The Largest Circulated Telugu Monthly

# చతుర

ఏప్రిల్ 1995

రూ.5/-



## నిర్జీవ యాత్ర

సత్యవోలు సుందరశాయి

# విపుల చతుర




# 200

సంచికలు వెలువడిన సందర్భంగా

ప్రకటించిన

కథలు, నవలలకు సాహిత్య పురస్కారాలు

**రు: 1,00,000/-**

విజేతలు

# చతుర

తెలుగు పత్రికా చరిత్రలో ఒక వినూత్న ప్రయోగంగా, కేవలం నవలల ప్రచురణకే ప్రత్యేకించిన మాసపత్రికగా అవతరించింది చతుర.

ప్రచురించే నవలలన్నీ ఉత్తమాభిరుచులుగలవిగా ప్రశంసలనందుకున్న నవలా మాసపత్రిక 'చతుర'.

ఎందరో నూతన రచయితలకు, రచయిత్రులకు అవకాశమిచ్చి ఆ క్రమంలో వారు నవలా రచనా రంగంలో స్థిరప్రతిష్టులయేందుకు తోడ్పడింది చతుర.

1978 ఫిబ్రవరిలో ప్రారంభమై 1986 మే నెలలో 100వ సంచిక వెలువడిన సందర్భంగా పెద్దఎత్తున నవలల పోటీలు నిర్వహించి అక్షరాలా యాభైవేల రూపాయల బహుమతులు అందజేసింది చతుర.

1994 సెప్టెంబర్ సంచిక 200వ సంచికగా వెలువడుతూన్న సందర్భంగా మరోసారి సాహితీ పరులను భారీగా సన్మానించదలచి నవలల పోటీలు ప్రకటించింది చతుర.

# విపుల

మరే భారతీయ భాషా పత్రికారంగంలోనూ లేని విశిష్ట ప్రయోగం "విపుల"

పూర్తిగా కథాసాహిత్యానికే అంకితమైన ఏకైక పత్రిక "విపుల"

తెలుగు కథలతోపాటు వివిధ భారతీయ భాషలు, విదేశ భాషలనుండి ఎన్నిక చేసిన ఉత్తమ కథలకు వేదిక "విపుల"

"ఏ భాషకు, సంస్కృతికి చెందిన కథనయినా ఆసక్తిగా చదివింపజేసే అనువాదాలతో పాఠకులకు విశ్వసాహిత్యాన్ని పరిచయం చేస్తున్న ప్రయోగ శీలి "విపుల"

1978 ఫిబ్రవరిలో ప్రారంభమై, 1986 మే నెలలో 100వ సంచిక వెలువడిన సందర్భంగా తొలిసారిగా భారీ బహుమతులతో 16 భారతీయ భాషల కథలకూ పోటీలు నిర్వహించింది "విపుల"

1994 సెప్టెంబరులో 200వ సంచిక వెలువడుతున్న సందర్భంగా మరలా కథల పోటీలు నిర్వహిస్తూ ఈసారి ప్రత్యేకంగా ఉత్తమ తెలుగు కథలకు విలువైన బహుమతులు ప్రకటించింది "విపుల"



ఉత్తమ సాహితీ విలువలతో పత్రికారంగంలో తమ విశిష్టతలను నిలుపుకు న్న 'విపుల' - 'చతుర' మాసపత్రికల 200వ సంచికల ప్రచురణ సందర్భంగా లక్షరూపాయల బహుమతులతో కథలు, నవలల పోటీలు 1994 ఆగస్ట్ చివరివారంలో ప్రకటించాం. కథలకు 45 రోజులు, నవలలకు 60 రోజులు వ్యవధి ఇచ్చాం. ముఖ్యంగా నవలా రచయితలు ఈ సమయం సరిపోదని విజ్ఞప్తులు చేసిన కారణంగా 1994 నవంబర్ 30వ తేదీవరకూ గడువు పొడిగించాం.

ఈ గడువునాటికి మా కార్యాలయానికి అందిన కథలు- 1388, నవల లు-190. వీటిలో పోటీలకు నిలిచే సాంకేతికార్హతలు లేనివిగా భావించి త్రిప్పి పంపివేయగా పరిశీలనకు నిలిచిన కథలు-812, నవలలు-140.

'విపుల'-'చతుర' నిర్వహించే పోటీలు ప్రతి ఏడాదీ జరిగేవి కావు. కనుక ఈ పోటీల నిర్వహణా విధానం ప్రత్యేకమైనది. ప్రతి ఒక్క రచననూ 35 మందితో కూడిన సెలక్షన్ కమిటీవారు చదివి, వారు ఎన్నిక చేసినవే 'న్యాయనిర్ణేతల' తుది పరిశీలనకు చేరాయి. బహుమతుల విషయంలో న్యాయనిర్ణేతల ఏకాభిప్రాయమే తుదినిర్ణయం!

ఈ పద్ధతిలో అర్హతగల ప్రతి ఒక్క రచననూ సెలెక్షన్ కమిటీ చదవగా, వారు ఎన్నికచేసిన ప్రతి ఒక్కకథనూ ముగ్గురు న్యాయనిర్ణేతలూ, ప్రతి ఒక్క నవలనూ మరో ముగ్గురు న్యాయనిర్ణేతలూ చదివారు. ఇది ఎక్కువ సమయమూ, శ్రమా తీసుకునే విధానమయినప్పటికీ రచయితలకు పూర్తి న్యాయం చేకూర్చే పద్ధతి అని మేము విశ్వసించాం.

గతంలో 1986లో 'విపుల'-'చతుర' 100వ సంచికల ప్రచురణ సంద ర్భంగా లక్ష రూపాయల బహుమతులిచ్చిన పోటీల సందర్భంలో కూడా ఇదే పద్ధతిని పాటించాం. కనుక, ఫలితాల ప్రకటనకు సహజంగా కొంత ఎక్కువ వ్యవధి తీసుకుని, అంతిమంగా న్యాయనిర్ణేతలు బహుమతులకు అర్హమైనవిగా ఈ దిగువ నవలలు/కథలు ఎన్నిక చేశారు.



## 'చతుర' నవలల పోటీలో బహుమతులు పొందిన రచనలు-రచయితలు

1. ప్రథమ బహుమతి రు: 15,000/- 'వేదన భూమి'
   -కామరాజు బ్రహ్మానందరావు
2. ద్వితీయ బహుమతి రు: 10,000/- 'గట్టుమీది చేప'
   -పి. చంద్రశేఖర ఆజాద్
3. తృతీయ బహుమతి రు: 7,500/- 'సంభవామి గృహే గృహే'
   -వక్కంతం సూర్యనారాయణరావు

## 5. ప్రత్యేక బహుమతులు - ఒక్కొక్కటి రు: 5000/- చొప్పున

1. వసంతరావు దేశపాండే - 'ఊరు'
2. కె. సురేష్‌బాబు - 'ది యూనివర్శిటీ'
3. రెంటాల నాగేశ్వరరావు - 'ఆవలిగట్టు'
4. కాలువ మల్లయ్య - 'సాంబయ్య చదువు'
5. ఎ. అప్పల్నాయుడు - 'పునరావాసం'

ఇవిగాక డాక్టర్ వి.ఆర్. రాసాని, పురాణపండ రంగనాథ్, ఘండికోట బ్రహ్మజీరావు, కాకాని చక్రపాణిగారల నవలలను రు: 3,000/- బహుమతులతో సాధారణ ప్రచురణకు ఎన్నిక చేయటం జరిగింది.

'చతుర' నవలల పోటీకి న్యాయనిర్ణేతలు:

1. శ్రీ మహీధర రామమోహనరావు
2. శ్రీమతి కాత్యాయని విద్మహే
3. శ్రీ అక్కినేని కుటుంబరావు

## 'విపుల' కథల పోటీలో
## బహుమతులు పొందిన రచనలు- రచయితలు:

1. ప్రథమ బహుమతి రు: 7,500/- 'జీవన్మృతుడు'
   -ఆడెపు లక్ష్మీపతి
2. ద్వితీయ బహుమతి రు: 5,000/- 'నా బిడ్డను కాపాడండి'
   -కె. రాజేశ్వరీదేవి
3. తృతీయ బహుమతి రు: 3,000/- 'విఘాతం'
   -కె. ఆదర్శస్మామాట్

## 18 ప్రత్యేక బహుమతులు రు: 1500/-చొప్పున

| | | |
|---|---|---|
| 1. | బండి నారాయణస్వామి | 'అధోముఖం' |
| 2. | గీతా సుబ్బారావు | 'చీకట్లో పిరికివాళ్లు' |
| 3. | కొండముది శ్రీరామచంద్రమూర్తి | 'రూపరహితులు' |
| 4. | చారి, పొన్నేకంటి | 'రేపటి ముఖచిత్రం' |
| 5. | యం. నరశింహారావు | 'సైకోడ్రామా' |
| 6. | ఎన్.వెంకటేశ్వరరావు | 'ఎలుకలబోను' |
| 7. | తాడిగిరి పోతరాజు | 'నిరవధిక నిరీక్షణ' |
| 8. | బి. మురళీధర్ | 'కొత్త నిర్వచనం' |
| 9. | వారాల కృష్ణమూర్తి | 'అస్తమించని సూర్యుడు' |
| 10. | కె.సి. శాస్త్రి | 'గోడలు' |
| 11. | డాక్టర్ వి. చంద్రశేఖరరావు | 'బహుమతి' |
| 12. | టి.ఎస్. జగన్మోహన్ | 'జీవలక్షణం' |
| 13. | డాక్టర్ శాంతినారాయణ | 'బొమ్మ-బొరుసు' |
| 14. | భాగవతుల సుబ్రహ్మణ్యం | 'విఫణి' |
| 15. | చొప్పకట్ల చంద్రమౌళి | 'భయం' |
| 16. | శ్రీమతి చంద్రలత | 'నేనూ నాన్ననవుతా' |
| 17. | వి. విజయకుమార్ | 'మహాపరాధి' |
| 18. | పి.పి. వరప్రసాదరావు | 'పేరులేని డ్రామా' |

వీటితోపాటు అదనంగా మరో 15 కథలను సాధారణ ప్రచురణకు ఎన్నిక చేయటం జరిగింది.

## 'విపుల'లో సాధారణ ప్రచురణకు ఎన్నిక చేసిన కథలు

1. కె. వరలక్ష్మి - పెద్దమామయ్య
2. ఎం. నాగమణి - ఆశ్రయం
3. 'గౌతమ్' - పదూళ్ల తగవు
4. జి. గౌరునాయుడు - బతుకుపోరు
5. ఆర్. అర్చన - కొలువు కొలిమలో
6. బళ్లా షణ్ముఖరావు - సాహిత్యమా వర్ధిల్లు
7. కె. ఆంజనీబాల - వలస
8. వల్లూరు శివప్రసాద్ - సహయాత్ర
9. కె. సురేష్‌బాబు - మహామాయ
10. ఎ. వెంకటాచార్య - పరదేశి
11. డి.జి. రామారావు - ఆమె కల కరగనీకు
12. బమ్మిడి జగదీశ్వరరావు - భరణం
13. జూకంటి జగన్నాథం - ముంపు
14. డి. హనుమంతరావు - జీవితం అంటే...
15. కాట్రగడ్డ దయానంద్ - అమ్మా! అమ్మా!

న్యాయనిర్ణేతలు:

1. శ్రీ కాళీపట్నం రామారావు
2. శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి
3. శ్రీ వాసిరెడ్డి నవీన్



విజేతలకు అభినందనలు, నిర్ణేతలకు ధన్యవాదాలు తెలుపుతూ బహుమతులు పొందిన నవలలు/కథలు ప్రచురణ 'చతుర-విపుల' 1995 మే సంచికనుండి ప్రారంభించనున్నామని మనవి చేస్తున్నాము.
పాఠకుల కోసం మా వంతు కృషి మేము చేశాం. ఇహ ఈ విలువైన కథలు, నవలల సారాన్నాస్వాదించటం మీ వంతు!

## న్యాయనిర్ణేతల అభిప్రాయాలు:

### చతుర - నవలల పోటీ

తెలుగులో వ్యాపార దృష్టితో వ్రాసేవాళ్లు ఎక్కువైపోయి, సీరియస్‌గా సాహిత్య విలువలను కాపాడుతూ రాసేవాళ్లు కరువైపోయారని అంగలార్చడం అధికం అయింది కొన్ని ఏళ్లుగా. సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల ప్రాబల్యంతో మన సాహిత్యం 1960-85 మధ్య ఓ పాతికేళ్లపాటు అడ్డదారులు తొక్కినా ఓ పదేళ్లుగా పరిస్థితులు దారికి వస్తున్నాయని నా అంచనా. దానిని పరీక్షించుకొనేందుకే నేనీ పోటీలకు జడ్జిగా వుండడానికి అంగీకరించేను.

ఈ నలభై రచయితలలో ఒక్కరు కూడా వ్యాపార సాహిత్య లక్షణాలయిన **Crime, Sex, Thrill, Anti – Social aptitudes** ని చిత్రించడానికి ప్రయత్నించలేదు. సమాజంలో ఎదురవుతున్న వివిధ సమస్యలనే తీసుకున్నారు. బాగా రాసిన వారూ, రాయగలవారూ తక్కువగా వున్నమాట యథార్థమే. అదే నిదర్శనం, వ్యాపార సాహిత్య దృక్పధాలు వారిని ఆకర్షించలేదనడానికి. బహుమతి మొత్తం చూసైనా ఎందుకు ప్రయత్నించలేదని ప్రముఖ రచయిత్రులిద్దరు, ముగ్గుర్ని కోప్పడ్డాను కూడా.

బుద్ధిగా, నిర్లిప్తంగా, చదువుకొనేందుకు యూనివర్శిటీకెళ్లిన కుర్రవాడు చల్లగా దేశరాజకీయాలలోకి ఇరుక్కుపోతాడు ఓ నవలలో.

అయోధ్య రామమందిర నిర్మాణం అంటూ దేశంలో సృష్టించిన అల్లర్లు, ప్రభుత్వాలు, రాజకీయ పార్టీలు దానిని ఉపయోగించి ప్రజాసామాన్యాన్ని కష్టాల పాల్జేయడానికి ఉపయోగపడిన దైవ భావనను ఒక వైరసుగా భావించేడు ఒక రచయిత.

నికృష్టస్థితి నుంచి విద్యావంతురాలుగా ఎదిగిన ఒక యువతి తాను చిక్కుకున్న కష్టాలతో చలం కుటుంబం ఆశ్రయం కోరడాన్ని చిత్రిస్తారొకరు.

ఒక మురికివాడలో వివిధ వృత్తులు, వ్యాపారాలు చేసుకొనేవారు, వారిపై అంతరంతరాలుగా బతికే దళారులు, ఆర్థిక, రాజకీయ పెత్తందార్లను చిత్రించేరొకరు.

నీకాల్మొక్తా దశనుంచి ఈనాటి నక్సల్స్ ప్రతిఘటనవరకు తెలంగాణాలో వచ్చిన ప్రతి రాజకీయ, ఆర్థిక, వైయక్తిక ద్వేష సంఘటనా విద్యాభివృద్ధితో ముడిపడిన పరిణామంగా చిత్రిస్తారు ఒకరు.

Easy money కోసం Bio– technologyని ఉపయోగించుకో గల శక్తివున్నా ఆ ధన సంపాదన, ఆశ కుటుంబ జీవితాన్ని భ్రష్టు పట్టించడాన్ని చిత్రిస్తారొకరు.

ఇల్లా చెప్పుకుపోవచ్చు కానీ చాలామందికి తాము చెప్పదలచుకొన్నదే మిటో స్పష్టతలేదు. రాసే పద్ధతి తెలియదు. కనుక నిజంగా విసుగే పుట్టించేరు.

మిగిలినవారు రచనా పద్ధతితో పరిచయం వున్నట్టే కనిపిస్తారు. కాని భాష, సంప్రదాయాలు తెలియని వారే ఎక్కువ తగిలేరు.

ఇంక కొందరికి తాము ఏ లక్ష్యం కోసం రాస్తున్నారో ఎక్కడ ఆపాలో మరిచిపోయి తాము చెప్పవలసిందంతా కాగితం మీద నొలక బొయ్యాలి సిందేనన్నట్లు దస్త్రాలే తయారు చేశారు.

రచన, పోటీ మీద కన్న తమ మెదడును తొలుస్తున్న సాంప్రదాయక ఆలోచనలమీద విశ్వాసం కనబరచిన వారొకరిద్దరు లేకపోలేదు.

నా నిర్ణయంలో నాకున్న Facts and Fallacious పనిచేశాయి. తప్పదు, కాని కనీసం 7-8 పుస్తకాలు రెండుమార్లు చదివేను. ఔను... కాదు అనేముందు మరో పది పదిహేనింటిని నోట్సుతోపాటు రచనని మరోమారు రిఫర్ చేస్తే తప్ప నిర్ణయం కాలేదు. అయితే రాసిన నిర్ణయంలో మృదుత్వం లేదు, స్పందన... అది నా జన్మ సంస్కారం.

Excuse me

—మహీధర రామమోహనరావు

నవల అభిమాన విషయంగా అధ్యయనం, పరిశోధన చేస్తున్న నాకు 'చతుర' నవలల పోటీ న్యాయనిర్ణేతలలో ఒకరుగా వుండటానికి అవకాశం రావటం - ఈనాటి నవలా ప్రక్రియాధోరణులను అర్థంచేసుకోవటానికి బాగా ఉపయోగపడింది. ఈ పనిలో 40 నవలలు చదివాను. జీవితం గురించి ఏమీ తెలియచెప్పని నవలలు, జీవిత సమస్యలను, విస్తృతిని గుర్తించినా వాటిపట్ల సరియైన దృక్పథమియ్యనివీ వున్నాయి. అట్లాగని మంచి నవలలు లేవని

కాదు. జీవితాన్ని కొత్తకోణాలనుండి చూపించిన నవలలు, కొంత ఆశాభావాన్ని కలిగించకపోవు.

ముఖ్యంగా అట్టడుగు వర్గాలవారి జీవితాన్ని వాస్తవ భౌతిక పరిస్థితులను 'సభ్యసమాజానికి' చూపించి కొత్తచూపునిచ్చే 'వేదన భూమి' వంటి నవలలు, డబ్బు మానవ జీవిత సంబంధాలనన్నింటిని తలకిందులు చేసి జీవితంతో ఆడుకొంటున్న వర్తమాన ఆర్థిక విధానాన్ని గురించిన 'గట్టుమీద చేప' లాంటి నవలలు, సామాజిక రాజకీయ పరిణామాలను యూనివర్సిటీ కిటికీలనుండి చూపించిన 'ది యూనివర్సిటీ' వంటి నవలలు - అటు శ్రీకాకుళం, ఇటు తెలంగాణా రెండు ప్రాంతాల అడవిని కేంద్రంగా చేసుకొని గిరిజన జీవిత పరిణామాలను వర్తమాన రాజకీయార్థిక నిరాశా వ్యవస్థలతో అనుబంధించి చెప్పిన 'ఊరు' వంటి నవలలు - నేటి నవల జీవిత వైవిధ్యాన్ని చిత్రించటంలో ముందుకు పోతున్నదన్న ఆశావహ దృష్టిని కలిగిస్తాయి.

స్త్రీల సమస్యలమీద మంచి నవలలు రాకపోవటం, వచ్చిన నవలల్లో ఆ సమస్యలపట్ల అరకొర అవగాహన, తప్పుడు అవగాహన వుండటం కొంత నిరాశను కలిగించిన అంశం.

జీవితంలోని సంక్షోభం, సంక్లిష్టత నవలా నిర్మాణాన్ని కూడా పకడ్బందీగా ఉంచటంలేదా? అన్న అనుమానమూ కలుగుతుంది. సరియైన ముగింపు లేని నవలలు చెప్పుకోదగ్గట్టుగానే వున్నాయి.

ఏమైనా నవల సాధించాల్సిన ప్రగతి ఇంకా ఎంతో వుంది.

**—కాత్యాయని విద్మహే**

చతుర నవలలపోటీ ప్రకటించగానే నేను, ఓల్గా చెరో నవల రాసి బహుమతులు కొట్టేద్దామనుకున్నాం. కాని చలసాని ప్రసాదరావుగారు,

"మీరిద్దరు రాస్తే ఎలా? ఈనాడు గ్రూపులోనే పనిచేసేవారు పోటీల్లో పాల్గొనటం మర్యాద కాదేమో'' అన్నారు నవ్వుతూ.

ఆ తర్వాత ఓరోజు ఫోన్‌చేసి పిలిచి, జడ్జీగా వుండాలన్నారు.

'నేనా?' అని నసుగుతోంటే-

"మీరే! జడ్జీగా ఉంటున్నారు, అంతే" అన్నారు.

ఆయన మాట నాకు శాసనం.

నేను 40 నవలలు (సుమారు 10 వేల పేజీలు) ప్రతి వాక్యం చదివాను. వీటిలో ఎనిమిది బహుమతులకు, మరో 4 సాధారణ ప్రచురణకు తీసుకుంటే, మరో ఆరేడు కూడా బాగానే వున్నాయి.

అంటే దాదాపు సగం నవలలు బాగున్నట్టే లెక్క. మిగిలిన సగం వస్తువు బాగుంటే రాయడంలో లోపాలు, రాయడం బాగుంటే విషయంలో లోపాలు వుండి కాస్త విసుగు కల్గించినమాట నిజం!

కాని, మొత్తంమీద ఒకేసారి ఇన్ని నవలలు చదవడం బాగుంది. చాలా ఆనందించాను.

ఈ నవలలు చదివి, ఓచోట కూర్చుని చర్చించుకుని మేం ముగ్గురము బహుమతులకు అర్హమయినవిగా అనుకున్నవి ఎన్నికచేసి, ఆ లిస్టు చలసానిగా ర్కి యిచ్చాక, అప్పుడు మాత్రమే ఆయా నవలల రచయిత లెవరో చెప్పారు. 3+5+4=12 నవలల్లో ఒక్కరు, ఒక్కరంటే ఒక్కరు కూడా 'రచయిత్రి' లేరు!

చాలా బాధపడ్డాం!

స్త్రీవాదం ఎంతో ప్రాచుర్యానికి వచ్చి, మంచి చర్చ నడుస్తున్న ఈ రోజుల్లో ఒక్క రచయిత్రి కూడా ఓ మంచి నవల రాయలేదే, కవితల్తోపాటు కథలూ రాస్తున్నవాళ్ళు నవలలు రాస్తే బాగుండును గదా అనుకున్నాం.

బహుమతులు గెల్చుకున్నవారిలో కొత్తవారే ఎక్కువ! ఇది 'నవల'కి ఆశాజనకంగా వుంది. కొత్త రచయితలకి నేను స్వాగతం చెప్తున్నాను. 'చతుర' ఎప్పుడూ చెప్తూనేవుంది.

**—అక్కినేని కుటుంబరావు**



## విపుల - కథల పోటీ

పధ్నాలుగు వందలదాకా వచ్చిన కథల్లో ప్రాథమిక పరిశీలనకు నిలవని వాటిని తీసివేయగా ఎనిమిది వందల పైచిలుకు పరిశీలనకు తేలేయి.

అభిరుచిగల పాఠకులుగా తాము గుర్తించిన 35 మందిచేత వాటిలో ప్రతి కథనీ చదివించి ఆ కథలపై వారి అభిప్రాయాలూ, సూచనలూ లిఖితపూర్వకంగా తీసుకున్నారు సంపాదకులు.

ఆ అభిప్రాయాలూ, సూచనలూ మేరకి బహుమతి పరిశీలనకి డెబ్భైపైనా, సాధారణ ప్రచురణకు దాదాపు నూటయాభై ఎంపిక అయ్యాయి. మిగిలిన వాటిని తిప్పి పంపేముందు మరోసారి ప్రతి కథా తిరగేయించి చూస్తే ఆకుచాటు పళ్లలాంటివి కొద్దిగా దొరికాయి. వాటితో బహుమతికి పరిశీలించవలసినవి దాదాపు ఎనభై, సాధారణ ప్రచురణకోసం సుమారుగా నూట అరవయ్యా కథలు తేలేయి.

ఆకుచాటు పళ్ల అనుభవంతోనే కావోలు, మేం పరిశీలించవలసినవి ఎనభైకాక సాధారణ ప్రచురణకు నిలిచినవాటిని కూడా చదివి చూడమన్నారు. అదీ మంచిదే అయ్యింది. రాళ్లలో కలిసిపోయిన కనీసం రెండు రత్నాలు దొరికాయి.

అలా వాటన్నింటినీ చదివితే-

మంచి కథకు వస్తువు జీవితం నుండే గ్రహించాలన్న విషయం పోటీలో పాల్గొన్న ప్రతి రచయితా గుర్తుంచుకున్నారనే అనిపించింది. సమాజపు

వేర్వేరు పొరలకు చెందిన ఆయా గుంపుల స్థితిగతులూ, వర్గలింగవయో బేధాలననుసరించి ఆ గుంపులలోని వ్యక్తుల స్వభావాలూ, మారుతున్న సమాజంలో మారుతున్న విలువలూ, వ్యవస్థల్లో నూతన పరిణామాల కారణంగా తమతమ ప్రయోజనాలకోసం గుంపుల మధ్య ఘర్షణ... ఇవీ యిలాంటివేన్నో ఈ కథల్లో కనిపిస్తాయి.

అయితే మంచికథకు వస్తువెంత ముఖ్యమో అందుకు సంబంధించిన కథాంశం సరికొత్తదై వుండడం అంతకు ఇనుమిక్కిలి ముఖ్యం.

రాయలసీమ వారికి వర్షాభావం వస్తువు కావచ్చు. తెలంగాణావారికి సాయుధ పోరాటాలూ, ఎన్‌కౌంటర్లూ వస్తువులు కావచ్చు. ఇటీవల విస్తరిస్తున్న స్త్రీవాదం, దళితవాదం మరికొందరికి వస్తువు కావచ్చు. వృద్ధాప్యపు సమస్యలూ, దంపతులిద్దరూ ఉద్యోగులైతే గృహ నిర్వహణ సమస్యా, రోజురోజుకీ తలిదండ్రులపైన, పిల్లలపైనా పెరిగిపోతున్న చదువుల భారం... ఇలాంటివి అన్ని ప్రాంతాలవారికీ కథా వస్తువులు కావచ్చు.

ఇలా వీటిలో ఏ దానిని తీసుకున్నా ఆ వస్తువుతో లోగడ వచ్చిన కథలకి భిన్నంగా పాత్రలూ వాటి స్థలకాలాలూ మార్చినంత మాత్రాన అవి కొత్త కథలూ కావు, మంచి కథలూ కాలేవు. వస్తువేదైనా అందుకెన్నుకొన్న కథాంశం, పర్యవసానంలో ఆ కథ కలిగించే అవగాహణ, అనుభూతీ సరికొత్తవై ఉండాలి.

ఈ మెలకువ తెలిసిన వారి కథలు యిందులో కొన్ని కనిపించాయి. కానీ చాలామంది రచయితలు వర్తమాన వస్తువూ అభ్యుదయ దృక్పథాన్ని ధ్వనించే ముగింపూ ఉంటే అంతటితో ఆ కథ మంచికథే అన్న ఊహలో ఉన్నారా అనిపించింది- మిగిలిన కథల విషయంలో.

ఈ కథలన్నింటిని వరసగా చదవడంవల్లా వీటి మంచి చెడ్డల గురించి జరిగిన తర్కంవల్లా మరో విషయం కూడా మా దృష్టికి వచ్చింది.

మాండలిక భాషలోనూ దాని నుడికారంలోనూ గొప్ప శక్తీ మాధుర్యం ఉన్నాయి. వాటి రుచి తెలిసిన పాఠకులూ, శక్తి తెలిసిన రచయితలూ దాదాపు అన్ని మండలాలలో నానాటికీ పెరుగుతున్నారు. ఈ సత్యాల్ని నిరాకరించగలవారెవ్వరూ ఉండరు. అయితే అవి వాహికలు మాత్రమే. కథన చాతుర్యమే కథ కానట్టు ఎంత మధురమైన మాండలికంలో రాసినా, రాసిందంతా ఎంత ఆసక్తితో పాఠకుణ్ణి చదివించినా ఆ రచనలో కథకూడా ఉండకపోతే అది మంచి రచనకాగలదుగాని మంచి కథ కాబోదు. మాండలికాభిమానం, మాండలికలౌల్యం (లోలత్వం) అతి కావడం వల్ల ఒకరిద్దరి రచనలు వారి పట్టుతప్పి పాడైన దాఖాలాలు కూడా యీ కథల్లో ఉన్నాయి.

ఇవీ, యిలాంటివే గణదోషాలు మరికొన్నీ ఉన్న కథలు తగు సంఖ్యలో మాముందుండడంతో ఈ కథల ఎంపిక కొంత సులభం, ఓ మేరకి కష్టమూ అయింది.

బహుమతి పరిశీలనకు తేలిన వాటిలో ప్రథమ బహుమతికి కథ ఎన్నడం కష్టం కాలేదు. రెండవ, మూడవ బహుమతులకు కథల్ని నిర్ణయించడంలో కొంత తర్జన భర్జన అవసరమయ్యింది.

ఆ రెండు స్థానాలకూ పోటీపడ్డ కథల్లోంచి వాటి ఎంపిక జరిగిపోగానే మిగిలినవన్నీ ప్రత్యేక బహుమతికి నిలిచిపోయాయి. వాటిలోంచి కొన్నింటిని మినహాయించి పద్దెనిమిది ఎంచడం కూడా కొంత కష్టమయ్యింది.

మొత్తం కథలపై ఏకగ్రీవ నిర్ణయానికి రావడానికి చాలా గంటలే పట్టాయి. మా ఎన్నిక ఉన్నంతలో సుగమం కావడానికి దోహదపడ్డ మరో రెండు అంశాల ప్రస్తావన కూడా ఇక్కడ అవసరమేమో.

ఈ కథలన్నింటి పైనా కోడ్ నెంబర్లే తప్ప రచయితల పేర్లుండకపోవడం మొదటి అంశం.

రెండో అంశం 'విపుల' సంపాదకులూ, వారి ఆఫీసు ఉద్యోగులూ పాటించిన గొప్ప సంయమనం.

తుది నిర్ణయపత్రంపై మా సంతకాలు అయ్యేదాకా రహస్య గోపనానికి వారు చేసిన ప్రతి ఏర్పాటులో ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. ఇది కూడా ప్రత్యేకంగా చెప్పుకోదగ్గ విషయమే.

**—కాళీపట్నం రామారావు**

పోటీకి ఎంపికైన కథల్లో మంచి కథల్ని వర్గీకరించడానికి అయిదు ముఖ్యలక్షణాలను మార్గదర్శక సూత్రాలుగా తీసుకున్నాం- 1. కథాంశంలో, ఇతివృత్తంలో కొత్తదనం; 2. కథాశిల్పంలో, శైలిలో కొత్తదనం; 3. భాషలో నిర్దుష్టత; 4. కథలో చివరిదాకా చదివించే గుణం; 5. మొత్తంగా కథమీద ఏర్పడిన అభిప్రాయం.

కథ కేవలం కాలక్షేపం కోసం కాకుండా, ఒక సామాజిక ప్రయోజనాన్ని సాధించడానికి ఉపకరించాలి- మనస్తత్త్వాలనూ, పరిస్థితులనూ, ప్రవర్తనలనూ అవగాహన చేసుకునేందుకు దోహదం చేయాలి; సమాజంలోనూ, మనసుల్లోనూ రావలసిన మార్పుకి పునాది వెయ్యాలి; రావలసిన మార్పు గురించి ఆలోచింపజేయాలి.

ఆధునిక కాలంలో దాంపత్య సంబంధాలూ, కుటుంబసభ్యుల మధ్య సంబంధాలూ, సమాజంలోని వివిధ వర్గాలకూ, వర్ణాలకూ చెందిన వ్యక్తుల మధ్య సంబంధాలూ, ఈ సంబంధాల్లోని సంఘర్షణలూ- ఇవే ఈ పోటీ కథలకు ముడిసరుకులు.

మధ్యతరగతి జీవితాల్లో ఆధునికతా, నాగరికతా తెచ్చి పెడుతున్న సంఘర్షణలూ, మానసిక సమస్యలూ, వాటి విశ్లేషణా పరిష్కార మార్గాలూ కళాత్మకంగా, వాస్తవికంగా హేతుబద్ధంగా చిత్రించడంవల్ల మూడు మరీ మంచికథలు ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులనందుకున్నాయి.

ఆధునిక జీవనంలో పాశ్చాత్య నాగరికత ప్రభావమూ, ఆంగ్ల భాషాభ్యాసమూ, తెలుగు కథల్లో ఆంగ్ల భాషాప్రయోగమూ అనివార్యమవుతున్నట్లుంది. ఈ లక్షణం బహుమతి పొందిన కథల కథావస్తువుల్లోనూ, కథనంలోనూ ప్రతిబింబించింది.

కథనంలో- తన్నుతాను సంబోధించుకుంటున్న వినూత్న పద్ధతిలో చైతన్య స్రవంతి శైలినీ, మొత్తం తన జీవితాన్ని సమీక్షించుకున్నరీతిలో కథాశిల్పాన్నీ సమర్థవంతంగా ప్రయోగించి, జీవితంలో పోగొట్టుకుంటున్న విలువలను ఎత్తి చూపించిన కథ అత్యుత్తమమైనదిగా ఎంపికైంది.

మానవ సంబంధాల్లో, ఏ స్థాయిలో చూసినా ఆర్థికాంశం అత్యంత ప్రముఖస్థానం వహిస్తుంది. డబ్బుకోసం, ఆస్తికోసం మనుషులు ఎంత దిగజారిపోతారో, ఎంత దోపిడీ చేస్తారో, వారి చేతుల్లో కొందరు ఎలా బలహీనులవుతున్నారో చెప్పే మంచి కథలు కొన్నీ, మన నూతన ఆర్థిక విధానంవల్ల ఏర్పడే దుష్ఫలితాల గురించీ, నేటి దుష్టరాజకీయాల గురించీ వ్యంగ్యంగా రాసిన మంచి కథలు కొన్నీ ఉన్నాయి.

వివిధ మాండలికాల్లో రాసిన కథల్లో తెలంగాణావి ఎక్కువగా రావడం విశేషం. అయితే, కథ మొత్తం మాండలికంలో కాకుండా, సంభాషణలకు మాత్రం పరిమితమై ఉంటే, కథలో చదివించేగుణం అధికమవుతుందని పించింది.

కథనంలో- ముఖ్యంగా భాషా ప్రయోగంలో శ్రద్ధ తీసుకోవలసిన అవసరం కనిపించింది- పోటీకి ఎంపికైన చాలా కథల్లో ఇతివృత్తకల్పనలో, కథాశిల్పంలో పరిణతి సాధించవలసిన అవసరం కూడా కనిపించింది.

మంచి కథల్ని గుర్తించడానికి మంచి అభిరుచీ, ఎంపిక చేయడానికి కొంత విచక్షణాశక్తీ ఉంటే సరిపోవచ్చు. కానీ, పోటీలో నెగ్గేటంత 'మంచికథ' రాయడం ఏమంత సులభం కాదనీ, ఎంతో ఆలోచించి, ఎంతో శ్రద్ధ తీసుకుని రాయవలసి ఉంటుందనీ అర్థమైంది!

—అబ్బూరి ఛాయాదేవి

ఒకేసారి యిన్ని కథలు చదవటం ఓ గొప్ప అనుభవం. వర్తమాన కథాసాహిత్యంలో వ్యక్తమవుతున్న భావజాలపు తీరుతెన్నులు తెలుసుకోవటానికీ, రచయితలు ఏయే విషయాలపై దృష్టిని కేంద్రీకరిస్తున్నారో అర్థం చేసుకోవటానికీ ఇలాంటి సందర్భాలు ఎంతగానో ఉపయోగపడతాయి.

జడ్జింగ్ కమిటీ సభ్యుడిగా 240 కథలూ, అంతకుముందే ప్రాథమిక దశలో మరో 100 కథలూ చదవటంవల్ల ప్రస్తుత కథల ట్రెండ్ చక్కగా అవగతం అయింది.

ఎంతో పకడ్బందీగా రూపొందించిన ఈ ఎన్నిక పద్ధతిలో భాగంగా ప్రతీ కథ గురించీ క్లుప్తంగానయినా ఓ రిపోర్టు రాయవలసి వచ్చింది. ఇందువల్ల ఆ కథలన్నీ ఎక్కువకాలం గుర్తుండే అవకాశం ఉంది. దీనికితోడు నిర్ణేతలు ఏరకంగానూ ప్రభావితం కావడానికి వీల్లేకుండా కథలపై రచయితల పేర్లు లేకుండా కోడ్ నెంబర్లు వేసి ఇవ్వటంవల్ల ఎన్నిక పూర్తిగా నిష్పక్షపాతంగా జరిగింది. ఈ పద్ధతివల్ల ఇతరత్రా తీసుకున్న జాగ్రత్తలవల్ల ఏ ఒక్క మంచికథా జారిపోలేదని కచ్చితంగా చెప్పగలను.

ఇన్ని కథలు చదివాక కలిగిన అభిప్రాయాలను, అనుభవాలను వివరించ

డానికి నిజానికి ఓ వ్యాసం రాయవచ్చు. గానీ, క్లుప్తంగా చెప్పుకుంటే...

1. దాదాపు రచయితలందరూ తమచుట్టూ అల్లుకుని ఉన్న జీవితాల గురించి, వాటి మంచి చెడ్డలగురించీ, దానికి కారణభూతమైన సామాజిక నేపథ్యం గురించీ నిజాయితీతో కథలు రాశారు. ఫలాని వస్తువుతో కథ రాస్తేనే బహుమతి వస్తుందనీ, మెచ్చుకుంటారని కాకుండా ఆయా విషయాలపై రాయటం బాధ్యత అని ఫీల్ అయి రాస్తున్నారనిపించింది. మొత్తంమీద ఈ పోటీలో పాల్గొన్న రచయితల్లో ఎక్కువభాగం రచయితలు నేల విడిచి సాము చెయ్యలేదు. ఇది ఆహ్వానించదగ్గ, మంచి పరిణామం.

2. రచనల్లో ఎక్కువభాగం మానవ సంబంధాల్లో వస్తున్న మార్పుల్ని, అందుకు గల కారణాలనూ విశ్లేషించే వస్తువుతో ఉన్నాయి. మధ్యతరగతి జీవితాల్లో పెరిగిపోతున్న యాంత్రిక జీవనం, అభద్రతాభావం, తమకు తెలీకుండానే ఒకరికొకరు దూరం అయిపోవటం, ఆత్మీయతలన్నీ అమ్మకపు సరుకుగా మారిపోవటం, మనుషులమధ్య సంబంధాలన్నీ డబ్బు సంబంధాలుగా మారిపోవటం... ఈ స్థితిపట్ల రచయితలు తమ కథల్లో తీవ్ర ఆవేదనను వ్యక్తంచేస్తున్నారు. అందుకుగల కారణాలను అన్వేషిస్తున్నారు. మొదటి, రెండవ బహుమతి పొందిన కథలు, కన్సొలేషన్ బహుమతులు పొందిన మరో మూడు కథలు ఈ స్థితికి ప్రతీకలు.

3. పిల్లలను దారుణంగా హింసపెట్టే ఈ చదువుల పద్ధతిని నిరసించే కథలు ఎక్కువగానే వచ్చాయి. చిన్నప్పటినుండీ వారిని ఆత్మీయతలకు, ప్రేమాభిమానాలకు దూరంచేసి యంత్రాలుగా తయారుచేసే పద్ధతిపట్ల తీవ్ర వ్యతిరేకత ఈ కథల్లో వ్యక్తమయింది. ఇలాంటి రెండు కథలకు బహుమతులు వచ్చాయి.

4. స్త్రీల సమస్యలను, మరీ ముఖ్యంగా ఉద్యోగినుల కష్టాలను వివరించే కథలు కూడా ఎక్కువ సంఖ్యలోనే వచ్చాయి. అయితే వీటిల్లో కొంత అస్పష్టత చోటుచేసుకుంది. స్త్రీవాదం ఒక దృక్పథంగా రూపుదిద్దుకుంటున్న దశలో ఇది అనివార్యం కావచ్చు. బహుమతులు గెల్చుకున్న ఈ తరహా కథలలో ఒక కథపై మంచి చర్చ జరగగలదని ఆశిస్తున్నాను.

ఊహించిన స్థాయిలో స్త్రీలనుండి రచనలు రాకపోవటం ఒక లోపంగా భావిస్తున్నాను.

5. హాస్య, వ్యంగ్య కథలు ఎక్కువగా రాకపోవటం కొంత నిరాశ కలిగించింది. బహుమతులు గెల్చుకున్న రెండు కథల్లోనూ ఒకటి 'గాట్' ఒప్పందంపైన, మరోటి పర్యావరణ సమస్యపైన ఎక్కుపెట్టినవి.

6. కొత్త వస్తువుని అన్వేషించటంతోపాటు రచయితలు శిల్ప నిర్మాణం విషయంలో కూడా కొత్తదారులను వెతుకుతున్నట్లనిపించింది. ఓ నాలుగైదు మంచి ప్రయోగాత్మక కథలు వచ్చాయి.

కొత్త విషయాలను నూతన కోణాలనుండి అన్వేషించే ప్రయత్నం చేస్తున్నారు మంచిదే... అయితే వాటిని కథలుగా మలిచే క్రమంలో కొంత అయోమయం, అస్పష్టత, మరికొంత అపరిపక్వత చోటుచేసుకుంటున్నాయి. కొన్ని కథలు చదివాక 'అయ్యో... ఇంత మంచి విషయాన్ని శక్తివంతంగా

చెప్పలేకపోయాడే! మరోసారి ప్రయత్నిస్తే బాగా రాసివుండేవాడేమో!' అనిపించే కథలు చాలానే తగిలాయి. అలాంటి కథలను ఎంతో బాధతో వదిలేయాల్సి వచ్చింది. చదివించే గుణం కూడా ముఖ్యమేకదా!

రచయితల శక్తికి పరీక్షగా ఉండే ఇటువంటి పోటీలను కనీసం రెండేళ్లకోసారయినా నిర్వహిస్తే బాగుంటుంది. ఈ విషయాన్ని పరిశీలించాల్సిందిగా సంపాదకుల్ని కోరుతున్నాను.

దాదాపు 350 కథలు చదివే థ్రిల్లింగ్ అవకాశాన్నిచ్చి కథావాతావరణంపై ఓ అవగాహనకు రావటానికి వీలు కల్పించిన సంపాదకులకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

—వాసిరెడ్డి నవీన్




## 'విపుల - చతుర' పాఠకులకు మనవి

పత్రికారంగానికి పెనుభారంగా ఇటీవలికాలంలో న్యూస్‌ప్రింట్ ధరలు విపరీతంగా పెరిగాయి. ఫలితంగా పత్రికలన్నీ తమ అమ్మకం ధరలు పెంచాయి. అయినా, విపుల - చతురలు మాత్రం ధరలు పెంచకుండా ఓపిక చూపాయి.

ఇప్పుడు తప్పనిసరి పరిస్థితులలో ఒక రూపాయి అయినా పెంచక తప్పటంలేదు. 1995 మే నెల సంచికలనుండి విపుల - చతురల ధరలు రు: 6/-గా, సంవత్సర చందా విపులకు, చతురకు విడిగా రు: 60/-గా నిర్ణయించాం. పాఠకులు సహృదయంతో మార్పును ఆమోదించగలరని ఆశిస్తున్నాం.

# చతుర కతలు

## శతభిషం

"రా... అన్నయ్యా రా'' ఆహ్వానించింది సుజాత.

"ఏంటమ్మా... అర్జంట్‌గా రమ్మని బాబిగాడితో కబురంపించావ్! ఏంటి సంగతి?" సోఫాలో కూలబడుతూ అడిగాను.

"ఏమైందిరా సుజీ..." లాలనగా అడిగాను.

సమాధానం ఇవ్వకుండా గోడవైపు చూస్తూ నిలబడింది.

"బావ ఏమైనా అన్నాడా... గొడవపడ్డారా?"

తల అడ్డంగా ఊపింది.

"మళ్ళీ పేకాట... రేసులు..."




సుజాత ఏం మాట్లాడలేదు. రెండుక్షణాలు గడిచాక- "ఉండు కాఫీ తెస్తా'' అంటూ కిచెన్‌లోకి వెళ్ళింది.

ఎప్పుడూ గలగల మాట్లాడుతూ బొంగరంలా తిరిగే సుజాత ఇలా ఎందుకుందో అర్థంకాలేదు. టీపాయ్‌మీది వీక్లీ తిరిగేస్తున్నా నన్న మాటేగానీ ఆలోచనలన్నీ చెల్లాయ్ చుట్టూనే పరిభ్రమిస్తున్నాయి.

ఇంతలో కాఫీ కప్పు తెచ్చి చేతికందించింది సుజాత. కప్పు అందుకుంటూ దాని ముఖంలోకి పరిశీలనగా చూశాను. ఏడ్చినట్లుంది కళ్ళు కొంచెం ఉబ్బాయి.

"అదైనా నాకింత దిగుల్లేదు'' దాని గొంతులో ఆవేదన సుళ్ళు తిరిగింది.

"మరి?"

"తన మొండిపట్టుదలతో ప్రాణంమీదికే తెచ్చుకుంటున్నారన్నయ్యా'' ఏడుస్తూ అంది సుజాత.

"కాస్త అర్థమయ్యేలా చెప్పవే?" విసుగ్గా అన్నాను.

"ఏం చెప్పమంటావన్నయ్యా... ఇన్నాళ్ళూ ఆయన రేడియోకి వెళ్తుంటే నేనేం మాట్లాడకుండా నోర్మూసుక్కూచున్నాను.


కవర్‌ఫోటో: వికీహండా ✣ బొమ్మలు: బలరాం

అయితే ఇప్పుడు ఏకాఏకీ టీ.వీ.కే వెళ్తున్నారు'' కళ్ళు తుడుచుకుంది సుజాత. నాకంతా అయోమయంగా ఉంది. రేడియో ఏంటో, టీ.వి. ఏంటో అర్థంకాలేదు.

"ఏ పెళ్ళామైనా మొగుడు పదికాలాలపాటు చల్లగా ఉండాలనుకోవడం అత్యాసేంకాదుగా అన్నయ్యా... అందుకే టీవీకి వెళ్లొద్దన్నాను. అదే తప్పయిపోయింది. 'నీకూ నీ పుట్టింటి వాళ్ళకూ నా సంగతి తెలీదు... ఉత్త నిరక్షరకుక్షులు' అంటూ తిట్టిపోశారు 'ఏమైనా సరే టీ.వీ.కి వెళ్ళి తీరుతాను, నన్నెవరూ ఆపలేరు' అని ఇప్పుడే బయటికెళ్ళారు. అన్నయ్యా నీ కాళ్ళు పట్టుకుంటాను. నువ్వైనా ఆయనకు నచ్చచెప్పు. నాకు పతిభిక్ష పెట్టు..." అంటూ మళ్ళీ రాగం అందుకుంది సుజాత.

దీనికేం మెంటలెక్క లేదుగదా అన్పించింది ఓ క్షణం. "అమ్మాయ్ రేడియో అంటావ్, టీవీ అంటావ్, పతిభిక్ష అంటావ్ నీకసలు మతిస్థిమితంగా ఉందా?" అని అడిగేశాను విసుగ్గా.

"నా మతికేం అన్నయ్యా నిక్షేపంలా ఉంది..."

"మరీ రేడియో, టీ.వీ. గోలేంటి?"

"ఇన్నాళ్ళూ... ఆయన రేడియోలో చదువుతుంటే మనిషెవరో తెలియక జనం అంతగా పట్టించుకోలేదు. ఇప్పుడు టీ.వీ.లో అవకాశం వచ్చింది గదా అని పరిగెత్తుకు వెళ్తే ఇంకేమైనా ఉందా! మనిషిని గుర్తుపట్టి రేపట్నుంచి అంతా ఉతికి ఆరేయరూ..." అర్థోక్తిగా ఆగిందామె.

"ఇంతకీ ఏంటమ్మా బావ రేడియోలో చదివేది'' ఆసక్తిగా అడిగాను.

"ఇంకేమిటి నా బొంద 'శతభిషం' పేరుతో కవితలు చదివేది మీ బావగారే గదా''

"ఆc..." 'శతభిషం' పేరు వినడంతోనే నా కడుపులో దేవినట్లయి బాత్‌రూమ్‌వైపు పరుగు తీశాను.

-ప్రతాపచంద్ర

---

## ఎకానమి

**ఆ** అబ్బాయి తన మొదటికథ తీసుకెళ్లి సీనియర్ రచయిత స్వామిగారికి చూపించినప్పుడు ఆయన అది చదివి కొంచెం కోపం తెచ్చుకున్నాడు. అతణ్ణి ఎదురుగా కూర్చోబెట్టుకుని అడిగేడు.

"నాయనా నీకు ఎకానమీ ఆఫ్ థాట్స్ అంటే తెలుసా?"

ఆ అబ్బాయి అడ్డంగా తలూపేడు.

"దేశద్రోహమయ్యా బాబూ. ఎకానమీ ఆఫ్ థాట్స్, వర్డ్స్ అండ్ పేపర్ - ఇవి లేకపోతే నువ్వు పైకెలా వస్తావ్. నీకు తెలిసిందంతా చిన్న కథలో చెప్పాలని మహా తాపత్రయపడిపోతావ్. ముందు 'పొదుపు' గురించి తెలుసుకో. కథ బాగానే రాశావ్. పొదుపే లేదు''

అతను వినయంగా తలూపేడు.

"మళ్లీ రాసుకురా, చూస్తా''

మరోసారి వినయంగా తలూపాడేగాని ఆ మాటలు అర్థం కాలేదు. మరో నాలుగు కథలు రాసి చూపించేడుగానీ ప్రతిసారీ ఆయన తల పట్టుకునేవాడు.

ఆ కుర్రాడికి ఈయన ధోరణి తమాషాగా అనిపించి 'ఎకనామిక్స్' మేస్టారు అని ముద్దుగా పిలుచుకునేవాడు.

కొంతకాలం కరిగిపోయింది.

ఆ అబ్బాయికి స్వామిగారి దగ్గరకొచ్చే తీరికలేకుండాపోయింది. మరికొంతకాలం కరిగాక అతనే సీనియర్ అయిపోయేడు. ఆయన్దగ్గరికి కుర్రాళ్లు రావటం ఆరంభించేరు. అవి కూడా తను కొత్తలో రాసిన కథల్లా ఉండేవి. వాటి గురించి మాట్లాడేవాడుగానీ 'ఎకానమీ' గురించి ఎప్పుడూ చెప్పలేదు.

"ఎకనామిక్స్' మాస్టారు ఎంత గొంతు చించుకున్నా నాకు అర్థం అయిచచ్చిందా. ఓ








కథ అచ్చయి పాతికరూపాయలు మనియార్డరు అందుకున్నాకగదా ఆయన గోలేందో అర్థం అయింది. వీళ్లూ అంతే. అట్టానే నేర్చుకుంటారు'' అనుకుంటాడు వాళ్లని చూస్తూ.

-పి. చంద్రశేఖర ఆజాద్

## అద్దెగది స్పెషాలిటీ

"ఏంటీ మేడమీద గదా? అద్దెంతేమిటి?" ఆతృతగా అడిగాను.

"జస్ట్ పదిహేనొందలు'' కూల్‌గా జవాబిచ్చాడు బ్రోకర్ అప్పారావు.

"బాప్‌రే... పదిహేనొందలా... అంటే నా జీతంలో సగం"

నా ముఖంలో రంగులు మారడం గమనించిన అప్పారావు "ఏంట్సార్ మరీ అంత వర్రీ అయిపోతున్నారు? అద్దె కొంచెం ఎక్కువైనా అందుకు తగ్గ సుఖమూ ఉంది అక్కడ. మీరింకేం వెనకాడకండి'' అన్నాడు.

నాకేం చెప్పాలో అర్థంకాలేదు.

మా ఆఫీసువాళ్లు అర్థాంతరంగా విజయవాడనుంచి హైదరాబాద్‌కి ట్రాన్స్‌ఫర్ చేయబట్టి నాకీ తిప్పలొచ్చిపడ్డాయి. కాదంటే ఉద్యోగానికే నీళ్లు వదులుకోవాల్సిన పరిస్థితి. అందుకే తాత్కాలికంగా ఓ ఫ్రెండ్ గదిలో దిగి రూమ్‌వేటలో పడ్డాను. ఎలాగో అలా ఓ నాలుగు నెలలు ఓ చిన్న రూమ్‌లో కాలక్షేపం చేస్తే ఆ తర్వాత నిదానంగా కాస్త పెద్ద పోర్షనే చవకలో సాధించి ఫ్యామిలీ పెట్టేయవచ్చునన్నది నా ప్లాన్. అప్పటికెలాగూ వేసవి సెలవులు ఇచ్చేస్తారు గనుక పిల్లల చదువూ మధ్యలో డిస్టర్బ్ కాదు. అందుకే సింగిల్‌రూమ్‌కోసం ఈ బ్రోకర్ అప్పారావు వెంటపడుతూండడం. వీడేమో సింగిల్‌రూమే పదిహేనొందలంటున్నాడు.

"ఏంట్సార్ ఆలోచిస్తారింకా... కాదంటే చెప్పండి. కాలేజి కుర్రాళ్లు ఇంకో రెండొందలు ఎక్కువీయడానికైనాసరే రెడీ అంటున్నారు'' తొందరపెట్టేస్తున్నాడు అప్పారావు. కాదంటే అదీ దొరకదేమో. ఏదో ఒకటి తొందరగా చూసుకోమని మా ఓనర్ ఒకటే నసపెడుతున్నాడు. పొద్దున్నే లేస్తూనే ఫ్రెండ్ చెప్పిన మాట చెవుల్లో మార్మోగింది. ఇంక ఆలోచించలేదు. ఒప్పేసుకుందామన్న నిర్ణయానికి వచ్చేశాను.

"రూమ్ పైనగదా కింద స్కూటర్ పెట్టుకోడానికి పార్కింగ్ ప్లేస్ ఉందా?"



"ఎందుకు లేద్సార్... రోడ్డువారగా పెట్టుకోవచ్చు. ఈ ఏరియాలో అంతా అలాగే పెట్టుకుంటారు. పోతుందనే భయంలేదు. ఒకవేళ పోయేదైమొస్తే ఆగుతుందా? మీరు గదిలో పెట్టి ఇరవై తాళాలేసినా మాయమైపోద్ది. అంతే కదా సార్?" వేదాంతం కలబోసి చిన్నపాటి లెక్చరిచ్చాడు అప్పారావు.

"మరి పైకి తాగడానికి నీళ్లొస్తాయా?"

కిచకిచ శబ్దం చేస్తూ నవ్వాడు అప్పారావు. అలా నవ్వుతూనే "ప్రెషర్ ఉంటే ఎందుకు రావు సారూ... అయినా మీక్కావల్సింది రెండు బిందెలేగందా... కిందకెళ్లి తెచ్చుకుంటే సరిపాయె..." తేలిగ్గా చెప్పేశాడు.

నాకు ఒళ్లు మండిపోతోంది. అయినా తమాయించుకుని, "పోనీ రూమ్ కాస్త నీట్‌గా ఉంటుందా? కొత్తగా కట్టిందేగదా?" అడిగాను.

"నో ప్రాబ్లమ్ సారూ... కట్టి సుమారు పదేళ్లు కాబట్టి... గోడలకు అక్కడక్కడా పగుళ్లిచ్చినా ఇచ్చేముందు సున్నం వేయిస్తారు గనుక చూడ్డానికి బానే ఉంటుంది. అయినా అదంతా మన మెయింటెనెన్స్‌బట్టి ఉంటుంది గదా సార్'

"వానొస్తే కురుస్తుందా?"

"జస్ట్... ఒకటీ రెండు చోట్ల... నాలుగు చుక్కలు పడతాయంతే! మిగతా ఎక్కడా మీరు కురవమన్నా కురవదు. అందుకు నాది గ్యారంటీ''

ఇక నా కోపాన్ని నిగ్రహించుకోలేకపోయాను.

"ఏమయ్యా పార్కింగ్‌ప్లేస్ లేదు. నీళ్లు పైకిరావు... గోడలకి నెర్రెలిచ్చాయి. వానొస్తే కురుస్తుంది. అద్దెమాత్రం పదిహేనొందలా?"

"తొందరపడకండి సారూ... స్పెషల్ ఎట్రాక్షన్ బాల్కనీలో ఉంది'' చిరునవ్వు నవ్వాడు అప్పారావు.




"ఏంటి నాయనా అది?" వ్యంగ్యంగా అడిగాను.

"అక్కడినుంచి చూస్తే..." ఊరిస్తున్నట్టు కొన్నిక్షణాలు ఆగాడు.

"కాశ్మీర్ దృశ్యాలు కనబడతాయా?" వెటకారంచేశాను.

"అంతకంటే ఎక్కువే''

"అంటే?"

"పైకప్పుల్లేని ఆ పక్కింటివాళ్ల, ఈ పక్కింటివాళ్ల బాత్‌రూమ్స్ మొత్తం ఎటు జడ్ కనబడతాయి'' అంటూ కన్నుకొట్టాడు అప్పారావు నోరు తెరుచుకు చూస్తున్న నా వంక చూసి.

-అన్వేష్





# చిత్ర ప్రపంచం

## చిత్రకారుడి సెంటిమెంట్లు

'మూఢనమ్మకాలు' మనిషిని మానసికంగాను, శారీరకంగానూ కూడా కుంగదీస్తూనే వుంటాయి. చాలామందిలో ఈ నమ్మకాలు ఏదో పరిమాణంలో వుంటూనేవుంటాయి. కానీ కొంతమందిలో ఇవి విపరీతంగా వుంటాయి. అవి వారినేకాక వారి స్నేహితులని, బంధువులని, కుటుంబసభ్యుల్ని కూడా ఇబ్బందులకు గురిచేస్తూవుంటాయి.

ఈ నమ్మకాలు ఓ సామాన్యమానవుడిలో కాక ఓ పేరుప్రఖ్యాతలున్న వ్యక్తిలో వుంటే అవి అందరికీ చర్చనీయాంశాలవుతాయి. ప్రఖ్యాత చిత్రకారుడు పికాసోకున్న నమ్మకాలు, భయాలు ఇన్నీ అన్నీ కావు. ఓ స్పానిష్ పౌరుడుగా ఆ దేశంలో ఉన్న నమ్మకాలు ఇతన్ని ఎప్పుడూ పట్టిపీడిస్తూనేవుండేవి. ఇవి కాక రష్యన్ మహిళ ఓల్గాని పెళ్లాడిన పికాసోలో రష్యన్ నమ్మకాలు కూడా చోటుచేసుకున్నాయి. అవన్నీ అతన్ని నిరంతరం కుంగదీస్తూవుండేవట.

రష్యన్లకున్న ఓ నమ్మకమేమంటే కుటుంబసభ్యులుగానీ, లేదా కుటుంబంలోని ఏ వ్యక్తిగానీ పొరుగూరు వెళ్లవలసిన పనిబడినప్పుడు వెళ్లబోయేముందు ఇంటిగుమ్మం బయటనుంచుని కొన్ని నిమిషాలు మౌనాన్ని



పాటించాలి. పికాసో దాన్ని క్రమం తప్పకుండా ఆచరించేవాడు.

ఓసారి పికాసో స్నేహితుడు తన టోపీతీసి పికాసో పడుకునే బెడ్‌మీద పెట్టాడు. అంతే ఓ భూతాన్ని చూసినట్టు గజగజ వణికాడు పికాసో. ఎందుకంటే మంచంమీద ఎవరైనా పొరపాటున టోపీ పెడితే ఏడాది తిరక్కుండా కుంటుంబసభ్యుల్లో ఎవరైనా పరలోకానికి టిక్కెట్టు కొట్టే ప్రమాదముందని గట్టిగా నమ్ముతారు స్పెయిన్ దేశస్థులు. దాంతో ఆ రోజు నుంచి ఆ స్నేహితుడితో మాట్లాడ్డం మానేశాడు పికాసో.

మరో నమ్మకమేమంటే ఇంట్లో గొడుగును తెరవకూడదు. బయటే తెరిచి పనయ్యాక గుమ్మం బయటే మూసి లోపలికి తీసుకురావాలి. ఓసారి ఓ నాస్తికమిత్రుడు పికాసో ఇంటికొచ్చి కాసేపు పిచ్చాపాటీ మాట్లాడి వెడుతూ వెడుతూ వానగావుందని, గుమ్మందాటకుండానే గొడుగు తెరిచాడు.

దాంతో ఆ చర్యకి విరుగుడుగా కుటుంబసభ్యులందరినీ వేళ్లు ఆకాశంలోకి చూపిస్తూ ఇంటిచుట్టూ 12 సార్లు ప్రదక్షిణాలు చెయ్యమన్నాడు పికాసో అలా చేస్తే గొడుగు ఇంట్లో తెరవడంవల్ల వచ్చే ప్రమాదంనుంచి బయటపడచ్చని ఓ నమ్మకం.

పికాసో ఇంకో విషయాన్ని కూడా నమ్మేవాడు. ఎవరైనా అతిథులు ఇంటికి వచ్చినప్పుడు వారికి సంబంధించిన వస్తువును దాచిపెట్టి తిరిగి వారు వెళ్లేటప్పుడు ఇచ్చిపంపేవాడు. అలా చేస్తే వారితో సంబంధబాంధవ్యాలు ఎప్పటికీ స్థిరంగా వుంటాయట.

పికాసోకి ఎవరైనా బ్రెడ్ ఇచ్చినా, లేదా తాను స్వయంగా కొనుక్కుతిన్నా... అది మధ్యభాగంలో కొంచెం మాడినట్టుంటేనే తినేవాడు. అలా లేకపోతే అది అనారోగ్యం చేస్తుందని నమ్మేవాడు.

ఇంతకీ ఆయనగారికి వృద్ధాప్యమంటే మహాభయం. వయసు పైబడుతున్నకొద్దీ మరింత చిన్నపిల్లాడిలా డ్రెస్ చేసుకుని తిరిగేవాడు పికాసో. అది చూసి ఎవరైనా నవ్వినా పట్టించుకునేవాడు కాదతను.

మరి వీటన్నిటినీ పాటిస్తూ కూడా అతడు వేలకొద్దీ బొమ్మలు వేసీ, శిల్పాలు చేసీ విశ్వవిఖ్యాత చిత్రకారుడుగా పేరు తెచ్చుకున్నాడంటే విశేషమే!

# ఎడారిలో నిర్విరామ ప్రయాణం

ఎలాంటి ఆకాంక్షలు, ఆశయాలు లేకుండా సాదాసీదా జీవనాన్ని గడిపేవాళ్లు కొందరైతే, ప్రాణాలకు తెగించయినా సరే ఏదో ఒకసాహస కార్యాన్ని చేసి పేరు తెచ్చుకోవాలనుకునేవాళ్లు కొందరు. అయితే వారి సాహసాల వెనుక తల్లితండ్రుల, లేదా భార్యాబిడ్డల ప్రోత్సాహం కూడా వుంటే వాళ్లు నిజంగా సాధించలేనిది ఏదీ వుండదేమో అనిపిస్తుంది కొందరిని చూస్తే. అమెరికాలోని నెవాడాకు చెందిన 42 సంవత్సరాల రిచెర్డ్ నోబెల్ నీటిమీద జరిగే పోటీల్లో నెగ్గి ఎన్నో రికార్డులను బద్దలుకొట్టాడు.

అయితే... 1983లో అతడు మొదటిసారిగా నేలమీద చేసిన విన్యాసం అందరినీ దిగ్భ్రమలోముంచింది. నెవాడా ఎడారిలో తన బోటులాంటి మోటారు బండిలో గంటకు 633 మైళ్ల వేగంతో ప్రయాణం చేసి భవిష్యత్తులో ఎవరూ బద్దలు కొట్టలేరేమో అనిపించేంత రికార్డు సాధించాడు. ఓ పసివాడు మెత్తని రోడ్డుమీద మూడు చక్రాలసైకిలు నడిపినంత సునాయాసంగా... కూరుకుపోయే ఇసుకలో... ఎండకు, చలికి బెదరక ఇతడు చేసిన ప్రయాణం




నిజంగా అభినందనీయం.

నోబెల్ తన మోటారు బోటుకి స్ప్రింటర్ అని పేరెట్టాడు. ప్రస్తుతం స్ప్రింటర్‌తో న్యూయార్క్‌నుంచి ఇంగ్లండు వరకు ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేయాలన్నది అతని ధ్యేయం. 3000 మైళ్ల దూరాన్ని గంటకు 52 మైళ్ల వేగం చొప్పున 65 గంటలనుంచి 70 గంటలలోపు ముగించగలనని అంటున్నాడు నోబెల్.

దానికున్న పెట్రోలు ట్యాంకులో 83630 గ్యాలన్ల ఫ్యూయల్ పడుతుంది. అయితే ఒకేసారి అన్నిగాలన్ల పెట్రోలు అవసరమా? అన్న ఓ ప్రశ్నకి సమాధానంగా... "ఎన్నోసార్లు పెట్రోలు కొరత కారణంగా బండిని ఆపేయవలసి వచ్చింది, ఆ విధంగా పోటీల్లో నెగ్గలేకపోవడం కూడా జరిగింది. కాబట్టి ఎక్కడా ఆగకూడని నిర్విరామ ప్రయాణంలో ఇంధనలోపం వుండకూడదని ముందు జాగ్రత్తగా అంత పెద్ద




ఇతడు పుట్టింది లండన్‌లో 'కొత్త రికార్డులను సృష్టించి, నా విన్యాసాలతో మాతృదేశ కీర్తి ప్రతిష్టలను పెంచాలన్నది నా ధ్యేయం' అంటాడు నోబెల్.

నిజానికి ఎడారిలో ప్రయాణమంటే ప్రాణాలతో చెలగాటమే. మంచుతుఫానులు, దారి కనిపించనీయని దట్టమైన పొగమంచులాంటి ఎన్నో అడ్డంకులను అధిగమించాల్సి వస్తుంది. తన మోటారుబోటు స్ప్రింటర్‌కి రోల్స్‌రోయస్ ఇంజన్‌ని బిగించాడు నోబెల్.

ట్యాంకు బిగించవలసి వచ్చింది" అన్నాడు.

ముఖ్యంగా అతని భార్య సైలీ, కూతుళ్లు మిరండా, జెనేవా, కొడుకు జాక్ అతనిని ఈ పోటీలకి విపరీతంగా ప్రోత్సహించారట! అప్పుడప్పుడు పిల్లలు కూడా వస్తామని గొడవ చేసినా ఆ ప్రమాదకర ప్రయాణం వారికి కూడదని నచ్చచెబుతాడు నోబెల్.

చతుర ఏప్రిల్: 1995
సంపుటి: 18 సంచిక: 3

ఆశయాల్లోను, ఆచరణలోను తన తండ్రి సాక్షాత్తూ గాంధీజీని తలపించే మనీషి. ఆయన్ని అందరూ గాంధీ మాస్టారనే పిలిచేవారు.

**అయితే... ఆయన ఆదర్శాలు కన్నకొడుకైన తన విషయంలో... అక్షరాలుగానే నిలిచిపోయాయి.**

తామిద్దరిమధ్య ఏర్పడ్డ అగాధం... తనను మరో దిశగా... ఒక్కొక్క మెట్టూ ఎదిగేలా చేసింది. సమర్థుడైన పోలీసాఫీసరుగా పేరు తెచ్చుకున్నా, ఆ సమర్థత ముసుగులో తను కోల్పోయినదేమిటి?

**బడబాగ్నులను సైతం తన 'సామర్థ్యం' మాటున దాచిపెట్టి జీవితంలో చివరకు తను తెలుసుకున్న చేదు నిజం ఏమిటి?**

దగా దౌర్జన్యాల పునాదులపై అంచెలంచెలుగా ఎదిగే వ్యవస్థలోని వ్యక్తుల ఉత్థాన, పతనాలను విశ్లేషిస్తూ **సత్యవోలు సుందరశాయి** రాసిన **'నిర్జీవయాత్ర'** ఈ నెల చతుర సమగ్ర నవల.

# నిర్జీవయాత్ర

సత్యవోలు సుందరశాయి



నీలి ఆకాశంలో ఎర్రని ఆకారాలు వింతగా కనిపిస్తున్నాయి. నిత్యం సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాల్లో ఆకాశంలో కనిపించే చిత్ర విచిత్ర ఆకృతులను ఆస్వాదించే హృదయాలకు ఏదో పులకింత కలుగుతుంది. ఆ ఆకృతులను సృష్టించిన వారెవరు? ఆ పులకింతలకు అర్థాలేమిటి? ఆ ప్రకృతి దృశ్యాల రసాస్వాదనలో మనసుని సంతృప్తి పరచే ఆ భావాలేమిటి?

అది పగటి వెలుగులోకి రాలేని చీకటి శక్తులు నిద్రలేచే సమయం. అంధకారంలోనే అరాచకాన్ని ప్రబలించే శక్తులు బలాన్ని సమకూర్చుకొనే కాలం.

మేడమీద ప్రకృతిని ఆస్వాదిస్తూ, ఆ చీకటి రేఖల ఆక్రమణని గమనిస్తూ భర్త కోసం ఎదురు చూస్తున్న వనజ, బంగ్లాలోకి వస్తున్న కారుని చూసి కిందికి వచ్చేసింది.

కారు దిగుతూనే స్వామి భార్యను చూస్తూ చిరునవ్వులు చిందించాడు. ఆ నవ్వులకే పులకరించిన వనజ ఆయనకేసి అభిమానంగా చూసింది.

"ఫస్ట్‌టైం నేను చాలా ముందుగా వచ్చాననుకుంటా'' ఆప్యాయంగా అన్నాడాయన.

వనజ తన మెరిసే కళ్లను చక్రాల్లా తిప్పి నవ్వింది.

తలెత్తి ఆమె ముఖంలోకి చూస్తూ 'ఏం మాట్లాడవు' అన్నట్లుగా కళ్లల్లోంచే భావాలను కనిపింపచేశాడు

"మీరు త్వరగా రావడం నిజంగా లక్... నా లక్. చాలా హేపీగా ఉంది'' అంది వనజ.

"అయిదు నిముషాల్లో రడీ అయి వస్తా'' అంటూ స్వామి లోపలికి వెళ్లిపోయాడు. ఇంటి పనులు నౌకర్లకి అప్పచెబుతూ హడావిడిగా తిరుగుతోంది వనజ. డి.ఐ.జి. దుస్తుల్ని వదిలి సాధారణ దుస్తుల్లో వనజ పక్కకు వచ్చేశాడు స్వామి.




బంగ్లా ప్రహరీగేట్లు తెరుచుకున్నాయి. పోలీసులు సెల్యూట్ చేస్తూండగా డి.ఐ.జి స్వామి సకుటుంబంగా కారులో బయలుదేరారు. ఆ కారువెంట పోలీసు జీపు సాగిపోతోంది.

ఆ వాహనాలు మెయిన్ రోడ్డుమీదకు వచ్చేసరికి డి.ఐ.జి కారుకి ఎదురుగా ఓ జీపు అడ్డంరాబోయి సైడు తీసుకొని డి.ఐ.జి బంగ్లాకి ఎదురుగా ఉన్న ప్రభుత్వ అతిథి గృహంలోకి దూసుకుపోయింది. ఆ జీపు నిండా జనం, దాని వెంట ఓ కారు.

ఆ కారులో....

★ ★ ★

"చాలా థ్యాంక్స్'' వనజ ఆప్యాయంగా అంది.

"దిసీజ్ సో సింపుల్' చాలా తేలిగ్గా అన్నాడు స్వామి.

"పుట్టిన రోజున ఇలా మీతో కల్సి సినిమాకి రావాలని ఎప్పట్నుంచో అనుకొంటున్నాను. రియల్లీ టుడే ఐయామ్ హేపీ'' వనజ సంతోషంగా మాట్లాడుతోంది.

"సరే... సినిమా చూడు.. యూ ఎంజాయ్'' స్వామి నవ్వుతూ అన్నాడు.

"సినిమా ఎవరితోనైనా చూడచ్చు. కానీ మీతో కలిసి రావాలనేదే నా అసలు కోరిక. ప్రతీ భార్యా అలాగే అనుకొంటుందనుకుంటా, కానీ నేను ఆ అవకాశం కోసం ఆరేళ్లు వెయిట్ చేశాను. ఎంత గేప్'' వనజ మళ్లీ మాటలు మొదలుపెట్టింది.

"టేక్ ఇట్ ఈజీ. నా పనుల గురించి నీకు తెలియంది ఏం వుందీ... అయినా ఇపుడవన్నీ ఎందుకూ... సరదాగా సినిమా చూద్దాం. ఆ మాటలు పూర్తి కాకుండానే వాళ్లవద్దకు ఓ కుర్ర ఎస్సై వచ్చాడు. అతను రెండు చేతుల్లోనూ కూల్‌డ్రింక్స్‌తో ఎంతో వినయం ప్రదర్శించటం వనజను ఆశ్చర్యపరచలేదుగానీ 'మేడమ్‌గారూ' అని పిలిచిన అతని పిలుపు మాత్రం కొత్తగా ఉంది.

ఆ కొత్త ఎస్సై ఆవిడకు ఓ స్కూలు విద్యార్థిలా అనిపించాడు. అతని సంబోధన

విద్యార్థులు స్కూల్లో చేరిన కొత్తల్లో టీచర్ని మేడమ్‌గారూ అన్నట్లుగా ధ్వనించింది. అదో తమాషాగా అనిపించి ఆ విషయాన్ని స్వామికి చెప్పి నవ్వింది. స్వామికూడా శృతి కలిపాడు.

కూల్‌డ్రింక్ తాగుతూ, సినిమా చూస్తూ, భర్త చేతిని తన చేతిలోకి తీసుకొంది. భార్య అనురాగపు భావనకు ఆమె చేతిలోని మెత్తని స్పర్శ శరీరానికి స్పందన అందించినా స్వామి మెదడు ఆ స్పందనను ఆస్వాదించలేదు. ఆ మెదడులో తన కారును దాటి ప్రభుత్వ అధికార గృహంలోకి వెళ్లిన ఆ జీపూ... ఆ కారూ... పదేపదే గుర్తుకు వస్తున్నాయి.

ఆ కారు తనకు తెలియందా?

ఆ వ్యక్తిని తాను ఎరగడా?

ఆ సమయంలో ఆ రకంగా ఆ వ్యక్తి కనిపిస్తే దానికి అర్థం ఒకరు తనకు చెప్పాలా.

దొంగ దొంగతనం చేస్తాడనీ, హంతకుడు హత్యలు చేస్తాడనీ, దుర్మార్గులు దారుణాలు చేస్తూనే ఉంటారనీ తనకు ఎవరో వివరించాలా?

ముందున్న జీపునిండా మనుషులు. ఆ వెనగ్గా ఆ కారు.

ఖాకీ బట్టలు ఒంటిమీద లేకపోయినా హృదయాంతరాళంలో ఎక్కడో బాధ్యత కదలాడింది.

అంతలోనే అది అదృశ్యమయింది.

ఎదురుగా తెరమీద రసరమ్య భావాలు కదులుతున్నాయి. అలరించే ఆ చలన చిత్రంలోని పాటలు మాధుర్యాన్ని గుబాళిస్తున్నాయి. కానీ స్వామి మనసులో రేగుతున్న ఆలోచనలు ఆ మధురిమలను అందుకోలేకపోతున్నాయి. వనజ మాత్రం ఆ సినిమాను ఆస్వాదిస్తూ మధ్యమధ్య భర్త భుజాలను తాకుతోంది.

ఎంత విచిత్రం ఈ శరీరం. కళ్లు చూస్తున్నాయి. సంగీతం చెవులకు సోకుతోంది. భార్య జడలోని మల్లెల పరిమళం నాసికాపుటాల మీద నాట్యం చేస్తోంది. భార్య ప్రేమానురాగాన్ని స్వామి వామహస్తం అనుభవిస్తోంది. మనోహరమైన సన్నివేశాలకు అభిమాన ప్రతిస్పందనలు స్వామి భుజంమీద సాగుతున్నాయి. భార్యకోసం తన ముఖంలో చిరునవ్వుని ప్రసరింపచేస్తున్న ఆ మానవునిలో ఏదో ప్రశ్న చిన్నగా ఉదయించింది. అది పెరిగిపెరిగి మహావృక్షంలా ఎదిగిపోయి మనిషినే పూర్తిగా ఆవహించింది.

"సార్... అర్జెంట్‌మెసేజ్' ఆ కొత్త సబ్‌ఇన్‌స్పెక్టర్ మళ్లీ వచ్చి ఆందోళనా స్వరంతో వినమ్రంగా తెలియజేశాడు.

"ఏమిటది'' డి.జి.పి మెల్లగా అన్నా గంభీరంగా ఉందా స్వరం.

"ఎస్.పిగారు లైనులో ఉన్నారు సార్. కరుణాకర్‌ని మర్డర్ చేశారట సార్' అదే వినయం.. అదే ఆందోళనతో అన్నాడు ఎస్సై.

"కరుణాకర్‌ని మర్డర్ చేశారా? ఎవరు?"

ఆ ప్రశ్న డి.ఐ.జి స్వామి అడగలేడు. అడగడు. ఎక్కడో మనసులో కలుక్కుమంది. ఆ భావం మనసులోనే అణగారిపోయింది. అది ముఖంమీదకు రాలేదు. ఆ వార్త సృష్టించిన కలవరం డి.ఐ.జి ముఖంలో మార్పుతేల్లేకపోయింది. ఆలోచన కలిగించిన అలజడి మాత్రం సాగుతూనే ఉంది. కానీ ప్రశాంతంగా ముఖంపెట్టి చిరునవ్వు చిందిస్తూ "ఎక్స్‌క్యూజ్‌మీ డియర్... జస్ట్ ఐ విల్‌కమ్'' అంటూ సుతారంగా ఆమె చేతినినొక్కి బయటకు వచ్చాడు. నేరుగా సెట్ దగ్గరకి వెళ్లి రిసీవర్ అందుకొన్నాడు.

"స్వామి హియర్' అధికార స్వరంతో అన్నాడు.

"సార్... సాయంత్రం అయిదింటికి కరుణాకర్‌ని మర్డర్ చేశారు. ఒక జీపు... ఓ కారులో వెళ్లి తోటలో ఉన్న కరుణాకర్‌ని ఎటాక్ చేశారు''

"డెడ్‌బాడీ ఎక్కడుంది?" స్వామి

కంఠంలో జీర.

"అది దొరకలేదు సార్. వాళ్లే ఏదో చేసుంటారని''

"మీరు సెర్చి చేయించండి. ఐ థింక్ యు కెన్ టేక్ యువర్ ఓన్ స్టెప్స్''

"యస్ సార్. ఐయామ్ ఆన్ ద జాబ్‌సర్'

ఎస్.పి. మెసేజ్ ఆగింది. 'ఓకే లెట్‌మీ నో ఫైండింగ్స్' స్వామి మెసేజ్ ఓవర్ అయింది. డి.ఐ.జి స్వామి మామూలుగా మారిపోయి సినిమాహాల్లోకి వెళ్లి భార్య పక్కన కూర్చొని చిరునవ్వులందించాడు.

"ఏమయిందీ... ఏదైనా సీరియస్ న్యూసా?" వనజ అడిగింది.

భార్య ముఖంలోకి చూస్తూ "ఏదో మర్డర్' అని సినిమావైపు దృష్టి సారించాడు.

అనవసరంగా ఆవిషయాన్ని ఎందుకు పొడిగించాలి అనుకొంటూ సినిమా చూడ్డంలో పడిపోయింది వనజ.

ఇలాంటి వార్తలు పెళ్లయిన కొత్తల్లో పోలీసు అధికార్ల భార్యల్ని కంగారుపెడతాయి. 'మీరు వెంటనే వెళ్లాలా?'

'అక్కడేమన్నా జరిగితే?'

'మీ చుట్టూ పోలీసులుంటారా?'

'ఆ రౌడీలు ఏం చెయ్యరుకదా?'

ఇలాంటి అసంకల్పిత ప్రశ్నలు కొత్తలో అడగటం మామూలే. కొంతకాలానికి అవి మామూలుగా అయిపోయి 'ఎపుడొస్తారు? లేటయితే మెసేజ్ ఇవ్వండి' అనే దాకా వచ్చేస్తారు.

కొత్తలోని ఆదుర్దా, కంగారు, భయం, ఆందోళన క్రమక్రమంగా తగ్గి కొంతకాలానికి ఎంత పెద్ద విషయాన్నయినా తేలిగ్గా తీసుకొంటారు. ఫంక్షన్లు, ఇతర ఆనందమయ సమయాల్లో ఏదైనా డిస్టర్‌బెన్స్ వస్తే చిరాకుపడతారు. ఆ క్షణం విసుక్కొని ఆపై మర్చిపోతారు.

అదే స్థితిలో ఉంది వనజ.

స్వామిని తన మనసే చిత్రవిచిత్రంగా కుదిపేస్తోంది. మనిషి అదుపు చెయ్యలేని మనసును ఎంత డి.ఐ.జి అయినా స్వామి ఏం చెయ్యగలడు? ఏ అధికారానికీ కట్టుబడని ఆ మనసే పెద్ద ప్రశ్నగా మారి ఎదురుగా వెండితెరమీద విశ్వరూపాన్ని ప్రదర్శిస్తోంది.



ఎంతసేపురా... త్వరగా బయలుదేరండి. అదేదో ఒదుల్చుకొస్తే మంచిదికదా! ఎవడికైనా అనుమానం వస్తే ఇరుకున పడిపోతాం" సుబ్బరాజు అరిచాడు.

"ఏంటలా అరుస్తారూ... ఇదేవయినా ఊరేగింపనుకొంటున్నారా! బాగా చీకటిపడాలి. ఇంకా గంట ఆగితేనేగానీ లాభంలేదు. బాగా దూరంపోవాలి. ఏం కంగారుపడకండి ఎవడికీ అనుమానం రాకుండా మేం చేసుకొంటాంకదా'' ఓ మత్తెక్కిన కంఠం బరువుగా అంది.

"మీ గొడవ మీదేగానీ నా మాట వినరా... మీరిక్కడనుంచి బయలుదేరి పోతేనే నేను కదలాలి. ఎవడేనా.. ఆ..." సుబ్బరాజు ఆగిపోయాడు.

"ఏమవుద్దండీ.. కంగారుపెట్టకండి. మనకేంటండీ.. ఇది మన బంగ్లా. మన మంత్రిగారు ఎపుడొచ్చినా ఇక్కడే ఉంటారు. మనకి ఎదురుగా డి.ఐ.జి బంగ్లా సెక్యూరిటీ.. ఎనక ఎస్.పి బంగ్లా మనకి కాపలా... మీకు మాట రాదులెండి'' బాటిల్ ఖాళీ చేసిన మైకం హామీ ఇచ్చింది.

"అదిసరేరా... మీరు ఎక్కడికయినా పోయి




ఉండొచ్చుకదరా'' సుబ్బరాజు గదమాయించాడు.

"సూడండి సుబ్బరాజుగారూ... మావీ ప్రాణాలే. ఆటిని పోగొట్టుకోవాలా. భలేవోరే... రవిగాడు చికెన్‌బిర్యానీ, మటన్‌కర్రీ తెస్తానని పోయాడు. అయి రాగానే తినేసి బయలుదేరతాం. అంత కంగారెందుకండీ సుబ్బరాజుగారూ! ఇంతకంటే సేఫ్టీ మనకి ఇంకెక్కడా ఉండదండి! అందుకే తినిపోతాం" తాగేవాళ్లు తీరిగ్గా అంటున్నారు.

"ఒరే మీకు మతిగానీపోయిందా.... ఆ శవం జీపులోనే ఉంది. ఇంకా రక్తం తడారలేదు. మీరు దాన్నక్కడుంచే మందూ... తిండీ మిమ్మల్ని ఏవనాలో సుబ్బరాజు ఆవేశపడ్డాడు.

"మీ గొడవ మీదేగానీ... మా సంగతి ఆలోచించరా... కనీసం ఏభై కిలోమీటర్లు పోవాలి. మెయిన్ రోడ్డు కాక పక్కరోడ్డు చూసుకోవాలి. నరమానవుడు లేనిచోట దీన్ని తగలెయ్యాలి. ఎంతలేదన్నా అయిదారు గంట లపని. సంపడం ఎంతండి రెండు నిమిషాలు. ఈ తతంగమే ఎక్కువ. మరి తిండి లేకుండా ఎలాగండీ... మధ్యలో ఎక్కడయినా ఆగితే ప్రమాదం. మీరు హడావిడి పడకండి. అంతా ఖేమం చూసుకుంటాంగా'' వాళ్లు భరోసా ఇచ్చేశారు.

ఇక వాళ్లకు మంచి తిండి సత్వరం అందేటట్టు చూడటం సుబ్బరాజు వంతయింది.

ఎలాంటి తిండితో అవసరంలేని శవం ఆ జీపులో పడి ఉంది.

★ ★ ★

స్వామి భార్యా సమేతుడై సినిమాహాలు నుంచి కారు దగ్గరకు వస్తున్నాడు. సినిమా ఇంకా కొంచెం ఉందనగానే బయలుదేరిన భర్తను అనుసరించింది వనజ.

సినిమాహాలు పోర్టికో దాటుతూండగా ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టర్ డి.ఐ.జి.కి సెల్యూట్ చేసి 'సార్' అని నిలబడిపోయాడు.

ఏవిటన్నట్లు చూశాడు స్వామి.

"సార్... ఇతను మీరు బాగా తెలుసంటున్నాడు. కలవాలంటే... ఆపాను'' సర్కిల్ ఓ వ్యక్తిని చూపాడు.

స్వామి ఆ వ్యక్తిని చూసీ చూడనట్లుగా చూశాడు.

"ఇక్కడేంటి బంగ్లాకి తీసుకురా'' సర్కిల్‌కి ఆర్డరేసి కారెక్కాడు స్వామి. సినిమా జనం బయటకు రాకుండానే డి.ఐ.జి కారు దూసుకుపోయింది.

"నువ్వెక్కడ తగిలావయ్యా నా ప్రాణానికి. డి.ఐ.జి. చూసీచూడగానే నిన్ను గుర్తుపడతాడన్నావ్. ఆయనేమో నిన్ను చూసి కూడా తెలియనట్లే బంగ్లాకి తీసుకురమ్మన్నాడు. అసలు నువ్వు ఆయనకి ఏమవుతావ్?" సి.ఐ. అడ్డుకున్నాడు.

"సార్... నా మాట నమ్మండి. ఆయన నాకు తెలుసు. అందుకే బంగ్లాకి రమ్మన్నారు'' ఆ వ్యక్తి అంతకన్నా ఒక్కమాట మాట్లాడలేదు.

సి.ఐ. ఆ వ్యక్తినే పరిశీలనగా చూస్తున్నాడు. నిజంగా ఇతను డి.ఐ.జి.కి ఏ బంధువో అయితే తన కానిస్టేబుళ్ళ సంగతి అయిపోతుంది. ఆ వ్యక్తిని అనవసరంగా 'దొంగ' అన్నారు. నాలుగు బాదారు. "నన్ను కొట్టకండి... సి.ఐ.గారికి చూపించండి'' అని డిమాండు చేశాడు. అతని మొండివాలకం, పట్టుదల చూసి కానిస్టేబుళ్ళు సి.ఐ. ముందుకు తీసుకువచ్చారు.

అప్పుడు అసలు విషయం బయటపడింది.

'దొంగ' అని ముద్రపడిన ఆ వ్యక్తి సినిమా చూడడానికి వచ్చి 'క్యూ'లో టికెట్‌కోసం నిలబడి వున్నాడు. ఆకస్మాత్తుగా ముందున్న ఓ యువకుడు 'బద్మాష్- నా జేబులోని పర్సు తీస్తావా?' అంటూ ఈ వ్యక్తిమీద విరుచుకుపడ్డాడు. "దొంగా... దొంగా'' అంటూ ఆ లైనులో ఉన్న మరో ముగ్గురు అక్కడికి దూసుకువచ్చారు. ఆ వ్యక్తి పేంట్ జేబులోంచి పర్సుతీసి "నా

కొడకా పర్సే కొట్టేస్తావా?" అంటూ నాలుగు గట్టిగా తగిలించాడు. అతని నోటిలోని పళ్ళు కదిలిపోయి రక్తం కారగా మాటరాక స్థాణువయ్యాడు. ఆ నలుగురూ ఆ హడావిడిలో అదృశ్యమయ్యారు. ఆ గొడవ చివర్లో అక్కడకి వచ్చిన పోలీసులు ఈ వ్యక్తిని స్టేషన్‌కి తీసుకొచ్చారు.

"అయ్యా... ఆ పర్సు నాది. దాంట్లో మూడువేల పైగా డబ్బుంది. ఇక్కడ రెండు ఇళ్ల అద్దెలు వసూలు చేసిన బాపతు అది. వాళ్లు నన్ను ముందే కాఫీ హోటల్లో చూశారు. ఆ తర్వాత ఇలా సినిమాహాలు క్యూలోకి వచ్చి ఇలా చేస్తారని అనుకోలేదు'' ఆ వ్యక్తి సూటిగా వివరించాడు.

"ఏయ్ ఫోవోయ్. ప్రతీ దొంగనాకొడుకూ ఇలాగే చెబుతాడు. అసలు నీదే ఊర్రా. ఇంకా ఎన్ని పర్సులు కొట్టావు. కానిస్టేబుళ్లు కరకుగా అంటూ లాఠీ ప్రయోగించారు. అతను చాలా గంభీరంగా ఉండిపోయాడు. "నేను సి.ఐ.ని కలవాలి అనవసరంగా కొట్టద్దు'' అన్నాడు.

"సి.ఐ.ని ఎందుకు కలవడం... వదిలేస్తాం ఫో..." అన్నారు కానిస్టేబుల్స్. కానీ అతను పట్టువిడవలేదు. సి.ఐ.ని కలిసి తననుతాను పరిచయం చేసుకొన్నాడు. డి.ఐ.జి. స్వామికి తాను తెలుసుననీ, అది నిజమని తేలిన తర్వాతే తననుంచి కాజేసిన సొమ్ము ఆ దుండగుల దగ్గర్నుంచి ఎలాగైనా ఇప్పించమని ప్రాధేయపడ్డాడు.

సి.ఐ. ఆ నలుగురూ ఎవర్రా అని కానిస్టేబుళ్ళను నిలదీశాడు.

వాళ్లు ముందు తెలీదన్నారు. సి.ఐ. సీరియస్ అయ్యేసరికి 'కాసులు' గాడి మనుషులు అని తేల్చిచెప్పారు. సి.ఐ.కి విషయం అర్థం అయింది. ఆ కానిస్టేబుళ్లకీ, వాళ్ళకీ ఏదో లాలూచీ. ఇలాంటివి పెద్దగా బయటకురావు. వాళ్లు రానివ్వరు. ఆ నేరం జరిగిన స్థలంలోనే దొంగతనానికి గురయినవాణ్ణి భయపెట్టి, లాఠీలు అదిలించి పరిగెత్తిస్తారు. కానీ ఇతను అలా భయపడలేదు. పైగా డి.ఐ.జి. తెలుసంటున్నాడు. వీడ్ని డైరెక్టుగా వదిలేస్తే డి.ఐ.జి.ని కలిసి చెబుతాడు. అనవసరంగా ఆయన సి.ఐ.ని. కూడా అనుమానించే ఆస్కారం ఉంది. ఈ హెడ్‌గాడు చేసిన న్యూసెన్సుకి తాను ఇతన్ని డి.ఐ.జి.కి కలుపుతున్నాడు.

డి.ఐ.జి. బంగ్లా దగ్గరున్న క్యాంపు క్లర్కు దగ్గర అతన్ని కూర్చోబెట్టాడు. డి.ఐ.జి.కి సి.ఐ. వివరాలు అందించాడు. ఇతగాడిని స్వామి గుర్తుపట్టగలడా! అనేది సి.ఐ. సందేహం. కాని అతను చాలా ధీమాగా ఉన్నాడు.

స్వామి అతన్ని చూసీ చూడటంతోనే గుర్తుపట్టాడు. అది పైకి చెబితే అందునా సి.ఐ.ముందు అతని హెూదాకే భంగకరం. పెరిగిన పదవి అల్ప విషయాలను పట్టించుకోదు. ఇతగాడో అల్పుడు. కానీ ఒకనాడు తన మానమర్యాదలు కాపాడిన ఆపద్బాంధవుడు.

గత జ్ఞాపకాల ఒరవడిలోకి ఒక్కసారి జారుకొన్నాడు. డి.ఐ.జి. స్వామి.

హైస్కూల్లో చదువుకొనే రోజుల్లో... వీరన్న గారి పొలంలో చెరకు ఆడుతున్నారు. బెల్లం బట్టీ నడుస్తోంది. అచ్చులుగా పోసి వాటిని ఆరబెడుతున్నారు. ఒక్కొక్క అచ్చు పన్నెండు రూపాయలు. అదొక్కటే ఆనాడు స్వామికి తెలుసు.

ఆ చిన్నతనంలో, తెలిసీ తెలియని వయసులో, ఆ అచ్చుల్ని దొంగతనంగా తెచ్చి కంచర్లవారి కొట్లో అమ్మేశాడు. ఎనిమిది రూపాయలే ఇచ్చాడు వాడు. ఎక్కువ అడగడానికి లేదు. అది దొంగసరుకని కొట్టువాడికి తెలీదా.

ఇంకా ఉంటే తీసుకురమ్మన్నాడు. తను తెచ్చాడు. అది బయటపడింది.

తనకి అమ్మింది గాంధీమాస్టారి అబ్బాయే అని కంచర్ల వారబ్బాయి వాదించాడు. అసలు మాస్టారబ్బాయి అలాంటివాడు కాదనీ, నాలుగైదు రోజులుగా తన కూడానే ఉన్నాడనీ




ఇతను ఆదుకొన్నాడు. కామేశ్వరరావు అబద్ధం చెబుతున్నాడని గట్టిగా వాదన పెట్టాడు. ఆనాడు ఇతను తననా ఆపదనుంచి తప్పించకపోతే ఆనాడే గాంధీమాస్టారు తన చదువు ఆపి ఉండేవాడు.

అక్కడనుంచీ అతన్తో స్నేహం పెరిగింది. అప్పట్లో స్వామికి చాలా విషయాలు చెప్పేవాడు.

కొన్నేళ్ళు ఆ పరిచయం సాగింది. అది మరువరానిది. కాలం దశాబ్దాలు పరిగెత్తినా ఇద్దరి పరిస్థితుల్లో విపరీతమైన మార్పులు కలిగినా ఆ బంధం ఉండదా...? అదే ఆనాడు ఇద్దరిమధ్యా ఉన్న చిక్కుప్రశ్న. ఇతని పేరు భైరవమూర్తి.

డి.ఐ.జి. స్వామికి పోలీసు వ్యవహారాలు బాగా తెలుసు. కానిస్టేబుల్స్‌నుంచి పై అధికారుల వరకూ ఎలాంటి లావాదేవీలు ఉంటాయో ఎరుగున్నవాడు. డి.ఐ.జి. స్థానంలోని వ్యక్తి చిన్న విషయాలు, చిల్లర విషయాలు పట్టించుకోవడం మంచిది కాదనీ తెలుసు. ఆ సంఘటనలో భైరవమూర్తి అన్యాయానికి గురయ్యాడని డి.ఐ.జి.కి తెలుసు. పరిపాలనాదక్షుడు కనుక నేరుగా అది అన్యాయం అని చెప్పలేడు. అలాగని చిన్ననాటి పరిచయస్థుడ్ని కాపాడనూలేడు. గుర్తుపట్టనట్లు ప్రవర్తించాలా? ఏదో జ్ఞాపకం లేదన్నట్లుగా వ్యవహరించాలా? ఎలా నటించాలి.

స్టేజీలమీద, కెమేరాలముందూ సీన్లు నటించడానికి ఆర్టిస్టులు ఎంతో కష్టపడతారు. ఆ సీనుకి ముందూ వెనుకా కూడా మానసిక ఒత్తిడికి గురవుతుంటారు. ఆ సీనుకి తగ్గట్టుగా నటించగలమా? లేదా అనేది వాళ్ల టెన్షన్. కానీ నిజజీవితంలో నటనని అతిసహజంగా నటించగల మేధావులు ఎందరో ఉన్నారు. వారి నటనకు ఒక్కోసారి ఆరితేరిన నటులే కంగారుపడాల్సి ఉంటుంది.

స్వామి అన్నిటినీ బేరీజు వేసుకొంటూనే సి.ఐ. మాటలు వింటూ తనకి భైరవమూర్తి తెలుసు లేదు అన్నట్లుగా ప్రవర్తిస్తున్నాడు. "ఏమయితేనేం. ఏదో ఇచ్చి అతన్ని పంపించు. మనవాళ్లు వాడికి తిండి పెట్టారో లేదో కనుక్కో. నేను చాలామందికి తెలుసు. అందర్నీ పర్టిక్యులర్‌గా ఎలా గుర్తుంచుకోవాలి'' అంటూ ఆదేశాలిచ్చి డి.ఐ.జి. లోపలి గదిలోకి వెళ్లిపోయాడు.

సి.ఐ. నవ్వుకొన్నాడు.

★ ★ ★

అది ఓ జిల్లా ముఖ్యపట్టణం. రాజకీయాలకు నెలవై, ఆర్థికంగా బాగా బలం పుంజుకొన్న జిల్లా కాబట్టి రకరకాలుగా రాజకీయాలు రంగులు మారుతాయి. అందరూ ఆశావాదులే. కానీ అవకాశవాదాలు మితిమీరుతూ జిల్లాలోని రాజకీయ వాతావరణాన్ని మార్చుతుంటాయి.

ఆనాడు ఆ జిల్లాలోనే కరుణాకర్ హత్యావార్త ఉడికిస్తోంది. దినపత్రికల ప్రధాన శీర్షికల్లో కరుణాకర్ దారుణహత్య చోటుచేసుకొంది. ప్రముఖంగా వెలువడిన ఆ వార్త ప్రజల్లో సంచలనాన్ని కలిగిస్తోంది. జిల్లా ముఖ్యపట్టణం దాదాపుగా భీతిల్లింది.

పట్టణమంతా చర్చలే. జనం మాట్లాడుకొంటున్నారు.

దోషులని కఠినంగా శిక్షించాలి.

ఏవిటీ దారుణం?

శవాన్ని కూడా మాయంచేసే దారుణ పరిస్థితులు ఎలా ఏర్పడ్డాయి?

కరుణాకర్ శవాన్ని పోలీసులు కూడా వెతికి అందించలేరా?

ఆ మాటలు అందరి మనసుల్లో మారుమోగుతున్నాయి. కొన్నిచోట్ల నెమ్మదిగా పైకి వస్తున్నాయి.

ఆ గొంతులు పైకిరావు రాలేవు.

అదే చిత్రమయిన పరిస్థితి.

దగ్గరి బంధువో, కుటుంబసభ్యుడో అయితే గొంతు విచ్చుకొంటుంది. ఆవేశపు అరుపులూ... ఆర్తనాదాలూ పైకి వస్తాయి.

## సచిత్ర విచిత్రం



# స్వర్గాన్ని తలపించే జైలు

[redacted]

ఆస్ట్రేలియాలోని గన్‌పాయింట్ జైల్లోకెళ్లడమంటే అమరలోకంలో అడుగుపెట్టడమే. ఎక్కడో భయంకరమైన అరణ్య మధ్యంలో, క్రూరమృగాల అరువులు తప్ప ఏ శబ్దం వినిపించని నిర్జన ప్రాంతంలో వున్న ఆ జైలునుంచి ఒక్క నేరస్థుడు కూడా పారిపోకపోవడానికి కారణం, ఆ అడవికి భయపడి కాదు. స్వర్గతుల్యమైన ఆ జైలు వాతావరణాన్ని వదల్లేకనే. మూడు పూట్లా రుచికరమైన వేడివేడి భోజనం, ఈత కొట్టుకోవడానికి చక్కని స్విమ్మింగ్‌పూల్, సూర్యస్నానానికి ఏర్పాటుచేసిన ఇసుక మైదానం, ఎయిర్‌కండిషన్డ్ గదులు, స్టీరియోలు, కలర్ టీ.వీ.లు ఒకటేమిటి... ఎన్నో. అయితే ఇందులో కేవలం 60 మందికే చోటు ఉంది. ఈ జైలుని ఇంత సౌకర్యంగా కట్టి, ఇన్ని వసతులు కల్పించడంలోని అంతరార్థం తెలియదుగానీ, ఓ చిన్న నేరమైనా చేసి, ఓసారి ఆ జైలుకెళ్లాలని మంచివాళ్లు కూడా అనుకోవడం కద్దు.

[redacted]

సానుభూతి ఉన్నంతమాత్రాన ఎవరు ముందుకువస్తారు?

లోకరీతి అంతే.

ఎవరో రావాలి. అందరికంటె ముందుగా తన గళంతో గర్జించాలి. ఆ గళంకోసమే చాలామంది ఎదురుచూస్తున్నారు. కరుణాకర్ పట్ల ఆ ప్రజలకున్న సానుభూతిని తక్కువ అంచనా వేయడానికి వీలులేదు.

కరుణాకర్ రాజకీయాలతో సంబంధం ఉన్న నాయకుడు కాదు. పెద్ద పారిశ్రామికవేత్తా కాదు. ధనబలం లేదు. అంగబలం ఉంటే ఆ దుస్థితి దాపురించేది కాదు.

కానీ అతను ఎందరికో అవసరం. అందుకే చాలామంది మనసులు పీకుతున్నాయి.

తనకంటూ ఏమీ లేనివాడు. ఆ పట్టణానికి ఎక్కడనుంచి వచ్చాడో తెలీదు. చదువుకొన్న యువకుడు.

"ఉద్యోగాలను ఆశించకండి. స్వతంత్రజీవితాన్ని సాగించండి. మనం చేపట్టాలేగానీ ఎన్నిపనులు లేవు. డిగ్నిటీ ఆఫ్ లేబర్‌ని మరువకండి. బిలో డిగ్నిటీ ఫీలవకండి." ఇలా అతని మాటలు ఎంతోమంది నిరుద్యోగ యువకులకు సందేశాలయ్యాయి.

ముందు రాడికల్ అన్నారు. ఆ తర్వాత అడవుల్లోంచి పారిపోయివచ్చిన 'అన్న' కాబోలు అని భయపడ్డారు. ఆ పైన అతని స్వభావం తెలుసుకొన్నారు.

ఏ పని ఎలా చేసుకోవాలి అనేదానికి కరుణాకర్ ఓ సమాధానం.

ఏ పని ఎలా జరగాలో అలాగే చెయ్యండి. మీరనుకొన్నట్లుగా పనులు జరగవు. అవి జరిగే మార్గాలు అన్వేషించి అలా జరిపించుకోండి. అని నేరుగా చెబుతున్న అతన్ని చూసి ముందు ముక్కున వేలు వేసుకొన్నా అది అక్షరసత్యమని నమ్మకతప్పలేదు.

ఎంతోమందికి ఎన్నోపనుల్లో సాయపడుతూ వారి పనులకి ఆలంబనగా మారాడు కరుణాకర్. ముఖ్యంగా మధ్యతరగతి జనంలో చాలా ఆసక్తిని కలిగించాడు. అతని కోవలోకి చాలామంది యువకులు రావడం ప్రారంభించారు. పని జరగడమే పరమావధిగా భావించిన సామాన్యజనానికి అతను ఆశ్రయమయ్యాడు.

కరుణాకర్‌కి తనదంటూ ఏమీలేదు. పెద్ద ఆశలు లేవు. ఈ కాలానికి అనుగుణమైన కావలసిన వ్యక్తిగా పేరుపొందాడు. హామీలు, గొప్పలు, అబద్ధాలు కరుణాకర్‌కి నచ్చని విషయాలు. పది పారేసి అయినా పని జరిపించుకోవాలి అనే సిద్ధాంతంతో ముందుకు సాగిపోతున్నాడు. యువకులు ఎలాంటి పనులు సాధించుకోవచ్చు. ఎంత సులభంగా, నేర్పుగా బతకవచ్చు అనే విషయాన్ని నలుగురికీ నేర్పుతున్నాడు. ఆ ఫలితంగానే స్వతంత్రజీవనాలు మొదలై వేళ్ళూనుకొంటున్నాయి. బిలో డిగ్నిటీ అనే పదం క్రమక్రమంగా తగ్గుతూ వస్తోంది.

స్వార్థానికంటూ ఏమీ ఏర్పరుచుకోని కరుణాకర్‌ని చూసి జనం ముచ్చటపడ్డారు. ఎలాంటి ఆరోపణకీ అవకాశం ఇవ్వని అతని నడవడి వారిని ఆకర్షించింది. ఏ జనానికైనా కావలసింది అదే. తమకోసం ఎదుటివాడు ఏమయినా ఫరవాలేదు. వాడి గురించి ఒక్క క్షణం వీరు ఆలోచించరు. వాడు ఏ పరిస్థితిలో ఉన్నా తమ అవసరానికి వాడు రావాలి. నిలబడి వాడు తన పనులు చెయ్యాలి. వాడికి ఆశ ఉండకూడదు. సెరగకూడదు. తాము అనుకొన్నట్లుగా, ఆశించినవిధంగా వాడి విధానమే లొంగివుండాలి. అది తమకు ప్రయోజనాలను సదా అందిస్తూండాలి. వాడు తమ పక్కనే జీవించాలి. అప్పుడు వాడు నిస్వార్థపరుడు.

ప్రజల ఆలోచనా విధానాలు ఎంతగా మారిపోయాయి. అనే ఆలోచనకు వెళితే కరుణాకర్ లాంటి వ్యక్తులు తక్కువగా కనిపిస్తారు. అందుకే అతను నిస్వార్థపరుడయ్యాడు.

అలాంటివాణ్ణి దారుణంగా హత్య చేశారా?

శవాన్ని కూడా మాయం చేశారా...?

ఎందుకా దారుణం?

ఏం సాధించాలని ఆ అమానుషానికి తలపడ్డారు?

ఎవరు చేసినా... మరెవరు చేయించినా పదిమందికోసం నిలిచే ఆ వ్యక్తిని చంపటంవల్ల వాళ్ళకు ఒనగూరే ప్రయోజనం?

ఆ సామాన్య ప్రశ్నలకూ... సామాన్యజనం మాటలకూ జవాబులుండవు. విలువా ఉండదు.

కరుణాకర్‌ది ముప్ఫైమించని వయసు. ఆకర్షణీయమైన ముఖం. సన్నగా దృఢంగా ఉండేవాడు. అతని మనసు మారుమూల ఆలోచనలు ఎలాంటివో ఎవరికీ అర్థంకావు. అవి బయటపడే అవకాశంగానీ, అవసరంగానీ లేకుండానే హతమయ్యాడు. ప్రజల్లోకి చొచ్చుకుపోతున్న అతన్ని నిరోధించాల్సిన అవసరం ఎవరిది?

నాయకులు హామీలిస్తూ, అవాస్తవాలు చెబుతూ ప్రజల్ని ముసుగులోనే ఉంచుతారనేది అంతా నమ్ముతున్న సత్యం. కానీ ఆ నాయకుల మాటలనే ప్రజలు వింటారు. నాయకుడైనవాడు ఆమాత్రం చేసుకోడా అనే సానుభూతీ ఉంది. నేటి రాజకీయాల్లో పనులు ఇతోధికంగా చెయ్యగలిగినవాడే చెల్లుబాటు కాగలడు. అధికారాన్ని తెచ్చుకోగలగాలి. మందీమార్బలాన్ని ఏర్పరచుకోగలగాలి. పార్టీ టికెట్‌నుంచి పదవులవరకూ ఎలాగోలా సాధించుకోగలగాలి. దానికి కావలసిన ముఖ్య ఇంధనం ఏమిటనేది తెలుసుకోవాలి.

డబ్బుతోనే అన్నీ వస్తాయనుకొంటే పొరపాటే అవుతుంది. అది తప్పనిసరి ముడిసరుకే కానీ పైవారి అహాన్ని శాంతపరచే అనేక పనులున్నాయి. కొందరికి జనాల జేజేలు. సన్మానాలు కావాలి. మరికొందరికి అడిగిన పనులు వెంటనే చెయ్యాలి. ఇంకొందరికి సరసాల సోయగాలు అందించగల సుందరీమణులు అవసరపడతారు. నేటి వ్యవస్థని ఆ దుర్లక్షణాలే ఏలుతున్నాయి అనడానికి సజీవ సాక్ష్యాలుగా ఇవి ఎవరికి తెలియవు గనుక. కాదనే సాహసం సామాన్యంగా ఎవరూ చెయ్యరనుకోవాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి.

ప్రజల్లో పేరు సంపాదించిన కరుణాకర్ ఎదుగుదల చూసి కలతచెందిన రాజకీయులు అతని అంతమే మంచిదని తమనుతాము సంతృప్తి పరచుకొన్నారా? ఆ కారణం తప్ప మరో బలీయమైనదేదీ కనిపించడంలేదు. ప్రవాహంలా సాగిపోతున్న కరుణాకర్‌ని ఆపకపోతే భవిష్యత్తులో ఆ ప్రవాహం ప్రభావానికి తామూ కొట్టుకుపోతే...?

అది జరగరాదు. అందుకే అడ్డు తొలగాలి. అందుకోసం ఇలాంటి మర్డర్లు సాగుతూనే ఉంటాయి. ఆ నిశ్శబ్ద సంతాప వాతావరణాన్ని ఒక్కసారిగా వేడెక్కించిన తొలికేక ఒక పార్టీనాయకుడిది.

అంతవరకూ ఆవేశాన్ని అణచుకొన్న సామాన్యులు విజృంభించారు. ఆ కలకలం కల్లోలంగా పరిణమిస్తోంది.

ఆ నాయకుడు 'కరుణాకర్ అమర్‌హై... అమర్‌హై... కరుణాకర్ అమర్‌హై' అంటూ అరుస్తున్నాడు.

జనం శృతికలిపారు.

అక్కడ కూడా జనం పేరుకుపోతున్నారు.

ఆ నాయకుడు ఎందుకలా ముందుకొచ్చాడనే విషయం ఆలోచించే పరిస్థితి అక్కడ లేదు. ఆ నాయకుడి గురించిగానీ, అతని పార్టీ గురించిగానీ ఎవరూ పట్టించుకోవడంలేదు.

ఒక కేక వినిపించింది. అంతే జనం గుమిగూడిపోయారు.

అక్కడ విలువైన ఆలోచనలకు తావులేదు. మేధస్సు పనికిరాదు. అదొక సాముహిక ఆవేశం. ఆ ఆవేశానికి అర్థం ఉండదు. ఎగిసిపడే ఆ ఉద్వేగానికి ముందుచూపు ఉండదు.

అది ఆ నాయకుడికి బాగా తెలుసు. జనం మనస్తత్వం అతనికి బాగా ఆకళింపు





అయింది. అందుకే నినాదాలు శృతిమించిన పుడల్లా తన పార్టీ పేరుకు 'జై' చెప్పించు కొంటున్నాడు. న్యాయవిచారణ జరగాలంటూ డిమాండు చేయిస్తున్నాడు. ఆలోచనార హితంగానే ఆ జనం ఆ నాయకుడి స్లోగన్‌ను చిలకల్లా పలుకుతున్నారు. అతను కూడా ముందుకు సాగుతున్నారు.

ఫలానా పార్టీ కరుణాకర్ హత్య సంఘటన ను భుజాన వేసుకుని విపరీతమైన ప్రచారాన్ని సాగిస్తోంది అనే విషయం క్షణాలమీద ఆ పట్టణంలోని ఇతర రాజకీయ పార్టీల కార్యాల యాలకు, నాయకులకు చేరింది. ఆ కార్యాల యాలు కదిలాయి. నాయకులు కంగారుపడ్డా రు. ఆ ప్రచారాన్ని తిప్పికొట్టాలంటే ఆ సమ స్యని తమ భుజాలమీదకి ఎక్కించుకోక తప్ప దు. అదే రాజకీయం. ఒక సమస్యను ఒకపార్టీ ఎలుగెత్తి చాటితే మిగతా పార్టీలు మౌనంగా ఉంటాయా. అలా ఉంటే ఆ సమస్యకు కారణం ఆ పార్టీవారేనని ప్రజలు అనుమానప డరా...? ప్రజలకు ఈ పార్టీల రాజకీయాలు పూర్తిగా అవగతం కాకపోయినా నాయకులు మాత్రం సునిశితంగా ఆలోచిస్తారు. తమకు సంబంధం లేకపోయినా సమస్యను తలమీద వేసుకొంటారు. అలా చెయ్యకపోతే అవతలిపా ర్టీకి విపరీతమైన ప్రాముఖ్యం వస్తుంది. అది తమ మనుగడకే సవాలుగా మారుతుంది. సవాలు సంగతి ఎలా ఉన్నా వేరేవాళ్లకి ప్రాము ఖ్యం ఎందుకు రానివ్వాలి?

అందుకే అన్ని రాజకీయ పార్టీలు తమ తమ బలగాలను వెంటనే సమీకరించాయి. కరుణాకర్ హత్యాఖండనకి రంగంలోకి వచ్చే శాయి. కలెక్టర్ కార్యాలయం వద్ద జరుగుతు న్న ఆ ఆందోళనా ఉద్యమంలో దూరి తమ ఉనికి చాటుకున్నాయి.

ఎక్కడ ఏ చిన్న ఆందోళన ప్రారంభమయి నా దాన్ని రాజేసేవారు కొందరుంటారు. ఆ ఆందోళనలో చేరి తమ ప్రతాపాన్ని చూపుతూ ప్రచారానికి ఆరాటపడేవాళ్లు మరికొందరు. నా యకుల ప్రవేశం మాత్రం నాటకీయంగా సాగు తుంది. ఆఖరికి ఎవరు ఎక్కువ ప్రచారం చేశారనే వాదన కూడా వస్తుంది.

మన రాష్ట్రంలో నెల్లూరు జిల్లాలోని దూబ గుంటలో సారాకి వ్యతిరేకంగా ఆరంభమ యిన మహిళోద్యమంలోకి క్రమక్రమంగా అన్ని రాజకీయ పార్టీలు చేరిపోయాయి. ఎవరి కివారే ప్రచారం కోసం ఆరాటపడ్డారు. జనాన్ని దించారు. కొన్నిచోట్ల మత్తుగా అరిచే సారా గొంతుల్ని చూసి మహిళలే ఆశ్చర్యపోయారు. వారెవరు? అనేదానికి సమాధానం ఎవరూ సూటిగా చెప్పలేరు. విజయకేతనం ఎగురవే సింది కాబట్టి అది మహిళోద్యమం విజ యంగా అభివర్ణించబడింది. లేకుంటే నాయ కులు గద్దెలెక్కి ఒకరిపై ఒకరు పరస్పరం నిందారోపణలకు దిగేవారే.

కానీ ఈ పరిస్థితిలో ఎవర్నీ మరెవరూ నిందించలేరు. సంఘటన అలాంటిది. రాజకీ యపక్షాలన్నీ కలెక్టరు కార్యాలయంవైపే దృ ష్టిని సారించాయి. గానీ అందరూ ఆ జిల్లాకే తలమానికమైన మంత్రి ఆ ఊరివాడేనన్న సంగతే మరిచిపోయారు. కలెక్టరు కార్యా లయం జిల్లా వ్యవహారాలకు కేంద్రస్థానం. అది ప్రభుత్వ కార్యాలయం. ప్రజలందరిదీ. దాన్ని ధ్వంసం చేసినా ఎవరికీ ముప్పురాదు. స్వతంత్ర భారతదేశంలో ప్రభుత్వ ఆస్తులకు న్న విలువ ఆ పాటిదేకదా. ఎవరో రగిల్చిన చిచ్చుకు అవి బలవడం ఏం సమంజసం అని ఆలోచించేవారు ఎవరూ ఉండరనే యదార్థ పరిస్థితులు స్పష్టం చేస్తున్నాయి. రాజకీయహ త్యలు, దోపిడీలు, మానభంగాలు, అల్లర్లకు అవి నాశనం అవడం అనాదిగా కొనసాగుతు న్న ఆనవాయితీ. ఆ దాడులకి ఎవరు బాధ్యు లు? సమస్యని పక్కదోవ పట్టించేవారు కాదా. వారి గురించి తెలియని అమాయకత్వంలో మన ప్రజలున్నారే అనుకోవాలా? కానీ అది సామూహిక ఆవేశం. వివేకం కోల్పోయిన అనవసర ఉద్రేకం.

నినాదాలహోరు ఆ పట్టణాన్ని కమ్మే

సింది. కోపతాపాలు... ఆవేశపు కేకలు. రకరకాల ప్రచార ఎత్తుగడల స్వరాలు ఆ హెూరులో మిళితమయ్యాయి. ఆ శోకం, కోపం, ఆవేశంలో ఒక వాస్తవం కూడా రూపుదిద్దుకుంటోంది. రాజకీయంగా పరిణితి చెందిన జిల్లా ముఖ్యపట్టణం కావడంవల్ల అక్కడి ప్రజల్లో రాజకీయ పరిజ్ఞానం కూడా చోటుచేసుకొంది. అది తక్కువ శాతమే అయినా వాస్తవాలు భయంకరంగా, కర్కశంగా, నిష్ఠూరంగా ఉంటాయి. వాటిని ఆపడం కూడా ఒక్కోసారి కష్టమే అవుతుంది. కొందరి పదునైన మెదళ్ళలో ప్రారంభమయిన ఆలోచన క్రమక్రమంగా ఒకరినుంచి మరొకరికి దూసుకుపోతోంది. వారి హృదయాలను తడుతున్నది.

'బతికినంతకాలం కరుణాకర్ ఆలోచనా విధానాన్ని దుయ్యబడుతూ సంఘానికి చీడపురుగులా అభివర్ణించిన నాయకులెవరు? చిన్నగా వ్యంగోక్తులు ప్రచారం చేస్తూ అతన్ని నిరోధించాలని ప్రయత్నించిన వారెవరు? వాడెక్కడివాడు? ఇక్కడ వాడికేం పని? స్థానికుడికంటె వాడు గొప్పవాడా? వాణ్ణి నమ్మవద్దు' అంటూ కరుణాకర్‌కి అవరోధాలు ఏర్పరచబూనిన ఆ పెద్దలెవరు?

ఆ మాటల్ని, ఆ మనుషుల్ని పట్టించుకోకుండా ముందుకు సాగినందుకే కదా కరుణాకర్ బలయ్యాడు. వారంతా ఎవరు? నేడు వీధినపడి నినాదోద్యమాన్ని తారాస్థాయిలో నడిపిస్తున్నది వీరుకాదా... వారే వీరు. కరుణాకర్‌కి అమరత్వం కలగాలని అరుస్తున్నారు. ఆ దారుణ అమానుష హత్యాకాండమీద తమ ఉనికిని చాటుకొంటున్నారు. తమ భవిష్యత్తుకు రాజకీయపురోగతికి ఆ శోకం, కోపం, ఆవేశాలను బాటలుగా వేసుకొని ముందుకొచ్చారు. రాజకీయాన్ని కాచి వడపోసిన నేర్పరులు. ఎలాగోలా ఏ సమస్యలోనైనా దూరి తమ రాజకీయ భద్రతకు పునాదులు వేసుకొంటారు. గతంగతః. గతాన్ని తవ్వుకొంటూ కూర్చొంటే చేతిలోని సమస్య దాటిపోతే




మళ్ళీ ఆ అవకాశం రావడానికి ఎంతకాలమైనా పట్టవచ్చు. అందుకే అనుకూల కాలాన్ని సద్వినియోగం చేసేస్తున్నారు.

హత్యలే మూలసూత్రంగా కొనసాగిస్తున్న కొన్ని రాజకీయ పార్టీల నాయకులు ఆ హత్యలు సృష్టించిన అలజడులను కూడా తమకి అనుకూలంగా మలచి తమ రాజకీయాన్ని చలామణీ చేయిస్తున్నారు. పథకం ప్రకారం ఆ కార్యక్రమాల ఆచరణ ఉంటుంది. హత్యలు చేయించేది వారే. వాటిని ఖండించేది వారే. నేటి రాజకీయ రణరంగంలో నాయకులు దేనికయినా సిద్ధపడుతున్నారు. ఇది దాదాపుగా అర్థం అయినా మాట కదిపేది ఎవరు? హత్యారాజకీయ ఒరవడికి అడ్డునిలిచే సాహసం చేసేదెవరు? అర్థం అయినా... కాకున్నా నేటికీ ఎందరో ఉద్రేకపు కెరటాల్లో కొట్టుకుపోవడంవల్ల ఈ విషయాలు సమాజంలో ప్రాముఖ్యతను సంతరించుకోవడంలేదు. కొంతమంది మాత్రం అన్నింటినీ అవలోకిస్తున్నారు. ఆ కొందరు పెరిగితే ఈ దేశరాజకీయాల కంటే ప్రతీకారజ్వాలలే ప్రముఖస్థానం ఆక్రమిస్తాయి. అవి ఇప్పటికీ కొన్ని రాష్ట్రాల్లో నిత్యాగ్నిగుండాల్లా సాగుతున్నాయి.

"ఈ పార్టీల నాయకులు ఇంత ఆకస్మికంగా కరుణాకర్‌ని పొగుడుతున్నారేంటీ" ఈ సందేహం ప్రజల్లోంచి వచ్చిందే.

"ఏదో గొడవ చెయ్యకపోతే ఈళ్లని ఎవడు పట్టించుకొంటాడూ"

"ఆ కరుణాకర్ ఆడి మానాన ఆడు ఏదో జనాన్ని పోగేసుకొంటున్నాడు. ఆడి బతుకు ఆణ్ణి బతకనివ్వకూడదా?"

"అసలు ఆడిని ఎవడు చంపుతాడూ. వీళ్ళే ఆడిని చంపి పైగా ఆడిమీద ఎంత ప్రేమ చూపిస్తున్నారు"

"రాజకీయమంటే అదేమరి. చంపేసి సానుభూతి చూపిస్తూ ఈళ్లు జనాల్ని ఎర్రోళ్లని చేస్తున్నారు..."

"వాణ్ణి చంపేసి- ఎక్కడో కాల్చేసి ఉంటారు. అదక్కడ అయిపోతుంది. ఇక్కడ వీళ్లు ఊరేగింపులూ- సంతాపసభలూ చేసేస్తారు"

"మనకెందుకులే. అవన్నీ పోలీసోళ్ళు చూసుకోవాలి. అనవసరంగా వాగడమెందుకూ?"

"ఇప్పుడు చేసేదేంలేక వాగుతున్నాం. ఎన్నాళ్ళు ఇలా సాగుతుందీ వీళ్లకంటె ఘనుడు మరొకడు తయారవుతాడు. అప్పుడు వీళ్లపనీ అంతే!"

ఆరకంగా జనంలోంచి వచ్చిన మాటలు నాయకులకు వినపడవు. వాటిని చేరవేసేందుకు ఎవరూ ఉండరు. అదే నేటి నాయకులకు ఉన్న పెద్ద బలహీనత. ప్రజాప్రతిస్పందనే తమ రాజకీయ భవిష్యత్తును శాసిస్తుందనే సూత్రాన్ని వారు పట్టించుకోవడంలేదు. భజనపరుల భజంత్రీ మోతలకే తలలు ఆడిస్తున్నారు. వారి ఆలోచనా విధానాన్నే అమలుపరుస్తూ ప్రజాభిప్రాయానికి ఏమాత్రం విలువనివ్వక అదే రాజకీయ విధానమనే భ్రమలో సాగిపోతున్నారు. సాగినంతకాలం సాగి ఆపైన ప్రజాభీష్టం ఎదురుతిరగడంతో చతికిలబడి శాశ్వతంగా చరిత్రహీనులవుతున్నారు. శరవేగంతో రాజకీయాల్లోకి చొచ్చుకువచ్చినవారు అంతే త్వరగా అదృశ్యమవడానికి అదే ప్రధానకారణం. నేటి సమాజంలో 'రాజకీయాలు వద్దు, వద్దు' అంటూనే ఎందరో నాయకులు కావడానికి ఉవ్విళ్లూరుతున్నారు. ప్రజానాయకత్వం నిజమైన నాయకత్వం కాదని వారి నమ్మకం. పదవీనాయకత్వమే కావాలి. దానికోసమే విపరీతమైన పోటీ. అందుకే ఈ నయవంచనలు.

సుబ్బరాజు కదిలి వస్తున్నాడు. అతని రెండుపక్కలా వస్తాదుల్లా ఉన్న ఆరుగురు అతన్ని గమనిస్తూ వెంట నడుస్తున్నారు. ఆ వెనుక రెండువందలమంది జనం. వస్తాదులు సుబ్బరాజుకి రక్షణవలయంలా ఉన్నారు. ఆ ఊరేగింపులో అదొక నూతనోత్సాహం. ఆవేశం పెరిగింది. అరుపులు పెరుగుతున్నాయి. సుబ్బరాజు వెనగ్గా ఉన్న జనం చేతుల్లో 'కరుణాకర్ అమర్‌హై' అనే నినాదాల పోస్టర్లు ఉన్నాయి. స్వయంగా సుబ్బరాజే కోపంగా, ఆవేశంగా 'అమర్‌హై' అని అరుస్తున్నాడు. అన్ని పార్టీల జనం కలిశారు. ఆ సంగమం చూస్తే దాదాపుగా అన్నిపార్టీలు కల్సిపోయాయా అన్నట్లుంది. తమ నాయకుల పేర్లు చెబుతూ 'జై'లు చెప్పించుకుంటున్నారు పక్కనున్న నాయకశిష్యులు. నాయకునిముందే జనంచేత ఆ నాయకునికి జై కొట్టించి సంబరపడుతున్నారు. పార్టీల జెండాలు రెపరెపలాడుతున్నాయి. వాటిని కనిపించేటట్లు పట్టుకొన్నారు. అపుడపుడు పార్టీలకు కూడా జైకొట్టి గౌరవం ఇప్పించుకొంటున్నారు. వారందరికూడా నడిచే సామాన్యజనం ఆ రాజకీయ ఎత్తుగడలతో సంబంధం లేకుండా నినాదపర్వాన్ని నిరాఘాటంగా నిర్వహిస్తున్నారు.

ఆ జనప్రవాహం కలెక్టరు కార్యాలయానికి చేరేసరికి మధ్యాహ్నం మూడవుతోంది. అప్పటికే అక్కడ పోలీసు బలగాలన్నీ దేనికైనా సిద్ధం అన్నట్లుగా మొహరించివున్నాయి. కలెక్టర్ కార్యాలయానికి కొద్దిదూరంలో ఎత్తుగా ఉన్న ప్రదేశంలో మైకు ఉంది. వెదురు గుంజలు పాతి ఉన్నాయి. వాటికి లౌడుస్పీకర్లు కట్టారు. బేనర్లు కూడా చోటుచేసుకున్నాయి. ఎవరెవరో చిన్న చిన్న నాయకులు ఆవేశంగా మాట్లాడుతున్నారు. మైకు ముందుకెళ్లినవాళ్లు తమ గొంతును పెంచి అరుస్తున్నారు. తీవ్రవాదాన్ని రౌడీయిజాన్ని, హత్యారాజకీయాల్ని దుయ్యబడుతున్నారు. గొంతులు మారినా ఆవేశపు ప్రసంగాల సారాంశం ఇంచుమించు ఒకలాగే ఉంది. అయినా జనం వింటున్నారు. ఆవేశకావేషాలకు లోనవుతూనేవున్నారు. ఏదో చెయ్యాలి. ఏం చెయ్యాలి? అదే అర్థంకాక అయోమయంలో పడిపోతున్నారు. కలెక్టరు కార్యాలయం సమీపాన ఆ ఎత్తయిన స్థలంలో మైకు ఏర్పరిచినవారెవరు. అక్కడ బేనర్లు ఎవరు కట్టారు... ఎవరు... ఎవర్ని... ఎందుకు విమర్శిస్తున్నారు... తమలోని ఉద్రేకాన్ని పెంచుకుంటూ ఉద్రేక ప్రసంగాలను ఉధృతంగా ఎందుకు చేస్తున్నారు. ఇవన్నీ ఎవరూ పట్టించుకోని ముఖ్య విషయాలు. కానీ అవి

జనందృష్టికి రావు. ఎందుకంటే వారంతా సామూహికంగా ఉద్రేకానికి లోనయ్యారు.

"నేనూ... నా పార్టీ - కరుణాకర్ హత్యను తీవ్రంగా ఖండిస్తున్నాం.

"ప్రజలారా శాంతం వహించండి. హింసకు హింస ప్రతీకారం కాదు. ఎవరో దుర్మార్గులు చేసిన దారుణానికి మనం శాంతి వదలకూడదు.

"ఈ హత్యకు బాధ్యులైనవారు ఎంతటి గొప్పవారయినా... ఏ పదవిలో ఉన్నా వదిలే ప్రసక్తి లేదని మీకు నేను హామీ ఇస్తున్నాను. హత్యారాజకీయాలకు అతీతంగా ఉండే మా పార్టీ హంతకుల్ని పట్టుకొనేంతవరకూ నిద్రపోదు. మేము ఈ హత్యలను చూస్తూ ఊరుకోము.

"ఒక మంచి వ్యక్తిని దారుణంగా హత్య చేసి తప్పించుకొని పోలేరు. వాళ్లని ఖచ్చితంగా పట్టుకొంటాం. కఠినంగా శిక్షిస్తాం. నిన్న రాత్రి హైదరాబాద్‌లో ఉన్న నాకు ఈ విషయం తెలిసింది. జిల్లా మంత్రిగా వెంటనే బయలుదేరి వచ్చాను. పోలీసు ఉన్నతాధికారులతో మాట్లాడాం. పోలీసులు ఆ హంతకులను పట్టుకోవడానికి చాలా ప్రయత్నాలు చేస్తున్నారు.

"ఇదొక విచారకర సంఘటన. జిల్లాకే తలొంపులుగా ఉంది. ఏది ఏమయినా మీరంతా ప్రశాంతంగా ఉండాలని కోరుతున్నాను. మీ బాధ, ఆవేశం నాకు తెలుసు. నాకూ అవి ఉన్నాయి. కానీ ఏంచేస్తాం. దిగమింగాలి... అనవసరంగా ఆవేశపడకండి. మనం ఉద్రేకపడితే చనిపోయిన మనిషి తిరిగిరాడు. శాంతం వహించండి.

"ఆ యువకుడు గతంలో ఓసారి నన్ను కలిశాడు. పేదలకోసం స్కూలు పెడతానన్నాడు. 'సరే' అన్నాను. ప్రారంభోత్సవానికి రమ్మన్నాడు. వెళ్లాను. ఇంతలోనే ఈ దుర్వార్త

"మీకు నేను చెప్పేది ఒక్కటే... మంచి ఎప్పుడూ మిగిలిపోతుంది. ఆ యువకుడు చాలా శాంతపరుడు. శాంతంగా ఉండి అతని ఆత్మకు శాంతి కలగాలని కోరుకొందాం. కరుణాకర్... అమర్‌హై''

మంత్రి కోటేశ్వరరావు తన ప్రసంగాన్ని పూర్తిచేసి వెనక్కువస్తూ "ఇప్పుడు మన ప్రియ నాయకులు శ్రీ సుబ్బరాజు'' అన్నాడు.

ఆ ప్రదేశంనుంచి పోలీసుల కాపలాతో దూరంగా వచ్చి పోలీసు రక్షణవలయంలో నిలబడ్డాడు.

"చాలా బాధపడాల్సిన విషయం. ఇపుడిపుడే పైకి వస్తున్న యువకుణ్ణి దారుణంగా చంపడం ఘోరం. హత్యారాజకీయాలవల్ల ప్రయోజనం ఉండదు. ఇలాంటి హత్యలు ఇకపై సాగకూడదు. ఈ హత్య చేసినవాళ్ళని వెంటనే పట్టుకోవల్సిందిగా పోలీసులను కోరుతున్నాను.

"మంత్రిగారు ఇక్కడే వున్నారు. ప్రభుత్వపరంగా కఠినచర్యలు తీసుకోవాలని ఆయనకు నా విజ్ఞప్తి. మరి మీ అందరికీ, కరుణాకర్ బంధువులకీ నా ప్రగాఢ సానుభూతి తెలియజేస్తూ ఆయన ఆత్మకు శాంతి కలగాలని ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తూ శలవు తీసుకుంటున్నాను. కరుణాకర్ అమర్‌హై''

సుబ్బరాజు ఆవేశంగా చేసిన ప్రసంగాన్ని ఎస్.పి. గంభీరంగా గమనించాడు.

డి.ఐ.జి. స్వామి ఎస్.పి.కేసి చూశాడు. కలెక్టర్ డి.ఐ.జి.కేసి చూస్తున్నాడు.

ఆ ముగ్గురూ కలవడానికి, చర్చించడానికి వీలులేని విధంగా అక్కడ ప్రజాప్రతినిధులున్నారు. వారిని గమనించడం వీరి విధి. ఆ ప్రతినిధుల కనుసన్నల్లో మెదిలే భావాలే ఆజ్ఞలుగా శిరసావహించడానికి అధికార యంత్రాంగం సమాయత్తమయింది.

అదే రాజకీయ నాయకులకూ, అధికారులకీ ఉన్న విచిత్ర సంబంధం. ఉన్నతాధికారుల దృష్టిలో ఈ రాజకీయ నాయకులు అల్లుళ్లుగానే ఉంటారనడం నిర్వివాదాంశం.




కానీ అక్కడ తేడా అధికారం.

అది ఎప్పుడు ఎవరి చేతిలోకి వస్తుందో తెలీదు కాబట్టి నాయకుల్ని అతి జాగ్రత్తగా చూస్తున్నామనే విధంగా ప్రవర్తిస్తుంటారు. నాయకులకి అధికారులంటే పూర్తిగా నమ్మకం ఉండదనేది అనేక సందర్భాల్లో రుజువయింది. పదవీ విరమణ వయసువరకూ కొనసాగే ఉన్నతాధికారానికీ, విధాయక నిర్ణయాలు తీసుకోగలిగిన ప్రజాప్రతినిధులకీ ప్రచ్ఛన్న యుద్ధం జరుగుతూనేవుంటుంది. అది పైకి ఏమాత్రం కనపడదు.

ఆ రెండు వర్గాలూ తమ పాత్రల్ని చక్కగా పోషిస్తుంటాయి. అతి సహజమైన ఆ నటనలో ఏమాత్రం తేడా రాదు. తమకి కలిసిరాని, సహకరించని ఉన్నతాధికారులని సునాయాసంగా అవతలకి తోయించేయగల సమర్థత ప్రజాప్రతినిధులకి, అందునా పదవిలో ఉన్నవారికి ఉంటుంది. ఆ అధికారాలు అక్కడ అలాగే కొనసాగితే పార్టీకే ముప్పు, తద్వారా ప్రభుత్వానికి చెడ్డపేరు అంటూ గోలచేసి వారిని సాగనంపేదాకా వీరు విశ్రమించరు.

ఆ బదిలీల పర్వంలో తమ స్థితి ఎలాంటి దైన్యానికి చేరుకొంటుందోననే బెంగ ఉన్నతాధికారులను పీడిస్తూవుంటుంది. అందుకే పవరున్న నాయకులపట్ల అతి జాగరూకతతో మెలగుతూవుంటారు. వారికి తమపట్ల అపార గౌరవం ఉన్నట్లు భావన కలిగిస్తారు. జిల్లాలకు మంత్రులు వచ్చినప్పుడు వారి కార్యక్రమంలో పాల్గొన్నా ఉన్నతాధికారులంతా వారికూడానే పరిభ్రమిస్తూవుంటారు. కనుచూపుమేరలో అధికారాలతోసహా కాచుకొని ఉంటారు.

సుబ్బరాజు ప్రసంగం ముగియగానే మంత్రి, సుబ్బరాజు ఒకే కారు ఎక్కారు. కారు బయలుదేరుతూండగా మంత్రి డి.ఐ.జి.ని పిలిచాడు.

"స్వామిగారూ! ఇక్కడ గొడవ కాకుండా చూడండి. ఈ జనాన్ని ఎలాగోలా పంపేయండి. అపోజిషన్‌వాళ్లు దీన్నేదో ఆసరాగా తీసుకుని గొడవ చెయ్యాలని ప్లాను చేస్తున్నారట. అదేదో కాకుండా చూడండి. వెంటనే జనాన్ని ఖాళీ చేయించండి. నేను ఓ గంట తర్వాత గెస్ట్‌హౌస్‌లో ఉంటాను'' అనేసి సమాధానం ఆశించకుండానే ముందుకు సాగిపోయాడు.

'సార్... అని ఆగిపోయాడు ఎస్.పి, డి.ఐ.జి. ఆలోచనలోపడ్డాడు.

"ఈ మాసెస్‌ని ఇక్కడినుంచి పంపించెయ్యండి. పీస్‌ఫుల్‌గా యాక్ట్ చెయ్యమని మన ఫోర్సెస్‌కి చెప్పండి'' స్వామి ఆదేశించాడు.

"యస్ సార్' ఎస్.పి. తల ఊపాడు.

డి.ఐ.జి. అక్కడున్న కుర్చీలో కూర్చొని కలెక్టరుతో మాటల్లోపడ్డాడు.

క్షణాలమీద డి.ఐ.జి. ఆదేశాలు పోలీసులందరికీ అందాయి. జనంచుట్టూ పోలీసు బలగాలు మోహరించాయి.

రాజకీయంగా కొద్దిగా ఎదుగుతున్న చిన్న నాయకులు జారుకొన్నారు. ఇలాంటి సంఘటనలలో అనుభవం ఉన్న ఓ మాదిరి పెద్ద జనం తప్పుకొన్నారు. ఆవేశాన్ని రగిలించిన ఊరేగింపు సారథులు కనుమరుగయ్యారు. ఏం చెయ్యాలో తోచని మామూలు జనం అక్కడినుంచి వెళ్లిపోవడానికి హడావుడి పడుతున్నారు.

లాఠీలు చిన్నగా కదిలాయి. అక్కడక్కడ జనం కాళ్లమీదా... వీపులమీదా అవి పడుతున్నాయి.

జనం పరుగులు... పోలీసుల కేకలు... లాఠీల ప్రతాపానికి అరుస్తున్న గొంతులు...

జనం చూస్తుండగానే ఆ ప్రదేశాన్ని ఖాళీ చేసి తలోదారిన కనుగమరుగయ్యారు. రోడ్డంతా పోలీసులే ఉన్నారు. అంతవరకు జరిగిన హడావుడి నామమాత్రంగా కూడా లేదు. పోలీసులు రోడ్డుకి ఇరువైపులా బారులుతీరి నిలబడి వున్నారు.

ఆ ఖాళీ రోడ్డుమీద డి.ఐ.జి. స్వామి కారు వేగంగా దూసుకెళ్లింది.



రాత్రి పదకొండు దాటింది.

పోలీసు క్రీడామండలి నిర్వహించిన మహిళా క్రీడోత్సవాల ముగింపు సభలో ముఖ్య అతిథిగా హాజరయిన స్వామి భార్య వనజ అలిసిపోయి నిద్రపోతోంది.

పదవీ ప్రదర్శనా దుస్తులను వదిలి స్వామి మామూలు బట్టలు వేసుకొన్నాడు. ఆ దుస్తులు వదిలినా ఏదో తెలియని అధికారభావం ఆయనలో కదులుతూనే ఉంటుంది. ఆ భావాన్ని అదుపుచేసుకోవడానికి విస్కీ తాగాడు.

కరుణాకర్‌కు ఎందుకా చావు...



రాజకీయాలకు దూరంగా తనకు అవసరం అనిపించిన పనులన్నీ చేశాడు వాడు!

కానీ, రాజకీయ కవచం లేదతనికి! ఆ పనులా తనకి పనికివచ్చేవి కావు.

ఈ జనం - పనులు చేయించుకొంటారే గానీ గుర్తుంచుకోరు.

యూస్‌లెస్ ఫెలో - అనవసరంగా చచ్చిపో యాడు అనుకున్నాడు.

'నో వాడు చావలేదు. దారుణంగా హత్యకు గురయ్యాడు. ఎవరో ఒకరు స్వార్థంతోనో,

నిస్వార్థంగానో పనులు చెయ్యకపోతే తనుమాత్రం ఈనాడు ఈ స్థితిలో ఉండేవాడా? స్వార్థంతో చేస్తే పని జరిగినా వాణ్ణి జీవితాంతం విమర్శిస్తాం. నిస్వార్థంగా చేస్తే అనుమానిస్తాం. అసలు ఎవరికైనా ఎందుకు రాజకీయ కవచం...? మనకు అనవసరం అనిపిస్తే ఆ పనులు జరక్కూడదా - అప్పుడు వాటిమీదే పూర్తిగా ఆధారపడిన జనం ఏంకావాలి.

"నిస్వార్థత" గౌరవాలనూ... కృతజ్ఞతనూ కోరుకోదు. ఈ సమాజానికి అవసరమైన ఒక నిస్వార్థ యువకుడు అమానుషంగా చంపబడితే మనలో కదలికే లేదా''

స్వామిని ఆలోచనలు చిత్రవధ చేస్తున్నాయి.

'అందరికన్నా ఎక్కువ బాధ తన మనసు మారుమూలలలో దాగివుంది. అంతరాత్మ అనంతంగా రోదిస్తోంది. కానీ ఆవేదన ఓ అంతర్మథనం. అంతే... అది పొరలు పొరలుగా ఏర్పరుచుకొన్న సమర్థతా వలయాలను ఛేదించుకొని రాలేక, అధికార భావనల సమీపానికి చేరలేక అంతరాళాల్లోనే విలవిల్లాడుతోంది. ఈ సమాజంలో సమర్థతకు అర్థం స్థానం. తానెక్కిన మెట్లన్నీ తమ సమర్థతా చిహ్నాలు. బట్...

"వాట్ - అదేమిటీ...? అంతరాళాల్లో మథనానికి గురయ్యే ఆ బాధని బయటకు రానీయాలి! ఆ కారులో వ్యక్తి ఎవరో తనకు తెలియదా...? తను ఆ వ్యక్తిని గుర్తుపట్టలేదా - ఆ క్షణంలో తన సమర్థతను కప్పేసిన ముసుగు ఏమిటి? నైతిక పతనమే సమర్థతా... అసమర్థుడైనవాడు కూడా ఎంతో ఉన్నతంగా బతుకుతూ అసమర్థతే ఆయుధంగా తన జీవనయాత్రను ఆనందమయంగా మార్చుకొంటున్న ఈరోజుల్లో సమర్థుడనిపించుకున్న తన జీవితం నిర్జీవంగా సాగాల్సిందేనా?

స్వామి మనసు... మెదడుని నానారకాలుగా కుళ్లబొడుస్తోంది. అంతర్మథనం... బయటకు రాలేని ఆలోచనాసమరం శరీరంలోకి మత్తుగా జారుకొంటున్న ద్రవం స్వామిని ఓడించి నిద్రావస్థలోకి జార్చాయి.

కానీ నిద్రపోని మెదడు స్వామి గత జీవిత జ్ఞాపకాలను నెమరువేస్తూనే ఉంది.



తన చిన్నప్పుడు ఓరోజు...

గాంధీ మాస్టారు హడావుడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు. ఆయన జీవితంలో ఏదో పెద్ద దెబ్బతిన్న వ్యక్తిలా కనిపిస్తారు. నిరాడంబరత, శాంతియుత జీవితం సదా కోరుకొనే ఆ మాస్టారికి గాంధీమాస్టారు అనే పేరు అందుకే వచ్చింది. ఆయన అసలుపేరు వెంకట సుబ్బారావు ఏనాడో మరుగునపడింది. సామాన్య బడిపంతులైన ఆ మాస్టారు తన వ్యక్తిత్వాన్ని గొప్పగా మలచుకొన్నారు. విద్యార్థులకు పాఠాలు చెప్పడమే మాస్టార్ల పనికాదనీ, పాఠాలతోపాటు మంచి ప్రవర్తన, సామాజిక పరిస్థితులపట్ల అవగాహన పెంచాలనే తన నమ్మకాన్ని ఆయన ఆచరించి చూపుతున్నారు.

పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతున్న అన్నవరానికి దగ్గర్లోని తొండంగి గ్రామంలో ఆయన ఆలోచనావిధానం ఆచరణమార్గాన్ని ఏర్పరచుకొంది. ఆ కొండప్రాంతంలో పదేళ్లుగా ఆయన విద్యార్థులకు పాఠాలు... జీవిత విధానాలు నేర్పుతున్నారు. విద్యార్థులకు చదువుకంటె ముఖ్యం నైతిక విలువలనేది ఆయన నమ్ముతున్న సిద్ధాంతం. ఆ విలువల పరిరక్షణ

లక్ష్యంగా సాగే ఆయన మనోపాఠశాలలోని విద్యార్థులంతా సుశిక్షితులైన భావిభారత పౌరులుగా రూపుదిద్దుకోవాలనేది ఆయన ఆకాంక్ష. సజావుగా సాగుతున్న ఆ మానస సరోవరంలో పెనుతుఫాను సుధీర్ మరణం.

సుధీర్, గాంధీమాస్టారి ప్రియ శిష్యుడు. అన్నిటా ఉత్తమంగా రూపుదిద్దుకుంటున్న సుధీర్‌పట్ల గాంధీమాస్టారు అపారమైన అభిమానాన్ని పెంచుకొన్నారు. అప్పటికి సుధీర్‌కి పదిహేనేళ్లు. ఇంచుమించు అదే వయసు కృష్ణస్వామిది. ఇద్దరూ తొమ్మిదో తరగతి చదువుతున్నారు.

గాంధీమాస్టారు జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలో పనిచేస్తున్నారు. ఇద్దరు మగపిల్లలు పుట్టగానే అనారోగ్యానికి గురై మరణించిన భార్యని తలచుకొంటూ కుంగిపోకుండా, ఆ శోకంలోంచి ఒక నైతిక బాధ్యతను స్వీకరించారు మాస్టారు. దాన్ని ఒక సిద్ధాంతంగా పెట్టుకొని తన పిల్లలూ, ఇతర పిల్లలూ అనే తేడా లేకుండా అందర్నీ ప్రేమగా చూస్తూ గ్రామస్థుల ఆదరాభిమానాలను చూరగొన్నారు.

సుధీర్ ఇంచుమించుగా అనాథ. తల్లిదండ్రులను చిన్నప్పుడే కోల్పోయి తాగుబోతు మామయ్య పంచన బతుకుతున్న కట్టుబానిస. వాణ్ణి చాలా శ్రమపడి మాస్టారు స్కూల్లో చేర్పించారు. తొమ్మిదో తరగతి వరకూ ఉన్నత ప్రమాణాల్లో సుధీర్‌ని తీర్చిదిద్దారు. తన కొడుకులకంటె మిన్నగా ఉన్నవాణ్ణి చూసి సంతోషంగా పొంగిపోయేవారు. అలాంటివాడు చనిపోయాడు. ఎలా...? మాస్టారి మనసు పరిపరివిధాలుగా శంకించింది. మొదట వాణ్ణి ఎవరో చంపేశారని చెప్పిన పోలీసులు తర్వాత రోగంతో చనిపోయాడన్నారు. ఎప్పుడూ వాణ్ని అంటిపెట్టుకు తిరిగే తన కొడుకు కృష్ణస్వామి తనకేం తెలియదని అందరి ముందు చెబుతున్నాడు.

ఏదినిజం...?

కొడుకుని నమ్మలేకపోతున్నారు మాస్టారు. ఆయనకి తన మనసుమీద ఉన్న నమ్మకం అలాంటిది. ఆ మనసంతా ఆక్రమించిన సుధీర్ అకారణంగా చంపబడ్డాడని ఆయన నమ్ముతున్నారు. దానికి ఆధారాలు లేవు. ఆ సుధీర్ మావయ్య వాడికేదో పురుగు కుట్టింది. తర్వాత ఏదో రోగం వచ్చింది. చచ్చిపోయాడంటూ చెబుతున్నా దాన్ని గ్రామస్థులు బలవంతంగానే నమ్ముతున్నారనేది మాస్టారి నిశ్చితాభిప్రాయం.

కానీ, అసలునిజం తెలుసుకున్న కృష్ణస్వామి నోరు మెదపడంలేదు. పైకి గంభీరంగా ఉంటున్నా, కృష్ణస్వామి మెదడులో ఆ పూరిపెద్ద సత్యం చేయించిన దారుణం దాక్కొనివుంది. అది బయటకు వస్తే తనకు అనవసర సమస్య అనేది ఆ కుర్రాడి ఆలోచన.

సుధీర్, సత్యం కూతురికి ప్రేమలేఖ రాశాడనే అభియోగంమీద నిజానిజాలు తెలుసుకోకుండా ఆ అనాధని భయంకరంగా చావగొట్టారు. ఆ దెబ్బలకు అనుకోనివిధంగా సుధీర్ ప్రాణం అనంతవాయువుల్లో కలిసిపోయింది. అయినా కృష్ణస్వామి నిజాన్ని వెల్లడించకపోవడానికి అసలుకారణం తన తప్పునుంచి సమర్థవంతంగా, శాశ్వతంగా తప్పుకోగలగడమే. ఆపైన కృష్ణస్వామి సత్యం కూతురుకేసి ఎన్నడూ చూడలేదు. సుధీర్‌ని తన జ్ఞాపకాల్లో ఉంచుకోలేదు. కానీ పిల్లల ఆలోచనల్ని పసిగట్టగల ఆ గాంధీ మాస్టారి మనసులో తాను ఉన్నానని కృష్ణస్వామికి తెలియదు.

హైస్కూలు చదువు పూర్తిచేసిన కృష్ణస్వామి వైజాగ్‌లో కళాశాలలో చేరతానన్నాడు. గ్రామపెద్ద సత్యం తన కొడుకుని కూడా కృష్ణస్వామితోపాటు కళాశాలలో చేరుస్తానన్నాడు. తనకి ఆ ఇద్దరూ ఒకటేనంటూ ఆయనే వసతి ఏర్పాటుచేశాడు. గాంధీమాస్టారికి తన కొడుకు ఆ వసతిలో ఉండడానికి ఏమాత్రం ఇష్టంలేకపోయినా ఆచరణలో అది చెల్లలేదు. దానికి స్పష్టమైన కారణం ఆయనకే అంతుచిక్కలేదు. పిల్లలు... నైతిక విలువలు...

దేశం... ప్రజలూ అంటూ ఉన్నదంతా ఖర్చుపెట్టినా కొడుకు విషయంలో ఆయన చేయగలిగింది లేకపోయింది. ఫలితంగా కొడుకు తన నుంచి తనే దూరంగా జరుగుతూవచ్చాడు. అయితే ఆ దూరం కృష్ణస్వామి తన సమర్థతను పెంచుకొనే అవకాశాన్నే కలిగించింది.

వైజాగ్‌లో చదువు అయిందనిపించిన కృష్ణస్వామికి ఒక ప్రభుత్వ కార్యాలయంలో గుమాస్తా ఉద్యోగం అనుకోకుండా వచ్చింది. దానికి కృష్ణస్వామి కృషి చాలావుంది. నిజంగా అది అతని సమర్థతే అనేది అందరూ ఒప్పుకున్న సంగతే. లేకపోతే ఉద్యోగాలు... అందునా ప్రభుత్వ ఉద్యోగాలు అంత సులభంగా దొరుకుతాయా...? పలుకుబడి, లంచం ఉంటేనే అది సాధ్యం అని ఉద్యోగాలకోసం వేటాడే లక్షలాది మంది నిరుద్యోగులకు బాగా తెలుసు. ఎవరికి వీలయినవిధంగా వారు పలుకుబడినీ, లంచాన్నీ అందించి ఉద్యోగాన్ని అందుకోవడం మామూలు విషయం. పైకి ఎవరు ఎన్ని నీతులు వల్లించినా ఉద్యోగ ప్రయత్నం దగ్గరికి వస్తే లంచమెంత...? ఏమాదిరి పలుకుబడి ఉండాలనే వివరాలు సేకరించడానికి ఆ అభ్యర్థులు, తండ్రులు, బంధువులు, మిత్రులు అందరూ ప్రయత్నిస్తూంటారు. ఎవరికందిన వివరాలు వారు చెబుతూంటారు. ఒకవేళ వాళ్ళల్లోనే పోటీ అభ్యర్థులుంటే ఎవరికందిన సమాచారం వారిదగ్గరే ఆగుతుంది. ఇక లంచం ఇవ్వకూడదు అనుకొనేవారు ఎవరు? నేటి కాలమాన పరిస్థితుల్లో అంతా ఇందుకు సిద్ధపడుతున్నారనేది అక్షరసత్యం. ఇదికాదని వాదించడమనేది వెర్రితనమని వాస్తవాలు స్పష్టంగా రుజువుచేస్తున్నాయి! అయితే ఆ లంచం ఎవరికి ఏ సమయంలో ఎలా అందించాలి - అనేదే సమస్య. అది అందుకొన్నా వారు ఆ పని చెయ్యగలరా అనేది మరో సమస్య. అవన్నీ బేరీజు వేసుకొని సక్రమంగా పని జరిపించుకోవడమే అసలు నేర్పు. పలుకుబడి విషయంలో కూడా ఇలాంటి సాధకబాధకాలే ఉన్నాయి. సరైన మనిషి సరైన సమయంలో చెప్పాలి. వినే మనిషి దాన్ని మనసుకి ఎక్కించుకోవాలి. అవన్నీ అనుకూలమైన దిశలో నడిచేటట్టుగా చూసుకోవాలి. దానికి చాలా సమర్థత ఉండాలి.

కృష్ణస్వామి ఆ సమర్థతను పెంచుకోవడంవల్లే ఉద్యోగం లభించిందని చెప్పడం వాస్తవానికి ప్రతిరూపం.

కృష్ణస్వామి సమర్థత పెరుగుతూ వస్తున్నకొద్దీ సహజంగానే తండ్రికి దూరమయ్యాడు. తండ్రి వ్యవహారం ఓరకంగా కృష్ణస్వామికి నచ్చలేదు. సమాజరీతుల్ని అవగాహన చేసుకోకుండా... సమాజ పరిస్థితులకు ఎదురొడ్డి నిలవాలనే ఆలోచనలు అసమంజసం అనేది కృష్ణస్వామి నమ్మకం.

★ ★ ★

"ఏం గురూ... మన కోడిగుర్రం కొత్తబాసుని పట్టేసిందనుకొంటా..." రెండేళ్ల సర్వీసున్న విశ్వనాథం... ఒక సంవత్సరం అనుభవాన్ని సంపాదించిన కృష్ణస్వామితో అన్నాడు.

"కోడిగుర్రం... యూమీన్... మీనాక్షి...?!"

"వాడు జాయినయినప్పట్నుంచీ చూస్తున్నా... రోజుకో డ్రస్... రోజుకో మేకప్. అలాంటివాణ్ణి కంగారుపెట్టి గిజగిజలాడిస్తోందనుకో''

"ఆ విషయాలు మనకెందుగ్గానీ, కొత్తబాస్ ఎలా ఉన్నాడూ''

"వాడెలావుంటే నీకేం. ఈ జాబ్‌లో ఉండేది లేదుకదా''

"ఇంకా సెలక్షన్ రావాలికదా! చాలా సమయం పడుతుంది. రేపే పంపించే ఏర్పాట్లు చేస్తున్నారా''

"నేనెందుకు చేస్తానయ్యా... ఏదైనా మీనాక్షిలాంటివాళ్లు చెయ్యాలి''

"మధ్యలో ఆవిడ గొడవెందుకు?"

"చూడూ... రేపు నువ్వు క్షణాలమీద రిలీవ్ అవ్వాలనుకో. మీనాక్షి ఆ కొత్తబాసుముందు





కూర్చొని ఓ లిప్‌స్టిక్ నవ్వు పారేసి, కళ్ళు ఎగరేస్తే చాలు. అదీ అసలు విషయం"

"అలా చేస్తే ఆవిడకి ఏంకాదా?"

"ఏమవుతుంది? ఇది అన్నిచోట్లా జరిగే కార్యక్రమమే. కొంచెం ఆడగాలి సోకితే కంగా రుపడే అధికారి ఉన్నాడనుకో కొంచెం ఒడ్డూ పొడుగూ చూడబుల్‌గా ఉండేవాణ్ణి కళ్లతోనే ఆడించేస్తారు. వాడికి దక్కేది గాలే'

"అలా చేస్తే వీళ్లకేమిటి ప్రయోజనం"

"ఎక్కడో పిచ్చోడిలా ఉన్నావ్. సెలవు పెట్టకుండానే సి.ఎల్. ఫ్రెంచ్ లీవులమయం. వాళ్ళు ఇష్టమయితే పనిచేస్తారు. లేకపోతే వెళ్లిపోతారు. జస్ట్ ఓ నవ్వు పారేస్తే ఎంత లాభమో చూశావా? అదే మనం విష్ చేస్తూ చిరునవ్వు నవ్వినా 'ఏం నవ్వులాటగా ఉందా' అంటూ మనవైపు చూస్తాడా బాసు''

"ఏమైనా అవి మంచి పద్ధతుల కావను కొంటా''

"సాగినంతకాలం సాగిస్తారు. అసలీ అధికా రమే అంత. అధికారి అయితేచాలు అన్నీ అతనివెంట పడతాయి. మన ఆఫీసులోనేకా దోయ్ అన్నిచోట్లా ఇలానే ఉంది. అధికార్లను ఆకట్టుకోవడానికి ఒకడు ఇతరుల గురించి అనవసరంగా వివరాలు అందిస్తాడు. మరొక డు తాగిస్తాడు. ఇంకొకడు ఆడవాళ్ల గుణగణా లు చెబుతూవుంటాడు. గతంలో జరిగిన ప్రేమ వ్యవహారాల్ని పూసగుచ్చినట్లు చెబుతూ బాస్ ఆనందానికి సోపానాలు నిర్మిస్తాడు. ఇప్పుడు మన కామాక్షి విషయం ఉందనుకో..." ఆగా డు విశ్వనాథం.

"ఎవరెవరో వస్తున్నారు అలా దూరంగా పోదామా'' కృష్ణస్వామి అన్నాడు.

"ఈ విషయం అందరికీ తెలుసోయ్. అంత ఇదవ్వాల్సిన అవసరం లేదు'' విశ్వనాథం ధైర్యంచెప్పాడు.

"అందరికీ తెలిసినా మనం చర్చిస్తూన్నట్లు ఎందుకు బయటపడటం" కృష్ణస్వామి తన సందేహాన్ని వెలిబుచ్చాడు.

"సరే... ఎలాగూ ఆఫీస్ అయిపోయింది. మురళి ఇంటికి పోదాం" విశ్వనాథం దారితీశా డు.

వాళ్లిద్దరూ మురళి ఇంటి దగ్గరికి చేరుకునే సరికి అక్కడ మురళితోపాటు సీనియర్ అయిన వెంకట్రావ్ కూడా ఉన్నాడు. అందరూ కబుర్లలో పడ్డారు. ఆడదానికి ఉన్న పవర్ చాలా పవర్‌ఫుల్ అనీ, అధికారి వాళ్లను ఏం చెయ్యలేడనీ, పరిస్థితులు అడ్డం తిరిగితే ఆ పవర్ తమ బాస్ భవిష్యత్తునే నాశనం చే స్తుందనీ వాళ్లు నొక్కి చెబుతున్నారు.

కృష్ణస్వామి వాళ్ల వాదనలను ఆసక్తిగా గమనిస్తున్నాడు. అంతలో ఆ చర్చలో ఒక అంశం చోటుచేసుకుంది. అది స్వామిని కంగా రుపెట్టింది. ఆ విషయాన్ని ఎంతలా పక్కకు తొలగిద్దామన్నా అతనికి సాధ్యంకాలేదు. అదే ఓ దిక్కుమాలిన శవం విషయం.

★ ★ ★

"శంకరం... నీ ఇష్టం వచ్చినట్లు మాట్లా డకు. నాతో గొడవ పడితే ఒక్క చిల్లిగవ్వ కూడా నీకు దక్కనివ్వను. జాగ్రత్త' హెచ్చ రించింది లక్ష్మి.

"నువ్వసలు ఏమనుకొంటున్నావ్? ఆస్తి అంతా నీదనుకొంటున్నావా? నాన్న ఆస్తిలో నాకూ సగభాగం వస్తుంది. నేను కోర్టుకెక్కితే నాకు ఆస్తిరావడమేకాదు నీ బండారం బయట పడుతుంది. అంతవరకూ నన్ను తీసుకెళ్లకు. మర్యాదగా ఆస్తి పంచుకొని ఈ క్షణమే విడిపో దాం" లక్ష్మి కొడుకు శంకరం సవాలుచేశాడు.

"మీ నాన్న బతికుంటే నీకు ఇలాంటి ధైర్యం వచ్చేది కాదురా'' లక్ష్మి కోపంగా అంది.

"నిజం.. ఆయన్ని ఏనాడు మాట్లాడని చ్చావ్? నీ వ్యవహారం బయటికి రావడంవల్ల కదా ఆయన గుండె పగిలి చనిపోయింది'' కొడుకు ఎద్దేవా చేశాడు.

"చేతకానివాడికి మాటలెక్కువ. మీ నాన్న

లాగే నువ్వూ నా జోలికి రావడం నీకంత మంచిదికాదు" లక్ష్మి సూటిగా అంది.

"ఏంచేస్తావ్? ఆ ఉంచుకున్నవాడిచేత చంపిస్తావా...? నీ వేషాలు నాన్న ఉండగా సాగాయి. నాదగ్గర సాగనివ్వను. మర్యాద దక్కాలంటే ఇంట్లో పడుండు. కాలు బయటకి కదిపావో నీ సంగతి చూస్తా'' లక్ష్మి కొడుకు శంకరం మాటలివి.

"నిన్ను ఏదో చెయ్యాలంటే ఎవడో ఎందుకురా... క్షణాలమీద ఏదైనా చెయ్యగలను. నామాట ప్రకారం నువ్వు, నీ భార్యా పడి వుంటే ఏ గొడవా ఉండదు'' లక్ష్మి కఠినంగా అంటోంది.

"ఇంకెక్కడి భార్యే నాకు. అది నీ వ్యవహారం చూసి ఏనాడో వెళ్లిపోయింది. నీలాంటి వాళ్లున్న కొంపలో ఉండడమే దౌర్భాగ్యం" శంకరం మాటల్లో బాధ ధ్వనించింది.

"అదెవడితోనో..." లక్ష్మి పూర్తిచెయ్యక ముందే "నోర్ముయ్యవే... అందరూ నీలాంటి వాళ్లే అనుకొంటావ్. మొగుడుండగానే అడ్డమైన తిరుగుళ్లూ తిరిగావ్. ఆయన పోయాక మరీ బరితెగించావ్. నా భార్య గురించి ఒక్కమాట అన్నావంటే చంపేస్తా'' శంకరం ఉగ్రుడయ్యాడు.

"నాకు తెలుసు ఈ ఇంట్లో ఉంటే అంతపనీ జరుగుతుంది. చూస్తా నీ సంగతి మాటలతో కాదు'' అంది లక్ష్మి. ఆపైన తలుపులు భళ్లున మూసుకున్న శబ్దం.

"ఛ... నీలాంటి ఆడది అమ్మ అవడం ఖర్మ! ఛీ... కొడుకూ, కోడలున్నారని కూడా చూడకుండా లోకం ఏమనుకుంటుందనే ఆలోచన లేకుండా బరితెగించి తిరిగే నిన్ను నిలువునా పాతెయ్యాలి. ఆస్థి, ఐశ్వర్యం ఉండి కూడా నీలాంటి దౌర్భాగ్యపు తల్లివల్ల నానా బాధా పడుతున్నాన్నేను. నువ్వెలా బతుకుతున్నావో నీకే తెలియడంలేదే'' అరచినట్లుగా అన్నాడు.

"నా గొడవ నీకెందుకురా... అలా అనుకొన్నవాడివి... ఫో... ఆ... పోవూ! డబ్బు కావాలి గదా నీకు. సరే, చచ్చినట్లు పడుండు'' లక్ష్మి గొంతు లోపల్నించి మెల్లగా వినపడినా కటువుగా వుంది.

ఇవతలి వాటాలోని గదిలో అద్దెకుంటున్న కృష్ణస్వామికి ఆ సంభాషణ అంతా వినిపించింది. మొదట ఆశ్చర్యపోయాడు. ఆపైన ఆలోచించాడు. ఇంటిగలామె తిరుగుబోతు. అది తెలిసీ కొడుకు ఆమెను భరిస్తున్నాడు. కారణం డబ్బు... ఆస్థి...

డబ్బుకి ఉన్న విలువని ఆనాడే... అక్షణమే గ్రహించాడు కృష్ణస్వామి.

ఆ తర్వాతే లక్ష్మితో పరిచయమయింది. ఆమె కొడుకుపై వెళ్లగక్కే అక్కసుకి తన సానుభూతిని అందించాడు. ఆమె పరిస్థితికి జాలి ప్రదర్శించాడు. స్త్రీ స్వేచ్ఛపై ఆమెకున్న అభిప్రాయాలు బలపరిచే ప్రయత్నం చేశాడు.

లక్ష్మి కృష్ణస్వామి తెలివితేటలకి మురిసిపోయింది. అతను ఐ.పి.ఎస్‌కి ప్రయత్నిస్తున్నాడని తెలిసి సంబరపడింది. తనకి తెలిసున్నవాళ్లద్వారా కృష్ణస్వామికి సహకారాన్ని అందించింది.

కృష్ణస్వామి విధానాలు నచ్చని శంకరం అతనితో గొడవపడ్డాడు. ఆపైన కృష్ణస్వామి ఆ ఇల్లు ఖాళీచేశాడు. అయినా అతనికి లక్ష్మి సహకారం అందుతూనేవుంది. సమాజంలో తన స్థానాన్ని పెంచుకోడానికి ఉపయోగపడుతున్న ఆమె పలుకుబడిమీద అభిమానాన్ని ఏర్పరచుకోవడంలో తప్పులేదనేది కృష్ణస్వామి నమ్ముతున్న తత్వం. ఆమె వ్యక్తిగతం అతనికి అనవసరం. ఎవరి బలహీనత వారిది. ఆమె తప్పు చేస్తోంది అనడం ఎందుకు? ఆమెకు అందం ఉంది. మరి ఆనందంఉండకూడదా? స్వేచ్ఛగా బతకకూడదా...?

ఎక్కడో మనసుపొరల్లో ఏదో కలుక్కుమంటోంది. అదేమిటి...? ఇది నైతికపతనం... నిజమే! కాని, ఎన్ని నైతికపతనాలను చూడటంలేదూ! అవన్నీ ఆలోచిస్తూ చుట్టూ బరిగీసుకుని కూర్చుంటే ముందుకు పోయేదెన్నడు?




# రచయితలకు మనవి





- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, అమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడాలేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్:

## చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**ఏప్రిల్ చతుర నవల నిర్జీవయాత్ర**

...............................................

**సమీక్షకుని పేరు :** ...............................................

**చిరునామా :** ...............................................

...............................................

...............................................

...............................................

పాతబడిన ఆలోచనలకు స్వస్తిచెప్పకపోతే ప్రస్తుత సమాజంలో మనిషి పైకి ఎదగలేడు. ఎపుడో పాతరోజుల్లో మంచి, చెడు గురించి ఆలోచించి వాటి ఆధారంగానే నడిచేవారు. ప్రస్తుతం ఎవరి వ్యక్తిగతం వారిది. ఎదటివాడి వ్యక్తిత్వంతో మనకి పనేమిటి అనే ధోరణి అలవరచుకోకపోతే మన అభివృద్ధే దెబ్బ తింటుంది. తాగుబోతు, తిరుగుబోతు, గూండా, వ్యభిచారి, లంచగొండి, ఎవడైతే ఏమిటి...? ఆ వివరాలతో ఇతరులకు పని ఏముంది? ఎవడైనాసరే వాడి వ్యవహారం చక్కబెట్టుకోవడం ఒక్కటే చేసుకోగలగాలి. అదే నేటి సమర్థత. తన వ్యవహారం ఎవరితో ముడిపడి వున్నా... వారిని ఆశ్రయించి పని సాధించుకొని ముందుకు సాగిపోవాలి. అదే నేటి కాలనీతి... రీతి. కృష్ణస్వామి సిద్ధాంతమే అది.

అన్నీ జరిగిపోతున్నాయి. ఆనాడు కృష్ణస్వామికి నిద్ర రావడంలేదు. ఆ అనాథప్రేతం కళ్ళముందు కదిలింది. ఎక్కడో మనసు మూలిగింది. పై పొర ఆ మూలుగుని కమ్మేసింది. దిక్కుమాలిన శవంలా కదిలిపోయిన గుర్తించ డానికి వీలుగా లేనివిధంగా చంపబడ్డ ఆ అనాథప్రేతం ఎవరిదో తనకి తెలియదా...?

కృష్ణస్వామిలో కలకలం రేగింది. తెలుసునని ఎందుకనుకోవాలి? సమాజంపట్ల బాధ్యత...? దానివల్ల నాకు ప్రయోజనం...?

నిజంగా ఆ శవాన్ని కృష్ణస్వామి గుర్తించలేడా...? ఎందుకు గుర్తించాలి? ఏం జరగాలని గుర్తించాలి? పైగా దానివల్ల ఎదురయ్యే సంక్లిష్ట పరిస్థితులను ఎవరు ఎదుర్కోవాలి...? అనవసర సమస్యను నెత్తికెక్కించుకోవడం అజ్ఞానంకాదా... తన స్థితిలో ఎవరున్నా తను చేసినట్లే చెయ్యాలి. లేకపోతే అకారణంగా లేనిపోని ఇబ్బందులకు గురవుతారు. సమర్ధుడైనవాడు ఏ పరిస్థితినైనా చక్కటి ఆలోచనలతో తనకి అనుకూలంగా మార్చుకోవాలి. అది తప్పుకాదు''

"శంకరాన్ని దిక్కులేని శవంగా మార్చగలిగిన శక్తులపై పోరాటం ఎవరు చేస్తారు? ఎందుకు చెయ్యాలి...? తమ పురోగతిని పక్కనపెట్టి ఇలాంటి వ్యవహారాల్లో తలదూర్చడం అవివేకం" కృష్ణస్వామి నమ్మి ఆచరించిన సిద్ధాంతం అది.

ఆపైన అతని జీవితవిధానంలో అనూహ్యమైన మార్పులొచ్చాయి.

★ ★ ★

డి.ఐ.జి స్వామికి కరుణాకర్ కార్యకలాపాల గురించి బాగా తెలుసు. యువకుడిగా కరుణాకర్ తొలిసారి రంగదాసు విషయంలో బయటకు వచ్చాడు. ఆ వ్యవహారంలోనే అతని తెలివితేటల్ని స్వామి పరికించాడు. రంగదాసు స్వామికి బాగా పరిచయస్థుడు. కంట్రాక్టర్ దాసుగా జనానికి తెలుసున్న ఆ వ్యక్తి ఒక చిత్రమైన పరిస్థితిలో చిక్కాడు. రంగదాసుకి అయిదుగురు కొడుకులు, ముగ్గురు కూతుళ్లు. ఆడపిల్లలకు పెళ్లిళ్లు చేశాడు. పెద్ద కొడుకులిద్దరికీ మంచి సంబంధాలు చేశాడు. పెద్దాడికి సుమారు నలభై సంవత్సరాలుంటాయి. కాంట్రాక్టర్ దాసు వయసు అరవైమూడుకి దగ్గరగా ఉంది. దాసు భార్య అనసూయ. ఆమెకు దాదాపుగా ఏభై ఎనిమిది ఏళ్లు వచ్చాయి. పదమూడేళ్లకే దాసుతో ఆమెకు వివాహం జరిగింది. పంతొమ్మిది సంవత్సరాలు రాకుండానే తొలికాన్పు... పిల్లాడ్ని ఎత్తింది. వాళ్లది సుదీర్ఘమైన నలభై అయిదేళ్ల వైవాహిక జీవితం.

చిన్న కంపెనీలో గుమాస్తాగా ఉద్యోగంలో చేరిన రంగదాసు ఆ కంపెనీలోనే వ్యాపారం ప్రారంభించాడు. సహ ఉద్యోగులకు వాయిదాల పద్ధతి మీద బట్టలు అమ్మేవాడు. చిన్నగా చీటీల బిజినెస్ ఆరంభించాడు. డబ్బు సంపాదించడానికి ఉన్న అనేక చిన్నచిన్న మార్గాలన్నీ అన్వేషించాడు. భార్య అనసూయ భర్త సంపాదనను ఆదా చేసింది. తనకు తోచిన రీతిలో తానూ వ్యాపారసరళి అవలంబించింది. కాలానుగుణంగా కొద్దిపాటి పె

ట్టుబడితో మధ్యతరగతి కుటుంబీకులకు అందుబాటులో ఉండే విధంగా రకరకాల తినుబండారాలు, పచ్చళ్లు, వడియాలు మొద లైనవి తయారుచేసి అమ్ముతుండేది. ఆ అమ్మ కాలు స్టీలుగిన్నెలు, వెండిగిన్నెలు వరకూ ఎదిగాయి. బంగారం క్రయవిక్రయాలు, చిన్న గా అప్పులు, వడ్డీలు అలా అలా అంచెలంచె లుగా సాగి అవసరానికి అనసూయమ్మ అనే స్థితికి ఎదిగిపోయింది.

ఈలోగా రంగదాసు అనేక అవతారాలెత్తా డు. తన చిన్నవ్యాపారాన్ని పెద్ద కార్యాలయా లకు విస్తరింపచేశాడు. బట్టలతోపాటు వివిధ రకాల వస్తువులు సమకూర్చేవాడు. ఆ వ్యా పారం మెల్లమెల్లగా రియల్ ఎస్టేట్ వైపు తిరిగింది. ఆ పట్టణానికి శివార్లయిన ప్రాంతా ల్లో భూములున్న ఆసాములను కలిసేవాడు. పొలాలను ప్లాట్లు చేస్తే నాలుగు రెట్లు ఆదాయం వస్తుందని నమ్మకమయిన లెక్క లు చెప్పేవాడు. పట్టువదలని రంగదాసు విధానం చూసి వాళ్లు ఆసక్తి చూపించారు. రంగదాసు మాట మెత్తన, వ్యవహారం సరళం, ప్రవర్తన అభిమానపూరితం. దాంతో ఆసాముల ఆసక్తిని వ్యాపార మార్గానికి మళ్లించాడు రంగదాసు. వాళ్ల భూములకు జి.పి.ఎ హోల్డర్‌గా మారిపోయాడు. అక్కడ నుంచి ప్లాట్ల వ్యాపారం మొదలైంది. తక్కువ ఖర్చులోనే ఇళ్ల నిర్మాణం అనే రంగదాసు ప్రచారం వ్యక్తినుంచి వ్యక్తికి పాకింది. చేతికి అందివచ్చిన ఇద్దరు కొడుకులు అతనికి అండ గా నిలిచారు. ఇక అతని సంపాదన విజృంభ ణకు అవరోధం లేకుండాపోయింది. కాంట్రా క్టర్ దాసుగా పేరు గడించాడు. మధ్య తరగతి కుటుంబీకుల్లో ఆశలు రగిల్చాడు. అప్పులు కూడా తానే ఇప్పిస్తానన్నాడు. కాగితాలమీద సంతకాల వరకే ఇల్లు కట్టించుకొనేవారి పని. మిగతాదంతా దాసు చేస్తానన్నాడు. స్థలం కొనే లావాదేవీలకోసం రిజిస్ట్రార్ కార్యాలయా నికి వెళ్లనవసరంలేదు. ఇంటి ప్లాను కోసం మున్సిపల్ ఆఫీసు చుట్టూ తిరిగే పనిలేదు. ఎలక్ట్రిసిటీ, వాటర్ కనెక్షన్లకోసం పట్టించుకోవా ల్సిన అవసరంలేదు. ఇంటికి కావాల్సిన ము డిపదార్థాలు ఏవి, ఎంత కావాలి తెలుసుకొనే పనేలేదు. మేస్త్రీలు, పనివారు, కార్పెంటర్, ఎలక్ట్రీషియన్, ప్లంబర్, చెక్కలు కొట్టేవారు... ఇలా ఎవరికోసం వెతకనవసరంలేదు. వారం వారం వారికి కూలీలు... పని అవుతుందా లేదా అనే బెంగ, పనివారు వస్తారా... రారా అనే ఆందోళనా ఇవన్నీ లేకుండా హాయిగా సంతకాలు పెట్టి ఎగ్రిమెంట్ ప్రకారం డబ్బు ఇచ్చేస్తే చాలు.

ఇంటికోసం అప్పుకై సంస్థల చుట్టూ హైరాన పడుతూ తిరిగే పనికూడా మాదే అన్నాడు కాంట్రాక్టర్ దాసు. అతని మాట, పద్ధతికి చాలామంది ముందుకొచ్చారు. రెండు చోట్ల కాంట్రాక్టర్ దాసు ఇళ్ల నిర్మాణాలు చేపట్టి విజయవంతమయ్యాడు. దాదాపు మూడు వందల ఇళ్లతో కాలనీలు అతని ఆధ్వర్యంలోనే నిర్మాణాలను పూర్తి చేసుకున్నాయి. అతని ఆదాయం అనుకొన్న దానికంటే అధికంగా పెరిగింది.

ఇళ్ల స్థలాల మీదా, ఇళ్ల నిర్మాణాలమీదా కాంట్రాక్టరు దాసు పకడ్బందీగా లాభాలు ఆర్జించాడు. ఆ సమయంలోనే రంగదాసుకి రాజీ పరిచయమయింది. రాజేశ్వరి పేరు కాంట్రాక్టరు దాసుకి రాజీగా తెలుసు. ఎనిమిది మంది సంతానం. మరో ఆరుగురు మనుషు లు: ఏటేటా పెరుగుతున్న మనుమలు, మన మరాళ్ల సంఖ్య. అయినా రాజీ ఎందుకో అతన్ని ఆకర్షించింది. రాజీ పట్ల ఇష్టం, మోజు, ఆ పైన ప్రేమ, ప్రణయం. రాజీకి ముప్పై ఏళ్లుంటాయి. ఇంచుమించు దాసు పెద్ద కూతు రు వయసు. కానీ కూతురు కాదుగా అంటాడు దాసు.

రాజీ వ్యవహారం కుటుంబ కలహంగా రూపాంతరం చెందింది. ముందుగా ఆ విషయం అనసూయ కనిపెట్టింది. ఈ వయ సులో ఇంతమంది కుటుంబ సభ్యుల పరువున్ని




కాలరాసి తన భర్త ఆ రకంగా వ్యవహరించడం ఆమెకు భరింపరాని వేదన కలిగించింది. అది కుటుంబ సభ్యులకు తెలియకుండా ఉండాలని శతవిధాలుగా ప్రయత్నించింది. కాంట్రాక్టర్ దాసుకీ, డి.ఐ.జి స్వామికి ఉన్న పరిచయాన్ని పురస్కరించుకొని స్నేహపూర్వకంగా ఆయన చేత చెప్పించి రాజీ బారినుండి తన మగడ్ని తప్పించాలని ఆలోచించింది. స్వామిని కలిసి, తన బాధను వెళ్లగక్కింది. ఆ విషయంలో స్వామి భార్య వనజ కూడా సహకారం అందించింది. స్వామి రంగదాసుకి నచ్చచెబుతానని అనసూయకు మాటయితే ఇచ్చాడుగానీ ఏరకంగా ఆ సమస్యను పరిష్కరించాలి అనే ఆలోచనకు తగిన సమాధానం దొరక్క మిన్నకుండిపోయాడు. పరిచయం, స్నేహం ఉన్నంత మాత్రాన వ్యక్తిగత విషయాల్లో ఎలా జోక్యం చేసుకోవాలి అనేది స్వామి భావన. అనవసరంగా ఆ విషయంలో తల దూరిస్తే ఆపైన ఎలాంటి చిక్కులు ఏర్పడతాయో అనే అనుమానం... దాంతో తన పెద్దరికాన్ని నిలుపుకోవడానికి కాంట్రాక్టర్ దాసుతో ఆ విషయం సూచనప్రాయంగానైనా ప్రస్తావించలేదు. ఆ విషయం గురించి రెండుమూడు సార్లు వనజ అడిగినా వీలు చిక్కడం లేదని అతి తేలిగ్గా తప్పించుకొన్నాడు.

రంగదాసు భార్య ఎంత ప్రయత్నించినా రాజీ సమస్య ఆ కుటుంబాన్ని రచ్చకి ఎక్కించక మానలేదు. ఆ సమస్య పరిష్కారం అనసూయవల్లకాలేదు. కొడుకులు, కూతుళ్లు ఆ విషయం తెలిసిఅవమానంగా భావించారు.

ఏ తండ్రి చరిత్రయినా పిల్లలకి గర్వకారణంగా ఉండాలని వారు కోరుకోవడంలో తప్పు లేదు. తండ్రి ప్రవర్తన అవమానకరంగా తయారయితే ఆ కుటుంబాలు తల్లడిల్లిపోతాయి. నాలుగున్నర దశాబ్దాల వైవాహిక జీవితం సాగిన తర్వాత జీవితం చరమాంకంలో ప్రవేశిస్తున్న తరుణంలో ఆ ఇల్లాలికి ఇదొక ఆందోళనకర పరిణామం. కొడుకులు, కోడళ్లు, కూతుళ్లు, అల్లుళ్లు... వాళ్ల ముందు నిలవడానికే ఆమెకు విపరీతమైన బాధ కలుగుతోంది. నిస్సిగ్గుగా, నిర్లజ్జగా ఆ వయసులో పరకాంతతో ప్రణయం సాగిస్తున్న మగనిపై ఆమె గుండెలో రేగే బాధాగ్ని కణాలకే గనుక భౌతిక రూపముంటే అవి అతన్ని నిలువెల్లా దహిస్తాయి. 'కామాతురాణాం... నభయం, నలజ్జా' అన్నట్లుగా కాంట్రాక్టర్ దాసు రాజీని పెళ్లాడతాననీ ఆమెతోనే జీవిస్తాననీ బహిరంగంగానే ప్రకటించాడు. ఆమె కోసం ఒక భవన నిర్మాణాన్ని చేపట్టాడు. తన పట్ల ఆమెకు విశ్వాసం కలగడానికి ఆమె పేరుమీద నాలుగు లక్షల డిపాజిట్లు వేశాడు. ఆ పట్టణ శివారులో తాను కొత్తగా నిర్మాణం ప్రారంభించిన కాలనీలో పూర్తయిన ఓ ఇంటిలో ఆమెతోపాటు సౌకర్యంగా ఉండిపోయాడు.

తన ఇంటిలో తన పట్ల అందరూ నిరాదరణ చూపుతున్నారనీ, స్వంత భార్య కూడా తన కనీస అవసరాలు కూడా పట్టించుకోవడంలేదనీ, కొడుకులూ, కూతుళ్లూ ఎపుడూ డబ్బు మాటేగానీ మరో మాట ఎత్తడం లేదనీ అంటూ ఎదురు తిరిగి రాజీని గుట్టు చప్పుడు కాకుండా గుడిలో పెళ్లి చేసుకొన్నాడు. స్వంత భార్య బతికుండగా, సుదీర్ఘ సంసారం సాగించిన తరువాత కూడా, మనశ్శాంతి కోసమే రాజీతో పెళ్లి అని దాసు అన్నాడు. తన జీవితానికి ఆశించిన తోడు రాజీ అని అభివర్ణించాడు. తనని అనేక రకాలుగా చిత్రవధ చేస్తున్న పాత కుటుంబ సభ్యులందరూ ద్రోహులుగా, శత్రువులుగా ఊహిస్తూ, వారి తలంపే జుగుప్సాకరంగా భావింపనారంభించాడు.

రంగదాసు ముగ్గురు కూతుళ్లకూ తండ్రి చేసిన పని పెద్ద అవమానంగా తలొంపులుగా తయారయింది. వాస్తవానికి ఆ కూతుళ్ల మనోవేదన రకరకాలుగా వారిని వేధిస్తోంది. సరదాగానో, వేళాకోళంగానో, వ్యంగ్యంగానో, సరసంగానో వారి భర్తలు ఏదో విధంగా తమ

తండ్రి ప్రణయగాధను కదుపుతున్నారు. ఆ రాజీ గురించిన వివరాల పట్ల ఆసక్తి చూపుతున్నారు. ఆ వయసులో మామగారు చేసిన పనిపట్ల కొంత సరదా, మరికొంత వ్యంగ్యం, ఇంకొంత కోపం వారు ప్రదర్శిస్తున్నారు.

పుట్టింటివారు ఏమిచ్చినా, ఇవ్వకపోయినా పరువు ప్రతిష్టల్ని మటుకు తమకు మెండుగా ఇవ్వాలని కోరుకొనే సామాన్య తెలుగింటి ఆడపడుచులు వాళ్లు. ఈ సమస్య వాదులాటకు పనికిరాదు. పోట్లాటకు వీలేలేదు. అత్తగార్లూ, ఆడపడుచులు, మరుదులు, మామగార్లు, ఇతర మెట్టింటి బంధువర్గంలో ఆ కూతుళ్ల పరువే మట్టి కొట్టుకుపోయిందని అల్లాడుతున్నారు. తల్లిని ఓదార్చలేరు. ఆమె బాధా నివారణకు తమవద్ద కొంతకాలం ఉంచుకొందామన్నా అది ఆమెకు మరింత బాధగా తయారవుతుంది. ఏది ఏమనాలో తెలీక అది వాళ్ల ఖర్మం అనుకొంటూ తెగ బాధపడుతున్నారు కూతుళ్లు. తండ్రిమీద పీకలదాకా ఉన్న కోపాన్ని దిగమింగలేక, బయటకు వెళ్లగక్కలేక లోలోపలే కుమిలిపోతున్నారు.

కొడుకులు తండ్రిని అసహ్యించుకోవడంతో పాటు దాసు కొడుకులం అని చెప్పుకోవడానికే అవమానంగా భావిస్తున్నారు. సామాన్యంగా అయితే ఏ కొందరో డబ్బున్నవారికిగానీ, లేనివారికిగానీ రెండేసి కుటుంబాలు ఉండటం అసామాన్యంకాదు. ఇద్దరు భార్యలుండటం ఎందరు ప్రియురాళ్లు ఉన్నా పైకి శ్రీరామ చంద్రుడిలాగే ప్రవర్తించడం మన సమాజంలో మామూలే. పూర్వం రాజులకు బహుభార్యత్వం ఉండేది. ఆ సంప్రదాయాన్ని రాచరిక పద్ధతుల్లో చాలాకాలం కొనసాగించారు. అధికారంతో అందలాలు ఎక్కినవారు సాగించే రాసలీలల గురించి అందరికీ తెలిసిందే. కాంట్రాక్టరు దాసు విషయంలో ఆ పర్వం అరవై రెండు వసంతాలు దాటింతర్వాత మొదలైంది. ఏదో గుట్టుగా ప్రణయమో, మరో వ్యవహారమో సాగిస్తే అది గుంభనంగా ఉంటుంది. కానీ దాసు కొంచెం తెగించాడు. అది డబ్బు తెచ్చిపెట్టిన అహంకారం కావచ్చు. కుటుంబం పట్ల ఏహ్య భావం కావచ్చు. రాజీ తాత్కాలిక ఉపశమనంలా అనిపించే అవకాశమూ అయి ఉండవచ్చు.

ముప్పై సంవత్సరాలున్న రాజీ అరవై మూడేళ్ల దాసును ప్రేమించిందా? అదే దాసు ఆలోచించని ప్రశ్న. మనిషి గొప్పగా చూడముచ్చటగా లేకపోవచ్చు గానీ కురూపి మాత్రం కాదు. దాసు కురూపిని చేరదీయగలవాడుకాదు. ఎందుకంటే నలభై అయిదేళ్ల తన జీవిత భాగస్వామిగా వెంటనడచిన అనసూయ అందమైనది.

దాసు మెదడులో ఏ నిమిషాన రాజీపై మోజు ఏర్పడిందోగానీ, అతనికి శత్రువర్గం ఆకస్మికంగా పెరిగింది. కుటుంబ సభ్యులే ఆగర్భ శత్రువుల్లా మారిపోయారని అతనంటాడు. ఆ కుటుంబ సభ్యుల్లో ఒకడు లక్ష్మీపతి దాసు మూడోకొడుకు. లక్ష్మీపతి, కరుణాకర్ స్నేహితులు.

డి.ఐ.జి స్వామికి దాసుతో సత్‌సంబంధాలున్నాయి. అందుకే అన్ని విషయాలూ తెలిసినా స్వామి ఈ గొడవలో ఇరుక్కోదలచుకోలేదు. స్నేహితుని బాధ చూడలేని కరుణాకర్ మాత్రం ఈ సమస్యలో తానేం చెయ్యాలి అనే విషయాన్ని సీరియస్‌గానే తీసుకున్నాడు. ఆ సమయంలోనే కంట్రాక్టర్ దాసు ఎప్పట్నించో కొడుక్కి ఇస్తాననంటున్న ఓ ఖరీదైన ఇంటి స్థలాన్ని రాజీ పేర రాయడానికి నిర్ణయించుకొన్నాడు. కొత్త పెళ్లాం బతికినంతకాలం తను ఆమెతోనే ఆమె తనతోనే ఉండాలి గదాఅని! అది కొడుకులకి తెలిసిపోయింది. అప్పటికీ తండ్రి పబ్లిగ్గా ఆమెతో కాపురం పెట్టడం... ఆమె గర్భవతి కావడం జరిగిపోయాయి. దాంతో కూతుళ్లు, కొడుకులూ ఏకమయ్యారు. తండ్రి మీద విరుచుకుపడ్డారు. అలా రభస చెయ్యవద్దని అనసూయ తన పిల్లల్ని వారించినా ఆమె మాటను వాళ్లు లక్ష్యపెట్టలేదు.

కాని తన మొదటి భార్యే పిల్లలందరినీ




రెచ్చగొట్టి తన మీదకు పురిగొల్పిందనీ, ఆ పిల్లలకూ తల్లికీ డబ్బు ముఖ్యంగానీ, తానుకాదనీ దాసు గోల చేశాడు. వాళ్లంతా తనను చంపడానికి వచ్చారంటూ వాళ్లమీద పోలీసులకు ఫిర్యాదు చేశాడు. డి.ఐ.జి దృష్టికి ఆ విషయాన్ని తీసుకువచ్చి ప్రాణ రక్షణకు అర్థించాడు దాసు. ఆ అర్థింపును డి.ఐ.జి స్వామి కాదనలేకపోయాడు. సంబంధిత పోలీసు ఇనస్పెక్టర్ని పిలిపించి, అతనికి సహకరించమన్నాడు. ఆ ఇనస్పెక్టర్ దాసు కొడుకుల్ని స్టేషన్‌కి రప్పించి హెచ్చరించాడు. దాసుకి ఏమైనా జరిగితే ఆ బాధ్యత వారే వహించాలని గట్టిగా చెప్పి పంపేశాడు.

అది జరిగిన నాలుగో రోజున దాసుని ఎవరో కొట్టారు. దెబ్బలు గట్టిగా తగలకపోయినా హత్యా ప్రయత్నమంటూ ఫిర్యాదు చేశాడు. దానికి తన పిల్లలే కారణమంటూ ఆరోపించాడు. పోలీసులు తమకు దొరికిన దాసు పిల్లలు ముగ్గుర్ని పోలీస్ స్టేషన్‌కి తీసుకుపోయారు. వారిలో లక్ష్మీపతి కూడా ఉన్నాడు. ఆ విషయంలో అంతవరకూ ఏమీ చెయ్యలేకపోయినా కరుణాకర్ అప్పుడు స్నేహితుని కోసం ముందుకు రావాల్సి వచ్చింది.

ఒక లాయర్‌ని తీసుకొని పోలీస్ స్టేషన్‌కి వెళ్లాడు. వారిని వెంటనే వదిలెయ్యమని అడిగాడు. వాళ్లు వీలులేదన్నారు. పై అధికారుల ఆదేశాలని కరుణాకర్‌కి చెప్పారు. ఎస్.పి. ఆ రోజు కేంపులో ఉండడంవల్ల కరుణాకర్ నేరుగా డి.ఐ.జి స్వామిని కలవడానికి వెళ్లాడు.

"మీకూ ఈ సమస్యకీ సంబంధం ఏమిటి?" ఎందుకు నీకీ గొడవ అన్నట్లుగా చూస్తూ అడిగాడు స్వామి.

"తండ్రిని చంపాలని ఏ కొడుకూ అనుకోడు. తండ్రి సిద్ధాంతం, ప్రవర్తనా నచ్చకపోతే గొడవ చేస్తాడు. బాధపడతాడు. దూరంగా వెళ్లిపోతాడు. ఆ తండ్రిని తండ్రే కాదంటాడు. కానీ చంపాలని చూడడు" అన్నాడు కరుణాకర్.

"అది వాళ్ల కుటుంబ వ్యవహారం. ఆ విషయంలో తలదూర్చడం ఎవరికీ మంచిది కాదు. ఇది మీకు అనవసరమని నేననుకొంటున్నా" అన్నాడు స్వామి.

"అదే నేనూ అంటున్నాను. అది వాళ్ల కుటుంబ విషయం కాబట్టి పోలీసులు కూడా జోక్యం చేసుకోకూడదు అని మా అభిప్రాయం. లక్ష్మీపతి నేరం చెయ్యలేదు. అతను నా స్నేహితుడు. ఈ సమస్యలో మేము తలదూర్చడంలేదు. స్నేహధర్మంగా మా పని చెయ్యాలికదా! వాళ్లని అనవసరంగా లాకప్‌లో ఉంచారని మీ దృష్టికి తీసుకు వస్తున్నాం. నేరం చేయకపోయినా వాళ్లని ఎలాంటి వారంటూ లేకుండా అరెస్ట్ చేసి పోలీసులు తొందరపడ్డారని మేం అనుకొంటున్నాం. వాళ్లు వ్యాపారాలు, ఉద్యోగాలు చేసుకొనేవాళ్లు. మీరు ఆలోచించి వెంటనే వాళ్లని విడుదల చెయ్యాలనే ఆదేశాలు ఇప్పించండి" కరుణాకర్ లాజికల్‌గా మాట్లాడాడు.

"ఈ విషయం ఇనస్పెక్టర్‌కి చెప్పండి. అతన్ని కన్విన్సు చేయండి. నేనేం చెబుతాను" స్వామి దాటవెయ్యడానికి ప్రయత్నం చేశాడు.

"మీరు దాసుగారికి బాగా తెలుసు. పై ఆదేశాలు రావడంవల్లే మేము వాళ్లని తీసుకెళ్లాం అని వాళ్లంటున్నారు. పైనుంచి ఒత్తిడి లేకపోతే కింది పోలీసులు ఏం చెయ్యరని మీకు తెలియందికాదు" కరుణాకర్ మాటల్లో 'నువ్వు చెప్పకుండా ఉంటే వాళ్లు ఎందుకు లాకప్‌లో ఉంచుతారూ' అనే ధోరణి కనిపించింది.

డి.ఐ.జి స్వామి అసహనంగా మారిపోయాడు.

"ఒకే ఐ విల్ లుక్ ఇన్ టు ద మేటర్" అన్నాడు.

"మాకు కాంట్రాక్టర్ దాసు వ్యవహారంతో సంబంధంలేదు. ఆ వ్యవహారం పట్టించుకోవడానికి సామాన్యంగా ఎవరూ ఇష్టపడరు. అది




మీకు తెలుసు. అది పూర్తిగా వ్యక్తిగతం. మీరేమనుకోనంటే ఒక్క నిముషం మీ సమయం వృధా అవుతుంది. ఏ కొడుకయినా తండ్రి సంపాదించిన ఆస్తి కోసం ఆరాటపడతాడు. బహుశా చాలామంది తండ్రి పేరు ప్రతిష్ట లకంటే డబ్బు సంపాదించాలనే అనుకొంటారని మనకు తెలియందికాదు. కానీ లక్ష్మీపతికి ఎదురైన సమస్య అలాంటిదికాదు. తండ్రి ఏరకంగా ఉన్నా అది బయటపడనంతవరకూ గొడవలేదు. లక్ష్మీపతి కుటుంబమే రోడ్డున పడింది. ఎవరో ఏదో అంటారనీ, అన్నారనీ వాళ్లు ఆలోచించడంలేదు. తెలుసున్న వాళ్లు కనిపిస్తే వీళ్లే గిల్టీగా అయిపోతున్నారు. ఎదుటి వాళ్ల సానుభూతిని కూడా భరించలేని దారుణ పరిస్థితి ఆ కుటుంబంలోని ప్రతి ఒక్కరూ అనుభవిస్తున్నారు. ఆ కోణంనుంచి కూడా మిమ్మల్ని ఆలోచించమని కోరడానికే మేము వచ్చాం" ఆ తర్వాత మీరేం చేసినా మీ ఇష్టం అన్నట్లు మాట్లాడాడు కరుణాకర్.

"నేను అర్థం చేసుకోగలను. వాళ్లని వదిలి పెట్టమని చెబుతాను. మీరు ఈ సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నించకూడదా'' డి.ఐ.జి స్వామి అన్నాడు.

"అది ఎవరివల్లా కాదుసార్! కాంట్రాక్టర్ దాసు ఆమెను పెళ్లి చేసుకొన్నాడు. వీళ్లని వదిలేశాడు. వీళ్ల మనసులు విరిగిపోయాయి. మళ్లీ వాళ్లు కలవలేరు. దాసు బతికున్నంత కాలం వాళ్లని కలవలేడు. అలాంటి తండ్రి ఏమయినా ఒకటే అనే మనస్థత్వానికి వాళ్లు వచ్చేశారు. మీరన్నట్లుగా ఎవరి జోక్యమూ పనికిరాదు'' కరుణాకర్ తన మనసులోని భావన సూటిగా చెప్పేశాడు.

"నిజం కూడా అదే'' అనుకున్నాడు స్వామి.

★ ★ ★

ఒక్క సూర్యుడు సమస్త కోటి ప్రజలకు తానొక్కొక్కండయి భాసిల్లుతూ మానవాళికి ఉత్తేజాన్ని కలిగిస్తూ తూర్పునుంచి చీకటి పొరలను చీల్చుకొంటూ ఈ జగత్తుకు వెలుగు ప్రసాదించడానికి బయలుదేరి దినచర్యను సాగిస్తున్నాడు.

స్వామి ఎనిమిదయినా లేవలేదు. ఆయన భార్య వనజ కంగారు పడుతోంది. అప్పటికే జిల్లా ఇన్‌ఛార్జి మంత్రిగారి పి.ఎ. నాలుగుసార్లు ఫోను చేశాడు. ఎంతో అలసటగా, మత్తుగా నిద్రపోతున్న డి.ఐ.జి గార్ని లేపడానికి ఆయన భార్య కూడా వెనుకంజ వేసింది.

ఎనిమిదిన్నర అవుతోండగా ఫోను మోతకి విసుగ్గా లేచిన స్వామి అవతలికంఠం విని ఎలర్ట్ అయ్యారు.

"ఎస్. సార్'

ఎస్... నో ప్రాబ్లమ్ సర్... తప్పకుండా సర్... అది కరెక్ట్‌సర్.. వస్తానుసార్' ఫోను క్రెడిల్ అయింది. డి.ఐ.జిగారి దినచర్య ఆరంభమయింది.

వనజ హడావిడి పడుతోంది.... "మినిస్టర్ ఫోను'' అంది.

"మాట్లాడాను''

"ఉదయం నుంచీ చాలాసార్లు చేశారు''

"ఆ... సంతాపసభ..."

"మళ్లీ అదో గొడవా...?"

ఆయన భార్యకేసి సూటిగా చూసి ముందుకు కదిలిపోయారు.

సరిగ్గా పదకొండు గంటల సమయానికి కలెక్టరేట్ పక్కనున్న ఖాళీస్థలంలో సంతాప సభ ప్రారంభమయింది. వేదిక మీద ఇంచు మించు జిల్లాలోని అన్ని పార్టీల ప్రముఖ నాయకులూ ఉన్నారు. ఉన్నతాధికారులు కూడా ఆశీనులయ్యారు. ప్రసంగాలు సాగుతున్నాయి. కరుణాకర్ సేవలను వాళ్లు పొగడటం, ఒకరికంటే మరొకరు పోటీపడి ప్రశంసించడం ఆశ్చర్యంగా అనిపించడంలేదు. అధికార్లూ, జనం కూడా వాటికి అలవాటు పడిపోయారు. డి.ఐ.జి స్వామి వంతు వచ్చింది. ఎందుకో ఆయన అంతరాళాల్లో

సంచలనం రేగింది. అది గొంతువరకూ వచ్చి ఆపైన ఆగిపోయింది. ఆ సంచలనం సృష్టించిన కదలికకు ఆయన గొంతు జీరపోయింది. దగ్గినా అది తొలగిపోవడంలేదు. వేదికమీదా ఎదురుగానూ కనిపించే ఖాకీలను చూసి ఆయన స్థిమితపడి "అందరికీ నమస్కారాలు. కరుణాకర్ గురించి పెద్దలంతా చెప్పారు. ఇలాంటి సంఘటన జరగడం అందరికీ బాధ కలిగిస్తుంది. అతని ఆత్మకు శాంతి కలగాలని ప్రార్థిస్తున్నాను" అంటూ ఆయన వెనక్కి వచ్చేశారు. దానికి కారణం ఒక సి.ఐ. ఏదో అర్జెంట్ మెసేజ్‌తో రావడం.

వేదికమీదున్న ఎస్.పి, డి.ఐ.జి కూడా ఆ మెసేజ్ తెలుసుకొని కలవరపడినట్లుగా కనిపిస్తున్నారు. ఆ వార్త మంత్రిగారి దృష్టికి కూడా వెళ్లింది. వెంటనే ఆయన మైకు ముందుకొచ్చారు. డి.ఐ.జి, ఎస్.పి వేదిక మీదనుంచి హడావిడిగా దిగి వెళ్లిపోయారు.

మహా ప్రజలారా ఇలాంటి దారుణాలకు ఎవరైనా పాల్పడతారా... కరుణాకర్ హత్యను ఇంతమంది ఇక్కడ ఖండిస్తున్నాం. బాధపడుతున్నాం. అవతల ఎవరో సంఘవిద్రోహక శక్తులు మన డి.ఎస్.పి ప్రసాదరావు గార్ని చావగొట్టారట. ఇలాంటివి మనం సహించగలమా? మన ప్రజాస్వామ్య దేశంలో హత్యల్ని ఖండించడం అందరి హక్కు. మన నిరసనని మనం వ్యక్తపరచుకోవచ్చు. అందుకు బాధ్యులైనవారిని కఠినంగా దండించాలనేది అందరూ కోరుకొంటున్నాం. దానికి అన్ని చర్యలూ తీసుకొంటున్నాం. కానీ ఇలా ఒక బాధ్యతాయుతమైన పోలీసు అధికారిని దారుణంగా కొట్టడం అన్యాయం. దౌర్జన్యకర పద్ధతులు అవలంబిస్తే చూస్తూ ఊరుకోం. బాధ అందరికీ ఉంది. దాన్ని దౌర్జన్యం చేసి సాధించాలనుకోవడం మంచిదికాదు. కరుణాకర్‌లాంటి మంచి వ్యక్తి కీర్తికి ఈ దౌర్జన్యాలతో కళంకం తేవద్దు. దౌర్జన్యాల విధానాలను వెంటనే విడిచిపెట్టండి...." మంత్రి ఆవేశపూరిత ప్రసంగం కొనసాగింది. అక్కడున్న ప్రజల్లో అనేక భావాలు సుళ్లు తిరిగాయి. ఆ వాతావరణమంతా గందరగోళంగా తయారైంది.



"వాట్? యుఆర్ టాకింగ్ నాన్సెన్స్... నో ఐ డోంట్ బిలీవ్" అరిచాడు డి.ఐ.జి స్వామి.

"నిజం సార్... నన్ను నమ్మండి. కరుణాకర్ స్నేహితులు నలుగురూ చనిపోయారు. వాళ్లు డి.ఎస్.పి గార్ని కొట్టడం పచ్చి అబద్ధం సార్. ప్రసాదరావుగారు సిన్సియర్ పోలీసాఫీసర్ సార్! అది రాజా గ్రూప్ వాళ్లు చేసిన పని సార్" సి.ఐ ద్వారకానాథ్ నమ్మకంగా చెబుతున్నాడు.

స్వామి అంతరంగిక విశ్వాసపాత్రుల్లో ద్వారకానాథ్ ఒకడు. అయినా ద్వారకానాథ్ మాటల్ని డి.ఐ.జి అధికారికంగా నమ్మలేకపోతున్నారు. ఈలోగా ఎస్.పి. లైనులోకి వచ్చాడు. డి.ఎస్.పి ప్రసాదరావు తల బాగా దెబ్బతినడం వల్ల కోమాలోకి వెళ్లిపోయాడనీ పరిస్థితి ప్రమాదకరంగా ఉందని, ఆ ప్రాంతమంతా కనిపిస్తే కాల్చివేత ఉత్తర్వులు హెచ్.యం. నుండి వచ్చాయని వివరించాడు. తాను తీసుకొన్న చర్యలన్నీ ఏకరువుపెట్టాడు.

ఆ సాయంత్రమే పోలీసు ఉన్నతాధికారుల అత్యవసర సమావేశం జరిగింది. పొరుగు జిల్లాల అధికార్లు కూడా దాంట్లో పాల్గొన్నారు. ఆ సమావేశంలో డి.ఐ.జి స్వామి ఒకే ఒక

 

వాక్యం మాట్లాడారు. దానికి ఎస్.పి భారీ వివరణ ఇచ్చాడు. ఆ వాక్యం తక్షణ కర్తవ్యంలా పైపైకి పాకిపోయింది.

స్వామికి తెలుసు తన మాటలు వెంటనే అంతపైకి పోతాయని. అయినా మాట్లాడాడు ఎందుకు?

'ప్రసాదరావుని వేరేవాళ్లు కొట్టించి. ప్రస్తుత పరిస్థితిని వాడుకోవడంలేదుకదా!' అదే డి.ఐ.జి. స్వామి వాక్యం.

ఆమాత్రం మాటలే ఎస్.పి. వ్యతిరేకవర్గమైన ద్వారకానాథ్‌లాంటివాళ్లకి ఆనందాన్ని చేకూర్చాయి. ఎస్.పి. వర్గం కొంచెం వ్యాకులపడినా ఆయన్ని మెప్పించడానికి డి.ఐ.జి మాటల్ని నానార్థాల మేళవింపుతో పైకి ఎగబాకించాయి. ప్రతీ జిల్లాలో మోహరించిన పోలీసులకూ. పోలీసు బలగాలకు రెండు బలాలున్నాయి. అన్ని ప్రభుత్వ కార్యాలయాల్లోనూ వచ్చిన మార్పులే పోలీసు శాఖలోనూ వచ్చాయి. పోలీసు స్టేషన్లలో కానిస్టేబుళ్ల సంఖ్య పెరగక దశాబ్దాలు దాటింది. కానీ ఉన్నతాధికారవర్గ పోస్టులుమాత్రం అనూహ్యంగా పెరిగిపోయాయి. పెరిగిన ఆ పోస్టులకు కాపలాకోసం కానిస్టేబుళ్లను ఏర్పరిచారు. దాంతో వాళ్ల సంఖ్య మరీ పడిపోయింది. పోలీస్ స్టేషన్‌లలో కానిస్టేబుళ్ల సంగతి చూసేవారుండరు. అందరి సంగతి వాళ్లే చూడాలి. కేసులకోసం కోర్టుకు కొందరు, స్టేషన్ కాపలాకిద్దరు, వి.ఐ.పిల పర్యటనలకు కొందరు, రహదార్లమీదా, ఇతర సెక్యూరిటీ పనులమీదా... అలా అలా విభజిస్తే ఆఖరికి ఆ పోలీస్ స్టేషన్ పరిధిలోని ప్రాంతాలను రాత్రుళ్లు పహరా కాయాలంటే తరచు పోలీసులే ఉండరు. ఒకోసారి ఆ పహరా ఓ గంటలోనే ముగిసిపోతుంది. ఇద్దరు అందులో ఒక హోంగార్డు నైట్ డ్యూటీలు సైకిళ్లమీద చేస్తుంటారు. వాళ్లు పహరాకు ఎప్పుడు వచ్చేదీ అందరికీ తెలిసిన విషయమే. ఆ సమయంలోనే దొంగతనాలకు పాల్పడాల్సిన అవసరం దొంగలకి ఏముంటుంది!

ఉన్నతాధికార పరిధిలో పోస్టులు ఎక్కువ అవడంవల్ల పోలీసు రాజకీయాలు కూడా పెరిగిపోయాయి. వాస్తవానికి కొన్ని ప్రాంతాల్లో పోలీసుల్లో చీలిక ఏర్పడింది. ఎస్.ఐ. స్థాయివరకూ బదిలీలు ఎస్.పి. చేతుల్లో ఉంటాయి. సి.ఐ. స్థాయి బదిలీలు డి.ఐ.జి. అధికార పరిధిలోకి వస్తాయి. ఇక డి.ఎస్.పి. రాంకు ట్రాన్స్‌ఫర్లు డి.జి.పి చెయ్యాల్సివుంది. డి.జి.పి.తో సన్నిహిత సంబంధాలు, ఇతరత్రా పలుకుబడి గల సి.ఐ.లు ఎస్.పి. మాట విన్నట్లు నటించినా ఆచరించరు. ఆ స్థాయిలో అన్ని విషయాలు డి.ఐ.జి.కి వెన్వెంటనే అందుతుంటాయి. ఎస్.పి.గారి అన్ని వ్యవహారాలు, సంబంధ బాంధవ్యాలు... లాలూచీలు భవిష్యత్ ప్రణాళికలూ అన్నీ డి.ఐ.జి.కి ముందుగానే తెలిసిపోతూంటాయి. అయినా తెలిసినట్లు ఎవరూ బయటపడరు.

అలా అని ఎస్.పి.లను తక్కువ అంచనా వెయ్యడానికి లేదు. వాళ్లకి డి.ఐ.జి.ల కదలికలన్నీ సంపూర్ణంగా తెలుస్తుంటాయి. ఎస్.ఐ.లను తక్కువ అంచనా వెయ్యడానికి ఎవరు సాహసిస్తారు.

ఈ రాజకీయాల్లో ఎవరిది పైచేయి అనేది వారి అధికార పరిధిమీద ఆధారపడి ఉండదు. పాలకులకు పని చెయ్యగలిగే సమర్థత, అధికారపార్టీ ఆలోచనలకు ప్రతిరూపమైన కార్యాచరణ, అధికార, ప్రతిపక్ష బేధాలెరిగిన చట్టప్రయోగ సూత్రాలు - అలా ఎన్నిటినో అలవరచుకోవాలి. ఇవన్నీ ఐ.పి.ఎస్‌కంటె కష్టతరమైనవి. ఎంత కష్టమైనా ఓర్చుకోక తప్పదు. నేర్పుతో వ్యవహరించకపోతే అదే అసమర్థత. ఒక్కసారి అసమర్థుడనే ముద్ర పడితే ఇక ప్రభుత్వాలు మారినా అది చెరిగిపోదు. అందుకే సమర్థత. ఆ సమర్థత నాది, నాది అనిపించుకోవడానికి సాగే ప్రత్యక్ష యుద్ధమే ఉన్నతాధికార రాజకీయంగా రూపొందిందనే వాస్తవం సర్వత్రా విదితమైన విషయం. కానీ పోలీసు క్రమశిక్షణ దాన్ని బజారునపడకుండా

కాపాడుతోందనేది కానిస్టేబుళ్లకు సంపూర్ణంగా అర్థం అవుతున్న నగ్నసత్యం.

డి.ఐ.జి. రాంకులోని వ్యక్తి చిన్న సందేహాన్ని అలవోకగా వెలువరించినా అది అత్యంత విలువైన వార్తలా పొక్కిపోవడానికి ప్రధాన శక్తులు పోలీసు రాజకీయాన్ని బాగా ఒంటికి ఎక్కించుకొన్నవారేనన్న సంగతి స్వామి లాంటి అనుభవజ్ఞులకు బాగా తెలుసు. అలా పొక్కిపోవడం కూడా తమ మంచికనే వ్యూహాలలో వారుంటారు. ఒకరకంగా ఆ వ్యూహం వారిని పెద్దవారికి సన్నిహితంగా మార్చేమార్గం అని వాళ్లు నమ్ముతారు. డి.ఎస్.పి ప్రసాదరావు వ్యవహారం పోలీసు రాజకీయాల మూలంగా మూలకు నెట్టబడింది. వాస్తవాలు చేదుగా ఉన్నా ఆ వివరాలు డి.ఐ.జి. స్థాయిలోని వ్యక్తికి తెలిసినా మింగక తప్పడంలేదు. డి.ఐ.జికి తెలిసినా, అధికారం చేతిలో ఉన్నా ఆయన ఏం చేయగలుగుతున్నాడు? తమ శాఖలో నేడు ఒక డి.ఎస్.పి. రాంకు అధికారికీ అలాంటి విపత్కర పరిస్థితి ఏర్పడింది. ఇలాంటి స్థితే రేపు ఎస్.పికి ఏర్పడవచ్చు. ఆపైన తాను నేటి సమాజంలో విజృంభిస్తున్న ఈ దారుణాలు తమ స్థాయిని పెంచుకొని తనకీ హాని ఎందుకు తలపెట్టకూడదు. డి.ఐ.జి అయినంతమాత్రాన, ఎంతో జాగ్రత్తగా వ్యవహరించినా దారుణ పరిస్థితులు తనని ఆక్రమించవని గ్యారంటీ ఉందా...? దారుణాలు చేసేవారికి మంచి చెడులు ఆలోచించే విచక్షణ ఉండదు. అందుకే వాటిని చేస్తూంటారు.

స్వామికి ఈ ఆలోచనలు రావని ఎవరూ అనుకోలేదు. డి.ఐ.జిగా ఎదిగిన స్వామికి ఎన్ని అనుభవాలుంటాయి? ఆ అనుభవాలు నేర్పిన పాఠాలు మరెన్ని...? కరుణాకర్‌లాంటి వ్యక్తి ఎవరికి ఏం చేశాడని చంపారు? స్వామిని అనేక ఆలోచనలు చుట్టుముట్టాయి. కరుణాకర్ గత జీవితం ఆయనముందు కనిపిస్తోంది.

బాగా చదువుకున్న యువకుడు కరుణాకర్. సామాన్యంగా బతకాలనే అతని వాంఛకు రూపం రాలేదు. కారణం పరిస్థితులు. ఉద్యోగం దొరకదు. దొరికినా అది ఎప్పుడు ఊడుతుందో తెలియదు. అతని తెలివితేటల్ని భరించగలిగే యాజమాన్యాలు అతనికి చిక్కలేదు. చిక్కినా అవకాశాలు అతని తెలివితేటల్ని చూసి కంగారుపడి అతన్ని వదిలేశాయి. ఎప్పుడు ఎక్కడ ఎలా జీవించాలో తెలియని పరిస్థితిలో ఉన్న కరుణాకర్‌కి కల్యాణ్‌తో స్నేహం పెరిగింది. లక్ష్మీపతి, ప్రియంవద కూడా అతనితో పరిచయం పెంచుకున్నారు.

కరుణాకర్‌ని స్వంతంగా ఏదైనా చెయ్యమని వాళ్లు అడిగారు. కరుణాకర్ తాను సింగిల్‌మన్ కన్సల్టెంట్‌గా ఉంటానన్నాడు. మధ్యతరగతి కుటుంబాల్లోని వాళ్లకి ఎదురయ్యే అనేక సమస్యలకు పరిష్కారమార్గాలు చెపుతానన్నాడు.

వాళ్లకి అతను చెప్పింది అయోమయంగా అనిపించింది. ఇదంతాజరిగేపనేనా? తన కోసం తానేదో చేసుకోక వేరేవాళ్ల సమస్యలు తలకెక్కించుకొని పరిష్కారమార్గాలేమిటి అని అనుకొన్నారు. వాళ్లు తమ మాటల్ని పైకి అనలేదు. తనకుమాలిన ధర్మం అని.

స్నేహితుల మనోభావాలను కరుణాకర్ అర్థంచేసుకొన్నా మనసులోనే ఉంచుకొన్నాడు. అతని ఆలోచనావిధానానికి తొలివిజయం రామం. ఇంజనీరింగ్ సీటుకోసం సతమతమవుతున్న రాము కరుణాకర్‌ని కలిశాడు. ఎంసెట్‌లో రాంకు రాలేదు. ఎలా? ఇంజనీరింగ్ చదవాలి. అది రామూ జీవితాశయం. కరుణాకర్ అనేక రకాల సమాచారాన్ని సంపాదించాడు. ఇతర రాష్ట్రాల్లోని కళాశాలల తీరుతెన్నులు క్షుణ్ణంగా పరిశీలించాడు. రామూని చదువుకోసం పరరాష్ట్రానికి పంపేందుకు కరుణాకర్ చాలా కష్టపడాల్సివచ్చింది. తల్లి దండ్రులను సిద్ధం చెయ్యడం ఒక సమస్య అయితే అక్కడ డొనేషన్ల బేరాలు మరో పెద్ద సమస్య. అయినా ఆఖరికి రామూ చదువు




కోసం వెళ్లాడు.

అది కరుణాకర్‌లో ఆత్మవిశ్వాసాన్ని పెంచింది.

అనవసర నమ్మకాలు పెట్టుకోవద్దు. పనులు జరగాలంటే వాటి విధానాలు తెలుసుకోవాలి. నీతిశాస్త్రాలు వల్లించకండి. మనదాకా వచ్చేవరకూ ఒకనీతి. మనకు కానపుడు మరొకనీతి. ఇలా నీతులను ఎందుకు మారుస్తారు. ఇళ్ళపన్నులు తక్కువ కట్టాలి. అది ఇళ్లు కట్టినవారి కోరిక. దానికోసం నియమనిబంధనలు మాట్లాడితే పన్ను తక్కువ అవుతుందా. మనం తెలుసుకోకుండా వదిలేసిన నిబంధనలన్నీ మున్సిపల్ ఉద్యోగులు వివరించి, తమ చెయ్యి తడపమంటారు. మీకు లాభం చేసేటప్పుడు మాకూ భాగమియ్యండి అనేది వాళ్ల లాజికల్ పాయింట్. వాళ్లకి లంచం ఇవ్వకుండా ఇంటిపన్ను తగ్గాలనడంలో ఔచిత్యం ఏమిటని అడిగే కరుణాకర్ వ్యవహారం చూసి మొదట్లో చాలామంది తడబడిపోయారు. ఆ తర్వాత అతని విధానం వాస్తవాలకు అనుగుణంగా ఉందని మెచ్చుకొన్నారు. అనేక లిటిగేషన్లకు అతను పరిష్కారమార్గంగా కనిపించాడు. క్రమక్రమంగా కరుణాకర్ మధ్యతరగతి ప్రజానీకానికి సుపరిచితుడయిపోయాడు. ఆపైన ఉన్నత వర్గాల దృష్టికి రావడం ప్రారంభించాడు. స్వంతలాభం లేకుండా ఇలాంటి లావాదేవీలు కరుణాకర్ ఎందుకు పట్టించుకొంటాడు అనేవారున్నా రేపు తనకూ ఆ అవసరం ఉంటుందేమోనని గట్టిగా పైకి అనలేకపోయేవారు.

మన సమాజంలో కొన్ని నమ్మకాలు చిత్రంగా ఉంటాయి.

రాజకీయ నాయకులు సంపాదించుకొన్నా ఎవరూ పెద్దగా పట్టించుకోరు. ఆమాత్రం చేసుకోకుండా ఎలా ఉంటారు... అని ఎదురు మాట్లాడతారు. నూటికి ఏభైశాతం పైగా తమ పనులు నాయకులచేత చేయించుకోవాలనే అనుకొంటారు. ప్రస్తుతం ఆ శాతం పెరుగుతూవస్తున్నది.

ఈరోజులు నాయకులకు కూడా గడ్డుకాలంకిందే ఉన్నాయి. పెద్ద పదవుల్లో వున్న నాయకులకు పెద్దగా ఇబ్బందులు ఉండవు. వారి పదవులను అనుసరించి పనులు జరిగిపోతుంటాయి. వారి లావాదేవీలు చూడడానికి అనుభవం వున్న మధ్యవర్తులు ఉంటారు. మంత్రిగారి బంధువో, కుటుంబ సభ్యులో ఆ వ్యవహారాలు చూడటం సాధారణంగా జరుగుతూంటుంది. కొన్ని సందర్భాల్లో పి.ఎ.లు అన్ని పనులూ చక్కబెడుతుంటారు. పెద్ద హెూదాలో ఉన్నవారు నేరుగా తమ అభీష్టాలను వెల్లడించలేని పరిస్థితులు ఉంటాయి కనుక వాటిని పి.ఎలద్వారా తెలుపుతూ విషయాలను నడిపిస్తుంటారు. మంత్రిగారికి చాలా ముఖ్యమైన పని. మీరు ఎలాగోలా కాదనకుండా వెంటనే చెయ్యాలి అనేది పి.ఎల లౌక్యం.

ఈ పి.ఎ.లు రకరకాలుగా ఉంటారు. కొందరు ఒక పెద్ద నాయకుడినే ఆశ్రయించి ఉంటారు. వారికి రాజకీయపు ముద్ర కూడా ఉండటం సామాన్యవిషయం. మరికొందరు అధికారంలోకి ఏ పార్టీ వచ్చినా ఏదో ఒక మంత్రి దగ్గర పి.ఎ.గా చేరేందుకు ప్రయత్నిస్తుంటారు. ఏ మంత్రయినా వారికి ఒకటే. ఊసరవెల్లులకంటె వేగంగా రంగులు మార్చగల ఈ పి.ఎలు ఎక్కువగా తమ స్వలాభంకోసమే పాటుపడుతుంటారు. మంత్రుల దగ్గర అన్ని పనులూ తామే చేయించగలమనే ధీమాని చాటుకొంటూంటారు. బహిరంగంగా కాకపోయినా చాటుగా పనులున్నవారికి ఆ విషయం తెలిసేలా చేసుకొంటారు.

అసలు సమస్యలన్నీ చిన్న నాయకులకే ఉంటాయి. ఒక వాడకి నాయకుడైనవాడికి రాష్ట్రస్థాయి నాయకుడికంటె ఎక్కువ రాజకీయాలు ఉంటాయి. ఆ వాడలో వందమంది ఉంటే ఆ వందమందీ ఆ నాయకుడు తమ మాట వినాలని అనుకొంటారు. అంతవరకూ బాగానేవుంటుంది. కానీ తమ మాట తప్పించి



వేరేవాళ్ల మాట వినకూడదు. విన్నా ఆచరణలోకి తేకూడదు. పరస్పర విరుద్ధ భావాల విబేధాల అభిప్రాయం ఆ చిన్న నాయకుడు అర్థంచేసుకోవాలి. న్యాయం, ధర్మం అంటూ ఆలోచిస్తే అది అతని ఉనికికే ప్రమాదం. ఏ అభిప్రాయానికి ఎక్కువ మంది విలువ ఇస్తున్నారనేదే అతని లెక్క కావాలి. తక్కువ మంది చెప్పేది న్యాయమే అయినా చెవిటివాని ముందు శంఖం ఊదినట్లుగా వ్యవహరించాలి. చెవులు ఉన్నా వినకూడదు. కళ్లున్నా చూడకూడదు. మనసున్నా దాన్ని విప్పకూడదు. స్వతంత్రించి ఏరకమైన ముందడుగూ వెయ్యకూడదు. అన్నిటినీ బేరీజు వేసుకొని ఆచి తూచి నడిస్తేనే వాడు నాయకుడిగా మనగలుగుతాడు. లేకపోతే వాణ్ణి జనం పట్టించుకోరు. అనేకరకాలుగా వాణ్ణి తప్పుపట్టడానికి ప్రయత్నం చేస్తారు.

సాధారణ జనానికి నాయకులు పనులు చేసిపెట్టాలి. ఉద్యోగాలు లేని కొడుకులకూ, కూతుళ్లకూ నాయకులే ఉద్యోగాలు వేయించాలి. అందుకోసం కొన్ని వేలు ఖర్చయినా ఫర్వాలేదు. పెద్ద ఉద్యోగాలయితే లక్షవ

రకూ ఖర్చయినా వెనుకాడమని జనమే అంటారు. తమ పిల్లలకు మంచి స్కూళ్లల్లో సీట్ల నుంచి కాలేజీల్లో ఎడ్మిషన్లవరకూ నాయకులే సహకారం అందించాలి. కొందరికి పోలీసు వ్యవహారాలు, మరికొందరికి ఆస్థి తగాదాలు ఇవన్నీ నాయకులే తమకి అనుకూలంగా చేసిపెట్టాలి.

జనం కోరుకొన్నవిధంగా వారి పనులు జరగాలంటే ఎన్నో ఇబ్బందులు ఎదురవుతాయి. అవి ఒకవిధంగా నాయకులమీద ఒత్తిడీ అవుతుంది. చేయలేననిగానీ, చేయననిగాని అనే నాయకుడు ప్రస్తుత పరిస్థితుల్లో కనిపించడు. ఖచ్చితంగా ఆ పని జరగదు అంటే వాడు నికార్సయిన నాయకుడే కాదనే నమ్మకం జనంలో ప్రబలిపోతుంది. సమర్థుడైన నాయకుడు అనిపించుకోవాలంటే అందుబాటులోని అడ్డదారుల్నీ అతను అవలంభించక తప్పదు. 'డబ్బు ఇచ్చినా ఆ నాయకుడి దగ్గర పనవుతుంది' అనే ఆమోదముద్ర పడాలి. అదే నేడు అధికంగా జనం కోరుకొంటున్న నాయకత్వం. ఇది నిజంకాదని వాదించేవ్వారున్నా అది వారు జనంకోసమే అంటారు. వాస్తవానికి వారు ఆశ్రయించేది కూడా అలాంటి సమర్థనాయకుడి ప్రాపకాన్నే.

కరుణాకర్ అలాంటి సమర్థతకిందికి వస్తాడా...?

ప్రజాకర్షణ సూత్రాలు పాటిస్తూ ఏవరు ముందుకు సాగిపోతారో వారికి వైరివర్గం సర్వత్రా అలముకొని వస్తుంది. కరుణాకర్ జనాన్ని ఎందుకు కూడదీసుకొంటున్నాడు. అతని ఆలోచనలు మెల్లగా నాయకత్వంమీదకు మళ్లుతాయా...? మధ్యతరగతి ప్రజల ఆమోదముద్ర ఉన్న కరుణాకర్ ఎదిగితే రాజకీయంగా ఏనాటికైనా ప్రత్యర్థికాడా... ఈ ఆలోచన ప్రధాన రాజకీయ పక్షాలకు తలపోటుగా తయారైంది. కొన్ని రాజకీయ పార్టీలు అతనికి సభ్యత్వం ఇచ్చి, పార్టీపరంగా పదవి ఇస్తామని ఆశ చూపినా కరుణాకర్ తనకలాంటి ఉద్దేశం లేదని స్పష్టంచేశాడు.

అన్ని పార్టీల నాయకులతోనూ అతనికి పరిచయాలున్నాయి. అయినా అతని వ్యవహారం వారికి అంతుచిక్కని సమస్యలా తయారయింది.

ఆ సమయంలోనే కరుణాకర్‌ని డి.ఎస్.పి. ప్రసాదరావు అరెస్టుచేశాడు. దానికి కారణం అతను ఒక ప్రయివేటు కంపెనీ యాజమాన్యాన్ని మోసంచేశాడనే ఆరోపణ. ఆ కంపెనీకి చెందిన ఒక ఉద్యోగి కంపెనీలో అకస్మాత్తుగా జరిగిన ప్రమాదంలో మరణించాడు. ఆ ఉద్యోగి భార్య తరపున కరుణాకర్ యాజమాన్యంతో సంప్రదింపులకు వెళ్లాడు. ఆమెకు ఓ అన్నలా అండగా నిలబడ్డాడు. యాజమాన్యం నష్టపరిహారం చెల్లించింది. ఆ తర్వాత ఆమె అన్నగా వచ్చిన కరుణాకర్ తమ దగ్గర ఎక్కువ నష్టపరిహారం వసూలు చేసి ఆమెను మభ్యపెట్టి కొంత కాజేశాడని యాజమాన్యం ఆరోపించింది.

వెంటనే డి.ఎస్.పి. ప్రసాదరావు కరుణాకర్‌ని అరెస్టుచేసి స్టేషన్‌కి రప్పించాడు.

పట్టణంలోని యువకులంతా అది అన్యాయమంటూ పోలీస్ స్టేషన్‌ముందే ధర్నా చేశారు. కరుణాకర్ స్నేహితులు కల్యాణ్, లక్ష్మీపతి ఆ ధర్నా నిర్వహించారు. కరుణాకర్ సానుభూతిపరులందరూ ఆ ధర్నాలో పాల్గొన్నారు.

రాజకీయ పార్టీలవారు చేసిన, చేస్తున్న ధర్నాలను అనేకం చూస్తున్న పోలీసులకు ఇది చిత్రంగా అనిపించింది. ఏ రాజకీయ పార్టీ అండా లేకుండా ఆ ధర్నా ఓరకంగా ఉన్నతాధికార వర్గాల్లో అలజడిని కలిగించింది. ఆ విషయం డి.ఐ.జి. స్వామివరకూ వెళ్లింది. స్వామికి డి.ఎస్.పి. ప్రసాదరావు గురించి బాగా తెలుసు. అందుకే నేరుగా అతనితోనే మాట్లాడాడు. యాజమాన్యం ఆరోపణమీద అరెస్ట్ ఎందుకు చెయ్యాల్సివచ్చిందనే ప్రశ్న తల ఎత్తింది.




దానికి కారణం ఒక స్థానిక రాజకీయ నాయకుడి ఒత్తిడి.

'ఆ ఒత్తిడికి మూలం...?'

అది డి.ఐ.జి అడగని ప్రశ్న.

ఎందుకంటె దానికి సమాధానం తనకీ ఇబ్బందిని తెచ్చిపెడుతుంది. రాజకీయపర మైన ఒత్తిడులు ఎందుకొస్తాయి అనే ఆలోచన లు అనవసరమని పోలీసు డిపార్టుమెంటుకి తెలుసున్న నమ్మకం.

'చనిపోయిన ఉద్యోగి భార్య ఏదైనా ఫిర్యాదు చేసిందా?' అనే ప్రశ్నకు సమాధానం రాలేదు.

కరుణాకర్ విడుదలయ్యాడు. అది యువ తరం విజయంగా భావించింది. కానీ అతని అరెస్టుకి ఒత్తిడి చేసిన రాజకీయవర్గానికి అది కంటకప్రాయమైంది.

సమావేశం ముగిసిపోయినా కరుణాకర్ ఆలోచనలు వెంటాడుతున్నా ఇల్లు... ఇల్లాలు తప్పవు. డి.ఐ.జి. స్వామి హుందావ్యక్తి కాబట్టి ఏ విషయంలోనూ బయటపడడు. నిద్రకు ఉపక్రమించినా గతం సాలెగూడులా అతని మెదడుని అల్లుకుపోయింది.

★ ★ ★

కృష్ణస్వామి ఐ.పి.ఎస్ పూర్తిచేసి ఎ.ఎస్.పిగా చేరిన తొలిరోజుల్లో తొలివలపు సౌందర్య తొలిచూపు.

ఎమ్యూజుమెంట్ పార్కుదగ్గర గొడవ జరిగితే ఆ ప్రాంతానికి కృష్ణస్వామి వెళ్లాడు. అక్కడ డ్యూటీలో ఉన్న సీనియర్ ఎస్.ఐ. ప్రసాదరావు పరిస్థితి వివరించాడు. ఆ వ్యవహారం రెండుగంటలపైగా సాగింది. దాన్ని ముగించుకొని తిరిగి రావడానికి పోలీసు వాహనంవైపు రోడ్డుమీదకు వచ్చాడు కృష్ణస్వామి. అక్కడే సౌందర్య సౌందర్యం తళుక్కుమంది.

ఫియెట్ కారు ఆగివుంది. టైరు పంచర్. చీకట్లు వ్యాపించాయి. టైరు మార్చాలి. ఆ గొడవలో జనం చెల్లాచెదురయ్యారు. ఆమెకు సహాయం చెయ్యడానికి ఎవరూలేరు. ఒకరిద్దరు కనిపించినా తమకు ఆ పని రాదని వెళ్లిపోయారు.

ఆమెను చూసిన మరుక్షణం కృష్ణస్వామి పరిస్థితిని అంచనావేసి సహకారం అందించాడు. కానిస్టేబుళ్లు ఆమె కారు టైరు మార్చారు. కృష్ణస్వామికి థాంక్స్ చెప్పి ఆమె గంభీరంగా నవ్వుతూ వెళ్లిపోయింది.

ఆమె ఆలోచనలు కృష్ణస్వామి మదిలో చెలరేగాయి. అతని హృదయమంతా తానై ఆక్రమించింది. ఆ క్షణంనుంచీ కృష్ణస్వామి కళ్లు ఆ సౌందర్యోపాసనను కూడా బాధ్యతగా స్వీకరించాయి. తన వృత్తిలోని సాధకబాధకాలన్నీ ఒక వైపూ, ఆమెకై పరిశోధన మరోవైపు సాగాయి.

సౌందర్య ఒక డిగ్రీ కళాశాల లెక్చరర్. అందం, తెలివి సహజంగా రాగా పెద్దింటివారమ్మాయి కూడా కావడంతో సమాజంలో ఒక ప్రత్యేకస్థానాన్ని సంపాదించుకుంది. సంఘంలో గుర్తింపుకోసం ఒక అవసరంలా ఉద్యోగం. ఆ ఉద్యోగంద్వారా సమాజంలో ప్రత్యేకత కోరుకొంటారు కొందరు. ఆర్థికావసరాలకోసం ఉద్యోగాలు అనే సామాన్య విషయం వారిది కాదు. చాలా కొద్దిమంది మాత్రమే మనదేశంలో సౌందర్యలాంటి పరిస్థితిలో ఉండడానికి నోచుకొంటారనేది నిజం.

అందమైన ఆడది ఏపని చేసినా అందంగా అనిపిస్తుంది. మధురభావనలా మనసులో నిలిచిపోతుంది. సౌందర్య తన అందాన్ని వ్యామోహపరచడానికి వాడకపోవడం ఓ సుగుణం. అందరితో కలిసిపోయి నిరాడంబరంగా ఉండే ఆ సౌందర్యరాశి ఎందర్నో ఆకర్షించింది. కానీ ఆమె ఉన్నత కుటుంబం గురించి తెలిసినవారు సమీపంలో నిలబడడానికి కూడా ప్రయత్నించలేదు.

కృష్ణస్వామి అన్నీ తెలుసుకున్నాడు. చాలా సార్లు ఆమెకి తారసపడ్డాడు. కృష్ణస్వామి కళ్లలోని భావాలను తెలుసుకోలేని లెక్చరర్ కాదు

సౌందర్య. తనకు ఏ భావాలు లేవనేవిధంగానే ప్రవర్తించింది. అసలే పోలీసుశాఖ, అందులోనూ సమర్థుడైన కృష్ణస్వామి. మనసులోని ఎలాంటి విషయాన్నైనా బయటపెట్టడం అనే ప్రసక్తే లేనివాడు. పరిస్థితులను తనకు అనుకూలంగా మార్చుకోవడానికి సకల ప్రయత్నాలనూ సమర్థవంతంగా ఆలోచించి ఆచరణలో పెట్టగలిగినవాడు.

కృష్ణస్వామికి సౌందర్య కావాలి. ఎలా...?

కాలేజీ కుర్రాడిలా వెంటపడలేదు. రోమియోల్లా టీజ్ చెయ్యలేదు. నేరుగా కలిసి చెప్పనూ లేదు. అయినా సౌందర్యం తన స్వంతం కావాలి.

కృష్ణస్వామి కామంతో ఆమెను కోరుకోలేదు. అదే అయితే కామాతురాణాం నభయం నలజ్జ అని తెలియనివాడూ కాదు. తన భార్య అలా ఉండాలి అనుకొన్నాడు. దానికి మార్గాన్వేషణ చేశాడు. ఆ పెద్దింటివారితో పరిచయం పెంచుకొన్నాడు. ఆ ఇంటికి సంబంధించినవారి పనులు జరగడంలో ప్రత్యేకశ్రద్ధ కనబరిచాడు. వాళ్ల ప్రశంసలు అందుకొనేవరకూ అంచెలంచెలుగా ఎదిగిపోయాడు.

ఆ సమయంలోనే ప్రసాదరావుకి సి.ఐగా ప్రమోషన్ వచ్చింది. ఆ అవకాశాన్ని కృష్ణస్వామి సమర్థవంతంగా వినియోగించాడు. ప్రసాదరావు ఆనందానికి సంకేతంగా పార్టీ జరిగింది. ఆ పార్టీకి సౌందర్యని ఆహ్వానించాడు. ఆమె కుటుంబసభ్యులు కూడా ఆ పార్టీలో పాల్గొన్నారు. అపుడు కృష్ణస్వామి తత్వాన్ని కొద్దిగా అర్థంచేసుకొన్నాడు ప్రసాదరావు. అక్కణ్ణుంచి సౌందర్యని కృష్ణస్వామికి చేరువగా తీసుకురావడానికి సి.ఐ. ప్రసాదరావు తనవంతు ప్రయత్నాలు కొనసాగించాడు.

అవి ఫలించి సౌందర్య, కృష్ణస్వామి కలుసుకొన్నారు. మొదట్లో అతన్ని అభిమానపాత్రంగా చూసిన సౌందర్య ఓ నిశ్చితాభిప్రాయానికి వచ్చింది. రెండుసార్లు వాళ్లు కలుసుకున్నా ఆ పరిస్థితులు వాళ్లని ఎక్కువసేపు మాట్లాడుకోనివ్వలేదు. ఆ తక్కువ సమయంలో కూడా పోలీసు వ్యవస్థని సౌందర్య విమర్శించింది. దానికి చిరునవ్వే సమాధానంగా కృష్ణస్వామి తప్పించుకొన్నాడు. మూడో సందర్భంలో ఒక పెద్ద పార్టీలో కలుసుకొన్నారు. పెద్దలంతా మధువు ఆస్వాదించడంలో నిమగ్నమయిన తరుణంలో అప్పటికి ఆ అలవాటులేని స్వామి సౌందర్యకు కంపెనీగా మారాడు.

"లేటెస్టు ఇంటరెస్టింగ్ కేసులేమయినా ఉన్నాయా?" సౌందర్య అడిగింది.

"అన్నీ ఒకేరకంగా మాకు అనిపిస్తాయి. మీకు ఏ విషయమైనా ఇంటరెస్టుగా ఉంటే అడగండి'' అన్నాడు స్వామి.

"ఎక్కువగా క్రైం ఉంటుంది. అసలా వార్తలు చదవడమే నాకు ఇష్టం ఉండదు. ఏదైనా ఇన్వెస్టిగేటివ్ కేసులుంటే చెప్పండి'' ఆమె తన ఆసక్తిని తెలిపింది.

"ఇక్కడ పెద్దగా పరిశోధించాల్సిన కేసులు ఎపుడోగానీ దొరకవు. రోజూ కేసుల గొడవతో తల నెప్పిగానే ఉంటుంది. మీలాంటివాళ్లదగ్గర కూడా ఆ గొడవలెందుకు? ఐవిల్ ట్రైటు రిలాక్స్ విత్ యంగ్ టాలెంటెడ్ పీపుల్ లైక్ యూ. సరదాగా ఉండే విషయాలు మాట్లాడండి. మీరు మంచి లెక్చరర్ అని విన్నాను. కాసేపు స్టూడెంట్‌ని అయిపోతాను. మీకిష్టమైన టాపిక్ మాట్లాడండి'' నవ్వుతూ నీ ఇష్టమే నా ఇష్టమన్నట్లు చెప్పాడు స్వామి.

"ఎందుకో పోలీసులూ... ఆ ఖాకీబట్టలూ... వాళ్ళ హడావిడి మొదట్నించీ నాకు నచ్చదు'' సౌందర్య కొంచెం తెలివి చూపింది.

ఒక్కసారి కళ్ళెగరేసి "బట్ నేనూ మనిషినే కదండీ- మనుషులకున్న భావాలు మాకూ ఉంటాయిగా. వృత్తి ఉద్యోగం ఏం చెయ్యమంటారు." 'నన్ను నీ దగ్గర మనిషిలా భావించుకోకూడదా' అనే అర్థింపుకళ్ళతో స్వామి అన్నాడు.




"అందరూ మనుషులే అనుకోండి. దొంగతనం చేసేవాడూ- రౌడీయిజం చేసేవాడూ, హత్యలు చేసేవాడూ అందరూ మనుషులే. కాని వాళ్ళ ప్రవర్తనే గదా వాళ్ళ మార్గాలను మళ్ళించేది'' సౌందర్య లౌక్యం ప్రదర్శించింది.

"నా ప్రవర్తనలో ఏదైనా పొరపాటు గమనించారా? నేను నాకు నచ్చిన వాళ్ళతోనే ఇలా మాట్లాడతాను. సామాన్యంగా అందరూ మాకు దూరంగానే ఉంటారు. అది హెూదాని చూసి. కానీ మనసుకు నచ్చిన వాళ్ళు కూడా దూరంగా ఉండాలని అనుకొనేవాణ్ణి కాదు. ఏదయినా మీరు నాకు సూటిగా చెప్పండి'' స్వామి తన హెూదా ఆమెపట్ల తన మక్కువని రంగరించి ఆమె ముందు ఉంచాడు.

"మనసుకి నచ్చడం అనేది దేనిమీద ఆధారపడి ఉంటుందంటారు'' సౌందర్య సున్నితమైన ఆ ప్రశ్నకు స్వామి తేలికపడ్డాడు. అతని కళ్ళల్లో ఏదో వెలుగు విరిసింది.

"ఎదుటి వ్యక్తిమీద అందునా మీలాంటి ఇంటెలిజంట్స్‌తో ఎంత కాలమయినా హాయిగా గడిపేయచ్చు. రియల్లీ ఆ ఆకర్షణని విడమరచి చెప్పడం అంత తేలికయిన విషయం అని నేను అనుకోవడంలేదు. ఇద్దరి మధ్య ఆకర్షణ ఎందుకు, ఎలా మొదలవుతుంది. మళ్ళీ మళ్ళీ వాళ్ళని కల్సుకొని ఏమయినా మాట్లాడాలని ఎందుకు అనిపిస్తుంది అనేది ఒకరకంగా జవాబులు లేని ప్రశ్నల్లాంటివి కదా. ఏమంటారు?" స్వామి వృత్తిపరమైన అనుభవంతో అన్నాడు.

"అలాంటి విషయాలు ఏరకంగా ఆలోచిస్తే అలాగే అనిపిస్తాయి. మనిషి మనోపరిధిమీద అవి ఆధారపడతాయనేది నా నమ్మకం. అయినా ఆ ఆకర్షణ తాత్కాలికం కూడా కావచ్చు. ఒకవైపునుంచి మాత్రమే ఆలోచిస్తూ ఒకోసారి తప్పటడుగు వేసే ప్రమాదం కూడా ఉంటుంది. సపోజ్ ఇద్దరు కలిశారనుకోండి. మగవారయితే వారిరువురూ స్నేహం అనే ముద్ర వేసుకోవడానికి ఆస్కారం వుంది. అదే ఆడవారయితే మళ్ళీ కలుసుకోవచ్చు అనే భావన కలగవచ్చు. ఒక ఆడ ఒకమగ అయితే ఒకరు ప్రేమ అనుకోవచ్చు. మరొకరు టైంపాస్ అని కూడా భావించవచ్చు. అది వాళ్ళని బట్టి ఉంటుంది కదండీ'' ఆమె వివరణ స్వామికి ఎక్కడో కలుక్కుమనిపించింది. తన భావనలకు ఓ ఈదురుగాలి అవరోధంగా నిలిచినట్లు ఫీలయ్యాడు. అయినా అతను కంగారుపడలేదు. పరిస్థితులను తనకి అనుకూలంగా మార్చుకోగల సమర్థతను ఉగ్గుపాలతో నేర్చుకొన్న స్వామి నిదానంగా మెల్లగా ఆమెవైపు సూటిగా చూస్తూ, "బహుశా ఆ కోవలో మనం లేమనుకొంటాను'' చిరునవ్వులు చిందించాడు. ఆమె కంగారు పడింది. అతని చాకచక్యానికి ఓరకంగా దెబ్బతిన్నట్లుగా చూసింది. స్థాణువులా మారింది. కానీ ఆమె మెదడు పదునైంది.

"మన సంగతి ఇప్పుడు ఆలోచించే ఆస్కారం లేదు. ఎందుకంటే మీ ఆలోచనలు నాకు స్పష్టంగా అర్థం అవడం అనవసరం. నా గురించి నేను వ్యక్తిగతాన్ని వివరించడం అసంబద్ధం. ఏమంటారు. ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో అక్కడ పరిచయస్థులు కనిపించినప్పుడు. అదయినా ఇలా కంపెనీ తప్పనిసరైనప్పుడు ఏదో మాట్లాడతాం. అవన్నీ అప్పటివరకేకదా- ఆ తర్వాత వాటిని ఆలోచించే సమయం మీ డిపార్టుమెంటు మీకివ్వదు. నా బిజీలో అది కుదరదు''

సౌందర్య మాటలకు మ్రాన్పడిపోయాడు స్వామి. ఆ విషయాన్ని అక్కడే వదిలేస్తే స్వామికి మరోఛాన్సు ఉండదు. అది గ్రహించి ఆ అవకాశంలోనే ముందుకు నడవాలనుకొన్నాడు. "మీరంటే అభిమానం.. మీపట్ల ఆకర్షణ పెంచుకోవాలనుకోవడం తప్పనుకొంటే ఐయామ్‌సారీ. నేను మీ ప్రవర్తనను అభిమానిస్తున్నాను. ఎప్పటికీ మీ తోనే స్నేహంగా ఉండాలనుకొన్నా. అయితే లోకంతీరు మీకు తెలుసు. మీకూ అదే అభిప్రాయం కలిగితే వుయ్‌కెన్ మేక్ గుడ్‌లైఫ్'' ఆమె కళ్ళల్లోకి

ఆరాధనగా చూస్తూ అన్నాడు.

"ఇంతవరకూ వచ్చింది కాబట్టి నేను ఒక విషయం అడుగుతాను- మీరు అన్యథా భావించకండి'' సౌందర్య ఆగింది.

"మీరేదయినా నిరభ్యంతరంగా అడగండి. నేను ఏమీ అనుకోను'' స్వామి హామీ ఇచ్చాడు.

"మిస్టర్ స్వామి! నాపట్ల అభిమానం... ఆకర్షణ అన్నారు. ఏ విషయంలో"

"అది మీ ప్రవర్తన కావచ్చు. నాకు అన్ని విషయాల్లో మీరు నచ్చివుంటేనే కదా అలాంటి అభిప్రాయం ఏర్పడుతుంది''

"నాకంటూ ఒక వ్యక్తిత్వం ఉండాలనీ, దాన్ని నేను నిలుపుకోవాలనీ నా అభిరుచి ప్రకారం నేను జీవించాలనీ మీకు ఎప్పుడయినా అనిపించే వీలుందా''

"అదేవిటి అలా అడిగారు. వ్యక్తిత్వాన్ని ఎవరికివారే కాపాడుకోవాలి''

"కదా... అందులోనూ సమాజంపట్ల కొంత అవగాహన ఉన్న మాలాంటివాళ్ళం మాకు మంచి మార్గమేదో మేమే నిర్ణయించుకొని, వ్యక్తిత్వాన్ని పెంచుకొని ముందుకు వెళ్ళే అవకాశం ఉంది- ఏమంటారు?"

"ఖచ్చితంగా ఉంది''

"కానీ మీకది లేదు. ఎందుకంటారా... ఎదుటివాళ్ల అభిప్రాయంతో అవసరంలేకుండా మీరనుకొన్న విధంగానే అన్నీ నడచి రావాలి అనే మనస్తత్వంలో ఉన్నారు. ఎదుటివాళ్లు మీరూహించిన, అనుకొన్న మార్గమే మంచిదని భావించాలనీ ఆ బాటలోనే వాళ్ళు నడవాలనీ అనుకొనే మీలాంటివాళ్లు పరిస్థితులను మీకు అనుకూలంగా మార్చుకోగలరు. కానీ మనుషుల మనసుల్లో స్థానం పొందడం మీకు అసాధ్యం. ఇది నా వ్యక్తిగత అభిప్రాయం. నేను సూటిగా మాట్లాడే మనిషిని. అపార్థం చేసుకోకండి. గతంలో మిమ్మల్ని చాలాసార్లు గమనించాను. నాకు దగ్గరగా రావడానికి మా వాళ్ళతో సంబంధాలు పెంచుకొన్నారు. వాళ్ళ అవసరాలకు మీ హోదాని ముడిపెట్టారు. అవసరపడినవాళ్లను దగ్గరికి తీసి మరింతగా అవసరాలకు వాడుకోవడం మాలాంటి ఉన్నత కుటుంబాల పెద్దలకు వెన్నతో నేర్పిన విద్య. కానీ మీ అంతట మీరు హోదా పక్కనపెడితే వ్యక్తిత్వంతో నన్ను చేరుకోగలరని మాత్రం నేను అనుకోవడంలేదు. ఏ హోదా అయితే ఈ పరిస్థితిలోకి మిమ్మల్ని తీసుకువచ్చిందో దాన్ని వదులుకొనే సాహసం మీరు చెయ్యలేరు. నాకు హోదాకాదు ముఖ్యం. వ్యక్తిత్వం. ఉన్నతంగా ఎదిగిన సభ్యసమాజపు ప్రతినిధిని కోరుకొంటున్నాను. బహుశా ఆ ప్రతినిధిని త్వరలోనే మీకు చూపిస్తాను. ఎనీహౌ మనం చాలా సమయాన్ని క్షణాల్లా గడిపేశాం. ఒక్కొక్కరూ డైనింగ్ టేబుల్ దగ్గరకు చేరుతున్నారు, పదండి'' అంటూ స్వామి మాట్లాడ్డానికి మళ్ళీ అవకాశం ఇవ్వకుండా సౌందర్య గంభీరంగా లేచి నెమ్మదిగా అక్కడ నుంచి కదలిపోయింది.

స్వామికి కొద్దిసేపు ఏం చెయ్యాలో అర్థంకాలేదు. కానీ కూలబడనూలేదు. ఏవో ఎత్తుల నుంచి జారి కిందికి పడనూలేదు. "యస్ ఇదొక ప్రయత్నం. ఫలించనంత మాత్రాన కృంగిపోవడం నాలాంటి సమర్థుడికి తగదు'' అదీ అతని స్వగతం.

ఎంతోమంది అందమైనవాళ్లు తారసపడుతుంటారు. వాళ్ళల్లో కొందర్ని చూస్తాం. కొందరితో మాట్లాడతాం. ఇంకొందరితో దూరంగా ఉంటాం. ఎనీహౌ ఆల్ ఇన్‌ద గేమ్. అనే ఆలోచనలతో ముఖానికి చిరునవ్వు పూసుకొంటూ డైనింగ్‌టేబుల్ దగ్గర హడావిడిగా కనిపించిన సౌందర్యని మామూలుగానే కళ్ళతో పలకరించాడు. తనకి డిన్నర్ ప్లేట్ అందించిన సౌందర్యకి థాంక్స్ చెప్పాడు. ఒంటరిగా కనపడినప్పుడు "మనం మంచి స్నేహితులుగానే ఉండిపోదాం" అనేసి ఆ పార్టీనుంచి వచ్చేశాడు.

ఆ రాత్రి స్వామికి దుర్భరంగా గడిచింది.




అందాలన్నీ అసహ్యంగా వికృతంగా అని పించాయి. అతి తెలివితేటల్తో జీవితాన్ని పంచుకొనేకంటే దూరంగా ఉండటమే శ్రేయ స్కరం అని సరిపెట్టుకొన్నాడు.

కానీ...

'తనకు వ్యక్తిత్వం లేదా?'

ఆమెవరు ఆ మాట చెప్పడానికి! తనకో హోదా లేకపోతే ఆమె కాలి దగ్గరకు కూడా రాలేననేవిధంగా మాట్లాడిన ఆ ఆడది నిజంగా ఆలి అయితే జీవితాంతం అశాంతికి గురికాక తప్పదు.

అందం... ఐశ్వర్యం.. చదువూ వుంటే సరిపోతుందా? దాన్ని పరిరక్షించగల సమర్థు డైన భర్త లేకపోతే అవన్నీ బజారుపాలవుతా యనే విషయం ఆ కుర్రపిల్లకేం తెలుసు?" ఆ సౌందర్యం వెనుక ఇంతటి దారుణమైన ఆలో చనా వలయం ఉందనుకొంటే ఏనాడో అంతక న్నా అపురూప లావణ్యాన్ని తన స్వంతం చేసుకొనేవాడుగదా!

తనలాటి వాడికోసం ఎంతమంది పోటీపడి ముందుకు వస్తారో తనకు తెలియని విషయ మా?

ఆలోచనలన్నీ అనుకూలంగా రావడంతో స్వామి నిద్రకు ఉపక్రమించాడు. కానీ, కళ్లు మూసుకొనేంతలో 'మనుషుల మనసుల్లో స్థానం పొందడం మీకు అసాధ్యం' అని పెద్ద అరుపుల్లా... వేయిగొంతుల మేళవింపుస్థా యిలో సౌందర్య మాటలు చెవుల్ని చిల్లులు చేయసాగాయి.

ఎవరి మనసులో స్థానం సంపాదించాలి? డబ్బు ఇస్తే ఒకరు సంతోషిస్తారు. ఉద్యోగం ఇప్పిస్తే మరొకరు ఆనందిస్తారు. దొరికిన దొంగల్ని విడిచి పెడితే వాళ్ళు సంతోషిస్తారు. కిరాయి గూండాలను, రౌడీలను చూసీచూడన ట్లు వదిలేస్తే అధికార పీఠాలకి దగ్గరగా ఉన్న నాయకులు మెచ్చుకొంటారు. ఒకరికి మరొకరి మీద ఆగ్రహం కలిగితే పలుకుబడి స్థాయిని అనుసరించి విచక్షణ లేకుండా పాలనాధికార ప్రభావాన్నే ప్రమాణంగా తీసుకోవాలి. ఇవన్నీ ఎంతకాలం చేసినా ఈ మనుషుల మనసుల్లో స్థానం ఉంటుందా? తనకి ఎంతమంది గు రించి గుర్తుంది. తన మనసులో ఎందరున్నా రు. దైనందిన జీవితంలో నెగ్గుకురావడానికి ఎన్నో చెయ్యాల్సిఉంటుంది. అవన్నీ చెయ్యా కుండా నెగ్గుకురాకుండా ఓడిపోవాలా? శుష్క పిడి వాదనలను పట్టుకొని కూర్చుంటే ఎవడు ఏం చెయ్యగలడు? ప్రతీవాడూ నీతీ, నిజా యితీ గురించి మాట్లాడతాడు. వాడి నీతి, నిజాయితీల ప్రసక్తిరానివ్వకుండా ఎదుటివాడి గుణగణాల పట్టికనే చూస్తూంటాడు. ప్రతివాడి కీ ఎదుటివాడు నీతిమంతుడు అయివుండాలి. ఎందుకు? వీడు అవినీతిని సాగించడానికా?

నేటి పోటీ ప్రపంచం... నిజంగా మరో ప్రపంచం. ఇక్కడ జరిగే పోటీ అవినీతి స్థాయిలమీద, సంపాదనా వ్యామోహాలమీద.

డబ్బుకి కులం, మతం లేనేలేవు. తరతమ బేధాలు అసలే లేవు. ఆ డబ్బు సర్వసమాన త్వంగా, సర్వజనామోదితంగా, సర్వసహ నంగా విరాజిల్లుతుండగా దాన్ని కాదనుకొనేవా డు ఎవడు?

ఏ హోదా అయినా... పదవయినా... నైతిక పతనమయినా... మరేదయినా ఆ రెండ క్షరాల ఉదాత్తపదార్థం కోసం కాదా.

"వ్యక్తిత్వం ఉన్నతంగా ఎదిగిన సభ్యసమా జపు ప్రతినిధి'' ఓహ్ పదాలు గొప్పగా ఉన్నాయి. ఈ సమాజంలో నిజంగా అలాంటి వాడే ఉంటే వాడితో బ్రతుకు ఎంత దుర్భరం. ఆవేశ ఆశయాలు వేరు. జీవితగమన వాస్తవ మార్గాలు వేరు. గొప్పగా ఆశయాలు వల్లించిన వారే నేడు అధికారపీఠాల మీద కూర్చుని అరాచకశక్తులకు ప్రేరణగా ఉండటంలేదా? గట్టిగా మాట్లాడే వాడికీ, గూండాకీ, అధికార హోదాకీ భయపడే ప్రజలు ఎక్కువగా ఉన్న మన బలహీన సమాజంలో సభ్యసమాజాన్ని నెలకొల్పడానికి ఎంత స్థాయీ గూండా కా వాలి. ఛ... అందాలను చిందిస్తూ ఆస్వాదించ

డానికి ఆస్కారం కలిగిస్తూ ఆనందమయం చేసే ఆలి తనకి కావాలిగానీ, తన సౌందర్యం వెనుక మగవాణ్ణి హేళన చేసే ఆడది అసలు ఆడదే కాదు.

ఆ ఆలోచనల అనంతరం కృష్ణస్వామి మగతగా నిద్రలోకి జారుకొన్నాడు.



అన్నీ మరచి కృష్ణస్వామి రోజూ ఉండే పనుల్లో పడిపోతున్న సమయంలో ప్రసాదరావు, స్వామిని కలిశాడు.

సరదాగా మాట్లాడుతూ... "సార్ మీరు వచ్చిన కొత్తలో ఇక్కడి వాతావరణం బాగాలేదనీ... వేరే ప్రాంతానికి బదిలీకి రిక్వెస్ట్ చేస్తాననీ అన్నారు. ఇప్పుడా ఆలోచన వదులుకొన్నారా సార్' ప్రసాదరావు ఆలోచనగా అన్నాడు.

"లేదే... ఎప్పటికప్పుడు టైం దొరకడంలేదు. రిక్వెస్టు పెట్టుకోవాలి'' స్వామి నిదానంగా అన్నాడు.

"అదేంటి సార్ అలా అంటారు. మన డిపార్టుమెంటులో అంతా మీరిక్కడే సెటిల్ అయిపోతున్నారని అనుకుంటున్నారు. వయసులో కొంచెం పెద్దవాణ్ణి కాబట్టి చెబుతున్నాను. ఏ వయసుకి ఆ ముచ్చట ఉండాలి సార్. మీరు మరోలా అనుకోవద్దు సార్. అలాంటి విశేషమేమైనా ఉంటే చెప్పండి సార్. బ్రహ్మాండమైన ఏర్పాట్లు చేసేస్తాం.

హుషారుగా అంటున్న సి.ఐ. ముఖంలోకి సీరియస్‌గా చూశాడు ఎ.ఎస్.పి. సి.ఐ. ముఖం తెల్లబోయింది.

"సీ... మీరు వెళ్లి నా రిక్వెస్టు ట్రాన్స్‌ఫర్ లెటర్ టైపు చేయించుకురండి'' అంటూ లెటర్ పాడ్‌మీద కాగితాన్ని చింపి ఓ అప్లికేషన్ రాసి టైపుకోసం ఇచ్చాడు ఎ.ఎస్.పి. స్వామి.

తెల్లబోయినా కంగారుపడలేదు సి.ఐ. అలాంటివన్నీ ఆ శాఖలో మామూలే. క్షణాల్లో కోపం... మరో క్షణంలో అవసరం ఇంకో క్షణంలో అధికార దర్పం. ఏమున్నా ఆఖరికి అవన్నీ మోయాల్సిన భారం కిందివారిదేనన్న విషయం బాగా ఎరిగిన వాళ్లు వాళ్లకంటే ఎవరుంటారనేది అనుమానమే. ఆ పని అయిందనిపించి ఆ అధికార పరిధినుంచి దాటుకొని తన అధికార పరిధిలోకి వచ్చిన సి.ఐ. ప్రసాదరావు ఆలోచించాడు. ఒకరకంగా ఎ.ఎస్.పి. ట్రాన్స్‌ఫర్‌కోసం అప్లికేషన్ పెట్టుకోవడానికి తనే కారణమయ్యాడు. తనకు తెలిసి సాగుతున్న ఎ.ఎస్.పి. ఆకర్షణా వ్యవహారం ఒకవేళ బెడిసికొట్టినా తనవల్ల పెట్టిన ఆ అప్లికేషన్ అక్కరకు వస్తుంది అనుకొన్నాడు సి.ఐ. ఏదో ఒకటి రెండుసార్లు పార్టీలకీ ఆమెని కూడా ఆహ్వానించమని చెబితే ఇక నేను ఆమెకు దాసోహమన్నట్లుగా మాట్లాడుతున్నాడీ సి.ఐ. ఇలా అనుకొనే నోళ్లకు తాళం తన అప్లికేషన్ అనుకొన్నాడు ఎ.ఎస్.పి.

అయితే ఎవరేమనుకొన్నా అదే తన భవిష్యత్తును కాపాడే మహత్తరశక్తిగా మారుతుందని మాత్రం కృష్ణస్వామి కలలో కూడా ఊహించలేదు.

సరిగ్గా అది జరిగిన మూడు నెలలకు ఆ పట్టణపు నడిబొడ్డున నడిరోడ్డుమీద ఒక యువకుణ్ణి అతిదారుణంగా పొడిచి చంపారు. అక్కడికక్కడే అతని ప్రాణం అనంతవాయువుల్లో కలిసిపోయింది. ఆ వార్త విని ఎ.ఎస్.పి. అదిరిపోయాడు. సౌందర్య గుర్తుకొచ్చింది. ఆ యువకుడు సౌందర్య పనిచేసే కళాశాలలో ఓ





లెక్చరర్. బాగా చదువుకొన్నవాడు.

అతన్నెందుకు చంపారనే కారణం కంటే ముందుగా ఆ డెడ్‌బాడీని స్వాధీనపరచుకొని పంచనామా జరిపి పోస్టుమార్టానికిగాను పంపించాలి. ఆ పోలీసు బాధ్యతలను సి.ఐ. ప్రసాదరావు వహిస్తున్నారు. అతని వివరాలు చాలా కొద్దిగా లభించాయి. నిమ్నవర్గాలకు చెందినవాడు. తెలివైన లెక్చరర్. అతని వయసు, క్వాలిఫికేషన్లు, జాబ్‌లో చేరిన తేదీ ఇలాంటి వివరాలన్నీ అందుతున్నాయి. సానుభూతి పవనాలు కూడా వీస్తున్నాయి. కానీ ఎవరూ ఎలాంటి క్లూ ఇవ్వలేకపోతున్నారు. అంతకుముందే అతన్ని ఓసారి సౌందర్యతోపాటుచూశాడు కృష్ణస్వామి. అతని పేరు పంకజ్. చాలా అభిమానంగా పరిచయం చేసింది సౌందర్య. కొద్ది క్షణాల్లో నిలిచిన ఆ కలయిక ఇలాంటి చేదు అనుభవాన్ని తనకు మిగుల్చుతుందని స్వామి ఊహించలేదు.

ఆ హత్యకు మూడురోజుల ముందుగా సౌందర్య కుటుంబమంతా ఏదో పెళ్ళికి వెళ్ళారనీ, ఆ పెళ్ళి తిరుపతిలో జరుగుతోందని స్వామి తెలుసుకొన్నాడు. ఏదో అనుమానం అతన్ని ఆవహిస్తోంది. పంకజ్ వివరాలు చూస్తే నిమ్నవర్గాలకు చెందినవాడని స్పష్టపరుస్తున్నాయి. మరి సౌందర్య చాలా ఉన్నతవర్గం. ఎంతటి ఉన్నత కుటుంబమయినా, ఎంత చదివినా, స్త్రీ స్వేచ్ఛ ఉందనుకొన్నా, పరువు అనే అర్థంలేని పదంకోసం ఎంతైనా ప్రాకులాడతారు. కాలం మారినా మారని అనేక మూఢాచారాల్ని చదువుకొన్నవాళ్లు సైతం ఆచరిస్తున్న మన సమాజంలో ధనబలంలేని నిమ్న వర్గ మేధావికి గౌరవం లభిస్తుందా? ఏ వర్గమైనా ఉన్నతంగా మారాలంటే ఉన్న ఏకైక సాధనం డబ్బు. ఏ ఘనకీర్తినైనా కట్టబెట్టగల ఆ సాధనంలేనినాడు ఎంత ప్రతిభ ఉన్నా దాని విలువ ప్రశ్నార్థకమే. "కన్యావరయితే రూపం- మాతా విత్తం- పితాశ్రుతం- బాంధవాకుల మిలచ్ఛంతి అన్మయ్ మృష్టభోజనాసక్తుల్' అన్నట్టుగా సౌందర్య తల్లి అంగీకరించదు. ఆస్థులు... బాలెన్సులు... హోదాలు ఉండాలనుకొనే ఆ కుటుంబం పంకజ్‌ని సమ్మతించలేదు. సౌందర్య తండ్రి కంటికి కూడా ఆనడు పంకజ్. 'ఎవడా డర్టీ ఫెలో' అని తెగేసి మాట్లాడతాడు. అతనికున్న ధనబలం అలాంటిది. ఇక ఆ ఉన్నతవర్గం గురించి కృష్ణస్వామికి తెలియంది ఏమీలేదు. అవసరం అయితే అవతలవాడిని లేపేస్తారు. తమ మాటే నెగ్గించుకొంటారు. మనదేశంలో ఒక ఆడ, మగా, ఒకరివైపు మరొకరు కాస్త పరిశీలనగా చూసినాసరే ఏదో జరిగిపోతున్నట్లు ప్రచారం చేస్తూ సంతోషించేవారు ఎక్కడపడితే అక్కడే ఉన్నారు. సౌందర్యతో కొన్నిసార్లు కలిసినందుకే కృష్ణస్వామి, సౌందర్యల ప్రణయగాథలంటూ డిపార్టుమెంటు అంతా గుసగుసలు చెలరేగాయి. ఆ తర్వాత పెళ్ళి అంటూ ఊహించేసుకొన్నాయి.ఆపైన అవసరానికి వాడుకొని వదిలేసుంటాడనే వ్యాఖ్యానాలు విస్తృతంగా వ్యాపించాయి. తన సీనియర్లు కూడా పరోక్షంగా అలాంటి మాటలతో తన ఎదురుగుండానే వినోదించడాన్ని భరించడం తప్ప స్వామి ఏమీ చెయ్యలేదు. ఆ మాటలకు స్పందిస్తే ఏమవుతుందో బాగా తెలిసి చిరునవ్వులతో వాటిని భరించడం అలవరచుకొన్నాడు.

ఇవన్నీ స్వామి అనుమానాలను పెంచుతున్నాయి. ఆ కేసు విషయం దర్యాప్తుకు వెళ్ళిన సి.ఐ. ప్రసాదరావు ఇంకా తిరిగిరాలేదు. ఈ విషయంలో ఎక్కువ శ్రద్ధ తీసుకుంటే... ఒక రకమైన అపోహలు బయలుదేరతాయి. అలాగని పట్టించుకోకపోతే, ఏవో అనుమానాలు ధ్రువపడే అవకాశం కలుగుతుంది. మధ్యస్థంగా ప్రవర్తించాలి. అందుకే ఆచీ... తూచీ అడుగేస్తున్నాడు స్వామి.

రాత్రి తొమ్మిదవుతోండగా ఆదరాబాదరాగా వచ్చిన ప్రసాదరావు అందించిన వివరాలు స్వామిని కలవరపెట్టాయి. సౌందర్య బంధువర్గంలోవారే ఆ హత్య చేయించి ఉంటారనే



అనుమానాన్ని ప్రసాదరావు వివరణాత్మకంగా ముందుంచుతున్నాడు. ఆ బంధువర్గంతో సన్నిహిత సంబంధాలున్నది పోలీసు డిపార్టు మెంటులో తానొక్కడికేనన్న విషయం అంద రికీ తెలిసిందే.

పంకజ్‌తో ప్రేమ వ్యవహారం నచ్చని పెద్ద లు ఆ పని చేయించి ఉండవచ్చు. ఆ ప్రాంత మంతా అదే వార్త వ్యాపిస్తోంది. మనిషినుంచి మనిషికి చేరే సమాచారం చాలా వేగంగా సాగుతుంది. ఆ సాధనంకంటే బలమైన సమా చార ప్రసార సాధనం మరొకటి ఉండదనేది స్వామి నమ్ముతాడు. ఏదయినా ఆపవచ్చు గానీ, పర్సన్ టు పర్సన్ కమ్యూనికేషన్‌ని మాత్రం ఎవరూ నిరోధించలేరు.

ఆ ఉన్నత కుటుంబానికి స్వామి దగ్గరవాడ నే అంశం కూడా ఆ వార్తలో ఇరుక్కుపో యింది. "ఏదో ప్రేమవ్యవహారంలో పెద్దలమ ధ్య వివాదాస్పద పోటీ ఏర్పడటంవల్లా, పోలీ సుల అండదండలు వారికి పుష్కలంగా ఉండ టంవల్లా ఈ ఘాతుకానికి పూనుకొని ఉండవ చ్చుననేది స్థానికుల కథనం" అని మర్నాటి దిన పత్రికలో స్వామిని నిలువెల్లా ఒణికించే వార్తా వ్యాఖ్యానం ఒకటి అచ్చయి వచ్చింది:

స్వామి జీవితంలో ఓడిపోయాను అనుకొ న్న మొదటి క్షణం అది. బహుశా తన ఓటమికి చివరి క్షణం కూడా అదే.

స్వామిని ఉన్నతాధికారుల సమక్షంలో నిలి పిందావార్త. ఉన్నతాధికారుల సందేహాలకు ఓర్పుగా, వినమ్రంగా వివరణలిచ్చాడు స్వామి.

సౌందర్య తనకి పరిచయస్థులైన కుటుంబంలోని అమ్మాయి అన్నాడు. అనేక మంది పరిచయస్థుల్లో వాళ్లూ ఉన్నారన్నాడు. అనవసరంగా ఎవరో తనని ఇలాంటి అబద్ధపు ప్రచారంతో ఇబ్బంది పెడుతున్నారని ఆరో పించాడు. తనకి ఈ ప్రాంతంలోనే ఉండాలని లేదనీ, బదిలీ కోసం గతంలోనే రిక్వెస్టు చేశాననీ తేదీతో సహా చెప్పేశాడు.





ఎస్.ఐ ప్రసాదరావు కూడా స్వామికి అను కూలంగా గట్టి వాదనను ఉన్నతాధికారుల ముందుంచాడు. సామాన్యంగా పోలీసులతో మంచి సంబంధాలుండాలని పెద్ద వాళ్లంతా కోరుకొంటారనీ అలాగని వాళ్లు చేసే అక్రమాల ను ఎవరు సమర్థిస్తారని ప్రసాదరావు తన అనుభవాన్ని తెలియజేశాడు.

అన్ని కోణాల్లో ఆ వార్తను పరిశీలించి కృష్ణస్వామి మూడు నెలలు ముందుగానే అందించిన రిక్వెస్ట్ ట్రాన్స్‌ఫర్ అప్లికేషన్‌ని ధ్రువ పరచుకొని పోలీసుల అండదండలు అనే పద ప్రయోగానికి అభ్యంతరం చెబుతూ రిజా యిండర్ జారీ చేసి ఉన్నతాధికారులు కృష్ణ స్వామి రిక్వెస్ట్‌ని ఆమోదించారు.

ఆ రోజు స్వామి అధికార హోదానుంచి కిందికి వచ్చి ప్రసాదరావుని కౌగలించుకొన్నా డు. కానీ ఈ రోజు అదే ప్రసాదరావుని మృత్యువు కౌగలించుకోబోతోంది. హోదా పెరిగినా... పోలీసు బలగాలు కనుసన్నల్లో మెలిగినా తాను అలనాటి ఆప్తుడికి ఎలాంటి న్యాయం జరిపించలేని దౌర్భాగ్యపు పరిస్థితి ఎందుకు ఏర్పడింది. ఈ పరిస్థితిని ఛేదించి అరాచక శక్తులను అణచి తానొక శక్తిగా విజృంభించలేడా? దానివల్ల ప్రయోజనం? ఆ దౌర్భాగ్యపు పరిస్థితులను సృష్టించిన దుష్టశక్తు లు ఎలాంటివో స్వామికి తెలియని విషయంకా దు. అవి ప్రసాదరావుని ఎందుకు దెబ్బతీ శాయో అంచనా వెయ్యలేని అనుభవం లేనివా డూకాదు.

పదేళ్లపాటు ప్రసాదరావుని ఆ జిల్లాలో కాలు మోపకుండా చేయగలిగిన ఆ శక్తులు కాలగమ నంలో బలహీనపడ్డాయి. డి.ఎస్.పిగా మళ్లీ ఆ జిల్లాలో అడుగుపెట్టిన ప్రసాదరావు తనకి అనుకూలమైన రాజకీయ, అధికార వాతావ రణం ఏర్పడటంతో ఆ శక్తులను సమూలంగా అణగార్చే కఠిన చర్యలు తీసుకొన్నాడు. సమా జపరంగా అవి ప్రశంసలకు నోచుకున్నాయి. ఒకే రాత్రి గుడుంబా స్థావరాలు, మట్కా కేంద్రా లు, కేబరే పేరిట సాగే నగ్ననృత్యాలు, వ్యభి చార గృహాలు... అలా ఆ సంఘవిద్రోహకరశ

క్తుల శక్తి అంతా తునాతునకలయిపోయింది. అవన్నీ విడివడి ప్రాణాలరచేత పెట్టుకొని పారిపోయాయి. పోలీసులకు నైతిక బలం పెరిగింది. డి.ఎస్.పి ప్రసాదరావు ధైర్యాన్ని అందరూ పొగిడారు. పత్రికలు ప్రశంసలవర్షాన్ని కురిపించాయి.

ఆరు నెలల కిందట సాగిన ఆ సమాజోద్ధరణ కృషి ఫలితం ప్రసాదరావు నేడు అనుభవిస్తున్నాడు. చెదరిన దుష్టమూకలు అవకాశం కోసం ఎదురు చూసి కరుణాకర్ హత్యతో ముడివేసి ఈ ఘోరానికి పాల్పడ్డాయి.

ఇదంతా తెలుసున్నా తానేం చెయ్యగలడు. క్షణం క్షణం మారే రాజకీయపు విలువలు... నాయకుల అభీష్టాల ప్రభావాలు... వాటితోనే ముడిపడి ఉన్న తమ స్థానాలు. ఏ రకంగా ఆలోచించినా అంతా అపసవ్యమే. ముందుకు సాగాలంటే ప్రమాదాలను ఆహ్వానించడమే. నిత్యం ప్రమాదాల వలయాల్లో ఇరుక్కొని జీవించడం కుదిరే పనికాదు. ప్రసాదరావు తొందరపడకుండా ఉండాల్సింది. కానీ తొందరపడకపోతే మరెలాంటి ప్రమాదం పొంచి ఉందో. ఏ రకంగా ఆనాటి ఆ సమయంలో ప్రసాదరావు ఆలోచించాడు. ఏ పరిస్థితులు అతన్ని అలా ముందుకు తీసుకెళ్లాయి. అదంతా ఎవరు అంచనా వేయగలరు. ఒకవేళ అంచనాలు వేసినా అవి నిజాలు కాకపోవచ్చు. పాపం... ప్రసాదరావు ఎలా ఉన్నాడో.

స్వామి కళ్లు మూతపడ్డాయి.

★ ★ ★

బాల్యం ఎవరికయినా అపురూపమే. ఒకరికది పూలబాట. అందరికీ అలా ఉంటుందని ఎవరనగలరు?

ఒక కుటుంబంలోనే రకరకాల మనుషులుంటారు. ఒకరు మెల్లగా తమ అవసరాలు ఏర్పరచుకొంటారు. ఇంకొందరు ఏది కావాలో తెలియక తికమకపడి అందరినీ ఇబ్బంది పెడతారు. పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది అనేది పిల్లల విషయంలో, అన్ని సందర్భాల్లోనూ వర్తించదు. ఈనాటి సమాజాన్ని పరిగణలోకి తీసుకొంటే పిల్లలందరూ తెలివైనవారే. వారికి అవగాహన శక్తి విపరీతంగా పెరిగింది. వారి ఆలోచనలూ... విధానాలు అర్థం చేసుకొని తల్లిదండ్రులు మెలగాల్సిన కాలమిది. తాము తండ్రి దగ్గర నిలబడడానికే భయపడేవారమని నేడు పిల్లలకు చెబితే నవ్వుతారు. తండ్రితో సరదాగా మాట్లాడటం తప్పా? అనే వారి ప్రశ్న సమంజసమే కానీ పూర్వ పరిస్థితుల్లో తండ్రి పట్ల పిల్లలు ఎందుకు అంతగా భయపడేవారు? ఆ ప్రశ్న ఇపుడు అనవసరమైనా అలాంటి దృక్పథంతో పిల్లల్ని పెంచాలనుకుంటే ఆ పెంపకమే ప్రమాదకరం కావచ్చు. పిల్లలతో స్నేహపూర్వకంగా ఉండకతప్పదు. అత్యాధునిక ప్రపంచ విషయాలు వారు నేర్చుకొంటున్నారు. అర్థం చేసుకొంటున్నారు. సమాజంలో అన్నింటినీ పిల్లలు సునిశితంగా పరికిస్తున్నారు. వాటికి సంబంధించిన అనేక విషయాలు పెద్దలను సూటిగానే అడుగుతున్నారు. ఒకనాడు ఒప్పులుగా చెలామణీ అయిన ప్రవర్తనలు నేడు తప్పుగా మారిపోయాయి. అక్షరాలు రాకపోయినా, ప్రశ్నలకు సమాధానాలు చదవకపోయినా, లెక్కలు చెయ్యలేక వదిలేసినా ఆనాటి ఉపాధ్యాయులు పిల్లల్ని దండించేవారు. 'దండం దశగుణం భవేత్' అని నమ్మిన ఆ రోజులకు కాలం చెల్లింది. తల్లిదండ్రులు కోప్పడ్డారని ఇల్లు విడిచి పారిపోయిన పిల్లల ఉదంతాలు నేటికీ అనేకంగా ఉన్నాయి.

పట్టుమని పదేళ్లు కూడా లేని బాలిక అయిదో క్లాసు తప్పింది. చుట్టుపక్కలనున్న స్నేహితులు కొంచెం సరదాగా ఆటపట్టించారు. తల్లిదండ్రులు ఏవేవో సామ్యాలు చెబుతూ ఆ పిల్లను వెక్కిరించారు. విద్య రాని మనిషి వింత పశువు అన్నట్లుగా వర్ణించి తమ తెలివితేటలన్నీ ఆ చిన్ని పాపమీద ప్రయోగించారు. పరీక్ష పాస్ అవడం, తప్పడం అనే విషయాలను ఆమూలాగ్రం అర్థం చేసుకోలేని పెద్దలున్న మన సమాజంలో ఆ చిన్ని మెదడుపై అంత ఒత్తిడి భరించలేనిదిగా మారింది. అందరిచేతా

ఏదోరకంగా మాటపడటం కంటే చనిపోవడం మంచిదని ఆ పిల్ల భావించే స్థాయిలో పెద్దలు ప్రవర్తించారు. నేరుగా హుస్సేన్ సాగర్‌లో దూకేసింది. అంత తీవ్ర మనో వ్యాకులతకు ఆ చిన్నారి గురయిందంటే దానికి బాధ్యత ఎవరు వహించాలి?

విద్యావిధానంపట్ల సరైన అవగాహన కొరవడిన నేతల నేతృత్వంలో రూపొందుకొని శతాబ్దాలు మారే స్థితి వచ్చినా మారకుండా జటిలంగా, కఠినంగా విద్యావిధానాలు ఉన్నప్పుడు పిల్లలకి విజ్ఞానం అందించాలా, పరీక్షల్లో రేంకులు సాధించాలా ఇదో పెద్ద చర్చనీయాంశంగా అతిపెద్ద ప్రశ్నగా తల్లిదండ్రులకు తయారయింది.

ఈ విద్యావిధానంలో ఏ విద్యార్థి తన చదువుకి తగిన పని దొరుకుతుందని కనీసం ఊహించలేడు. ఉద్యోగాలకోసం చదువులు తయారవడంతో వాటినే ఆశ్రయించక వేరే దారిలేదు. సరైన కోచింగ్‌లు, వేలకువేలు ఖర్చు, ఆర్థికంగా బలం, పలుకుబడి ఇవే నేటి ఉన్నత విద్యాసాధనాలు. తెలివితేటలు, కష్టపడటం, మేధావిగా ఆలోచించడం వల్ల ప్రయోజనం కలగడం లేదు. ఇలాంటి పరిస్థితుల్లో ఏ విద్యార్థి ఏమవుతాడు అనే అంచనాలు ఉండటంలేదు. ఒకవేళ అలా ఆలోచించినా అవి తారుమారవుతున్నాయి. డబ్బు సంపాదనే ప్రధాన లక్ష్యం కాబట్టి చదువుతో నిమిత్తంలేని లోకరీతుల్ని అవగాహన చేసుకొని స్వంత లాభం చూసుకొంటే పైకి రావచ్చు అనే నమ్మకం పెరిగిపోతోంది. అందుకే అత్యధిక శాతం మంది స్వలాభానికి ఇచ్చిన విలువ మరే పనికీ ఇవ్వరు.

డి.ఐ.జిగా ఎదిగిన స్వామి ఒకనాటి సామాన్య విద్యార్థే. హత్యగావింపబడిన కరుణాకర్ కూడా మామూలు విద్యనే అభ్యసించిన విద్యార్థి. ఒకరు డి.ఐ.జి స్థానానికి ఎదిగితే మరొకరు ఆకస్మికంగా హత్యకు గురయ్యారు. తెలివితేటల విషయానికి వస్తే కరుణాకర్‌కంటే స్వామి ఏమాత్రం గొప్పవాడు కాదు. అధికార బలం డి.ఐ.జి హోదాకి ఉంది. వ్యక్తిగతంగా అంగబలం ఉన్న కరుణాకర్ అందులోనూ స్వామిని మించి ఉన్నాడు. ఆర్థిక బలం ఉన్నా అది తమకుతప్ప వేరే వారి విషయానికి అంగీకరించదు కనుక ఆ సంగతి వదిలెయ్యాలి. హోదా, అధికారం కరుణాకర్‌కి అందలేనివి. ప్రజల్లోకి చొచ్చుకుపోవడం, వారి మనిషిగా భావించబడటం స్వామికి చిక్కనివి. ఇద్దరూ ఒకే విద్యావిధానం తయారుచేసిన వ్యక్తులే. ఉన్న అవకాశాన్ని అనుసరించి అల్లుకుపోయినవాడు స్వామి, అవకాశాలను ఏర్పరచుకొని తన విధానాన్ని కొనసాగించగలిగిన నేర్పరి కరుణాకర్.

స్వామి కట్టుదిట్టమైన నియమాలున్న ఓ మాస్టారి కొడుకు. ఆశయాలు... ఆదర్శాలు అంటూ విద్యార్థులముందు ఉపన్యాసాలు ఉద్బోధించే ఉపాధ్యాయులకోవలోకి ఆ మాస్టారు రాడు. వాటిని వీలున్న విధంగా ఆచరిస్తూపోతూ వేరే వారి ప్రశంసలతో పనిలేకుండా ముందుకు సాగే ఓ ప్రవాహం ఆ తండ్రి. ఆ ప్రవాహం స్వామికి చిన్ననాడే ఏర్పడ్డ నైజాన్ని మార్చలేకపోయింది. అది ఆ ప్రవాహానికి అడ్డుకాలేకపోయింది. కానీ ప్రవాహంనుంచి పక్కకు తప్పుకొని చిన్న మొక్కనించి నేడు మహావృక్షమయింది. అవకాశవాదాన్ని సమర్థతగా రాణింపు తేవడానికి శాయశక్తులా పాటు పడుతోంది. అదే స్వామిని అనేకమెట్లు ఎక్కించింది. అధికారపు అందలాలలో ఓలలాడిస్తున్నది.

వాస్తవాలను నిర్భీతిగా నినదించే కరుణాకర్ చిన్నతంలోనే గడుగ్గాయిగా పేరు సంపాదించాడు. బాల్యంలోని అతని తెలివితేటలు అడవికాచిన వెన్నెల అయ్యాయి. ఆ తెలివి తేటల్ని ఉపయోగించుకొనే అవకాశం అతనికి కలగలేదు. పిల్లలు హుషారుగా, అల్లరిగా ఉంటే వాళ్లతో సమస్యలుంటాయని అందరూ భావిస్తారు. అనేక అల్లరి పనులు చేసే పిల్లలు చాలా తెలివైన వారని గుర్తించడం




సామాన్యమే అయినా వారిని హేళన చెయ్యడం, కించపరచడం, భయపెట్టడం తల్లి దండ్రులు చేస్తూనే ఉంటారు. ఆగడాలు చేసే పిల్లలు అవి ఎందుకు చేస్తున్నారు? అని ఆలోచించే తీరిక మన పెద్దలకు లేదు. వారిని చదువువంకనో, మరో వంకనో సదా విమర్శి స్తూంటారు. దానివల్ల వారి ఆగడాలు తగ్గవు. పెరిగి ఆ దారిలోనే వారు తెలివినంతా విని యోగిస్తారు.

ఆ కోవలోకే కరుణాకర్ కూడా వస్తాడు. బాల్యమంతా అత్త అజమాయిషీలో నడిచింది. చిన్నతనంలో జ్ఞానమేలేని పసిప్రాయంలో తల్లిని పోగొట్టుకొన్న కరుణాకర్‌ని మేనత్త చేరదీసింది. విద్యాబుద్ధులు నేర్పించడానికి చాలా కష్టపడింది. తల్లిలేదు, తండ్రి కూడా దూరంగా ఉన్నాడు. పిల్లలులేని మేనత్త గారాబం చేసింది. కరుణాకర్ తెలివితేటలు గమనించి చదువులోకి దించింది. బాగా చదివే వాడు. ఆ విషయంలో ఎవరూ ఆ కుర్రాణ్ని ఏమీ అనేవారుకాదు. అల్లరి అంటే మామూలుగాకాదు. ఆ గ్రామంలోని ఇతర కుర్రాళ్లంద రినీ పోగుచేసి దగ్గర్లోని కాల్వలో ఈదులాటలు, లాకుల దగ్గర జలకాలాటలు, కొబ్బరి తోటల్లో ధోంగాటలు, వేసవి కాలమంతా మామిడి చెట్ల మీద కోతికొమ్మచ్చిలు, పది కిలోమీటర్ల దూరంలోని ఓ మాదిరి పట్నాల్లో సినిమాలు, నాటకాలు, ఊర్లో ఏ సంబరమయినా... ఏ ఉత్సవం జరిగినా కరుణాకర్ లేకపోతే ఉత్సాహం కరువయ్యేది. అలా సాగింది బాల్యం, యవ్వనం వచ్చేవరకూ.

కరుణాకర్ చిన్నచిన్న విషయాలకు అసలు ప్రాముఖ్యం ఇవ్వని మనస్తత్వం ఉన్న వాడుకాబట్టి దూసుకువెళ్లాడు. చాటుగా విమర్శలు సాగినా అవి అతని ముందుకు రావడానికి జంకాయి. యువజనుల కేంద్రం అన్నాడు. ఆ యూత్ క్లబ్ హడావిడి చూసి గ్రామంలో అప్పటికే పాతుకుపోయిన రాజకీయ వాదులు కలవరపడ్డారు. యూత్‌క్లబ్ మీద విరుచుకుపడ్డారు. ఆ రాజకీయ నాయకుల మీద కరుణాకర్ తిరగబడ్డాడు. నేరుగా గ్రామ యువకులతో కలిసి ఉన్నత అధికారులను కలిసేవాడు. ఆరోగ్య శిబిరాలను గ్రామాలకు తీసుకెళ్లేవాడు. యూత్‌క్లబ్ భవనాన్ని అధికార సహకారంతోనూ, యువకుల శ్రమశక్తితోనూ నిర్మింపచేశాడు. గ్రామంలో చిన్నచిన్న సదుపాయలు ఏర్పరచడానికి పథకాలు వేశాడు. ఏ ఇంటిలో శుభకార్యాలు జరిగినా ఇంకేమయినా కార్యక్రమాలున్నా వంట పాత్రలకూ, టెంట్‌లకూ ఇబ్బంది అయ్యేది. యూత్‌క్లబ్ తరపున అవి కొనిపించి గ్రామ ప్రజలకు అద్దెకు ఇచ్చేవాడు. వారానికొక డాక్టర్ని తీసుకు వచ్చి ఉచిత సేవలు అందించేవాడు. దానికి పబ్లిసిటీ ఉండేది. అలా ప్రభుత్వ ప్రచారంతో ముడిపడి ఉన్న అనేక చిన్న పనులను అవలీలగా చేసేవాడు. రాజకీయాలపట్ల ఆసక్తి చూపించక పోయినా అన్నివర్గాలవారూ అతని సహకారాన్ని ఆశించేవారు. ఎవరునెగ్గినా అది కరుణాకర్ సహాయం అనుకొనేవారు. ఓడినవారు అతనిమీద కక్షగట్టేవారు. కానీ ఏనాడూ ఆ వర్గాలమధ్యకు కరుణాకర్ వచ్చేవాడుకాదు. ఎవరు ఎన్నిసార్లు ఒత్తిడి చేసినా రాజకీయాల్లోకి దిగేవాడుకాదు.

ఎవరూ ఊహించని మలుపు ఆ గ్రామంలో జరిగింది. అదే కరుణాకర్ మేనత్త భర్త హత్య.

ఆయనా, కరుణాకర్ స్కూటర్‌మీద ఆ గ్రామానికి వస్తూండగా దారిలోని చింతలతోపు దగ్గర ఎవరో వాళ్లమీద దాడిచేశారు. స్కూటర్ అదుపు తప్పిపడిపోయింది. చావచితక కొట్టారు. మేనత్త భర్త వృద్ధుడు కావడంతో ఆ దెబ్బలకు తాళలేక చనిపోయాడు. తీవ్రంగా గాయపడి చాలాకాలానికి గానీ కరుణాకర్ మామూలు మనిషి కాలేదు. మేనత్త అంతకు ముందే మరణించింది. పట్నానికి వైద్యం నిమిత్తం తరలించబడిన కరుణాకర్‌ని కల్యాణ్ ఆదుకొన్నాడు. క్లాస్‌మేట్ కావడం, కరుణాకర్ తెలివితేటలమీద అపారనమ్మకం ఉండటంతో అతన్ని ఇక ఆ గ్రామానికి వెళ్లవద్దని అడ్డుకొ

న్నాడు.

కరుణాకర్ జీవితంలో అదొక పెద్ద మలుపు. ఆగ్రామ చరిత్రకే అదొక దురదృష్టం. కానీ కాలంతోపాటు అందరూ అన్నీ మరిచిపోయి సాధారణ స్థితికి వస్తూండగా సంవత్సరాలు దొర్లిపోయాయి.

కరుణాకర్‌కు ఏం చెయ్యాలి? అనే ప్రశ్న తలెత్తింది.

ఉద్యోగాన్వేషణ ప్రారంభమయింది. కరుణాకర్ తెలివి ఆ ఇంటర్వ్యూలలో పనిచెయ్యలేదు. వాటికి కావలసిన ఇతర అర్హతలు అతనివద్ద కరువయ్యాయి. రెండు, మూడు చిన్న సంస్థల్లో పనిచేశాడు. అక్కడ ఇతని తెలివితేటల్ని వాడుకొనే అవకాశంలేక బయటకువచ్చాడు. తీవ్రవాదం అతన్ని ఆకర్షించలేదు. కానీ అసామాన్యంగా ఉన్న అతని ఆలోచనలు ఎందరినో ఆకట్టుకొన్నాయి. ఈనాటి పరిస్థితులతో ఒంటరిపోరాటం సాగించలేక నిరుత్సాహపడిన యువకులకు అతనొక సమాధానంగా కనిపించాడు. అతని మార్గాలు ఆమోదయోగ్యాలుగా భావించడమే సులభంగా అనిపించాయి. ఏ పనులకైనా సులభపద్ధతులు అనుసరించాలని కోరుకొనే సాధారణ ప్రజలు అతన్ని అనుసరించారు. అది ఓ వాస్తవ దృక్పథం. దాన్ని కాదంటే అవరోధాలు అధిగమించడం ఎలా?

కరుణాకర్ కూడా ఊహించలేనంతగా అతనిపట్ల ప్రజాదరణ పెరిగింది. అతని స్వభావం దానికితోడుగా నిలచింది. చాలా నెమ్మదిగా ఉంటాడు. అన్ని కోణాలనుంచీ సమస్యలను ఆలోచిస్తాడు. ఇరువైపులా తానే నిలచి పరిష్కార మార్గ నిర్దేశకుడవుతాడు. ఎవరైనా మన పనులు చేస్తానంటే కాదనలేము. ఓ వ్యక్తి అందునా తెలివైన మనిషి మన సమస్యల్ని పరిష్కరించడానికి దొరికితే వదలడం ఎవరికయినా అసాధ్యమే. ఎవరు ఏ పని ఉన్నా పక్కవాళ్లపై తోసి హాయిగా కాలం గడిపేయాలనుకొనే వాళ్లకి ఇదొక మంచి అవకాశం. కొంచెం ఖర్చయినా చాలు పనయిపోతే ఫర్వాలేదు అనే స్థితికి మనం ఏనాడో వచ్చాము. కారణాలు ఏవయినా మన పనులు ముందుగా జరగాలనుకొనేలా ఆలోచించకుండా ఉండలేము. రేషన్ దుకాణం దగ్గర క్యూలో నిలబడలేము. సినిమా హాలు దగ్గర ఏదోలా కష్టపడకుండా టిక్కెట్లు సంపాదించాలనుకొంటాము. మనపని మనకు మనం అనుకొన్న వెంటనే జరిగిపోవాలి. సాధ్యాసాధ్యాలు మనకి అనవసరం. వాటిని ఒక వ్యక్తి చూసుకొంటానంటే మనకి అంతకన్నా సుఖం ఎక్కడుంది. ఆ బలహీనతలే కరుణాకర్ నూతన కార్యక్రమ విధానాలకు సోపానాలయ్యాయి.

★ ★ ★

డి.ఐ.జి స్వామికి ఆఫీసులో ఆరోజు ముఖ్యమైన కార్యక్రమాలులేవు. ఉన్నతాధికారాల్ని సాధారణంగా జనం ఖాళీగా ఉండనివ్వరు. ఏదో ఉత్సవమనీ, మరేదోవార్షికోత్సవమనీ, ఇంకేదో ప్రారంభోత్సవమనీ అవన్నీ కాకపోతే దారుణాలు జరిగాయనీ వారిని పిలుస్తూంటారు. స్వామికి అవన్నీ అంతగా నచ్చకపోయినా, వివిధ కార్యక్రమాల్లో పాల్గొంటూనే ఫైళ్లను పరిశీలించడానికి ఎక్కువ సమయం కేటాయిస్తూంటాడు. అత్యవసర ఫైళ్లు ఏ రోజువి ఆరోజు కదిలిపోతూంటాయి. పెండింగు ఫైళ్లకి మోక్షం ఖాళీ సమయాల్లోనే ఉంటుంది.

డి.ఐ.జి సీటుకి ఎదురుగా పోలీసు క్రమశిక్షణలో నిలబడ్డాడు సి.ఐ. జగన్నాధరావు.

"ఏవిటి'' అన్నట్లు చూశాడు స్వామి.

"సార్... నా ఫైలు'' చాలా నెమ్మదిగా అన్నాడు జగన్నాధరావు చిరునవ్వులు చిందిస్తూ.

"మీ ఫైలు నన్ను చదవనివ్వరా! వివరాలన్నిటినీ నేను చూసి మరీ నిర్ణయం తీసుకోవాలా... వద్దా... ఫైలు నా దగ్గరకి రాకుండానే కంగారు పడతారేం! నిర్ణయం తీసుకొనేవరకూ ఆగలేరా. ఈ లోగానే ఎవరెవరి చేతో ఫోన్లు చేయిస్తుంటారు. వాళ్లమీదున్న నమ్మకం నా మీద లేదా మీకు. మీ విషయం




ఎవరెవరో నాకు చెప్పాలా?" డి.ఐ.జి స్వామి సూటిగా అడిగాడు. కొంచెం ఇబ్బంది పడ్డాడు సి.ఐ జగన్నాధరావు.

"సార్... అంతమాట అనకండి సార్! మిమ్మల్నే నమ్ముకొన్నాను. వాళ్లే మీకు గుర్తు చేస్తామంటూ ఫోన్లు చేశారు. అయ్యగారు ఆయనే చేస్తారు. అని నేను చెబుతూనే ఉన్నాను సార్. మాకు ఆయన బాగా తెలుసు అంటూ వాళ్లే చేశారుసార్! నన్ను అపార్థం చేసుకోకండి సార్. జీవితంలో ఒకే ఒక్క అవకాశం ఇది. మళ్లీ రాదు సార్. ఈ యూనిఫాం ఒంటిమీద లేకపోతే ఎవరూ పట్టించుకోరుసార్. మరో ఆరేళ్లలో రిటైర్‌మెంట్ సార్' ఫైలు చూస్తున్న స్వామికి జగన్నాధరావు వివరణ ఇచ్చాడు.

"చూడు జగన్నాధరావు మన డిపార్టుమెంట్‌లో మంచి పనేదన్నా జరుగుతూందంటే నాకంటే ఆనందపడేవారెవరుంటారు. ఏదోలా మంచి చెయ్యాలనే ప్రయత్నిస్తుంటాను. మీకు ప్రమోషన్ వస్తుందో రాదో నేను చెప్పలేను. అది మీకూ తెలుసు. కానీ ఈ అవార్డు ఇప్పించడానికి నాకేం అభ్యంతరం ఉంటుంది. ఇది మీకు రావడానికి నా వంతు ప్రయత్నం నేను చేస్తాను. మీకేదయినా సహాయం కావాలంటే నేరుగా నన్ను కలిసి అడిగితే బాగుంటుంది. మనం ఒకే డిపార్టుమెంట్‌లో చాలాకాలంగా పనిచేస్తున్న వాళ్లం. మీరూ సీనియర్ ఆఫీసర్. మనమధ్య రాజకీయ నాయకులు ఎందుకు? ఏమంటారు'' నవ్వుతూ చెప్పాడు స్వామి.

"యస్. సార్... సారీ సర్... మీ గురించి నాకు తెలీదాసార్... డాక్టర్ అనిల్ మర్డర్ కేసులో అసలు నేరస్థుల్ని పట్టుకొనేవరకూ మీరు నిద్రపోలేదుకదా సార్... మీరు ఎస్.పిగా ఉన్నప్పుడు నర్సయ్యనాయుణ్ణి చంపినవాళ్లను తరిమితరిమి పట్టారుకదా సార్... సారా బట్టీలను రెండు గంటల్లో మొత్తంగా ఎత్తించేశారుకదాసార్' హుషారుగా చెబుతూ పోతున్నాడు జగన్నాధరావు.

"సరే... సరే అవన్నీ ఎందుకూ మీ పని చేస్తానన్నానుకదా'' అన్నాడు స్వామి నవ్వుతూ. వాస్తవంలో అవి "ఇంకా మాట్లాడు'' అన్నట్లుగా అతన్ని ఉత్సాహ పరచటమే!

"సార్ మాలాంటివాళ్లకి మీతో మాట్లాడడానికి ఎపుడోగానీ అవకాశం రాదుకదాసార్. కాలం మారినా పరిస్థితులు ఎలా ఉన్నా... మనం చేసిన కొన్ని మంచి పనులు ఎపుడూ గుర్తుంటాయికదా సార్. డాక్టర్ అనిల్ మర్డర్ కేసు నేను ఎప్పటికీ మర్చిపోలేను. మూడు వేల రూపాయలకు డాక్టర్ని చంపేశారు. నర్సయ్యనాయుడ్ని వాళ్లవర్గం వాళ్లే నమ్మించి చంపారుకదాసార్. ప్రాణానికి ఏం విలువుంది. రెండువేలకీ మూడు వేలకీ కూడా గొంతులు కోసేస్తున్నారు. నేను సర్వీసులో చేరిన కొత్తల్లో ఎపుడో రెండు మూడేళ్లకు ఓ మర్డర్ కేసు గురించి ఇన్వెస్టిగేట్ చేసేవాళ్లం. ఇపుడు ఏ వి హత్యలు, ఏవి ఆత్మహత్యలు అనేవే సందేహాలుకదా సార్. ప్రస్తుతం మనిషి ప్రాణమే చాలా చీప్‌సార్. ఓ మనిషిగా నేనీ పరిస్థితికి బాధపడుతూంటాను. కానీ ఎవరేం చెయ్యగలరు సార్. మనుష్యుల మనస్తత్త్వాన్ని ఎవరు మార్చగలరు సార్'

చాలా సౌమ్యంగా చెప్పుకుపోతున్న జగన్నాధాన్ని ఆపే ప్రయత్నం చెయ్యకుండా అతన్నే చూస్తున్నారు డి.ఐ.జి స్వామి.

"సార్... మీ సమయం చాలా వృధా చేశాననుకుంటా. సారీసార్. ఇవన్నీ మామూలేగానీ సార్... పాపగారు ఎలా ఉన్నారు సార్. మెడిసన్ చక్కగా చదువుతున్నారా సార్' జగన్నాధరావు ఆగాడు.

పాప ప్రసక్తిరాగానే స్వామి పైకి కనిపించని ఇబ్బంది ఫీలయ్యాడు. "బాగానే ఉంది. సరే... ఫైలు సంగతి చూస్తాను. నాకు చేతనయిన సాయం తప్పకుండా చేస్తా'' అన్నాడు.

స్వామి హామీని అందుకొని సెల్యూట్ చేసి వస్తానని చెప్పి వెళ్లిపోయాడు జగన్నాధరావు.

జగన్నాథరావు ఫైలందుకొన్నాడు స్వామి. మహెూన్నత సేవా పతకానికి జగన్నాథరావుని రికమెండు చేస్తున్న అధికారిక ఫైలది. స్మగ్లర్లను చాకచక్యంగా పట్టుకొని వాళ్ల దగ్గర్నుంచి బంగారం స్వాధీనం చేసుకొన్నందుకు ప్రతిఫలంగా ప్రభుత్వం అందించే సేవాపతకం అది. వెయ్యి రూపాయలు ఇంక్రిమెంట్. స్వామి డి.ఐ.జి హెూదాలో తన రికమండేషన్లు రాసి ఫైలు డిస్పాచ్ ట్రేలో పెట్టారు.

ఆ ఫైలు నవ్వినట్లనిపించింది.

ఈలోగా ఆ ట్రే క్లియర్ అయింది.

స్వామి ఒక్కసారి కళ్లు మూసుకొని కుర్చీ వెనక్కి వాలారు.

జగన్నాథరావు స్మగ్లర్లను పట్టుకొన్నమాట ఎంతవరకు నిజం. అతను శిక్ష వేయించినవాళ్లు నిజంగా స్మగ్లర్లు కాదనే సంగతి ఎందరికి తెలుసు? స్మగ్లర్లు అంత తేలిగ్గా దొరుకుతారా? పట్టుబడినా పెద్దల ఆశీర్వాదంతో బయటపడరూ. చిల్లర దొంగలు స్మగ్లర్లు అయ్యారు. అసలు వాళ్లు పెద్ద మనుషులుగా ఉండిపోయారు.

బంగారం పట్టుకొన్న మాట నిజం. కానీ అందులో ఎంత ఎవరి పాలయిందీ తనకు తెలియదా! మూడు లక్షలకి కొంత బంగారాన్ని అక్కడికి అక్కడే అమ్మిన జగన్నాథరావు బుద్ధికుశలత ఎవరెరుగనిది. అసలువాళ్లని వదిలెయ్యడానికి జరిగిన బేరసారాలు డిపార్టుమెంటులోని ముఖ్యులకు తెలియకుండా ఎలా ఉంటాయి? ఏమయినా ఎంతోకొంత బంగారం ప్రభుత్వపరమయింది. ఎవరో ఒకరు స్మగ్లర్లుగా పట్టబడ్డారు. అంతకన్నా డిపార్టుమెంటుకి కావలసింది ఏముంటుంది. మహెూన్నత సేవాపతకానికి అర్హత అది చాలు. జగన్నాథరావు ఆ అర్హత అధికారికంగా ఉందనిపించుకున్నాడు. దానికి వ్యతిరేకంగా రాయడం ఎవరికైనా అనవసరం. వాస్తవాలు ఎపుడూ మరుగునపడిపోతాయి. వాటికి రూపం ఉండదు.

జగన్నాథరావు ఎంత తెలివైనవాడు. తనపనికోసం పెద్దలచేత చెప్పించుకొన్నాడు. స్వయంగా వచ్చి వినయాన్ని ప్రదర్శించాడు. అదంతా కాకుండా 'పాప' సంగతి ఎత్తాడు. అదెందుకు ఎత్తాడో స్వామికి తెలుసు.

అది నాలుగేళ్ల కిందటి విషయం.

ఆ సమయంలో జగన్నాథరావు ఒక్క తెలివైన వాదన మొత్తం సమస్యనే తనకు అనుకూలంగా మార్చివేసింది. పాప భవిష్యత్తు దెబ్బ తినకుండా కాపాడగలిగింది.

దానికి జగన్నాథరావు కోరుకొన్న ప్రతిఫలం చాలా చిన్నది.

తనకు తెలిసి ఎందరు దొంగసర్టిఫికెట్లు సృష్టించి స్వాతంత్ర్య సమరయోధులుగా చలామణీ కావడంలేదు? మరెందరో నిస్వార్థ స్వాతంత్ర్య సమరయోధులు వయోభారంతో బతుకీడ్చేమార్గమేలేక హీనాతిహీనంగా చావుకోసం ఎదురుచూడడంలేదు? ఇంకెందరు నకిలీ సర్టిఫికెట్లు సృష్టించుకొని ఉద్యోగాలు సంపాదించి వాటితోనే పైపైకి ఎదిగిపోవడంలేదు?

ఎవరికి అందుబాటులో ఉన్నది వాళ్లు అందుకొంటున్నారు. జగన్నాథరావు కూడా అదే చేస్తున్నాడు. అతని అవకాశాన్ని నీరుగార్చడంవల్ల ఎవరికీ ప్రయోజనం ఉండదు. ఓరకంగా అది మిగతావాళ్లకు మార్గదర్శకత్వం. ఆ అభిప్రాయం డి.ఐ.జి స్వామికి ఊరట కలిగించింది. కానీ మాసిపోని గతం మనిషిని వెంటాడుతూనే ఉంటుంది. ఆ గతం హృదయంలో సుళ్లు తిరిగినా, తెలియన బాధని సదా రేపుతున్నా మనిషి సర్దుకుపోవాలి. తన సంసారం... పిల్లలు... సంఘం... సంఘంలో పరపతి. అవినీతి ప్రధానావసరాలు. వాటిని దేనికోసం వదులుకోవాలి...

★ ★ ★

"కరుణాకర్‌ని ఎవరు చంపారు డేడీ'' తన చిన్నారి పాప కౌస్తుభ అడిగిన ప్రశ్నకు చివాలున తల ఎత్తి చూశాడు స్వామి.

"డైనింగ్ టేబుల్ దగ్గర అలాంటి విషయాలెందుకే. నీ కాలేజీ చదువు గురించి ఆయనకి





చెప్పొచ్చుగా'' వనజ అడ్డుపడింది.

"ఎప్పుడూ చదువు చదువు అంటావ్. ఇంటికొచ్చినా ఆ కాలేజీ బోర్‌నే తలచుకోవాలా'' కౌస్తుభ అడ్డంతిరిగింది.

"అవునే నీకంతా బోర్‌గానే ఉంటుంది. వేలకువేలు ఖర్చవుతున్నాయి. నువ్వు డాక్టరయినా నీ పెళ్లికి ఖర్చు తప్పదు. అది గుర్తుంచుకో' వనజ టాపిక్ మార్చే ప్రయత్నం చేసింది.

"అమ్మా... అవన్నీ ఇపుడనవసరం. డేడీ నేను అడిగింది తప్పా... ఎట్ ప్రజంట్ అదే కరెంట్ టాపిక్. ఈవిడగారు బయట జనంతో ఉండదు. అంతా హైక్లాస్ సొసైటీ కాబట్టి మామూలు మనుషులు పట్టించుకొనే విషయాలు ఆ లెవిల్‌కి రావు'' కౌస్తుభ తల్లి వ్యవహారాన్ని తర్కించింది.

స్వామి చిరునవ్వులు చిందిస్తూ డిన్నర్ చేస్తున్నా... భార్యని గమనించడం మానలేదు.

"అదేం మాట్లాడుతోందో దానికే తెలియడంలేదు. మీరలా నవ్వుతూండండి. అది ఇంకా ఏదో గొప్పగా ఫీలయి అనవసరమయినవన్నీ మాట్లాడుతుంది'' వనజ భర్తను నిలదీసింది.

"అమ్మా... నువ్వు కోపం తగ్గించి వింటే చెబుతానే'' కౌస్తుభ శాంతం పాటించింది.

"అమ్మా... అన్నావుగా... చెప్పు'' ఆ శాంతానికి పడిపోయింది వనజ.

"నేను మెడిసిన్ చదువుతున్నాను. డేడీ పోలీస్ డిపార్టుమెంటు, నువ్వు హైక్లాసు సొసైటీ మెంబరువు. నాకు అవసరం అనిపించినవి నీకు అనవసరం అనిపించవచ్చుకదా. ఎనీహౌ డేడీ ఒక్కమాట మాట్లాడారా... మనం మాట్లాడుకొంటూ ఉంటే ఇద్దర్నీ గమనిస్తున్నారు. అదే ఇంటెలిజెంట్ ఇన్వెస్టిగేషన్ ఆఫ్ అవర్ అయిడియాస్'' కౌస్తుభ తండ్రికేసి కళ్లెగరేస్తూ అంది.

"అదేంలేదులే పాపా! నన్నెందుకు మీ వాదనల్లోకి లాగుతావు. అమ్మ చెప్పిందీ ఓరకంగా నిజమే. ఇన్నేళ్లు నాతో గడిపింది. రోజూ ఏవో హత్యలూ... గొడవలూ మామూలేకదా! రొటీన్ అయిపోయి చిరాగ్గా అని పిస్తూంటుంది'' అని భార్యకేసి సాలోచనగా చూశాడు డి.ఐ.జి.

"దట్స్ ఆల్‌రైట్ డేడీ. బట్ కరుణాకర్ మర్డర్ చాలా దారుణమైంది. అతను ఏ పార్టీకీ చెందినవాడు కాదు. ఏ గొడవల్లోనూ ఉన్నట్లుగానైనా వినలేదు. చాలామందికి హెల్ప్ చేస్తూంటాడని అందరూ అనుకొంటూ వుంటారు. డేడీ ఈ రోజుల్లో ఒక మురికివాడలో ఉంటూ అక్కడి ప్రజల్ని సంస్కరించాలనే ఉద్దేశం ఎవరికి ఉంటుంది చెప్పండి? అతను పేదవాళ్లను పోషించడంలేదు. చక్కని గైడెన్సు ఇస్తున్నాడు. అది వాళ్లకు నచ్చుతోంది. దానివల్ల వేరేవాళ్లకు నష్టం ఏముంటుంది? ఇటీజ్ సమ్‌థింగ్ ఫిషీ'' గబగబా తన మనసులోని భావాలను బయటపెట్టింది కౌస్తుభ.

"నీ పాపా... పేదవాళ్లకి గైడెన్స్ ఇవ్వడంవల్ల కూడా కొందరికి నష్టం కలగవచ్చు. వాళ్లకు అన్నీ తెలిస్తే కొంతమందికి మనుగడ ఉండదు. అందువల్ల కూడా అతన్ని మర్డర్ చేసే అవసరం..."

కౌస్తుభ డేడీ మాటలకు అడ్డుతగులుతూ అంది "వాట్ డేడీ... మీరు జిల్లా పోలీసులందరికీ కంట్రోలింగ్ ఆఫీసర్. అలాంటివాళ్ళు ఎవరో తెలుసుకొని వాళ్లని అరెస్టుచేసి, హేంగ్ చేయించాలి'' ఆవేశంగా ఉన్నాయా మాటలు.

"డోంట్ గెట్ ఎక్సైటెడ్. అది మాకు తెలీదా? అదేపనిలో ఉన్నాంలే'

"దీన్ని కూడా మీ డిపార్టుమెంటులో చేర్చుకొంటే సరి. మీకు బాగా అయిడియాలు ఇస్తుంది'' వనజ అంటించింది.

"అందర్నీ చేర్చుకోరే అమ్మా... దానికి క్వాలిఫికేషన్లు ఉండాలి. ఇంకా ఫిట్‌నెస్ కావాలి. నన్ను ఏదో సినిమాలో హీరోయిన్‌లా ఊహించుకోకు. అలా రయ్‌మని జీపులో వెళ్లి




గూండాలని అదరగొట్టేసినట్లు మామూలు సీనియర్ పోలీస్ ఆఫీసర్లే చెయ్యరు. పదిమంది పోలీసుల్ని తీసుకొని ఒకడ్ని అరెస్టుచెయ్యడానికి వెళతారు'' నవ్వుతూ అంటోంది కౌస్తుభ.

"అవును అవన్నీ నువ్వు చెబితేనే నేను తెలుసుకోవాలిమరి..." అంది వనజ వ్యంగ్యంగా.

తల్లీకూతుళ్ల డిన్నర్ చర్చ సాగుతుండగానే డి.ఐ.జి. తనవంతు ముగించి ఎవరో విజిటర్స్ వస్తే చూడటానికి వెళ్లిపోయాడు.

"అమ్మా... ఎప్పుడూ నన్ను ఏదోరకంగా విమర్శిస్తూనే వుంటావెందుకూ?" కూతురు సూటిగా అడిగింది.

"ఒక్కమాట చెప్పనా కౌస్తుభా... పంతంపట్టి మెడిసిన్‌లో చేరావు. దానికెంత గొడవైందో తెలుసుకదా! ఏదో సీటు దక్కింది. అది పూర్తిచేస్తే అంతగొడవ పడ్డా ఫలితం దక్కింది అనిపిస్తుంది. ఎక్కడ ఇతర గొడవల్లో పడి నీ చదువు దెబ్బతింటుందేమోనని అలా మాట్లాడతాను. అంతేగానీ నిన్నేదో సాధిద్దామని కాదు'' వనజ తన అభిప్రాయం వెల్లడించింది.

"ఎప్పుడూ ఆ పాతగొడవే మాట్లాడతావు. అనవసరంగా వాళ్లు తొందరపడ్డారు. వాళ్లు చెప్పకపోయినా... నాకు ఆ ఆన్సర్స్ వచ్చు. నాకు మామూలుగానే సీటు వచ్చేది'' కౌస్తుభ నిదానంగా అంది.

"ఇపుడలాగే అంటావుమరి. ఎందుకంటే సీటు వచ్చింది కాబట్టి. నీకంటె చాలా తెలివైన వాళ్లు చాలా కష్టపడినా సీటు దొరకలేదు. మీ ఒక్క ఇన్స్‌టిట్యూట్‌కే డెబ్బైరెండు సీట్లు వచ్చాయి. మిగతాచోట్ల నాలుగయిదుకి మించి రాలేదు. ఎందుకంటావ్...?" వనజ అడిగింది.

"మంచి కోచింగ్ లేకపోవచ్చు. ఎక్కువ సీట్లు వస్తే అందర్నీ అనుమానించాలా'' కౌస్తుభ వాదనలోకి వచ్చింది.

"చూడు... ఇలాంటి వితండవాదన చెయ్యకు. ఆరోజు జగన్నాధరావే అడ్డం పడకపోతే మీ సీట్లన్నీ రద్దు అయ్యేవి. మొన్న సీతాకోచింగ్ సెంటర్‌లో అయినట్లు'' వనజ గట్టిగా అంది.

"సర్లే... వాళ్లు మరీ దారుణం. ఎగ్జామినేషన్ సెంటర్లో ఆన్సర్లు చదివేశారు. అందరూ అన్నీ కరెక్ట్‌గా టిక్ చేశారు. అందుకే నూటికి నూరుమందికీ సీట్లు వచ్చి మొత్తం వ్యవహారం బయటపడిపోయింది. మాదగ్గర అలా జరగలేదు. ఏదో సెవెన్టీ పర్సంట్ ఆన్సర్స్ చెప్పారు. మిగతావి మేమే ఆన్సర్ చేశాం. మాకు ఎనభైపర్సంట్ సీట్లే వచ్చాయి. అందరికీ అన్ని రాలేదు. అమ్మా ఆన్సర్లు అలా చదివినా, గబగబా టిక్ చెయ్యడానికి తెలివి వుండాలి. కొందరు కంగారుపడి ఒకదానికి బదులు ఒకటి టిక్ చేస్తారు. మావాళ్లు అలా ఆన్సర్లు చెప్పినా ఒక అమ్మాయి మొత్తానికి రాంగ్‌లు పెట్టింది. క్వశ్చన్ నెంబరుకీ ఆన్సర్‌కీ కన్‌ఫ్యూజ్ అయింది. తెలుసా?" కౌస్తుభ వివరించింది.

"అది మహా మొద్దయి ఉంటుంది. మీ సెంటర్లో ఎనభైమందికి సీట్లు వచ్చాయంటే చాలా ఈజీగా వచ్చాయనుకొంటున్నావా. ఒక్కొక్కళ్లూ ఇరవై వేలు ఖర్చుపెట్టారు. పైగా ఎవరో పేపరుకి ఎక్కించారు. అదో గొడవ. ఆ కంప్లెయింట్ ఇచ్చినవాణ్ని పట్టుకొని వాడికి కొంత పడేసి... పెద్దపెద్దవాళ్ల పిల్లలున్నారు కాబట్టి అల్లరి చెయ్యాలనే ఉద్దేశంతో ఆ కంప్లెయింట్ ఇచ్చానని వాణ్ణి ఒప్పించేసరికి ఆ జగన్నాధానికి తలప్రాణం తోకకి వచ్చింది. లేకపోతే నీకు సీటు వచ్చేది కాదు'' వనజ ధీమాగా అంది.

"చాల్లేవే... నాన్నని మెప్పించడానికి వాళ్లు అలా చేశామని గొప్పలు చెప్పుకొన్నారు. ఆ కంప్లెయింట్ ఇచ్చినవాడు రుజువు చెయ్యగలడా...? వాడిదగ్గర ఏ ఆధారం ఉంది. పోలీసులు భయపెట్టేసరికి వాళ్లు చెప్పినట్లు విని అలా మాట్లాడాడు. నిజంగా చెప్పాలంటే వాడి కంప్లెయింట్‌కి వాల్యూ లేదు. ఎవడికిబడితే వాడికి దొరికిపోయేలా చెయ్యడానికి మావాళ్లు

చేతకానివాళ్లు కాదు. సీటురానివాళ్లు ఉక్రోషంగా పేపరువాళ్లని పిలిచి నానా హంగామా చేశారు. దానిమీద ఎంక్వయిరీ జరిగిందిగా. అందులో ఏం బయటపడలేదు'' తేలిగ్గా కొట్టిపారేసింది కౌస్తుభ.

"ఏదోలే ఎలాగోలా సీటు దక్కింది. లేకపోతే ఆ ఇరవై వేలు గంగపాలే అయ్యేవి'' అంటూ లోపలికి వెళ్లిపోయింది వనజ.

విసురుగా తల ఆడించింది కౌస్తుభ. ఆమెకి ఆ టాపిక్ నచ్చలేదు. అసలా సంస్థలో చేరమని ప్రోత్సహించింది వనజే. మంత్రుల పిల్లలూ, రాష్ట్రంలోని ఉన్నతాధికారుల పిల్లలూ అంతా అక్కడే చేరారు. మన ప్రిస్టేజి అంటూ చేర్పించింది. అదో సీటు గ్యారంటీ వ్యవహారం. నిజానికి కౌస్తుభకి పరీక్షాకేంద్రంలో అలా జరుగుతుందని ముందుగా తెలీదు. తమందరికీ బాగా తెలిసున్న లెక్చరర్ పరీక్ష మధ్యలో వచ్చి ప్రశ్న నెంబర్లూ, వాటి ఆన్సర్లూ చదువుతూపోయాడు. అందరు విద్యార్థులతోపాటు తానూ వాటిని వింటూ ఆన్సర్ పేపర్ని గమనిస్తూ అంతవరకూ తప్పులున్న వాటిని సరిచేసి కరెక్టయినవాటిని అలాగే ఒదిలేసింది. వాస్తవానికి కౌస్తుభ చాలానే దిద్దింది. కానీ బయటకు వచ్చి అన్నీ కరెక్టుగానే రాశాననీ, అలా లెక్చరర్ వచ్చి చెప్పకపోయినా తనకు రాంకు గ్యారంటీ అని చెప్పింది. కానీ అసలునిజం ఆమెకు తెలియంది కాదు. అయినా ఎప్పుడో అయిపోయిన సంగతులు మాట్లాడుతూ అమ్మ తన మూడ్ పాడుచేసింది అనుకొంది కౌస్తుభ.

తన బెడ్రూంకేసి నడవబోతూ తండ్రి మాటలు విని ఆగిపోయింది. "అదెప్పుడోగానీ రాదు. వచ్చినప్పుడు దాన్ని సంతోషంగా ఉండనివ్వు. ఎందుకు దాంతో అనవసర చర్చలు. అది బాధపడుతుంది'' బెడ్రూంలోంచి స్వామి వనజతో అంటున్నాడు

"ఇప్పుడు దాన్ని నేను ఏమీ అనలేదు. అదేదో గొప్పలకి పోతోంటే కొంచెం ఆకాశంనుంచి భూమ్మీదకు దింపాను. అది పెద్దదయింది. ఇంకా చిన్నపిల్ల కాదు. రేపు డాక్టరవుతుంది. అపుడు పేషెంట్ని ముందు కూర్చోపెట్టుకొని వితండవాదనలు చేస్తే ప్రాక్టీసు ఉంటుందా... దీనికి తనకు సంబంధించిన విషయాలకంటె ఇతర విషయాలంటేనే ఎక్కువ ఇష్టం. మీరు అనవసరంగా దాన్ని..." కూతుర్ని గుమ్మంలో చూసి ఆగిపోయింది వనజ.

"నాన్న అనవసరంగా మాట్లాడితే ఊరుకోరు. ఏదో అందరికీ ఇంటరెస్టింగ్గా ఉందికదాని కరుణాకర్ మర్డర్ గురించి అడిగితే ఇంత గొడవ ఎందుకు చేస్తున్నావో నాకు అర్థంకావడంలేదు మమ్మీ. ఇకనుంచి నీవుండగా నేను ఏ విషయం ఎత్తను... మాట్లాడను... సరా?" అంటూ గబగబా నడుచుకొంటూ వెళ్లిపోయింది కౌస్తుభ.

ఆమె అలా వెళ్లిపోవడం డి.ఐ.జి స్వామికి ఎందుకో నచ్చలేదు. 'ఏమిటీ రభస' అన్నట్లుగా భార్యకేసి చూశాడు. "ఇందులో నా తప్పు లేనేలేదు. మీరలా చూడాల్సిన అవసరం లేదు'' అన్న భావనతో వనజ కళ్లు ఎగరేసింది.

ఆయన విసుక్కున్నట్లుగా కనిపించారు.

"మీ విసుగు నామీద అనవసరం" అన్నట్లు చూసి వనజ అక్కడనుంచి కదిలిపోయింది.

కౌస్తుభ బెడ్రూంలోంచి పాప్మ్యూజిక్ వినిపిస్తోంది.



రాజకీయ నాయకులకూ, అధికారవర్గానికీ




రకరకాల సంబంధాలుంటాయి. పోలీసు వ్యవస్థ కూడా రాజకీయంగా మారిపోయిందనడానికి అనేక ఆధారాలున్నాయి. అధికారంలోకి ఏ పార్టీ వచ్చినా ఆ పార్టీ సిద్ధాంతాలకు, వ్యూహరచనకూ, ఆచరణకూ పోలీసులు నడుంకడతారు. ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రభుత్వం ఎలాంటి కార్యక్రమాలు రూపొందించినా వాటిని అమలుచెయ్యాల్సిన బాధ్యత అధికార యంత్రాంగంమీదే ఉన్నది కాబట్టి తాము ఆ విధానాలు పాటించాలని ఉన్నతాధికారవర్గం భావిస్తుంది. ఏ పార్టీ ప్రభుత్వం ఏర్పడినా శాసనాధికారం ఉన్న ప్రజాప్రతినిధులను కలిసి తమ సహకారం అందించడానికి సంసిద్ధతను ఉన్నతాధికారులు వ్యక్తపరుస్తుంటారు.

త్రికరణశుద్ధిగా ప్రజాపరంగా ప్రయోజనకరమైన పనులు సాగించినంతకాలం ఎవరికీ ఎలాంటి సమస్య ఉండదు. స్వార్థ రాజకీయ ప్రయోజనాలకు ప్రజాసంక్షేమాన్ని, ప్రయోజనాలను దెబ్బతీస్తే ప్రజల్ని ఎవరు ఆదుకోవాలి? నాయకుల స్వార్థానికి బాసటగా అధికార యంత్రాంగం నిలవాలా....? నిజాయితీగా... నియమనిబంధనలకు లోటు రానివ్వకుండా నడవాలా...? ఇదే నేడు ఉన్నతాధికార వర్గాన్ని నిలువెల్లా కుదిపి కదిలించివేస్తున్న సూటి ప్రశ్న. శాసనాధికారులైన నాయకులకు ఎదురొడ్డి నిలిచే అధికారులెవ్వరు? వారి సంఖ్య బహు స్వల్పం. దానివల్ల వారికి అనుకోని నష్టాలు, ఊహించని సమస్యలు ఎదురవుతాయి. జీవితమంతా సుడిగాలిలా మారిపోతుంది. దానికి ఎందరు అధికార్లు ముందుకు రాగలరు? సాధారణ జీవుల్లాగే ఉన్నతాధికారులూ పాలకులనే ఆశ్రయిస్తున్నారు. తమ భవిష్యత్తును దిద్దుకొంటున్నారు. ప్రస్తుతం మన సమాజంలోని యధార్థ పరిస్థితులను గమనిస్తే రైతులు, రైతులు కారు. రైతుకూలీలు గర్జించే కాలం వచ్చింది. ఆ మార్పు కావాలనుకొన్నాం. వచ్చింది. సేవకుడు, అధికారి అనే భావనలు కనుమరుగయ్యే పరిస్థితులు మన ముందుకొస్తున్నాయి. ప్రభుత్వ కార్యాలయ వ్యవస్థలో అనూహ్యమార్పులు ఏర్పడుతున్నాయి.

ఎంతటి అధికారులైనా తమ వద్ద పనిచేసే వారిపట్ల అంతో ఇంతో సమభావంతో ఉండాలి. చాలామంది అధికారులు తమ ప్యూన్లమీద బాగా ఆధారపడివుంటారు. అధికారులకు ఎక్కువ సేవలు సమాచారం వాళ్ళే అందిస్తారు.

ప్రస్తుతం ప్రభుత్వ కార్యాలయాలు ప్రజలకు అనుగుణంగా పనిచేస్తున్నాయని చెప్పలేం. అధికారుల భావనలకు అనుగుణంగానే ఉంటున్నాయవి. అధికారులు 'సమర్థులు' కాని పక్షంలో అవి సమర్థులైన ఉద్యోగుల చెప్పుచేతల్లోకి వచ్చేస్తాయి. ఉన్నతాధికారులు సైతం ఆ ఉద్యోగులు చెప్పినట్లు వింటూంటారు. ప్రజాసమస్యలు, ప్రజాఅవసరాలు, ప్రజాభీష్టం అనే పదాలకు ప్రభుత్వ కార్యాలయాల్లో విలువలేని పరిస్థితులు నెలకొన్నాయి.

అలాగే పోలీసుశాఖలోనూ విలువలు ఎంతగానో మారిపోయాయి.

రాజకీయ నాయకులు తమ పరిధిలోని అధికారులంతా తమ మాటను ఆచరించే తమ వారుగానే ఉండాలని కోరుకుంటున్నారు. అలా లేనిపక్షంలో ప్రజల పనులను మేమే ఎలా చేయగలమని ప్రశ్నిస్తున్నారు. అనుకూలంగా ఉండే అధికారులనే వారు కోరుకొంటున్నారు. తమ మాట తూ.చా. తప్పకుండా వినేవారు కావాలంటే ఒత్తిడి తేవాలి. ఆ విషయంలో వారు దేనికీ వెనుకాడడంలేదు. అధికార యంత్రాంగం తమకు సహకరించడం లేదని బాహాటంగా ఆరోపణలు చేస్తున్న నాయకులే అధికంగా ఉన్నారు.

ఈనాటి సమాజంలోని నేరస్థుల జాబితాలు తీస్తే అందులో పలుకుపబడి గలవారికి సంబంధించినవారు ఎక్కువనేది పోలీసుల వాదన. నేరం చెయ్యకముందే అన్ని బలాలనూ క్రోడీకరించుకొని, పలుకుబడిని సంసిద్ధం

చేసుకొని యధేచ్ఛగా నేరాలు చేస్తూంటే ఎంతటి ఉన్నత పోలీసు అధికారి అయినా ఏం చెయ్యాలి? నేరం జరిగిందంటేనే పోలీసులు ఆ నేరస్థుల వాసన పసిగడతారు. వారిని వెంటనే మూసెయ్యాలని వారికీ ఉంటుంది. కానీ పలుకుబడితో పోటీపడి నెగ్గలేమని వారి అనుభవాలే రుజువుచేశాయి. అసాధారణ పరిస్థితుల్లో బలహీనుడు నేరం చేస్తే పోలీసులు ఆ నేరాలను విస్తృతంగా ప్రచారం చేస్తూ బలహీనులను బంధిస్తారు. చిన్న దొంగలు, దోపిడీ దొంగలు, గూండాలు, బీభత్సకాండ సృష్టించే భయానకవ్యక్తుల విషయంలో పోలీసులు అప్పుడప్పుడు కఠినంగానే ఉంటారు.

పేరొందిన రౌడీషీటర్ల విషయంలో రాజకీయ నాయకుల జోక్యం అంత ఎక్కువగా ఉండదని పోలీసులకు తెలుసు. రాజకీయనాయకులు ప్రధానంగా జోక్యం కలిగించుకొనేది ముఠాతగాదాల విషయంలోనే కాబట్టి వాటి విషయంలో చాకచక్యంగా ఉండడం పోలీసులకు వెన్నతో పెట్టిన విద్య.

రాజకీయ నాయకులకు పోలీసులు రక్షణకవచంలా ఉంటారనే విషయాన్ని పూర్తిగా అంగీకరించే వీలుకూడా లేదు. అలా ఉన్నట్లు భ్రమింపచేస్తారు. లేకపోతే పరిణామాల ప్రభావం వారికి తెలియంది కాదు. లోలోపల ఈ నాయకులపట్ల విరక్తి అనాసక్తి నిండుగా ఉంటాయి. వారి అధికారాన్ని సవాలు 'చేయ లేని స్థితిలోనే పోలీసులు నాయకులకు నమ్మకంగా ఉంటారు. నాయకుల సంపూర్ణ చరిత్ర పోలీసుల దగ్గర ఉంటుంధి. వారి కార్యకలాపాలు పోలీసులకు వివరంగా తెలుస్తాయి. బయటపడకుండా ప్రత్యర్థివర్గాలకూ, వైరివర్గాలకు ఆ సమాచారాన్ని అందించి వీరిని దెబ్బతీయగల సత్తా కూడా పోలీసులకు ఉంది. మామూలుగా అలాంటి సత్తాను పోలీసులు ఉపయోగించరు. అసాధారణ పరిస్థితుల్లో తమనితాము కాపాడుకోవడానికి మరో గత్యంతరం లేకపోతే మాత్రం అలా చెయ్యక తప్పదు.

డి.ఐ.జి. స్వామికి అలాంటి పరిస్థితి ఏర్పడలేదు. ఏర్పడే అవసరం రాదు. అతని సమర్థతకి విషమపరిస్థితులు ఎదురుకాలేవు.

చరిత్రలో ఎందరో పోలీసు అధికార్లు హతమయ్యారు. మతకలహాలు విజృంభించినప్పుడు, ఇతర తగాదాలు పెరిగినప్పుడు పోలీసులు పెద్దగా బలికావడం జరగదు. పెద్దఎత్తున జరిగే హింసాకాండల్లో సైతం పోలీసులు ఎక్కువగా మరణించడం ఉండదు. దానికి ప్రధాన కారణం పోలీసులు దళాలుగా సాయుధులై ఆ సంఘటనలు ఎదుర్కొంటారు. పోలీసు అధికారులపై జరిగిన అనేక అమానుషాలు వెలుగులోకి వచ్చినా, వాటిని పూర్తిగా పరిశోధించడం నేరస్థులను పట్టుకొని శిక్షంచడం అనే అంశాలు ప్రజలముందుకు రాలేదు. వాటి విషయం పోలీసులకు పూర్తిగా తెలియదని భావించడం అజ్ఞానం కిందకే వస్తుంది. పోలీసులకూ, రాజకీయ నాయకులకూ తగాదాలు ఏర్పడటం చాలా అరుదు. నాయకులు చెప్పిన పనులన్నీ పోలీసులు వారికి అనుకూలంగానే చెయ్యాల్సి ఉంటుంది. వాటికి ప్రతిఫలం కూడా పోలీసులకు వెంటనే అందుతుంటుంది. నాయకుల పరపతి, అర్థబలం పోలీసులకు ఉపయోగపడతాయి.

ఇలా పనులు చేసిపెడుతున్న పోలీసులు ఏ విషయంలోనైనా నాయకులకు అనుకూలంగా పనిచెయ్యలేకపోతేనే వివాదం ఏర్పడుతుంది. వేరేవిధమైన ఒత్తిడి మూలంగానో, ప్రజాందోళన పరంగానో పనులు ఆగినప్పుడే ప్రమాదాలు ఏర్పడతాయి. నాయకులు పోలీసులను వేధించడం ఆ సమయాల్లోనే ఆరంభమవుతుంది. అంతవరకూ వారందించిన సేవలన్నీ మరుగునపడతాయి. అధికారుల బ్రతుకులే అలా ఉంటాయి. ఉన్నతాధికారుల, నాయకుల మాటనే ఆదేశాలుగా భావించి వ్యవహరించే అధికారులకు సమస్యలు ఉండవు. ఉన్నతాధికారుల ఆదేశాలు, నాయకుల అభీష్టాలు పరస్పరం విరుద్ధంగా ఉన్నప్పుడు పోలీసు యంత్రాంగం అవస్థల పాలవుతుంది. తామరా




కుపై నీటిబిందువులా నడచుకోగల అధికారు లకు సమస్యలు అంటవు. కొన్నిసార్లు నియమ నిబంధనలను తప్పనిసరిగా పాటించాల్సి ఉంటుంది. నాయకులకూ ఆ సంగతులు తెలుసు. కానీ వారు కూడా కనుసన్నలలో మెలిగే అనుచరవర్గాన్ని కాదనలేరు. ఆ అనుచరవర్గం నియమనిబంధనలను అతిక్రమించినా తమ ప్రాబల్య ప్రదర్శనకోసం వారిని వారించకుండా ఊరుకుంటారు. అదే పోలీసులకు పరీక్షా సమయం. ప్రభుత్వ కార్యాలయాల్లో ఏ చిన్న సంఘటన జరిగినా అది దావానలంలా వ్యాపిస్తుంది. పనులన్నీ ఆగిపోయి ఉద్యోగులందరూ ఆ సంఘటన గురించే మాట్లాడుకోవడం సాధారణ విషయం. ముఖ్యంగా ఏ కార్యాలయంలోనైనా ఉన్నతాధికారి అందులోనూ ఆఫీస్ హెడ్ బదిలీ అయితే అది ప్రధాన చర్చనీయాంశమవుతుంది. కొత్త బాసు వివరాల సేకరణ కార్యక్రమం కూడా మొదలవుతుంది. పోలీసుశాఖలో మాత్రం ఈ వాతావరణం భిన్నంగా ఉంటుంది. ఏ సంఘటనైనా గుంభనంగా ఉంచుతారు. తమ శాఖకు సంబంధించిన విషయాన్ని బయటకు రానివ్వరు. చర్చించినా ఆసాంతం బయటకు వెళ్ళగక్కరు. వారి కోపం, బాధ, ఆవేశం, అసహ్యం, సంతోషం అన్నీ చేతల్లోనే చూపిస్తుంటారు.

ఆనాడు పోలీసుల్లో సంచలనం కలగడానికి ప్రత్యేక కారణం ఉంది. అసలు విషయం గోప్యంగా ఉండి పోలీసులను కలవరపెడుతోంది. పోలీసు వ్యవస్థ ఇలా దిగజారిపోతే తమ విలువ మరీ పడిపోయి ప్రజలకు తామంటే జుగుప్సాకరమైన అభిప్రాయం ఏర్పడుతుందని ఆ వార్త తెలిసిన వారంతా అనుకొంటున్నారు. ఇప్పటికీ ప్రజలకు భయం తప్పించి తమపట్ల నమ్మకం, విశ్వాసం లేవు. రాజకీయాల్లో పైకి రావడానికీ, ఆపైన తమ స్థానాన్ని కాపాడుకోవడానికీ కట్టుబానిసల్లా పోలీసులను ఉపయోగించుకొనే నాయకులు ఆవిధంగా ప్రవర్తించడం క్షమించరాని నేరం. ఇలాంటి విషయాలు వదిలేస్తే రేపు పోలీసు శాఖ ఉనికికే ప్రమాదం. తగిన గుణపాఠం చెప్పితీరాలి.

పోలీసుల్లో ప్రతీకారజ్వాల రేగింది. ఆ జిల్లాలోని దాదాపు అన్ని పోలీసుస్టేషన్లకూ ఆ వార్త పాకిపోతోంది.

డి.ఐ.జి. స్వామి తన ఆఫీసుగదిలోకి ప్రవేశించారు. ఆయన మనసూ ఉడికిపోతోంది. కానీ ఆ ఉడుకుతున్న మనసు ఏ భావాన్ని ఆయన ముఖంమీదకు రానివ్వడంలేదు. జరిగిన సంఘటన విస్మరించరానిది. ఏదో ఒకటి చెయ్యాలి? ఏం చెయ్యాలి?? బాధ్యతాయుత అధికారిగా ఈ సంఘటనను ఎలాగోలా మరిపింపచెయ్యాలా... లేక ప్రతీకార చర్యకు రెచ్చగొట్టాలా?

'ఏం కాదులే' అని వదిలేస్తే మొత్తం తన డిపార్టుమెంటే తనంటే అసహ్యాన్ని పెంచుకొంటుంది. చొరవచేసి ఆ సంఘటనలకు బాధ్యులైనవారిని అరెస్టు చేస్తే పోలీసులు అధికార దుర్వినియోగానికి పాల్పడ్డారంటూ పాలకులే తనమీద ధ్వజం ఎత్తే అవకాశం ఉంది. పాలకులకు ఎదురుతిరగాలా... తమ పోలీసు శాఖ నైతికబలాన్ని కాపాడాలా?

డి.ఐ.జి. స్వామి చల్లని నీళ్ళు తాగి కుర్చీలో వెనక్కువాలి కళ్లు మూసుకొన్నాడు.

ఆయన చెవుల్లో అంతకుముందు వినిపించిన దారుణమైన బూతులు పెద్ద స్థాయిలో వినపడుతూ మనిషిని మొత్తం కుదిపేస్తున్నాయి. మరి, వినడానికే బాధాకరమైన ఆ పరుషపదజాలాన్ని భరించిన ఎస్.పి. మనసు ఎంతలా రగులుతోందో???

ఆ ఉదయం ఎయిర్‌పోర్టు దగ్గర జరిగిన ఒక దురదృష్ట సంఘటనలో ఎస్.పి. మనసుని హత్యచేసి అతని వ్యక్తిత్వాన్ని కాలరాశారు. రాజకీయ గర్వాంధకారంతో పోలీసు ఉన్నతాధికారి అధికారిక ప్రవర్తనపై దాడిచేశారు.

ఎవరు???



ఆ ప్రశ్నకు ఏ ఒక్కరూ పెదవి విప్పడం లేదు.

ఒక వి.వి.ఐ.పి. పర్యటన. ఎయిర్‌పోర్టులో ఆయనకు స్వాగతం సత్కారం. అధికారంలో ఉన్న మంత్రిమండలి సభ్యులూ- మాజీ మంత్రులూ... శాసనాధికారం ఉన్న ప్రముఖులూ... ఎందరో పెద్దలు విమానాశ్రయానికి తరలివచ్చారు.

ఉన్నత పోలీసు అధికారుల ఆదేశాలను అనుసరించి ఆ వి.వి.ఐ.పి. దిగిన విమానం దగ్గరికి అయిదారుగుర్నే తప్ప పంపరాదు. ఆ బాధ్యత ఎస్.పి.కి అప్పగించారు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆదేశాలను అమలు చేయకతప్పదు. ముందుగానే అయిదుగుర్ని నిర్ణయించారు. అందరికీ ఆ ఆదేశాల గురించి వివరంగా తెలియజేసి, వి.వి.ఐ.పి. విమానం దగ్గరకి వెళ్ళవలసిన వారిని ముందువరసలోకి తీసుకువచ్చారు.

ఆ విమానం ఎయిర్‌పోర్టులో లేండు అవడంతోనే తొక్కిసలాట ప్రారంభమయింది. పోలీసులు జనాన్ని అదుపు చేస్తున్నారు. ఆరుగురు పెద్దలూ పూలమాలలతో విమానంవైపు కదలుతున్నారు.

ఆ సమయంలో నలుగురు యువనాయకులు ముందుకు దూసుకువచ్చారు. ఆ పెద్దలని ముందుకు వెళ్ళమని చెప్పి ఆ యువనాయకుల ముందుకు వచ్చాడు ఎస్.పి.

"ప్లీజ్... రెండు నిమిషాలాగండి... వాళ్ళిక్కడికి వస్తారు'' అన్నాడు ఎస్.పి.

"మమ్మల్ని ఏవనుకొంటున్నారు. తీవ్రవాదులమా...? దోపిడీదొంగలమా...? మేమూ వెళ్ళాల్సిందే వెళదాం రండిరా'' అని అరిచారు, వారిలో ఒకరు.

ఆనాడు పోలీసు డిపార్టుమెంటులో సంచలనం రేగింది. అది సర్వత్రా వ్యాపిస్తోంది. ఆ సంచలన విషయాన్ని మోసుకొచ్చిన మొదటి వ్యక్తి కానిస్టేబుల్ గురవయ్య. ఓ రకంగా ఆ సంఘటన పోలీసులందరికీ కోపం కలిగించింది. అది క్రమంగా పెరుగుతోంది. ఆ విషయంలో ఏదో ఒకటి చెయ్యాలనే నిశ్చయం బలపడుతోంది. కానిస్టేబుల్స్... హెడ్సూ... ఇతర సిబ్బందీ ఆసక్తిగా... ఆవేశంగా ఆ సంఘటననే తమలో తాము చర్చించుకొంటున్నారు. కొందరు కోపాన్ని ఆపుకోలేని వారు కొంచెం ముందుకెళ్ళి ఆ సంచలనానికి కారణమయిన వారిని సెల్‌లోకి తోసి చావగొట్టాలన్నారు. అయితే అవన్నీ ఆచరణ పెట్టాలంటే పై అధికారుల ఆదేశాలు కావాలి.

సాధారణంగా పోలీస్ స్టేషన్లలో హడావిడిగానే ఉంటుందిగానీ ఆసక్తి చాలా తక్కువ. కేసులు వందల సంఖ్యలో నమోదవుతూంటాయి. ఎన్నెన్నో తగాదాలు పోలీసుల దృష్టికి వస్తుంటాయి. తగాదా అయినా ఆఖరి దశలోనే వారి స్థాయికి వస్తుంది. మనదేశంలోని ఏ రాష్ట్రంలోనైనా నూటికి ఎనభైశాతం పైగా తగాదాలు పోలీసుల పరిధిలోకి వెళ్ళవు. తప్పనిసరి పరిస్థితిలో వెళితే తగాదాపడిన ఇరువర్గాల అర్థబలం, పలుకుబడి మాత్రమే పోలీసుల్ని రంగంలోకి దించుతాయి. పార్టీల నాయకుల స్థాయినిబట్టి పలుకుబడి పోలీసు డిపార్టుమెంటుమీద పనిచేస్తుందనేది నిజం. ఈ విషయాలమీద పరిశోధనలు జరిపినవారు పలుకుబడి ప్రసక్తి లేనిచోట మాత్రం అర్థబలానికి ప్రాముఖ్యం ఉంటుందని స్పష్టంగా పేర్కొన్నారు. సాక్షులు... వాదనలు... సామాజికన్యాయం ఆవైపే మొగ్గుచూపుతాయనేది సాధారణ సత్యం.

"మనల్ని ఆపడం తప్ప వీళ్లకి మరోపనేం లేదనుకొంటా... నడవండిరా ఎవడడ్డం వస్తాడో చూద్దాం" మరొక అరుపు.

"ఏంచేస్తార్రా... అరెస్టు చెయ్యమను. భయపడతామా? ఇలాంటివి ఎన్ని చూళ్ళేదూ! గాడిద..." ఇంకొకడు ప్రేరేపించాడు

వాళ్ళూ... వాళ్ళతోపాటు మరో పాతికమందీ ముందుకు కదలడానికి ఉద్యుక్తులయ్యారు.

ఎస్.పి. వాళ్ళని వారించాడు.

వాళ్లు వినలేదు.

వాళ్ళని ఆపడానికి పోలీసు ఆఫీసరుగా తనకుండే అధికారంమేరకు ఆయన చేతిలోని చిన్న కర్రని అడ్డుగా పెట్టాడు.

ఆ కర్రని ఓ మాజీమంత్రి కొడుకు లాగిపారేశాడు.

ఎస్.పి. ముందుకు తోసుకురాబోతున్న ఆ గుంపుని తన చేతులతో ఆపడానికి ప్రయత్నించాడు.

ఆ చేతులను వెనక్కువంచారు. ఆ ఎస్.పి. కాలరుపట్టారు. టోపీని లాగి దూరంగా విసిరారు.

ఆ క్షణంలో ఎస్.పి.ని వారు తిట్టిన కఠినపరుష పదజాలానికి ఏ కొంచెం పౌరుషం ఉన్నవారైనా ఆ క్షణమే తిరగబడి ఉండేవారు. పోలీసు వ్యవస్థకే గర్వకారణంగా వ్యవహరించేవారు. ఆ అసభ్య, అనాగరిక ప్రవర్తన పెద్దలందరిముందూ జరిగింది. కానీ ఏ ఒక్కరూ పెదవి విప్పలేదు.

వి.వి.ఐ.పి. కనుసన్నలలో మెదలాలనే




కాంక్షతో అటువైపు ఎవరికివారు కదలిపోయారే తప్ప ఎస్.పి.ని పట్టించుకొన్నవారు లేరు. ఆ ఎస్.పి.ని పక్కకు తోసేసి ముందుకు వెళ్ళిపోయిన యువరాజకీయనాయకులు వి.వి.ఐ.పి.కి జేజేలు పలుకుతూ సమీపంలోకి వెళ్ళి ఆయనకు ఆనందాన్ని కలిగిస్తున్నారు.

అవమానభారంతో, కోపావేశంతో రగిలే ఆ ఎస్.పి. దగ్గరకు చాలా దూరంనుంచి వచ్చి చేరిన మొదటివ్యక్తి డి.ఐ.జి. ఆయనకు ఎస్.పి.ని ఓదార్చే సమయం కొన్ని క్షణాలు మాత్రమే చిక్కింది. ఆ వెంటనే ఎస్.పి.తోసహా కర్తవ్య నిర్వాహణకు నడుం కట్టాల్సివచ్చింది. ఆ వి.వి.ఐ.పి. పర్యటన ముగిసేంతవరకూ ఈ విషయాన్ని తలపోయడానికి క్షణం వీలుదొరకలేదు. విషయం మాత్రం పోలీసువర్గాలకు మైక్రోవేవ్ న్యూస్‌కంటే వేగంగా చేరిపోయింది. ఏ పోలీసు అధికారిని చూసినా, ఏ కానిస్టేబుల్ మొఖం కనిపించినా ఆ కళ్ళల్లో ఈ విషయంలో ఏం చేద్దాం" అనే చూపులే తగిలాయి.

అలాంటి విషమ పరిస్థితుల్లోనే స్వామి 'సమర్థతకు' పనిపెడతాడు. ఆ అకృత్యం చేసిన పెద్దల కొడుకులపై చర్య తీసుకోవడం జరిగేపని కాదని డి.ఐ.జి. స్వామికి బాగా తెలుసు. అది చాలా ప్రమాదం కూడా.

"అధికారం ఉందికదాని రాజకీయ ప్రముఖులమీద దాన్ని ప్రయోగిస్తే అది ఆ అధికారానికే సవాలుగా మారి తన భవిష్యత్తు అగమ్యగోచరం అవుతుంది. అలా అని మౌనంగా ఊరుకొంటే ఎస్.పి. తనని చాలా హీనంగా భావిస్తాడు. ఎన్నో విషయాల్లో తనకి అడ్డుపడ్డ ఎస్.పి. మొన్నటి కరుణాకర్ హత్యను కూడా తప్పుదారి పట్టించాడనే సంగతి తెలియంది కాదు. కరుణాకర్ అనుయాయుల్ని తెగనరికిన వాళ్లు ఆ ప్రముఖులకు సన్నిహితులే. తనకి అవమానం జరిగిందికదాని ఆ కేసుని తిరగ తోడనూ లేడు. డి.ఎస్పీ ప్రసాదరావుపై అక్రమంగా దాడిచేసి చావుదెబ్బలు కొట్టిన వాళ్ళని పట్టుకోగలిగిన తెలివితేటలున్న ఎస్.పి. ఆ పనీ చెయ్యలేదు. అవన్నీ చేయలేనివాడు ప్రస్తుతం ఈ సంఘటనలో ఎలా స్పందిస్తే మటుకు ప్రయోజనం ఏముంటుంది. అతనికి ఒక సమస్య మాత్రం తప్పనిసరిగా ఉంటుంది. రేపట్నుంచి అదే వ్యక్తుల మొఖాలను చూస్తూ తన అవమానాన్ని క్షణక్షణం గుర్తుంచుకొంటూ మధనపడాలి.

ఆ బాధనుంచి తానిప్పుడు ఎస్.పిని తప్పించాలి. ఈ జిల్లానుంచి వెంటనే బదిలీ చేయించాలి. ఓ రకంగా అతనికీ సమస్య ఉండదు. మరోరకంగా తనకున్న కొద్దిపాటి ఆటంకాలు తొలగిపోతాయి'' అలా సాగాయి డి.ఐ.జి. స్వామి ఆలోచనలు.

వెంటనే డి.ఐ.జి. జిల్లా ఇన్‌చార్జి మంత్రితో మాట్లాడాడు. ఆ మంత్రి ఓ మెట్టు కిందికి దిగి ఆ యువనాయకులచేత డి.ఐ.జి. సమక్షంలో ఎస్.పి.కి క్షమాపణలు చెప్పిస్తాననన్నాడు.

డి.ఐ.జి., ఎస్.పి. జిల్లా ఇన్‌ఛార్జిమంత్రి సమక్షంలో ఆ యువనాయుకులు రాజకీయ కుశలతను అనుసరించి క్షమార్పణ అయిందనిపించారు. ఆ మంత్రి వారిని కసురుకొన్నారు. విసుక్కొన్నారు. మందలించారు. అది అర్థం చేసుకొన్న యువనాయకులు బయటకు వచ్చి నవ్వుకొన్నారు.

ఆ తర్వాత వారంరోజులకే ఎస్.పి.ని బదిలీ చేశారు.

ఎస్.పి. బదిలీ డి.ఐ.జి. స్వామి తన సమర్థతకు గెలుపుగా భావించారు. కానీ తమ శాఖపట్ల గౌరవం ఉన్న పోలీసు సిబ్బందిమాత్రం స్వామి నైతికపతనానికి అదొక తార్కాణమని అనుకొన్నారు. అయితే ఆ సిబ్బంది గళం పైకిరాదు. ఎన్నో నిజాలు వారి గుండెల్లో మండుతున్నా... అవి వారి మనసుల్ని పట్టిపీడిస్తున్నా... వారి హృదయానరేగే ఆక్రోశం మాత్రం గొంతు దాటిరాదు. ఆ గుండెల్లోనే అలిసిపోయేలా తల్లడిల్లి నిద్రపోతుంది.

మనిషి తన సమర్థతను ఏరకంగా భావించుకొన్నా- నిజాలు మాత్రం అగ్నికణాల్లా

మెదడుని మండిస్తూంటాయి. ఎస్.పి. వ్యవహారం అలా ముగిసింది. మరి రేపటిరోజున అలాంటిదే తనకే జరిగితే...?

ఆ ప్రశ్న స్వామి ఊహించలేనిదేం కాదు. జవాబులేని ఆ ప్రశ్నను నిద్రపుచ్చడానికి వేడెక్కిన మనసుని మత్తులో దింపడానికి నాలుగు పెగ్గుల విస్కీ ఆయన గొంతులోంచి గుండెలోకి జారుకొంది.



కరుణాకర్ అనే యువకుడు హతుడయ్యాడు సరే! అతని హత్య ఎలా జరిగింది? ఎవరు చేశారు?

ఈ విషయాలను క్రమక్రమంగా పోలీసులూ, ప్రజలూ, అతని సన్నిహితులూ చర్చించడం తగ్గించారు. దైనందిన కార్యక్రమాల్లో నిమగ్నమయిన ప్రజానీకానికి మరుపు ఎక్కువ. కానీ ఒక యువతరం ప్రతినిధి దారుణంగా చంపబడితే ఆ హత్య వ్యక్తిగతమా...? సమాజపరమా...? సమాజంలోని వాస్తవ పరిస్థితులు అవగాహన చేసుకొని తదనుగుణంగా ముందుకు సాగిపోవాలంటే నేర్పు, చతురత, ఓర్పు ముఖ్యం. అన్నిటికంటె ప్రధానమైనది లౌక్యం. రాజకీయాలు సజావుగా సాగాలంటే అవరోధాలు ఉండకూడదు. ఎలాంటి చిన్న అవరోధం ఎదురైనా దానిని సమూలంగా అణచివెయ్యడం రాజకీయ సోపానానికి మూలసూత్రం. ప్రత్యర్థి పెరగరాదు. తనంతటివాడు మరొకడు ఉండరాదు. ఇదే నేటి రాజకీయాలను రణరంగంగా మారుస్తున్న అంశం.

కరుణాకర్ గురించి డి.ఐ.జి. స్వామికి తెలియని విషయం లేదు. కరుణాకర్ రాజకీయాల్లోకి ప్రవేశించే అవకాశం ఉందని స్వామి అనుకోవడమూ జరిగింది. కొన్ని సంఘటనల ఆధారంగా పోలీసులు వ్యక్తులను ఖచ్చితంగా అంచనా వేయగలరు. ఆ జిల్లాలో కరుణాకర్ పెద్ద నాయకుడు కాదు. అంతటి అర్థ, అంగబలాలు, కుటుంబ పలుకుబడి అతనికి లేవు. ఎక్కడినుంచో రావడంవల్ల స్థానికంగా పట్టు సంపాదించడం అంత తేలికయిన పనికాదు.

కరుణాకర్ హత్యకు ఆరునెలల ముందు ఒక బస్సులో ప్రయాణిస్తున్న ఇద్దరు వృద్ధ నాయకులను దారుణంగా చంపేశారు. అదే బస్సులో కరుణాకర్ కూడా ఉన్నాడు.

ఆ ఇద్దరు వృద్ధ నాయకులు ఒకనాడు జిల్లా రాజకీయాల్లో ప్రముఖులు. రాజకీయాలు మారుతూండటంతో వారు అస్త్రసన్యాసం చేశారనే చెప్పుకోవాలి. వారి కొడుకులుమాత్రం వ్యాపారాలు ఏర్పరచుకొన్నారు. ఆపైన బాగా ఆర్జించి రాజకీయాలకు అండగా నిలిచారు. రాజకీయ నాయకులు అన్నిరకాలుగా బలపడడానికి మంచి అండ చూసుకొంటారు. వారికి అనేకవర్గాల ప్రముఖులతో ఆంతరంగిక మైత్రి ఉంటుంది. ఎవరుగానీ నాయకులుగా తయారవడమంటూ జరగదు. సమస్యలను ఆసరాగా చేసుకొని కొందరు నాయకులుగా ముద్రించబడతారు. నాయకత్వం సమస్యల్లోంచి పుట్టుకొస్తుంది. ఎవరూ ముందుకు రాని ఆ రోజుల్లో ఎవరు బాధ్యత వహిస్తారో వారిమీదే అంతా ఆధారపడుతుంది. ప్రారంభంలో ఏ నాయకుడికైనా అనేక సమస్యలు తలెత్తడం పరిపాటి. ఆపైన అనుభవాలు పాఠాలు నేర్పుతుంటాయి. చాలామంది వెనకుండి రాజకీయాన్ని నడపాలని ఉబలాటపడతారు. రాజకీయ నాయకుల్ని, ఇతర నాయకులనూ తమ గు




ప్పిట బంధించాలని ప్రయత్నిస్తుంటారు. తమ వ్యాపారాలు, లావాదేవీలకూ ఎవరూ అడ్డం రాకుండా ఉండటానికి నాయకులను పెంచిపో షిస్తూ పనులు నెరవేర్చుకొంటారు.

ఆ కోవకు చెందిన ఈ మాజీ నాయకుల కొడుకులు పరోక్షంగా రాజకీయం చేస్తున్నారు. ఆ రాజకీయాలు భరించలేనివర్గం వారిమీద కక్షకట్టింది. అదను చూసుకొని ప్రత్యర్థులను కూడగట్టుకుంది.

హైదరాబాద్‌లో పనులు చూసుకొని తిరిగి తమ పట్టణానికి వస్తున్న ఆ నాయకులను మార్గమధ్యలోనే బస్ ఆపి అతి దారుణంగా గొడ్డళ్లతో నరికేశారు. దానికి ప్రత్యేక కారణా లంటూ ఏవీలేవు. కొడుకుల పరోక్ష రాజకీయా లు ఆ వృద్ధ నాయకులను బలిగొన్నాయి.

వృద్ధులను నరకడానికి ఎవరికి చేతులు వస్తాయి? డబ్బు! దానికోసం ప్రాణాలు తీస్తు న్నారు. మనుషుల్ని కొట్టడానికి, కొట్టించడానికి డబ్బుంటే చాలు. ఎవరి ప్రాణాన్నయినా డబ్బుకోసం దారుణంగా తీసెయ్యడానికి వెను కాడని నరహంతకులు ఎక్కడైనా ఉంటారు.

ఆ ఘాతుకాన్ని కళ్ళారా చూసినా ప్రతిఘ టించలేని సాధారణ జనం మధ్యలో నిలిచిన కరుణాకర్ ఏమీ చెయ్యలేకపోయాడు. ఒంటరి గా ఎవరూ అడ్డుకోలేని క్రూరత్వం అది. అయిదుగురు గుర్తుతెలియని వ్యక్తులు ఒక చిన్నకారులో రోడ్డుకి అడ్డంవచ్చి బస్సుని ఆపివేశారు. అకస్మాత్తుగా అప్పటికే నిద్రలో వున్న ప్రయాణీకుల్లోంచి ఆ వృద్ధ నాయకుల ను బస్సు బయటకు తీసుకువెళ్లి గొడ్డళ్లతో చంపేశారు. ఆ వెంటనే వారు చీకట్లో కలిసిపో యారు. అదంతా క్షణాల్లో జరిగిపోయింది. ప్రయాణీకులు మత్తు వీడి వాస్తవంలోకి వచ్చే సరికే ఆ కారు ఎటో దూసుకుపోయింది. ఆ ముసలి నాయకుల ప్రాణాలు అనంతవాయు వుల్లో కలిసిపోయాయి. కరుణాకర్ నిద్రావస్థ లోంచి బయటపడి వాస్తవం పరికించేసరికి అంతా అయిపోయింది. ఆ దారుణానికి ద్రా న్పడిపోయిన ప్రయాణీకులందరూ భీతావహు లయ్యారు. సమాజంలో నిత్యం జరిగే దారుణా లు వినడం... పత్రికల్లో చదవడం సాధారణ మైన విషయమైనా కళ్లఎదురుగా రాక్షసంగా సాగిన ఆ అమానుషం వారి హృదయాలను కలచివేసింది.

ఆపైన పోలీసులు రావడం, ప్రయాణీకుల ను వివరాలు అడగడం అన్నీ జరిగిపో యాయి. ఆ దారుణం జరిగిన విధానం సవివరంగా పోలీసులకు తెలిసినా ఆ దుర్మార్గు లను పట్టుకోవడం ఎలా? ఎవర్ని అనుమా నించాలి?

కరుణాకర్ ముందుకొచ్చి దుండగులను తాను గుర్తించగలనన్నాడు. అదెప్పుడు జర గాలి...? వారెవరో పోలీసులు గుర్తించాలి. న్యాయవ్యవస్థకు అప్పగించాలి. సాక్షి కింద కరుణాకర్ రావాలి. న్యాయస్థానంలో వారిని గుర్తించాలి. ఈలోగా వారు ఎన్నివిధాలుగా తప్పించుకోగలరో అందరికీ తెలిసున్న సర్వ సాధారణ విషయం.

ఆ సంఘటన తర్వాత ఆ వృద్ధ నాయకుల కొడుకులు కరుణాకర్‌ని కలిశారు. రాజకీయా లు క్షుణ్ణంగా తెలుసున్నవారు కరుణాకర్‌తో స్నేహం పెంచుకొన్నారు. కరుణాకర్ రాజకీ యాల్లోకి దిగితే తప్పక తమ సహకారం లభించగలదనే నమ్మకాన్ని పెంచారు.

కరుణాకర్ ఏం చెయ్యనున్నాడనే ఆలోచన డి.ఐ.జి. స్వామికి ఆనాటినుంచీ పెరిగింది. జిల్లాలోని రాజకీయవర్గాలు... పరస్పర విద్వే షాలు... వాటికున్న బలాలు స్వామికి తెలి యని సంగతులు కావు. కొన్ని వర్గాల్లో కరుణా కర్‌మీద కలవరం ఉన్నదనే విషయం కూడా స్వామికి తెలుసు. జిల్లా రాజకీయ కార్యకలా పాలను తక్కువగా అంచనా వెయ్యకూడదన్న స్వామి భావనలు బయటకురావు. ఎక్కడో ఒకచోట హాయిగా ఉద్యోగం చేసుకొంటూ బతుకీడ్చక ఈ వ్యక్తికి ఈ వ్యవహారాలెందుకు అని కూడా స్వామి చాలాసార్లు మనసులోనే అనుకొన్నాడు. కానీ ఆ ఆలోచనలు అలాగే

ఉండిపోయాయి.

★ ★ ★

'కరుణాకర్ కేసులో మలుపు'

'కోలుకొంటున్న డి.యస్.పి.'

పత్రికల్లో వచ్చిన ఆ విషయం పోలీసువర్గాల్లో కొంతమందికి ఆనందం కలిగించింది. కొత్తగా ఆ జిల్లా ఎస్.పిగా పదవీబాధ్యతలు స్వీకరించిన రంజిత్ దినపత్రిక చూస్తూ "జయా" అని గట్టిగా పిలిచాడు.

"వస్తున్నా... ఏం కావాలి?" భార్య జయ అడిగింది.

"ఆ ఫోను ఇలా తీసుకురా" భార్యకేసి నవ్వుతూ చూస్తూ అడిగాడు.

"తెల్లవారలేదు. ఇంకా చీకటిగానే ఉంది. అపుడే మొదలయిందా డ్యూటీ" జయ కూడా నవ్వుతూనే అంది.

"చీకటిలోనే తప్పులు జరుగుతాయి. దోపిడీలు... హత్యలు... మానభంగాలు... పట్టపగలు చేస్తారా...!" భార్యను క్రీగంట చూస్తూ ఫోనందుకుని నెంబరు డయల్‌చేశాడు.

"వద్దులెండి... ఆ విషయాలు నాకెందుకు గానీ ఈ క్వార్టర్స్‌లో గడ్డి చాలా పెరిగిపోయింది. ఎవర్నయినా పంపి తీయించెయ్యాలి. రెండువారాల్లో మన పాప వస్తోంది. అదసలే తుంటరిపిల్ల. ఆ గడ్డిలోకి పోతూంటుంది. ఏ పురుగు..." ఆమె చెబుతూండగానే అవతల ఎవరో లైనులోకి వచ్చారు. భార్యని ఆగమని చేతితో సౌంజ్ఞ చేసి "ఎస్.పి. రంజిత్ హియర్" అన్నాడు.

భర్త వినిపించుకున్నాడనే నమ్మకం కుదిరాక జయ లోపలికి వెళ్లిపోయింది.

"చూడండి! ఆ కరుణాకర్ ఫైలూ... డి.ఎస్పీ ప్రసాదరావు ఫైలూ వెంటనే తీసుకురండి. క్విక్" అని ఫోను పెట్టేసి మళ్లీ దినపత్రికలు చూడటం ప్రారంభించాడు.

కరుణాకర్ హత్యకూ... డి.ఎస్.పి మీద దాడికీ సంబంధం ఏమిటి?

కరుణాకర్ అనే వ్యక్తికి ఎవరితో సంబంధాలున్నాయి?

అతన్ని ఎందుకు హత్యచేశారు?

ఆ వెంటనే కరుణాకర్ మనుషులే డి.ఎస్.పి.ని గాయపరిచారని ఒక దినపత్రిక రాసింది. మరో దినపత్రిక కరుణాకర్ వర్గంమీదకు ఆ దాడిని నెట్టారనీ, నిజానికి వేరేవాళ్లు పాత కక్షలతో ఆ దారుణానికి పూనుకొన్నారనీ రాసింది. ఆ దినపత్రికలు పరస్పర విరుద్ధ వివరాలను అందిస్తున్నాయి. ఆ వివరాలను పరిశీలించిన ఎస్.పి. రంజిత్ తన విధానంలో అంచనాలు వేస్తున్నాడు.

ఈలోగా ఒక సి.ఐ. ఫైళ్లు పట్టుకొని వచ్చాడు. అతన్ని గౌరవంగా పేరు పెట్టి పిలిచి, వయసులో పెద్ద కాబట్టి మర్యాదగా 'కూర్చోండి' అన్నాడు రంజిత్.

ఆపైన టీ వచ్చింది. ఎస్.పి. రంజిత్ స్వయంగా తన చేతులతోనే సి.ఐ.కి టీ అందించాడు. ఆ క్షణంలో ఆ సి.ఐ.కి ఎస్.పి. రంజిత్‌పట్ల ఆరాధనాభావం పొంగిపోయింది. తన శాఖలోని ఓ ఉన్నతాధికారి అంత గౌరవంగా, ఆప్యాయంగా చూడటం నిజంగా పోలీసుశాఖలోనే ఒక వినూత్నమార్పు. అది ఇటీవలికాలంలో కొంతమంది ఉన్నతాధికారులు ఆచరిస్తున్న మంచి సంప్రదాయం.

"ఈ కరుణాకర్ ఎవరండీ" రంజిత్ కుతూహలంగా అడిగాడు.

"అతనో సోషల్ వర్కర్ సార్. చిన్న స్కూలు నడిపేవాడు" సి.ఐ. ప్రశ్నకు మాత్రం జవాబిచ్చాడు.

"సోషల్ వర్కర్ అంటే ఏం చేసేవాడండీ"

"ఏంలేదు సార్.. బేక్‌వర్డ్ క్లాసెస్ ఏరియాలకు వెళ్లి వాళ్లకు అప్లికేషన్లు ఎలా పెట్టుకోవాలి? లోన్లు ఎలా తెచ్చుకోవాలి? మధ్యవర్తులతో సంబంధం లేకుండా ఇళ్లస్థలాలు... ఇళ్లు ఎలా ఏర్పరచుకోవాలి? అనే విషయాలు చెప్పేవాడట సార్"

"అందులో తప్పేముందండీ. మన నాయ





కులు మురికివాడల్లో ఓట్లకోసం తిరుగుతారు గానీ వాళ్లకి అవసరమైన విషయాలు పట్టించుకోరు. ఓరకంగా అతను మంచిపనులే చేసేవాడన్నమాట"

"అంతేసార్! ఆ గుడిసెల్లో ఏదో చిన్నగా బడులు పెట్టి పిల్లలకి అక్షరాలు నేర్పే ప్రయత్నం చేశాడు సార్. ఇప్పుడు అక్షరక్రాంతి పథకం వచ్చిందికదాండి! కలెక్టరుగారు కూడా అతన్ని మెచ్చుకొని అతనికీ... అతని కూడా ఉన్న కుర్రాళ్లకీ చాలా సాయంచేశారు సార్" సి.ఐ. తనకు తెలిసిన వివరాలు ఏకరువు పెడుతూపోయాడు. ఆ చర్చ చాలా సేపు సాగింది. ఎస్.పి. కుర్చీలోంచి లేస్తూ అన్నాడు

"సి.ఐ.గారూ! ఆ కరుణాకర్ చాలా సిన్సియర్‌గా అనిపిస్తున్నాడు. అలాంటివాడిని హత్య చేసే అవసరం సాధారణంగా ఎవరికి ఉంటుందంటారు!"

రంజిత్ ప్రశ్నకు సి.ఐ. ఉలిక్కిపడ్డాడు. ఆ ఉలికిపాటును పైకి ప్రదర్శించకుండా నిదానంగా నిలబడి "అదేసార్ అందరికీ ఆశ్చర్యం. రాజకీయ కక్షలు లేవు. అతనికి ఎవరితో తగాదాలు లేవు. ఎవరో బందిపోట్లు అతని ఇంటిమీద దాడిచేసి ఇల్లంతా చిందరవందర చేసి దొరికింది దోచుకుపోయారు. కరుణాకర్... ఇంకా అతని మనుషులు అడ్డంపడితే చంపేశారని తెలిసింది సార్. అదే ఎఫ్.ఐ.ఆర్.లో రాశారు సార్. నేను అప్పట్లో సెలవులో ఉన్నాను సార్. ఈ కేసు డీల్ చేసింది సి.ఐ. రాజారాం సార్" చాలా నేర్పుగా రంజిత్ ప్రశ్ననుంచి తనని తాను తప్పించుకొన్నాడు సి.ఐ.

"ఎవరు డీల్ చేసినా విషయం తెలుస్తుంది కదాండి. ఇది జిల్లానీ, రాష్ట్రాన్ని కూడా షేక్ చేసిన మర్డర్‌కదా" ఎస్.పి. మళ్లీ అతన్ని తన ఉచ్చులోకి లాగడానికి ప్రయత్నించాడు.

"ఏంలేదు సార్! ఆ సమయంలో పెద్ద పర్సనల్ గొడవలో ఉన్నాను సార్. అందుకే సెలవు కూడా పెట్టాను. కొద్దిగా తెలిసినా వివరంగా చెప్పలేనుకదా సార్! రాజారాం ఆ కేసు పూర్తిగా డీల్ చేశాడు సార్" సి.ఐ. అనుభవం నేర్పిన పాఠంనుంచి కొంత నేర్పరితనం చూపించాడు.

ఎస్.పి. పైకి కనిపించకుండా చిన్నగా నవ్వుకున్నాడు. అతనికేసి ఓసారి చూసి "సరే... ఓసారి రాజారాంగారితో నన్ను కలవమని చెప్పండి. అర్జెంట్‌గా అక్కర్లేదు..." అంటూ 'ఈ విషయం అని మీరు చెప్పకపోతే బాగుంటుంది' అనేవిధంగా చూశాడు.

"ఎస్ సార్..." అని సెల్యూట్‌చేసి వెళ్లిపోయాడు ఆ సి.ఐ.
వెళ్లాల్సివస్తే 'అక్కడ అలా ఉండాలి... ఇలా ఉండాలి' అని ముందే హెచ్చరికలు చేస్తూంటారు.

ఎస్.పి. రంజిత్ ఆలోచనలలో పడిపోయాడు.

★ ★ ★

శీతాకాలం విపరీతమైన చలి. ఉషోదయంఅయి ఆరు అయినా ఆ చలికి ఇంకా సూర్యుడే బయటకు రాలేదు. చీకట్లు కమ్ముకొనే ఉన్నాయి. తెల్లవారుతున్న సూచనలున్నా మంచు తెరలుతెరలుగా కప్పేయడంతో చలి తీవ్రత పెరుగుతోంది.

ఎస్.పి రంజిత్ ఫోను రింగవుతోంది. అప్పటికే ఫోను వాల్యూమ్ తగ్గించడంవల్ల చిన్నగా శబ్దం చేస్తోంది.

ఎస్.పి రాత్రి చాలా ఆలశ్యంగా వచ్చి పడుకొన్నాడు. మగతగా చూసిన అతని భార్య జయకు అతను మత్తుగా పడుకోవడం కనిపించింది.

ఫోను మోత ఆగడంలేదు. బద్ధకం ఇంకా శరీరాన్ని వదలిపోవడంలేదు. ఎక్కడో దూరాన లారీలు వెళుతున్న శబ్దం వినిపిస్తోంది. దగ్గర్లోని గుడినుండి లౌడ్ స్పీకర్ లోంచి సుందరాకాండ శ్రావ్యంగా చెవులను తాకుతోంది. బద్ధకంగానే లేచిన జయ ఫోను రిసీవర్ అందుకొంది.

"హలో" నిద్రమత్తు ఇంకా తేలకుండానే. అంది.

"గుడ్‌మార్నింగ్" అవతలి కంఠం సుపరిచితం.

"మీరా... గుడ్‌మార్నింగ్"

"సారీ టు డిస్టర్బ్ యూ... ఇంకా నిద్రలేచినట్లులేరు. నేనే నిద్ర పాడుచేశానేమో... సారీ" అవతలి కంఠం చాలా మృదువుగా ఉంది.

"మెలుకువ వచ్చింది. బద్ధకంగా ఉంటేనూ... రాత్రి చాలా ఆలస్యం అయిందిలెండి"

"మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి. నాకు చాలా టెన్షన్‌గా ఉంది. ఎవరికి చెప్పాలో తెలీక మీకు ఫోను చేశాను" అవతలినుంచి వనజ కొంచెం కంగారుపడుతూ అంది.

"చెప్పండి వనజగారూ కంగారుపడకండి. ఏం జరిగింది?" జయ ఆదుర్దాగా అడిగింది.

"డి.ఐ.జిగారు ఏదో ఫంక్షన్ అటెండ్ అవడానికి కాకినాడ వెళ్లారు. ఎల్లుండిగానీ రారు. అంతవరకూ ఆగే విషయం కాదు. అందుకే" వనజ మాటలు కంగారు పుట్టించేలా ఉన్నాయి.

"ఏవిటది... ముందు మీరు టెన్షన్ పడకండి ఏమయింది" జయ ఆసక్తి చూపింది.

"ఏం లేదు జయగారూ... ఒక పర్సనల్ ప్రాబ్లెమ్ వచ్చింది, మీకుచెబుతాను. ఎస్.పిగారు లేచిన తర్వాత కొంచెం ఆయనకు చెప్పండి" వనజ గొంతు అర్థింపులా ఉంది.

"అర్జెంటయితే చెప్పండి. ఇపుడే ఆయన్ని లేపుతాను. ఇంక లేచే టైం కూడా అయింది"

"నో... నో.. మీరు చెప్పండి. మీకు తెలుసుగా మా అమ్మాయి కౌస్తుభ మెడిసన్ చేస్తోంది"

"ఆ తెలుసు... ఆమధ్య మేం కల్సుకొన్నాం. చాలా ఇంటెలిజంట్."

"ఆ... ఏం ఇంటెలిజంట్‌లెండి అన్నీ అతి తెలివితేటలు. రెండు రోజులనుంచి హాస్టల్ నుంచి మిస్సింగ్. ఓ రోజు చూసి హాస్టల్ వార్డెన్ నాకు ఫోను చేసి చెప్పింది. విషయం ఇంకా ప్రిన్సిపాల్ వరకూ వెళ్లలేదు. ఏదో పిక్నిక్ అని మొన్న ఉదయం వెళ్లారట. సాయంత్రానికే తిరిగి వస్తాం అని చెప్పారట. ఇంతవరకూ తిరిగిరాలేదు. నాకు ఒకటే కంగారుగా ఉంది. ఈయన ఇంకా రెండు రోజులవరకూ రారు. అంతవరకూ ఊరుకోవడం మంచిదికాదు. పోనీ ఎక్కడయినా ఆగిపోతే కనీసం నాకయినా ఫోను చేసి చెప్పవచ్చు. అదీ చెయ్యలేదు. మగపిల్లలయితే ఎక్కడో అక్కడ ఉంటార్లే అనుకోవచ్చు. ఏమయిందోనని చాలా కంగారుగా ఉంది. సారీ మీకు ఉదయాన్నే టెన్షన్ కలిగిస్తున్నాను. ఎవరికి చెబుదామన్నా బాగుండదు. రంజిత్‌గారయితే అర్థం చేసుకొని ఎక్కడా బయటకు రాకుండా తెలుసుకొంటారని అనిపించింది. అందుకే..." వనజ కంగారుగానే చెప్పింది.

"మీరేం కంగారుపడకండి... ఆయనకు నేను చెబుతాను. మొన్నా నిన్నా వర్షాలు కదా... వర్షం ఎక్కువయితే ఎక్కడయినా ఉండిపోవచ్చు. పిక్నిక్ అంటున్నారుగా... ఇంకా చాలా మందే ఉండిఉంటారు. ఏం కాదులెండి. ఎక్కడో క్షేమంగానే ఉంటుంది. ఇవాళే తెలుస్తుందిలెండి" జయ ధైర్యాన్నిచ్చింది.

"నేనూ అదే అనుకొంటున్నాను జయగారూ. అయినా వర్షంగా ఉంటే పిక్నిక్ ఎందుకు చెప్పండి. పిల్లలు చిన్నప్పుడో గొడవ. పెద్దయితే ఇలాంటి సమస్యలు. ఈ రోజుల్లో వాళ్లు మన మాట వినరు. గట్టిగా చెబితే ఎదురుతిరిగి మనం చెప్పింది తప్పంటారు. ఈ విషయం నలుగురికీ తెలిస్తే పరువుంటుందాండి. లేనిపోని సమస్య తెచ్చింది" వనజ బాధగా అంది.

"మీరేం బాధపడకండి. పిల్లలంతా అలాగే ఉన్నారు. నేను ఆయనకి చెబుతాను. తొమ్మిదింటికి మీ ఇంటికి వస్తాను. మీరేం బెంగపడకండి" జయ అనునయించింది.

"చాలా ధైర్యం చెప్పారు. థ్యాంక్స్. మీ కోసం వెయిట్ చేస్తూంటాను. ఉంటానండీ




# ఏరిన ముత్యాలు

☆ ఉత్తముడు మాటల్లో పరిమితంగానూ, చేతల్లో చురుకుగానూ వుంటాడు.

-కన్ఫ్యూషియస్

☆ ఒక తప్పువలన మరొక తప్పు సరిచేయబడదు.

-సోక్రటీస్

☆ విమర్శతో కూడినదే జీవితం. ఆ విమర్శే జీవం.

-ప్లేటో

☆ తక్కువ కళతో ఎక్కువ విషయాల్ని చెప్పగలగడమే నిజమైన కళ.

-షేక్స్పియర్

☆ తాత్విక పరిశీలనకు ప్రాథమికావసరం నిర్భయమైన స్వతంత్రబుద్ధి.

-కారల్మార్క్స్

☆ తనకు తాను తృప్తిపడే మానవుడు ఇక ఎదగడు.

-గాంధీజీ

☆ ప్రజాస్వామ్యం, సోషలిజం రెండూ మార్గాలే కాని గమ్యాలు కావు.

-నెహ్రూ

☆ దేశం నాకేమి చేసిందనే ప్రశ్నకన్నా దేశానికి నేనేమి చేయగలిగాననే ఆలోచన ఉత్తమం.

-జాన్కెన్నడీ

☆ నింద వేయడం అబద్ధం చెప్పడంకంటే ఘోరం. అది అబద్ధాన్ని దాచే బురఖా.

-పోప్

☆ తినడం కోసం జీవించడం కాకుండా జీవించడం కోసం తినాలి.

-సోక్రటీస్

☆ త్యాగధనులకు ఆదర్శాలు ఉంటాయి. ఇతరులకు కోరికలు ఉంటాయి.

-జార్జివాషింగ్టన్

☆ నా మతం విజ్ఞానశాస్త్రమే. జీవితాంతం నేను దానినే ఆరాధిస్తాను.

-సి.వి. రామన్

☆ భయపడ్తూ వున్నవాడే నమ్మకాన్ని నిరంతరం నిలబెట్టుకోవడానికి ప్రయత్నిస్తాడు.

-జిడ్డు కృష్ణమూర్తి

☆ శాంతంగా, నిబ్బరంగా వుండగలగడమే నిజమైన శక్తికి నిదర్శనం.

-వివేకానంద

☆ అబద్ధాలకోరుకి మంచి జ్ఞాపకశక్తి కావాలి.

-క్వింటీలియర్

సేకరణ: శ్రీగిరి శ్రీకాంత్

సారీ టు డిస్టర్బ్'' వనజ మళ్లీ అంది.

"నో నో నాటెటాల్' జయ అనడంతో ఫోను సంభాషణ ఆగిపోయింది.

ఆ తరువాత ఎస్.పి. నిద్రలేవడం జయ ఆ విషయాన్ని పూర్తిగా ఆయనకు తెలియజేయడం జరిగాయి.

రంజిత్ నిదానంగా ఆలోచించి తనకి తెలుసున్న ఓ పోలీసాఫీసరుని వివరాల సేకరణ నిమిత్తం నియోగించాడు.

డి.ఐ.జి కూతురు తప్పిపోయిందంటే ఎంత చెడ్డపేరు. మొత్తం డిపార్టుమెంటుకే తల ఒంపులు. ఈ వార్త ఎట్టి పరిస్థితుల్లోనూ బయటకు రాకూడదు. డి.ఐ.జి స్వామికి ఈ విషయాన్ని తెలియజేయాలి. కాకినాడ మెసేజ్ ఇస్తే నోనో అందరినోటా ఈ విషయం పడకూడదు అసలే ఈ డిపార్టుమెంట్ కొంచెం ఉంటే దాన్ని భూతద్దంలోంచి చూసి నానా రకాలుగా ప్రచారం చేసే జనంతో నిండి ఉంది. బాధ్యతాయుతులైన వాళ్లకే ఇలాంటి పనులు అప్పగించాలి. పెద్దపెద్ద కేసుల్ని అసలేం జరగనట్లుగా చూస్తూ ఊరుకోవడం ఇలాంటి అతిచిన్న విషయాల్ని చిలవలు పలవలుగా వర్ణించి కోతిపుండు బ్రహ్మరాక్షసిని చెయ్యడం అలవాటున్న ఏ ఒక్కడికి ఇది తెలిసినా ప్రమాదమే. స్వయంగా వెళ్లి కనుక్కొంటే! అది మరీ ప్రమాదం. పెద్దఎత్తున ప్రచారమవుతుంది. ఏ రకంగా ముందుకు సాగుదామన్నా రంజిత్‌కి అన్నీ అవరోధాలే కనిపిస్తున్నాయి. ఆ పోలీసాఫీసర్ ఫోను గురించి వెయిట్ చెయ్యడం తప్పించి వేరే గత్యంతరంలేని పరిస్థితి.

"అసలా అమ్మాయి పిక్నిక్‌కి వెళ్లినా తిరిగి రావడానికి రెండు రోజులు పడుతుందా. ఒకవేళ ఎక్కడయినా ఆగిపోతే ఆ విషయం తెలియజెయ్యవచ్చుకదా. అలాంటి వీలులేని పరిస్థితులు ఎలా ఏర్పడతాయి. ఎస్.పి. పోలీసు మెదడు పరిపరివిధాలుగా ఆలోచిస్తోంది.





అవతల వనజ ఆందోళన పడుతోంది. తన సర్కిల్‌లోని ఎవరికి విషయం తెలిసినా తనకి పరువు ఉండదు. అందునా ఆడపిల్ల! ఇదేదో ఘోరం జరిగినట్లు చిత్రీకరిస్తారు. పైకి తామూ బాధపడినట్లు నటించినా పక్కకు తిరిగి ఏవేవో అనుమానాలూ... వ్యాఖ్యానాలు చేసేస్తారు. ఏదో హైక్లాస్ సొసైటీ అని తిరగడం మామూలే. అదంతా గొప్పలు చెప్పకోవడానికీ... పొజిషన్లను ప్రదర్శించడానికీ పనికివస్తాయి. ఏదైనా వ్యక్తిగతంగా బాధ కలిగితే మనసు విప్పి మాట్లాడడానికి మంచి స్నేహితురాలు అని చెప్పుకొనేందుకు ఒక్కరూ కనిపించడంలేదు. ఏదైనా పార్టీ... ఫంక్షనూ అయితే పిలవడానికి ఎంతోమంది పేర్లు పెద్దలిస్టులా పేరు కొంటాయి. ఈ విషయం చెప్పుకొని మనసులోని ఆందోళనను పంచుకోవడానికి ఏ ఒక్క పేరూ ఆలోచనల్లోకి స్థిరంగా రావడంలేదు. వచ్చినా ఆ పేర్ల పక్కనున్న పొజిషన్‌వల్ల అవి క్షణం కూడా నిలవడం లేదు.

ఇదేనా హైక్లాస్ సొసైటీ? వనజ మనసు ఆక్రోశిస్తోంది.

ఎవరో ఒకరు తన ఆందోళనను పంచుకోవాలని ఆమె మనసు ఆరాటపడుతోంది. తన బాధకు ఏదోకొంత ఉపశమనం కావాలి. తాను తనకంటూ ఏర్పరచుకొన్న పెద్దపెద్ద స్నేహాలు ఎందుకూ పనికిరాకుండా పోతాయా? డబ్బూ, కీర్తి హెూదాలమీద స్నేహమనే పదాన్ని ఉపయోగించి కట్టిన గొప్ప భవనాలకు అర్థం లేదనిపిస్తోంది. నిజంగా వాటికి ఆప్యాయత ఆత్మీయత అనే గట్టి పునాదులులేవు. అంతస్థులే వాటి పునాదులు. ఇలాంటి సమయంలో ఎంతటి అంతస్థులయినా నీరు కారిపోతాయి. ఎవరినయినా పక్కవారు ఎగతాళి చేస్తారు. ముఖం మీదున్న భావాలు వాళ్లమనసుల్లో ఉండవనేది అక్షర సత్యం.

మొదటిసారిగా వనజకి తన హైక్లాస్ సొసైటీ మీద అనేక అనుమానాలు కలిగాయి. తన భ్రమలు తొలిగిపోయినట్లుగా అనిపించింది. అదే సమయంలో చాలా తక్కువ పరిచయం ఉన్న జయ ఆప్తురాలుగా హృద

యంలో పెరిగిపోతోంది. ఏమయినా ఒక పోలీసు భార్య మనసు మరో పోలీసు భార్యకు ఖచ్చితంగా అర్థం అవుతుందేమో... అవును ఆ భర్తల వృత్తి ఇంచుమించు ఒకేవిధంగా ఉంటుందికదా... జయ పెందరాళేవస్తే బాగుంటుంది. వనజకి జయమీద వాత్సల్యం పెరిగిపోతోంది. ఏదైనా బాధ కలిగినపుడు ప్రతీ మనసూ ఓ ఓదార్చే హృదయాన్ని కోరుకొంటుంది. ఎవరైనా చిన్నగా అనునయిస్తే ఆ క్షణంలో ఆ వ్యక్తి దైవ సమానంగా కనిపిస్తారు. అందుకే బాధల్లో ఉన్న వారిని ఆదుకోవాలని పెద్దలు చెప్పడం! నిజంగా అవి అనుభవంతో కూడుకొన్న వేదంలాంటి మాటలు. జయ గురించి ఆలోచనలో ఉండగానే వనజ కోరుకొన్న విధంగానే జయ ఎనిమిదిన్నరకే ఆ ఇంటికి వచ్చింది.

"రా... జయా" అప్రయత్నంగా వనజ నోటినుంచి ఆ మాటలు వచ్చేశాయి.

"సారీ... మిమ్మల్ని... ఏవిటో మిమ్మల్ని చూడగానే ఆత్మీయుల్ని చూసినట్లుగా అనిపించి అలా అనేశాను. ఏమనుకోకండి" వనజ నొచ్చుకొంది.

"భలేవారే... మీరలా పిలిస్తే నాకు చాలా ఆనందం కలిగింది. మీరు అలాగే పిలవండి. మీకంటే చిన్నదాన్ని. నాకో అక్కయ్య మీరు. రియల్లీ నాకు చాలా హేపీగావుంది " జయ సంతోషంగా అంది.

ఆమె కళ్లల్లోని మెరుపూ ఆమెమాటల్లోని స్వచ్ఛతా వనజని బాగా ఆకట్టుకొన్నాయి.

జయ చెయ్యి పట్టుకొని ప్రేమగా నొక్కి దగ్గరగా తీసుకొని సోఫాలో కూర్చోపెట్టుకొని బాధను మాటల్లో వ్యక్తం చెయ్యలేక కళ్లల్లో సుడిలా తిరిగే నీళ్లతో ప్రతిబింబించింది వనజ.

"అదేంటి అక్కయ్యగారూ... ఇపుడేమయింది. ఓ గంటలో అంతా తెలిసిపోతుంది. మీరనవసరంగా కంగారుపడకండి. ఇలాంటి సమయంలోనే ధైర్యంగా ఉండాలి. ఇంత మంది ఉండగా మీరు బాధపడటం ఎందుకూ. ఆయన ఈ పనిమీదే ఉన్నారు"

జయ మాటలు వెయ్యి ఏనుగుల బలాన్నిచ్చినా ఆ తల్లి హృదయం తల్లడిల్లుతోంది.

"ఏం లేదు జయా... చాలా టెన్షన్ భరించాను. ఎవరికీ చెప్పుకోలేను. ఎంతో ఆత్మీయురాలిలా నువ్వు కనిపిస్తే..." అంటూ దాదాపుగా కళ్లల్లో నీళ్లు సుడులు తిరుగుతూండగా వనజ తలదించుకొంది.

ఆమెకు దగ్గరగా జరిగింది జయ. "బాధపడకండి... అమ్మాయికి ఏంకాదు. మీరు దిగులు పెట్టుకోవద్దు. ఇలాంటి సమయాల్లోనే ధైర్యంగా ఉండాలి" అంది జయ.

వనజ తలూపింది. ఏం మాట్లాడలేదు.

"పొద్దున్నుంచీ కాఫీ అయినా తాగారా... కొంచెం కాఫీ కలపమని చెబుతాను. మీరు డల్ అవద్దు" అంటూ జయ ఆమెను ఊరడిస్తూ ఉండిపోయింది.

  

ఎంత హోదా ఉన్నా, ఎన్ని పనులున్నా కొన్ని సందర్భాల్లో అన్నిటినీ వదిలిపెట్టి ముఖ్యమైన స్నేహితులకోసం వెళ్లక తప్పదు. అన్ని విధాలా తమ పురోభివృద్ధిని కోరుకొనే వారి పట్ల అభిమానం చూపకుండా ఎవరూ ఉండలేరు. పోలీసు శాఖలో పనిచేసేవారికి వీలు చిక్కడం అంత తేలికయిన పనికాదు. ముఖ్యమైన వ్యక్తిగత పనులున్నా అవి పోలీసు యంత్రాంగంమీద ఉన్న ఒత్తిడి ఆధారంగా సాగుతూంటాయి. అధికారంలో ఉన్న నాయకులకూ, ఉన్నతాధికారులకు కొన్ని సౌలభ్యాలు, సౌకర్యాలు అందుబాటులో ఉంటాయి. ఐ.ఎ.ఎస్, ఐ.పి.ఎస్ అధికారులు, ఇతర అధికార్ల విషయంలో పరిస్థితులు భిన్నంగా ఉన్నా వారెక్కడికి వెళ్లినా మర్యాదలకు లోటు ఉండదు. సాధారణంగా వీరు అధికార పర్యటనలకీ అనధికార పర్యటనలను కూడా జోడిస్తారు. ఎక్కడయినా అనధికారిక కార్యక్రమాలుంటే

వాటిని అధికార కార్యక్రమాలకు హాజరవుతూ నే పూర్తి చేసుకొంటారు. ఈ విషయంలో ఇతర ఉన్నతాధికారుల సహకారం వారికి ఎపుడూ లభిస్తుంది. ఎప్పుడైనా అనధికార పర్యటనల నిమిత్తం వేరే ప్రాంతాలకు వెళ్లినా అక్కడ ఆ శాఖకు చెందిన అధికారులు సౌకర్యాలు సమ కూర్చడం ఆనవాయితీ.

గతంలో ఉన్నతాధికారుల సంఖ్య చాలా తక్కువ కాబట్టి వారి అధికార, అనధికార పర్యటనలు బహుస్వల్పంగా ఉండేవి. ఉన్నతా ధికారులు అధికార పర్యటనలను అత్యవసర మైతేగానీ ఏర్పరచుకొనేవారు కాదు. అనధి కార పర్యటనలో ప్రభుత్వ యంత్రాంగ సహాయం ఏమాత్రం ఆశించేవారుకాదు. కొంద రు ఉన్నతాధికారులు నేటికీ అధికారపరమైన పనులకీ సౌకర్యాలను వాడుతూంటారు. ప్రభు త్వం నిర్దేశించిన మార్గదర్శక సూత్రాలను కట్టుదిట్టంగా స్వయం క్రమశిక్షణతో అమలు పరుస్తూంటారు. వారి స్వంత పనులకూ... అధికార పనులకూ తేడా ఉంటుంది.

ఇటీవలికాలంలో అలాంటి ఉన్నతాధికా రుల శాతం బాగా తగ్గిపోయింది. ఉదయం లేచింది మొదలు అధికార వాహనాలలోనే అన్ని పనులూ జరుపుకొనే వారు అధికమ య్యారు. పెద్ద పాఠశాలలు, కాలేజీలు, హొటళ్లు, బజార్లు, కూరగాయల మార్కెట్లు, రాత్రి సమయాల్లో స్టార్ హొటళ్లు, బార్‌లు... ఇలా అనేక ప్రదేశాల్లో ప్రభుత్వ అధికార వాహనాలు కనిపిస్తూనే ఉంటాయి. ప్రభుత్వ యంత్రాంగంలోని పెద్దలే అధికారాన్ని ఆ రకంగా వాడుతున్నప్పుడు మిగతా అధికార్లు గా ఉద్యోగులూ అది ఆసరాగా తీసుకోకుండా ఉండరు. సమాజంలో నైతిక విలువలు పడిపో తున్నాయంటూ గోల చేసే పెద్దలు... వాటి పరిరక్షణకు తామెంతవరకూ దోహదం చేస్తు న్నామనేది ఆలోచించడంలేదు. అధికారం చేప ట్టగానే వారి మనస్తత్వమే అనేక రకాలుగా మారిపోతున్నది. తమ అధికారాన్ని అందరూ గుర్తించాలనేది కొందరి విధానంగా మారిపో యింది. ఏ పనినైనా తమ ఆమోదముద్ర తాము అనుకొన్నట్లుగా కింది ఉద్యోగులు పొంది ఆచరించాలనే భావన పెరిగిపోయింది. ప్రభుత్వ సౌకర్యాలన్నీ తమకి అందుబాటులో ఉండాలనే స్వార్థం ఎక్కువ అయింది.

పోలీసు వ్యవస్థలో కొన్ని మార్పులు విస్తృ తంగా జరగడంవల్ల ఆశాఖలోని ఉన్నతాధికా రులకు కొంచెం ఊపిరి పీల్చుకొనే సమయం దొరుకుతున్నదనే చెప్పాలి. జిల్లాకి ఒక ఎస్.పితోపాటు ఇద్దరు ఎ.ఎస్.పిలు... జిల్లా పరిధిని అనుసరించి డి.ఎస్.పిలు ఉన్నారు. వారుకాక రెండేసి జిల్లాలకు ఓ డి.ఐ.జి పదవి నేర్పరిచారు. జిల్లాలో పెద్ద మున్సిపాలిటీలు ఉన్న పక్షంలో ఉన్నతాధికారుల సంఖ్య పెరు గుతుంది. గత పదేళ్ల కాలంలో పోలీసు శా ఖలో ఉన్నతాధికార పదవులు అయిదారురెట్లు పెరిగాయి. డైరెక్టరేట్ సమగ్రంగా ఏర్పడింది. ఒక్క హైదరాబాదు నగరంలోనే దాదాపుగా నూట నలభైకి పైగా ఐ.పి.ఎస్ అధికారులున్నా రు. ఒక్క పోలీసు డైరెక్టరేట్‌లోనే పాతిక మందిదాకా ఉన్నతాధికారులు వివిధ హోదా లను నిర్వహిస్తున్నారు. కార్పొరేషన్స్ ఎం.డి.లుగా నగర పోలీసు విభాగంలోని అధికారులుగా, ఇతర పోలీసు, పరిశోధన, నిరోధక వంటి అనేక కార్యాలయాల్లో శాఖాధి పతులుగా వ్యవహరిస్తున్నారు.

సీనియర్లను గౌరవించడం పోలీసుశాఖకీ చెల్లింది. సీనియర్ ఐ.పి.ఎస్ అధికార్లు తమ ప్రాంతాలకు ఏ పని మీద వచ్చినా ఆయా ప్రాంతాల ఉన్నతాధికారులు సకల మర్యాద లూ జరిపిస్తారు. ఈ మర్యాదలు పోలీసు రాజకీయాలతో ప్రసక్తి లేకుండానే జరుగు తాయి. ఐ.పి.ఎస్ అధికార్లలోనూ గ్రూపులు న్నాయి. ప్రాంతీయ, కుల, మతాలకు అతీ తంగా ఈ గ్రూపులు వ్యవహరిస్తాయి. అవ సరం ప్రాతిపదికగా ఈ ఉన్నతాధికారులు గ్రూపులు కడతారు. ఈ సర్కిల్స్ చాలా పెద్దగా ఉంటాయి. అవికాక ఆంతరంగిక మిత్ర




బృందాలు ఉంటాయి. అలవాట్లను అనుస రించి ఆ బృందాలు ఏర్పడతాయి. ఎంతటి జటిలమైన అధికారినైనా అలవాట్లు దగ్గర చేస్తాయి. డి.ఐ.జి స్వామికి సీనియారిటీ ఉన్నందునా, ఏ గ్రూపులోనైనా ఇమిడిపోయే స్వభావం అలవడినందునా మిగతావారు గౌర వంగా చూడటం సాధారణ విషయం. ఎంత లా అధికారులు కలిసిపోయినా వారి వ్యక్తిగత విషయాలు మాత్రం బయటకు వెల్లడించరు. ఆంతరంగిక స్నేహబృందాలకు కూడా పరిధు లు, పరిమితులు ఉంటాయి. పరస్పరం వ్యక్తి గతం గురించి ఏనాడూ పట్టించుకోరు. వారడి గిన సదుపాయాలు ఏర్పరచడం వరకే తమ బాధ్యతగా భావిస్తూంటారు.

డి.ఐ.జి స్వామి కాకినాడ వెళ్ళడానికి ము ఖ్యకారణం తన అభివృద్ధిని సదా కోరుకొన్న ఓ రిటైర్డ్ పోలీసు అధికారి కూతురి పెళ్ళికి. ఆ పెళ్ళికి తప్పనిసరిగా రావాలని ఆ అధికారి కోరాడు. దాంతోపాటు మరొక అధికార కార్యక్ర మాన్ని ఏర్పరచుకొని స్వామి కాకినాడ వెళ్ళా రు. అంతవరకూ వచ్చిన స్వామికి చిన్ననాటి జ్ఞాపకాలు మనసులో మెదిలాయి. నిత్యం అధికారిక పనుల ఒత్తిడి వల్ల ఆ జ్ఞాపకాలు కలిగినా వాటిని వెంటనే మరచిపోవాలి. మధు రంగా ఉండే చిన్నతనం ఎవరికైనా పదిలంగా హృదయంలో ఉండి ఆనందాన్ని కలిగిస్తుంది. చిన్ననాటి రోజులు తలచుకొని మురిసిపోవ డమో... లేక ఆ రోజుల్లో తాము పడిన కష్టాలు తలచుకోవడమో ఒక వయసు దాటింతర్వాత అందరూ చేసేపనే. హోదాలో ఉన్న స్వామి తన బాల్యాన్ని ఎవరితో చెప్పుకోగలడు. కనీసం భార్యతో ముచ్చటిద్దామన్నా ఎక్కడ లోకువ అవుతానోననే అభిమానం అడ్డువ స్తుంది. ఆ అభిమానం హోదా కలిగించిన శాపమా... మనసుని మభ్యపెడుతున్న దౌర్బ ల్యమా...

అది చాలామంది తేల్చుకోలేని జటిల ప్ర శ్న.

ఒక హోదా లభించిన వ్యక్తికి అన్నీ ఆ హోదాలోనే గడిచిపోతూంటాయి. ఆ గౌరవం, మర్యాద కాపాడుకోవడం కోసం ఆత్మానందా న్ని కూడా త్యాగం చేస్తూంటారు. తమ హోదా నూ, అధికారాన్ని ప్రదర్శించడానికి వారు ప్రయత్నిస్తారు. కాని ఎవరూ తమను చిన్నగా కూడా ఏదీ అడగకూడదనే భావన వారిలో గూడుకట్టుకుని ఉంటుంది. పై అధికారులకు సైతం ఆ వీలు లేకుండా నడవడానికే వీరు అహర్నిశలూ ప్రయత్నిస్తూంటారు. భార్యా...పిల్లలూ కూడా తమ హోదా మేరకే ప్రవర్తిస్తూ గౌరవ మర్యాదలకు లోటు రానివ్వ కూడదనే కచ్చితాభిప్రాయంలో వీరుంటారు. ఏ వ్యక్తిగత విషయాన్ని భార్యాపిల్లల ముందర చర్చించరు. ఈ ఉన్నతాధికారులకు చిత్రమైన స్నేహితులు కూడా ఉంటారు. వారికి వీరితో ఏపనీ ఉండదు. బహుశా వారివద్దనే వీరి అభిరుచులు... కళాత్మక భావనలు బయ టపడతాయి. వారితో సరదాగా కాలక్షేపం చేస్తారు. అదే వారి మనసులకు ఆనందం కలిగించే అనుబంధంకావచ్చు.



**స్వా**మి తన డి.ఐ.జి. హోదాని పక్కకుపె ట్టి ఓ స్నేహితుడి కారు తీసుకొని ఒంటరిగా బయలుదేరాడు. కాకినాడ దాటి ఆ కారు పిఠాపురం రోడ్డులోకి ప్రవేశించింది. ఆ దారీ, ఆ ప్రాంతాలు అతనికి సుపరిచితాలే. చాలాకా లంగా ఆ దారిలో రాకపోయినా అది పెద్దగా మారలేదు. పిఠాపురం దాటి కత్తిపూడినుండి

కుడికి తిరిగి కారు అన్నవరం దారిలో వెళు తోంది సెక్యూరిటీ లేకుండా... ఒంటరిగా కారు నడుపుతూ వెళ్ళడం... అందులో ఆ మార్గంలో చాలా హాయిగా ఉంది. మనసు ప్రశాంతంగా ఉన్నట్లు తోచింది.

అధికార హోదా గుర్తుల్లేని కారు గనుక ఎవరూ గుర్తుపట్టరు. ఈమధ్యకాలంలో అలా సెక్యూరిటీ లేకుండా... అధికారపు ఆర్భాటం... హోదాకు సంబంధించిన ఆడంబరాలకు తావివ్వకుండా ఎపుడూ వెళ్ళలేదు. అది కొత్తగా అనిపిస్తున్నా హాయిగా ఉంది.

చిన్నపుడు తిరిగిన ప్రదేశాల్లో అనవసర ఆడంబరం ప్రదర్శిస్తే తానెవరో లోకానికి ప్రత్యక్షంగా తెలుస్తుంది. తను తండ్రికీ, ఆ పరిసరాలకూ, ఆ వాతావరణానికీ దూరమై మూడు దశాబ్దాలు కావస్తోంది.

ఏ కొడుకుకైనా తండ్రి కావాలి. స్వామి ఏ రకంగా కోరుకొన్నా ఆయన తండ్రి మాత్రం ఆయనకు అందేస్థాయిలోలేరు. ఆయన్ని స్వామి అధికారం... హోదా శాసించడం కాదుకదా చిన్నగానైనా కదపలేదు. ఆయన నైజం ముందు స్వామి పలుకుబడి భంగపడాల్సిన పరిస్థితి. తల్లి లేకపోయినా అన్నీ తానై పెంచిన తండ్రి పట్ల చిన్నతనంలో కొడుకుగా విధేయత చూపించాడా...? విద్యవలన వినయం రావాలంటారు. దానివల్ల పాత్రత వస్తుందనీ, పాత్రతవల్లే అన్ని సుఖాలు ఏర్పడతాయంటారు. పాత్రత వచ్చింది. కానీ తండ్రికి దగ్గరయ్యే అవకాశం రాలేదు. తండ్రి ఆశించిన వినయం తన దగ్గరలేదు.

ఆ తండ్రి స్వామికి గురువు. కానీ స్వామి శిష్యుడిలా కూడా ప్రవర్తించాడా....? శిష్యులు సామాన్యంగా మూడు రకాలు. ఉత్తములు, మధ్యములు, సాధారుణులు. గురువులకు ఏం కావాలో గుర్తించి వారు ఆజ్ఞాపించకముందే వెంటనే దానిని నెరవేర్చేవారు ఉత్తములు. గురువు ఆజ్ఞ మేరకు ఆయన ఆజ్ఞ అయిన వెంటనే ఆలశ్యం చెయ్యకుండా వాటిని అక్షరాలా అమలు చేసేవారు మధ్యములు. గురువు ఆజ్ఞలను వాయిదా వేస్తూ అడుగడుగునా తప్పులు చేసేవారు సాధారణ శిష్యులు. కానీ తానో...? ఆ మూడు రకాలకూ చెందనివాడు. తండ్రీ, గురువూ అయిన వ్యక్తి మాటలను లెక్కచెయ్యక వాటిని తన స్వలాభం, స్వీయ ప్రయోజనాలతో ముడిపెట్టి ఆయన్నే పక్కకు నెట్టిన మేధావి శిష్యుడు. ఈ రోజుల్లో తన తండ్రిలాంటివాడు లోకరీతుల్ని అర్థంచేసుకోలేక అవస్థల పాలు పడుతున్నాడనేది స్వామి ఖచ్చితాభిప్రాయం. న్యాయాన్యాయాలు ఆలోచించి న్యాయమార్గాన్ని ఎంపిక చేసుకొని ముందుకు నడిస్తే ఎలాంటి దారుణ పరిస్థితులు ఎదుర్కోవాలో క్షుణ్ణంగా అర్థం చేసుకొన్న అనుభవశాలిగా స్వామి తన అంచనాల్నే నమ్మి చరిస్తూంటాడు. మనిషి ఆలోచనా సరళిలో అనేక మార్పులు సంభవించిన ఈ తరుణంలో తన తండ్రిలాంటివాడి మనుగడ చాలా చిత్రంగా అనిపిస్తూంటుంది. మనసు మారుమూలలలో తండ్రి పట్ల అమిత గౌరవం ఉన్నమాట వాస్తవం.

ఆ గౌరవం ఎందుకు?

ఆయన నమ్మి ఆచరిస్తున్న సిద్ధాంతం మంచిదనా...?

ఆయన ప్రవర్తన ఈ సభ్య సమాజానికి అవసరమనా?

కాదు... ఆ వ్యక్తిత్వం గొప్పది. హోదాలో పైమెట్టు ఎక్కినా అధికారంలో ఉన్నత స్థాయిలకు చేరుకొంటున్నా మనసులో పర్వతంలా పేరుకుపోతున్న అసంతృప్తి ఆయనకు లేదు. అసంతృప్తిని కప్పివేసి మేకపోతు గాంభీర్యాన్ని తనలాంటివాళ్ళు ప్రదర్శించినా స్వచ్ఛంగా, ఏ మాయపొరలూలేని మనసుతో హాయిగా బ్రతికే తన తండ్రి జీవితం ఆనందమయం కాదా.

కొడుకులతో ఆయన సంబంధాలు ఏనాడో వదిలేసుకొన్నాడు. ఫలానా వ్యక్తి తన కొడుకు అని చెప్పుకొనే పరిస్థితి ఆయనకు లేదు. ఎంతటి హోదాలబించినా స్వామి ఆ పరిసర




ప్రాంతాల్లో అపరిచితుడే. ఆ పేరుకూ అధికార హోదాకు కూడా గాంధీ మాస్టారి పెద్ద కొడుకు అని తగిలించుకోక తప్పదు. అధికార హోదాకి విలువ లభించినా గాంధీ మాస్టారి కొడుకంటేనే అక్కడివారి మనసుల్లో స్థానం లభిస్తుంది.

ఎంతోకాలంగా తాను పోగొట్టుకొన్న అభిమానం... ఆప్యాయతా అక్కడ పొంగుతుంది. అవసరాల నేపథ్యంలో తన అధికారానికి అడుగులకు మడుగులు ఒత్తే జనం మనసులోంచి అభిమానాన్ని అందించలేదనే సత్యం స్వామికి తెలియంది కాదు. ఎందరో విద్యార్థులు తన తండ్రిని గురువుగా స్వీకరించిన ఫలితంగా ఉన్నత శిఖరాలు అందుకొన్నారు. వారి తల్లి తండ్రులు సదా తన తండ్రికి కృతజ్ఞతగా ఉండటం విశేషమే. తనకి అధికారులూ... పాలనాయంత్రాంగం... మంత్రులూ... శాసనాధికారంగల సభ్యులు ఎందరో తెలుసు. వారంతా తనపట్ల చూపేది ఆదరణా లేక అధికారానికి వారిచ్చే విలువా? అది తేల్చుకోవడం కుదరని పరిస్థితిలో స్వామి కాలచక్రంతోపాటు బతుకును సాగిస్తున్నాడు. అది అంత క్లిష్టమైన, బలమైన ప్రశ్న కాదని ఆయనకు తెలుసు. దానికి జవాబు ఆయనకు అనవసరం.

స్వామిని ఆ ఒంటరి ప్రయాణంలో ఎన్నో ఆలోచనలు రకరకాలుగా శోధిస్తున్నాయి. అసలీ ప్రయాణం ఎందుకనేది ఒక ప్రశ్న.

అతి సమీపంలోకి వచ్చి ఒంటరిగా వెళ్లడానికి వీలుపడింది కాబట్టి ఈ ప్రయాణం. అన్నవరం దరిదాపుల్లోకి కారు వచ్చేసింది. అన్నవరం మెయిన్‌రోడ్డునుంచి ఆ కారుని రత్నగిరి కొండమీదకు మళ్లించారు డి.ఐ.జి. ఆ ఘాట్‌రోడ్ తనకి చాలా సుపరిచితం. అయితే స్వంతంగా కారు నడుపుతూ రావడం అదే ప్రథమం. ఆ ఘాట్‌రోడ్‌లో ఒంపులు తిరిగిన రోడ్డుమీద కారు వెళుతోంది. దాదాపుగా కొండ ఎక్కేస్తోంది. ఒక మలుపుకు సమీపంలో ఆ కారుని ఆపారు డి.ఐ.జి. అదే తన జీవితంలో ఆహ్లాదకరమైన ప్రదేశంలా చిన్నప్పటినుంచీ స్వామి భావించేవారు. అక్కడనుంచి పంపా సరోవరాన్ని తిలకించారు. ప్రకృతి గీసిన మనోహర చిత్రమది. కొండల నడుమ కోనేరు. ఆ సరోవరం, ఆ కొండలు, ఆ వాతావరణం అంత ఎత్తునుంచి చూస్తే రమణీయంగా మనోజ్ఞంగా అనిపిస్తోంది. అక్కడనుంచి దూరంగా చెట్లమధ్య ఉన్న చిన్న గ్రామాలు మసగ్గా కనిపిస్తున్నాయి. ఆ సుందర దృశ్యాన్ని చూస్తూ చాలా సేపు అక్కడే ఉండిపోయారు. చిన్ననాటి అనేక మధుర జ్ఞాపకాలు భావ కెరటాల్లా ఆయన మనసుని తాకాయి. సూర్యుడి తీక్షణత పెరిగి ఎండ చురుక్కుమనిపించేసరికి ఆ భావ కెరటాలు మాయమై ఆయన అక్కడ నుంచి కదిలారు. కొండమీదకు వచ్చి సత్యన్నారాయణస్వామి దర్శనం చేసుకొని మళ్లీ ప్రయాణమయ్యారు.

కారు కొండ దిగింది. తొండంగి దారిలో వెళుతోంది. మధ్యలో రైల్వేక్రాసింగ్. అక్కడ కొంతసేపు ఆగక తప్పలేదు. రైలు దాటింతర్వాత లెవెల్ క్రాసింగ్ అవరోధం తొలగి తొండంగి వైపు కారు సాగుతోంది. కొత్తపల్లి గ్రామం దాటుతోండగా ఏదో ఉద్వేగం మనసులో చోటుచేసుకొంది. ఏదో ఆవేశం... మరేదో తీయని అనుభూతి కదలాడుతూండగా కారు సడెన్‌బ్రేకుతో ఆగాల్సివచ్చింది.

ఎదురుగా జనం... జనం... అదో జనసముద్రం. కారు కదిలే అవకాశం లేదు. ఓపక్కగా కారుని ఆపేశారు. ఏవో బళ్లు చాలాదూరంవరకూ ఉన్నాయి. విపరీతమైన జన సందోహం. అక్కడినుంచి తన తండ్రి నివాసం ముప్పావు కిలోమీటరు ఉంటుంది. ఏదో ఊరేగింపులా జనం. ఆడా... మగా... పిల్లలూ, ముసలివాళ్లూ... ఎందరో... ఏమిటో...?

కొద్దిసేపు ఆగితే సరి అనుకొని కారు దిగకుండానే స్వామి సిగరెట్ వెలిగించాడు. జనం పెరిగిపోతున్నారు. అలా కారు ముందు కెళ్లలేని పరిస్థితి వస్తుందని ఊహించని స్వామి

ఆ జనాన్ని తిట్టుకొన్నారు. అప్పటికే మధ్యాహ్నం రెండవుతోంది. మూడవుతుండగా కారు కదిలే వీలు కలిగింది. శృంగవృక్షం సెంటర్‌వరకూ వచ్చారు. ఇక అక్కడనుంచి కారు కదిలే వీలు లేకపోయింది. చేసేదిలేక నడుచుకుంటూ వెళ్లడానికి ఉద్యుక్తులై కారు అద్దాలు పైకి ఎత్తి డోర్ లాక్‌చేసి ఆ జనంలోపడి అతి కష్టంమీద ముందుకు నడవసాగారు. ఈలోగా జనంలో కదలిక ఏర్పడింది. అప్పటివరకూ ఆ రోడ్డంతా వ్యాపించిన జనం ఒక్కసారిగా కదలనారంభించారు. ఇసుక వేస్తే రాలనంత జనం. ఆ జనం హడావిడిగా కదలడంతో స్వామి వెనకబడిపోయారు. జనప్రవాహం ముందుకు సాగుతోంది. ఎన్నో గ్రామాల ప్రజలు వేల సంఖ్యలో అక్కడ పోగుబడటానికి కారణం ఆయనకు అంతుచిక్కడంలేదు. ఎవర్నీ అడగడానికి ప్రయత్నం చెయ్యలేదు. ఆ ప్రవాహంలో ముందుకు చొచ్చుకొని పోలేక ఆగిపోయి, ఒక యువకుణ్ణి 'ఏమిటది?' అనడిగారు.

"గాంధీమాస్టారు చనిపోయారు'' ఆ యువకుడు ఓ విషాదవార్త చెప్పాడు.

స్వామి మ్రాన్పడిపోయాడు.

తల్లయి, తండ్రయి, గురువై బాల్యాన్ని ఎంతో ఘనంగా తీర్చిదిద్దిన ఆ వ్యక్తి ఇకలేరు. కన్నతండ్రి తననుంచి ఏదీ ఆశించకుండా ఎవర్నీ ఏదీ యాచించకుండా అన్నిటికంటే గొప్పదైన విద్యాదానాన్ని త్రికరణశుద్ధిగా ఆజన్మాంతం చేసిన ఆ మహోన్నత వ్యక్తిత్వం అనంతవాయువుల్లో కలిసిపోయిందన్నమాట!

ఒక వ్యక్తి పదవిలో ఉండగా చనిపోతే ఆ పదవి పరిధినిబట్టి అంత్యక్రియలు సాగుతాయి.

అమితంగా సంపాదించి మరణిస్తే తృణమో, పణమో దక్కుతుందని ఆశ్రితులంతా ఘనంగా అంతిమ వీడ్కోలుకి హాజరవుతారు.

కానీ గాంధీమాస్టారు ధనబలం లేని నిర్భలుడు. నిరాడంబరుడు. పదవీ విరమణ చేసి పదమూడు సంవత్సరాలయింది. ఈ పదమూడేళ్లలో అనేకమంది ఉపాధ్యాయులు ఆ ఊరి ఉన్నత పాఠశాలకు వచ్చారు. బదిలీలు చేయించుకొని వెళ్లిపోయారు. ప్రమోషన్లమీద వచ్చినవారు కూడా బదిలీ ప్రయత్నాల్లో తల మునకలుగా ఉంటూంటారు. దానికి కారణం అదొక మారుమూల ఊరనే అభిప్రాయం. అన్నవరానికి సమీపంలో ఉన్నా, రైల్వేస్టేషన్, అందులోనూ మెయిన్‌రోడ్ దగ్గరయినా ఆ కుగ్రామంలో ఉండడానికి ఇష్టపడేవారు బహు స్వల్పం.

గాంధీమాస్టారుమాత్రం ఏనాడో ఆ ఊరికి స్వంతం అయిపోయారు. ఎన్నోతరాల విద్యార్థులు తమ ఉజ్వల భవిష్యత్తుకు ఆయనదగ్గరే పునాదులు వేసుకొన్నారు. ఎంతో పైకి వచ్చారు. ఆ పాఠశాలకు నేటికీ ఉపాధ్యాయుల కొరత ఉంది. ఆ కాలంలో విద్యార్థులు మితంగా ఉండటంవల్ల ఉపాధ్యాయులు తక్కువమంది ఉన్నా విద్యార్థులను అందర్నీ విడివిడిగా చదువుకొనేలా చూసేవారు.

క్రమక్రమంగా విద్యార్థుల సంఖ్య విపరీతంగా పెరిగింది. ప్రయివేటు స్కూళ్లల్లో ఫీజుల భారాన్ని తట్టుకోలేక, మిగతా ఆడంబరాలకు తాము ఓర్చలేక సన్నకారు రైతులూ, బడుగువర్గాల ప్రజలూ తమ పిల్లలకు కొద్దోగొప్పో చదువు రావాలనే అభిలాషతో ఆ స్కూల్లోనే చేర్పిస్తూవస్తున్నారు. ఎనిమిది వందల మంది విద్యార్థినీ విద్యార్థులుండగా వారికి పాఠాలు నేర్పడానికి పట్టుమని పాతికమంది ఉపాధ్యాయవర్గం లేదు. వారిలో సెలవుల్లో వెళ్లేవారూ, డ్రాయింగూ, డ్రిల్ నేర్పేవారూ ఇలా విభజిస్తే పై క్లాసులకు చదువు చెప్పడానికి నలుగురు కూడా మిగలని దుస్థితి.

తరచుగా క్లాసులే జరగక విద్యార్థులు ముందుగానే ఇళ్లకు పోతుంటారు. ఎంతటి సమర్థులైన ప్రధానోపాధ్యాయులను నియమించినా ఆ ప్రభుత్వ పాఠశాల పదోతరగతి ఫలితాలు ముప్పైశాతాన్ని మించవు. దానికి ప్రధాన కారణం ఉపాధ్యాయులు లేకపోవడ




మే అంటున్నారు గాంధీమాస్టారు. అన్ని పోస్టులూ భర్తీచెయ్యాలనీ, మరికొందర్ని అదనంగా పోస్టు చెయ్యాలనీ ఆయన కోరారు గానీ ఎవరూ వినిపించుకోలేదు. శాసనసభ్యులకు అంతకన్నా విలువైన పనులుంటాయి. స్థానిక నాయకులు ఇతర రాజకీయాల్లో మునిగి వుంటారు. జిల్లా యంత్రాంగానికి ఈ ఒక్క స్కూలు గురించీ పట్టించుకునే అవకాశం లేదు.

నూటికి నూరుశాతం పాఠశాలల్లో ఇదే పరిస్థితి ఉంది. దానికి తాము కారణం కాదని వారు వాదిస్తూంటారు. వేలల్లో ఉపాధ్యాయుల పోస్టులు ఖాళీగానే ఉన్నా, భర్తీ చెయ్యడానికి బడ్జెట్ లేదంటూ సంవత్సరాలను గడిపేస్తున్నారు. బియిడీలు ఏటేటా ఉత్పత్తి అవుతున్నా నిరుద్యోగం వారిని వెంటాడుతూనేవుంది. స్కూళ్లల్లో ఫీజులు పెంచి బడ్జెట్ పూరించాలంటే రాజకీయ సిద్ధాంతాలు అడ్డువస్తాయి.

ఇలా సమస్యల విషవలయంలో చిక్కుకుపోయి పూడుకుపోయిన విద్యారంగంలో అన్ని ఈతిబాధల్నీ చూస్తున్న ఆ పాఠశాల చుట్టూ పచ్చని చెట్లతో కళకళ్లాడుతూ వుంటుంది. ఆ పచ్చదనం రావడానికి కారణం గాంధీమాస్టారే. నిజానికి కొత్తపల్లి ఇవతలనుంచి ఒంటిమామిడివరకూ ఉన్న రోడ్డు పచ్చదనంతో శోభాయమానంగా ఉంటుంది. దానికి కారణం మాస్టారే.

ఇరవై సంవత్సరాలకిందటే ఆయన చెట్లని నాటే కార్యక్రమాన్ని ఒంటరిగా చేపట్టారు. అప్పట్లో ఆయన్ని పిచ్చివాడిలా భావించినవారూ లేకపోలేదు. సహకరించిన విద్యార్థుల అండతో ఆయన పాఠశాల ఆవరణలో రకరకాల ఫలవృక్షాలను నాటారు. పది కిలోమీటర్ల పొడవునా సైకిళ్లమీద వెళ్లి మొక్కలను పాతారు. అవే ఈనాడు ఎన్నోరకాలుగా ప్రజలకు పనికివస్తున్నాయి. వేసవిలో ఆ రోడ్డున పోతూ ఆ చెట్ల నీడలను ఆశ్రయించే బాటసారులు ఆయన పేరు చెప్పుకొంటూ ఉంటారు.

ఆ పరిస్థితులు ఎలా మారినా గాంధీమాస్టారు సహనాన్ని కోల్పోలేదు. తనకు తోచినవిధంగా అనుకూలమైనరీతిలో తాను పదవీవిరమణ చేసినా విద్యార్థులకు విద్యాబుద్ధులు నేర్పడంలోనే ఆయన నిమగ్నమయ్యేవారు. ప్రజల్లో ఆయనకు ఉన్న పలుకుబడిని చూసి రాజకీయ నాయకులు ఎర వేసినా ఆయన పడలేదు. సాంఘిక సేవాకార్యక్రమాలు తప్ప ఆయన మరే విషయంజోలికీ పోలేదు. అందరికీ అమితాశ్చర్యం కలిగించే అంశం అదే.

సర్వసాధారణంగా ప్రైమరీ, అప్పర్ ప్రైమరీ పాఠశాలల ఉపాధ్యాయులు రాజకీయాలు బాగా ఒంటపట్టించుకొంటారు. వారిలో అధికశాతంమందికి నాయకులతో సంబంధాలు ఎక్కువగా ఉంటాయి. అసలు గ్రామీణ ప్రాంతాల్లో రాజకీయాలు ప్రారంభమయ్యేవి పాఠశాలల్లోనన్నా ఆశ్చర్యపడనవసరంలేదు. నిజాలు కొన్ని చేదుగా అనిపించినా వాటిని భరించక తప్పదు.

చిన్ని స్కూళ్లల్లో ప్రారంభమయ్యే వర్గ, వర్ణ విబేధాలే ఆపైన మహావృక్షాలవుతున్నాయి. ఇది సూక్ష్మంగానే కనిపించినా గడ్డు సమస్యల్ని మొత్తం సమాజానికి అందిస్తోంది. పాఠశాలల్లో అత్యధిక విద్యార్థులు పిన్నవయసులోనే కులాలతో, మతాలతో పిలవడం ప్రారంభిస్తుంటారు. అదొక సంప్రదాయంగా పరిణమించింది. తెలిసీ తెలియని వయసులోనే ఆ చిన్నారుల హృదయాల్లో ఆ పిలుపులూ... ఆ మాటలూ ముద్రించడం జరుగుతోంది. తల్లిదండ్రులనూ, టీచర్స్‌నూ అనుకరించే ఆ వయసులోనే అలాంటి విధానాలు వారిని తప్పుదారిలో ప్రభావితం చేస్తున్నాయి. కుల, వర్గ, వర్ణ, మత విబేధాలు ఆ వయసులనుంచే తెలియకుండానే చిన్నారులు ఒంటపట్టించుకొంటున్నారు. ఇది అందరికీ తెలిసిన సత్యం అయినా దీనిని నివారించడానికి ఎవరూ నేటివరకూ ఎలాంటి కట్టుదిట్టమైన చర్యలూ తీసుకోలేదు.

ఒకపక్క గ్రామీణ వాతావరణంలో అలాంటి అవాంఛనీయ పరిస్థితులు కొనసాగుతోంటే పట్టణప్రాంతాల్లో కులాలవారీ సంఘా




లు చదువుకొన్నవారి ఆధ్వర్యంలోనే నడవడం నిజంగా విచారకరం. ఆ సంఘాలకు రాజకీయపు రంగు మిళితం కావడం శాశ్వతంగా కులవ్యవస్థను పెంచి పోషించడానికే అన్నట్లు తయారైంది.

వీటన్నిటికీ అతీతంగా రూపుదిద్దుకున్న గాంధీమాస్టారి వ్యక్తిత్వం ఎందర్నో ఆకట్టుకుంది. ఆయన ఇల్లొక ఆశ్రమం. అక్కడ అందరికీ స్థానం ఉంది. ఆయనకి 'నా' అన్న స్వార్థం లేకపోవడంతో అందరి అవసరాలకు ఆలంబనగా నిలిచారు.

అది పల్లెకావడంతో అందులోనూ గాంధీ మాస్టారు స్వార్థ రాజకీయాలకు దూరంగా మసలుకోవడంతో ఆయనపట్ల ఆదరణ పెరిగిందేగానీ తరగలేదు. ఆయన సంతానం ఆయనకి దూరమయినా గ్రామంలో అంతవరకూ ఉన్న యువతరం ఆయనకి బాసటగానే ఉంది. ఎన్నో దశలు మారినా ఆయన కూడా యువకులు ఉంటూనే వచ్చారు. ఆయనకు కొడుకులు లేని లోటు వారే తీరుస్తున్నారు. అందుకే ఆ మనిషి చనిపోతే గ్రామాలకు గ్రామాలే కదిలి వచ్చాయి. జనసముద్రంమధ్య అశ్రునయనాల వీడ్కోలు అందుకొంటున్న ఆ మాస్టార్ని కడసారి చూడడానికి ఎందరో వయోబేధం, వర్ణబేధం, మతవివక్ష లేకుండా కదలివచ్చారు. తమ మనసుల్లోనే ఆయనకు నివాళులు అర్పిస్తున్నారు. ఆ అసాధారణ అంతిమయాత్ర సాగుతూనేవుంది.

డి.ఐ.జి. స్వామి కంగారుగా ముందుకు కదలబోయాడుగానీ శరీరంలో శక్తి ఉన్నా మనసు స్వాధీనంలో లేదు. మానసిక పరిస్థితి దారుణంగా మారింది. 'నేనాయన కన్న కొడుకుని' అని చెప్పుకోవాలనీ, అరవాలనీ అనిపించినా అది అతనివల్ల కాలేదు.

ఎంతయినా ఏ వయసులోనైనా, ఏ పరిస్థితిలోనైనా తండ్రి మరణం పుత్రునికి ఎనలేని శోకాన్ని కలిగిస్తుంది. నవనాడులూ కృంగిపోయే ఆ వార్త దారుణంగానే తాకుతుంది. ప్రతి కొడుక్కీ తండ్రి ఓ నైతికబలం. ఎంతస్థాయికి ఎదిగినా, ఎంత ఉన్నతపదవి అలంకరించినా తండ్రి తండ్రే.

కాని ఇక్కడ ఆ నైతికబలంతో ముందుకు వెళ్లలేని దుస్థితి ఈ కొడుకుది. స్వామి గాంధీ మాస్టారు కొడుకు. అయితే అతని డి.ఐ.జి. పదవి గాంధీమాస్టారులాంటి ఉన్నతుని వ్యక్తిత్వంముందు ఎందుకూ కొరగాదు. గాంధీమాస్టారుకి కన్న కొడుకులు అందుబాటులో లేకపోయినా ఆయన చితికి నిప్పంటించటానికి, తలకొరివి పెట్టడానికీ, పున్నామనరకాన్ని ఉద్ధరించడానికీ అనేకమంది కొడుకులు నైతికబలంతో ముందుకొచ్చారు. అదే ఆయన జీవితాశయం. అందులో ఎంతవరకూ విజయవంతం కాగలిగారు అనే ప్రశ్నకంటే పతనావస్థనుంచి కొందరినైనా సమాజానికి మిగిల్చారనేదే పెద్ద సంతృప్తి.

స్వామికి తండ్రితో గడిపిన అనుభవాలు గుర్తుకొచ్చి నీరసపరుస్తున్నాయి. అయినా ముందుకు సాగే ప్రయత్నంలోనే ఉన్నాడు. ఆ ప్రయత్నం ఆఖరికి స్మశానవాటిక దగ్గర ఫలించింది. కానీ నైతికబలమే విజయం సాధించిందా... అన్నట్లుగా ఆయనకు ఆఖరి చూపు కూడా దక్కలేదు. ఎవరో తలకొరివి పెట్టేశారు. అక్కడా జనమే. పాఠశాలలకు సెలవు ప్రకటించడంతో విద్యార్థులు పెద్ద సంఖ్యలో అక్కడికి చేరారు. అందరి కళ్ళల్లో ఏదో ఆవేదన. ఎందరి కళ్లల్లోనో బాధ. ఆ కళ్లన్నీ తనని ప్రశ్నిస్తున్నట్లుగా భావించాడు స్వామి.

'కొడుకులు ఆయన్ని వదిలేసినా మహారాజ యోగంరా... మాస్టారిది'

'ఎంత సంపాదిస్తేమటుకు ఏముందిరా... అందరూ కాటికి చేరాల్సిందే. అయితే ఇలా అందరిచేతా కంటతడి పెట్టించిన మన మాస్టారులాంటివాళ్లు ఎక్కడా ఉండరు'

'ఎంత జనం... ఎన్ని వేల జనం! ఏమిట్రా ఈయన్ని చూస్తే పాతపంచె... పై కండువా తప్ప లేదు. అంతటి నిరాడంబరునికి ఇంత

గొప్ప అంతిమయాత్రా'

'అదేరా మనిషికి నిజమైన విలువ. బతికున్నంతకాలం ఏం చేసినా ఏముందిరా చచ్చిపోయింతర్వాత కూడా పేరు నిలబెట్టుకోవడం అందరివల్లా కాదు'

'ఇప్పుడు కర్మకాండలు ఎవరు చేస్తారట. మనమేం చెయ్యాలి'

'అన్నీ అవే జరుగుతాయి. ఆయన పేరు మీద ఏదయినా జరిగిపోతుంది. ఇంత జరిగిన తర్వాత అవన్నీ ఆగుతాయా. ఏదయినా కావాలంటే మనమూ ఉన్నాంగా'

'ఆయనకి ఎవరూ లేరా?'

'ఎవరికి కావాలిరా ఆ సంగతి. మనమంతా లేమా? ఈ ఊర్లో కుర్రాళ్లంతా ఆయన పిల్లలే. ఆయన నాకూ చదువు చెప్పారు. మా నాన్నకీ చెప్పారు. నా కొడుకూ ఆయనదగ్గరే చదివాడు'

'ఇలాంటిది ఎక్కడా జరిగి ఉండదేమో!'

★ ★ ★

"మమ్మీ.. డేడీ లేరా'' హడావిడిగా ఇంట్లోకి అడుగుపెట్టింది కౌస్తుభ.

ఒంటరిగా ఆలోచనల్లో మునిగివున్న వనజ ఒక్కసారి తలెత్తి చూసి కూతుర్ని గమనించి గుండెలనిండా ఊపిరి పీల్చుకొని ఒక్క ఉదుటున కూతురివైపు వచ్చింది.

"ఏవే... ఏమయ్యావు?" వనజ అడిగింది.

"అబ్బా... ఆ వార్డెన్ నిన్నూ కంగారుపెట్టిందా?" చాలా క్యాజువల్‌గా అంది కౌస్తుభ.

"నువ్వు అన్నీ అలా తేలిగ్గా మాట్లాడకు. ఎంత కంగారయిందో తెలుసా? పాపం జయా ఆంటీ సాయంత్రంవరకూ ఇక్కడే ఉన్నారు. రంజిత్ అంకుల్ నీకోసం ఎన్ని ప్రయత్నాలు చేశారో తెలుసా?" అసహనంగా మాట్లాడింది వనజ.

"ఎందుకంత కంగారు. నేనేం చిన్నపిల్లనా తప్పిపోవడానికి? అంత పోలీసాఫీసరు భార్యవి. ఆమాత్రం ఆలోచించలేదా నువ్వు? అసలు నాకేంభయం? ఎందుకంత హడావిడి చేశావ్?" నిర్లక్ష్యంగా అంటున్న కూతురువైపు కోపంగా చూసింది వనజ.

"అవునే... నీకేం నీ ఇష్టం వచ్చినట్లు మాట్లాడతావు. రెండుమూడు రోజులు హాస్టల్ వదిలేసి ఎక్కడికో పోయి... ఏమయ్యావో తెలీకపోతే తల్లిని కాబట్టి ఏడ్చాను'' వనజ కోపం బాధగా మారింది.

తక్షణం తగ్గిపోయింది కౌస్తుభ.

"అదికాదే అమ్మా! ఆరోజు బాగానే ఉందిక దాని పిక్నిక్‌కి వెళ్లాం. తీరా వెళ్లాక వర్షం పెరిగిపోయింది. మా వ్యాను ట్రబుల్ ఇచ్చింది. అక్కడే గెస్ట్‌హౌస్‌లో ఉండిపోయాం. ఆ విషయం వెంటనే హాస్టల్‌కి ఫోను చేసి చెప్పాం" కౌస్తుభ వివరించింది.

"మరయితే ఆమె నాకెందుకు ఫోనుచేసింది?" వనజ అంది.

"అదే అసలు సమస్య. హాస్టల్ వాచ్‌మెన్ మెసేజ్ రిసీవ్ చేసుకున్నాడు. ఆ తర్వాత అతని భార్య పురిటినెప్పులంటే హడావిడిగా వెళ్లిపోయాడట. ఆ తొందర్లో ఈ విషయం మర్చిపోయాడట. దాంతో వార్డెన్ నానా రభసా చేసేసింది'' అలా కూతురు మాట్లాడే విధానం వనజకు నచ్చలేదు.

"ఏదయినా అలా పిక్నిక్‌కి వెళ్లడం... అందర్నీ కంగారుపెట్టడం మంచిదికాదు'' వనజ సూటిగా అంది.

"అయిదుగురం మేమున్నాం. ఆరుగుర బ్బాయిలున్నారు మమ్మల్ని ఎవరు ఏం చేస్తారు?" నిబ్బరంగా అంది కౌస్తుభ.

"ఆఁ... అయిదుగురు ఆడవాళ్ళూ, ఆరుగురు మగాళ్లూ... బుద్ధి లేకపోతేసరి. మీరంతా గెస్ట్‌హౌస్‌లో రెండురోజులుండి రావడం"

"వాటీజ్ రాంగ్? వాళ్లు మా బాయ్‌ఫ్రెండ్స్. ఏదో సరదాగా ఎంజాయ్ చేద్దామని వెళ్ళాం. దానికి ఇంత గొడవా'' చిరాకుపడింది కౌస్తుభ.

"ఏంటీ సరదా... ఎంజాయ్ అంటున్నావ్. తల తిరుగుతోందా? బాయ్‌ఫ్రెండ్స్‌తో





ఎంజాయ్ అని సిగ్గులేకుండా మాట్లాడుతున్నావ్. ఇది మీ నాన్నకి తెలిస్తే ఎలా ఉంటుందో తెలుసా? నలుగురికీ తెలిస్తే పరువేం వుంటుంది?" వనజ రుసరుసలాడింది.

"వాట్ మమ్మీ... అసలేం మాట్లాడుతున్నావ్? నువ్వే నలుగురికీ చెప్పాలి. అంతే. ఎవరికెక్కావాలి నా గొడవ. ఎప్పుడో నువ్వు చదువుకొన్నట్లుగా ఉంటుందనుకొంటున్నావా. దిసీజ్ ఎ డెవలెప్డ్ సొసైటీ. జస్ట్ క్యాజువల్‌గా తీసుకొనే విషయాన్ని అనవసరంగా సీరియస్‌గా చేస్తున్నావ్. ఇంతకీ డేడీ లేడా?" చాలా ఉదాసీనంగా అడిగింది కౌస్తుభ.

"ఇదిగో కౌస్తుభా... కేరెక్టర్ చాలా ముఖ్యం" వనజ వార్నింగ్ ఇచ్చింది.

"నా కేరెక్టర్ గురించి మాట్లాడే దమ్ము ఎవరికుంది? ఎవరయినా నీకేమయినా చెప్పారా?" ఎదురు ప్రశ్నించింది కౌస్తుభ.

"ఇలాంటి విషయాలు మా సర్కిల్‌లో ఎవరికైనా తెలిస్తే నా పరువుపోతుంది. నీ మూలంగా అనవసరంగా టెన్షన్ పడ్డాను. నీకు నా ఆందోళన అర్థంకాదు'' వనజ గొంతు జీరపోయింది.

"నీ సర్కిల్ నీకు ముఖ్యంగానీ, నీ కూతురు కాదు. నేనెలా తిరిగినా ఫర్వాలేదుగానీ, నీ వాళ్ళకు ఈ విషయాలు తెలియకూడదు. అంతేగా. అసలు వాళ్ళతో మాట్లాడే అవసరం నాకు లేదు'' విదిలించింది కౌస్తుభ.

"నేనవన్నీ మాట్లాడలేను. తల్లిగా ఒకే విషయం నేను మళ్ళీ చెబుతున్నా. కేరెక్టర్ ముఖ్యం" అంతే అన్నట్లు చూసింది వనజ.

"నా కొక్కద్దానికే కాదు. అందరికీ అది వర్తిస్తుంది. నీ సర్కిల్ సంగతి అందరికీ తెలిసిందే. వాళ్ళల్లో ఎవరినైనా నా గురించి మాట్లాడమను. చెబుతా వాళ్ళ సంగతులన్నీ. పోస్టర్లు వేయించి బజార్లో గోడలకి వాల్‌పోస్టర్లలా అంటిస్తా. నువ్వేమయినా చెప్పదలిస్తే ముందు వాళ్లకి చెప్పు''

కూతురు కోపం చూసి వనజ తగ్గింది.

"నీలాంటి మూర్ఖులతో మాట్లాడి లాభంలేదు. ముందు రంజిత్ అంకుల్‌కి ఫోనుచేసి నువ్వు వచ్చిన సంగతి చెప్పు'' అంటూ విసురుగా వెళ్ళిపోయింది వనజ.

★ ★ ★

ఎస్.పి. కార్యాలయంలో రాత్రి ఏడున్నర సమయం.

దాదాపుగా కార్యాలయం అంతా నిర్మానుష్యంగా ఉంది. శీతాకాలం కావడంతో సిబ్బంది చీకటిపడటంతోనే ఇళ్లదారి పట్టేశారు. ఎస్.పి. గది దగ్గర మాత్రం కొంత అలికిడి ఉంది. సెంట్రీలున్నారు. ఎస్.పి. తన గదిలో కూర్చుని ఎదురుగా కూర్చున్న సి.ఐ. రాజారాంతో మాట్లాడుతున్నాడు.

"రాజారాంగారూ... ఎఫ్.ఐ.ఆర్.లో రాసింది కరెక్ట్ అంటున్నారు. దానికీ, ఆ హత్యకూ కారణాలు కుదరడం లేదుకదండి. దోపిడీ దొంగలూ... బందిపోట్లూ అయితే సాయంత్రం ఇళ్ళను ఎటాక్ చేస్తారా? ఊరికి దూరంగా ఉందిగదా! మరి అదే నిజమయితే హత్య చేసింతర్వాత డెడ్‌బాడీని ఎందుకు మాయం చేస్తారు? వాళ్ళకి కావలసింది బంగారమో... డబ్బో అంతేకదా. సీ... రాజారాం దీసీజ్ ఎ ప్లాన్డ్ మర్డర్. మీకూ తెలుసుండాలి. లేకపోతే అంత ఈజీగా ఈ విషయం మరుగునపడదు. నేను మీ మంచికే చెబుతున్నాను. ఎందుకంటే డి.ఎస్.పి. ప్రసాదరావు కోలుకుంటున్నారు. ఆయన నోటివెంట ఎలాంటి నిజాలైనా రావచ్చు. అప్పుడు ప్రమాదం ముఖ్యంగా మీకే. ఎందుకంటే, ఈ విషయం గందరగోళంగా ఉంది. ఏ విచారణ జరిగినా చాలా తేలిగ్గా నేరమంతా మీ మీదకే నెట్టేస్తారు, ఈ నాయకులు. అందుకే నన్ను నమ్మండి. నేనూ మీలాంటి ఆఫీసర్నే. రేంకు పెద్దయినంతమాత్రాన మీ మనసులోని భయాలనూ, ఆందోళనలనూ అర్థం చేసుకోలేనివాణ్ణి కాదు. మీరు నా దగ్గర అసలు జరిగిందేమిటో పూర్తిగా చెబితే నేను పూర్తిరక్షణ కలిగించే ప్రయత్నాలను

చేస్తాను. బి ఫ్రాంక్. డోన్ట్ వర్రీ''

ఎస్.పి. రంజిత్ వ్యూహరచన చేశాడు.

"మీరింతలా చెప్పాలా సార్. మీ మాట మీద నాకు పూర్తిగా నమ్మకం ఉంది సార్. కానీ, కరుణాకర్ మర్డర్ ప్లాన్డ్ కాదుసార్. అతనికి శత్రువులు ఎవరుంటారు సార్. అతను పేరున్న నాయకుడూ కాదు. డబ్బున్న వాడూ కాదు సార్. ఈ ఏరియాలో పట్టపగలే చాలా దోపిడీలు జరిగాయి సార్. ఆ ఊరి చివర్న ఇల్లు అంటారా! ఏదో ట్రై చేసి ఉంటారు. అతను తిరగబడితే..."

ఎస్.ఐ. రాజారాం మాట్లాడుతూండగానే "అది సరిలెండి. అలా ఎన్నయినా మనం చెప్పవచ్చు. కానీ అవి ఎవరూ చూడలేదుకదా. ప్రత్యక్షసాక్షులు ఎవరూ లేరన్నారుకదా. అలాంటప్పుడు అలాగే జరిగి ఉండాలనీ... అదే నిజమనీ నమ్మడానికి ఆస్కారం ఎంతవరకూ ఉంటుంది. మరోవిధంగా ఆ మర్డర్ జరిగి మనల్ని తప్పుదారి పట్టించే వీలు కూడా ఉండదంటారా?"

ఎస్.పి. రంజిత్ వాదనకు సి.ఐ. రాజారాం కొంత కంగారుపడ్డాడు.

"కరక్టే సార్. కానీ మనం ఎలా అనుకొన్నా అన్నీ అనుమానాలే కదాసార్. ఏదో ఒకటి అనుకొని ధ్రువీకరించుకొని ఎఫ్.ఐ.ఆర్. రాయాలికదా. అప్పట్లో అందిన సమాచారం ప్రకారం అలా రాయడం జరిగింది సార్. వేరేరకంగా రాస్తే అదీ తప్పని వేరేవారు అనవచ్చుకదా సార్' సి.ఐ. రాజారాం కొంచెం ఆలోచించి సమాధానం ఇచ్చాడు.

రంజిత్ నవ్వుకొన్నాడు.

నవ్వుతూనే "అదేనండీ... మీరు చెప్పింది కరక్టే. అప్పట్లో అందిన ఇన్ఫర్మేషన్ అలా ఉండబట్టి మీరలా రాశానంటున్నారు. ఇప్పుడది మారవచ్చుకదా అని నేనంటున్నాను. ఎందుకంటే డి.ఎస్.పి. ప్రసాదరావు రేపు స్టేట్మెంట్ ఇవ్వబోతున్నారు. అందుకే ముందు జాగ్రత్త చర్యగా మిమ్మల్ని కబురుపెట్టి మాట్లాడుతున్నాను. సరే... రేపు ఎలాగూ కొంత అదనపు సమాచారం వస్తుందికదా. మనం మళ్ళీ కలుద్దాం" అని రాజారాంకేసి నవ్వుతూ చూశాడు.

ఆ నవ్వు అందంగా ఉన్నా ఎక్కడో బాధగా తగిలింది రాజారాంకు. రాని చిరునవ్వుని పెదాలమీదికి తెచ్చుకుని సెల్యూట్ చేసి వెళ్ళిపోయాడు.

అంతలో మ్రోగుతున్న ఫోనందుకున్నాడు ఎస్.పి. రంజిత్.

"హలో... అంకుల్' కౌస్తుభ కంఠం.

"హలో బేబీ... హౌ ఆర్ యూ... ఎక్కడ నుంచి మాట్లాడుతున్నావ్? ఆర్ యూ సేఫ్'' రంజిత్ అడిగాడు.

"నో ప్రాబ్లమ్. అమ్మ అనవసరంగా మిమ్మల్ని ఇబ్బంది పెట్టింది. సారీ... నేను ఇంట్లోంచే మాట్లాడుతున్నాను. ఆంటీకి ఫోను చేస్తే మీరు ఆఫీసులో ఉన్నారని చెప్పారు. నా గురించి ఇంకా ఇన్వెస్టిగేషన్ చేస్తున్నారేమోనని వెంటనే ఫోను చేస్తున్నాను'' కౌస్తుభ మాటల్లో నిర్లక్ష్యం గోచరించింది.

"అది కాదమ్మా. ఒక్కమాట చెప్పి వుంటే ఈ టెన్షన్ ఉండేది కాదుకదా. యూనో... కమ్యూనికేషన్ గేప్ ఉంటే చాలా సమస్యలు వస్తాయి'' రంజిత్ నిదానంగా అన్నాడు.

"యస్... అంకుల్ నేను మేసేజ్ ఇచ్చాను. కానీ అది మిస్ అయింది. ఎనీహౌ సారీ అంకుల్. రేపు సాయంత్రానికిగానీ డేడీ రారట. అందుకే మమ్మీ మిమ్మల్ని డిస్టర్బ్ చేసింది సారీ'' కౌస్తుభ మాటల్లో గడుసుతనం కనిపించింది.

"నో... డిస్టర్బెన్స్ ఏంలేదు. యు హేవ్ కమ్. ఐయామ్ హేపీ. సీ... దెన్' రంజిత్ అన్నాడు.

"థేంక్యూ అంకుల్' అంటూ ఫోను పెట్టేసింది కౌస్తుభ.

ఎస్.పి. రంజిత్ ఆ రాత్రి డి.ఎస్.పి. ప్రసాదరావు కోలుకొంటున్న ఆసుపత్రి దగ్గర ఉండ




డానికి నిశ్చయించుకొని ఆ ఏర్పాట్లు చేసుకొన్నాడు. తర్వాత తన క్వార్టర్స్‌కి చేరుకొని డిన్నర్ పూర్తిచేసి ఆసుపత్రికి చేరుకొన్నాడు.

ప్రసాదరావు గదిలోనే తన మకాం ఏర్పాటు చేసుకొని మఫ్టీలో పదిమందిని ఆసుపత్రి దరిదాపుల్లో ఉంచాడు. పోలీసు ఫోర్సును అప్రమత్తంగా ఉండమని హెచ్చరికలు జారీచేశాడు.

సి.ఐ. రాజారాం కదలికలమీద నిఘా ఉంచాడు. ఎస్.పి. రంజిత్ మనసులో ఆలోచనలు సాధారణంగా బయటకు రావు. అవి అమలు అవుతాయి. అప్పుడే అతని వ్యూహం అర్థం అవ్వాలి. అది అందాకా అందర్నీ తప్పుదారి పట్టిస్తుంది. అధికారులు ఒకొక్కరూ ఒక్కోవిధంగా ప్రవర్తిస్తుంటారు. కొందరు పైకి చాలా హడావిడి చేసి వ్యవహారాలు సున్నితంగా నిర్వహిస్తారు. నిజాయితీ అనేది చాలా గొప్ప పదం. ఎవరు నిజాయితీ లేకుండా ఉంటారు? ఏ ఒక్కరూ తమ నిజాయితీమీద చిన్న మచ్చపడడానికి కూడా ఒప్పుకోరు. తమంత నీతినిజాయితీలున్నవారు మరెవరూ ఉండనట్లే అందరూ ప్రవర్తిస్తుంటారు. అధికారబలమో... మత్తో తెలియని ఒక ఊహలో వారు తేలిపోతూ తమ ఆలోచనలను అమోఘంగా ఊహించుకొని ఎదుటివాళ్ళ నిజాయితీని దుయ్యబడుతుంటారు.

రంజిత్ చాలా తెలివైన పోలీసాఫీసరుగా పేరుతెచ్చుకొన్నాడు. అక్కడకు తానెలా వచ్చిందీ... తన ముందున్న ఎస్.పి. ఎలా అవమానపడిందీ రంజిత్‌కి తెలియని విషయం కాదు. తాను జాయిన్ అయిన నాటినుంచీ ఫైళ్లు పరిశీలిస్తూనే ఉన్నాడు. అందరి గోత్రాలూ తెలుసుకోవడానికి తన సునిశితమైన విధానాలను తాను అనుసరిస్తూ ముందుకు సాగుతున్నాడు.

ఆ రాత్రి ఎస్.పి. రంజిత్ ఇంటికి నాలుగైదు సార్లు జిల్లా ఇన్‌ఛార్జిమంత్రి సోదరుడు ఫోను చేశాడు. ఎస్.పి. ఇంట్లో లేడు.

"ఈ కొత్త ఎస్.పి. ఏం చెయ్యబోతున్నాడు..."

"కరుణాకర్ కేసుకీ ఇతనికీ ఉన్న సంబంధం ఏమిటి?"

"సి.ఐ రాజారాంని ఇరకాటంలో ఎందుకు పెడుతున్నాడు?"

"కొత్త ఎస్.పి. విధానాలకు అర్థం ఏమిటి?"

అర్థంకాని వర్గాలు అనేక ఆలోచనలతో సతమతమవుతున్నాయి.



"వనజగారూ... ఎలాగైనా ఈ గొడవలోంచి మా అన్నయ్యని మీరే కాపాడాలి. మీరేం చెయ్యమంటే అది చేస్తాను. డి.ఐ.జి.గారు తలుచుకుంటే బయటపడటం చాలా తేలిక అని అందరూ అంటున్నారు. నా స్నేహాన్ని దృష్టిలో ఉంచుకొనైనా ఈ సహాయం చేసిపెట్టండి'' ఎంతో అర్థింపుగా రూపాదేవి వనజను అడుగుతోంది.

"రూపాదేవిగారూ... మీరు చెబితే నమ్మరు గానీ నేను ఆయన పనిలో ఏనాడూ కల్పించుకోలేదు. ఆయన అసలు ఈ విషయాన్ని పట్టించుకుంటారో.. లేదో... నేను చెప్పినా జరుగుతుందో... లేదో. మీమాట కాదనలేక నేను చెప్పినా ఆయన మొండికెత్తారనుకోండి. ఇంకా కష్టంకదా. ఆయనకి మన జిల్లామంత్రులు బాగా తెలుసు. ఎవరిచేతనయినా చెప్పిస్తే బాగుంటుందేమో..." వనజ తెలివిగా తప్పుకోబోయింది.

"అది కాదండీ... మంత్రులూ...ఎం.ఎ ల్.ఏ.ల అధికారం ఎంత సేపండీ. ఏదో పదవి ఉన్నంతకాలం. డి.ఐ.జి.గారిది అలాకాదు కదాండి. మీరుండగా... ఏ చింతా పడవద్దని నేను అన్నయ్యకు మాట ఇచ్చేశాను. నామాట కాపాడే బాధ్యత మీదే. ఇది చాలా పరువుతో కూడుకొన్న విషయం వనజగారూ. మన



సర్కిల్‌లో మీరు తప్ప ఈ విషయంలో ఎవరూ కాపాడలేరు. ప్లీజ్... ఈ ఒక్కసారికి ఎలాగోలా డి.ఐ.జి.గారికి నచ్చచెప్పండి'' రూపాదేవి పదేపదే బతిమాలుతోంది.

తన హైక్లాస్ సొసైటీలో అత్యంత విలువ ఉన్న రూపాదేవి బేలగామారి తనను అర్థించడం ఓరకంగా గర్వంగా అనిపించినా... తనమాట సాగుతుందా లేదా అనే అనుమానం వనజ మనసులో ఓ రకం భయాన్ని కలిగిస్తోంది. భర్త ఆ పని చెయ్యకపోతే తన పరువు ఈ సర్కిల్‌లో ఏమాత్రం ఉండదు. వీళ్లు ఎంతలా బతిమాలగలరో అంతలానూ విమర్శించగలరు. అవసరం ఆమెది కనుక ఎంత స్థాయినుంచైనా దిగివచ్చి తనను



బతిమాలుతోంది. అవసరం తీరింతర్వాత ఓ డిన్నరు పారేసి కళ్లు ఎగరేస్తుంది. అలా అని మరీ బతిమిలాడించుకోవడం బాగుండదు. ఎలాగైనా ఈ విషయంలో తన భర్తను ఒప్పించాలి అని నిర్ణయించుకొంది.

అప్పుడు వివరాలలోకి దిగారు ఇద్దరూ.

ఆ పట్నంలో రూపాదేవి అన్నగారికి ప్రయివేటు నర్సింగ్‌హోం ఉంది. అతనూ... అతని స్నేహితులు ఆరుగురూ కలిసి వివిధ ప్రదేశాల్లో ప్రయివేటు ఆసుపత్రులు నెలకొల్పారు. అందరూ గల్ఫ్‌వంటి దేశాలనుంచి తిరిగి వచ్చినవారే. ఒకరు పెద్ద లాబ్ పెడితే మరొకరు అత్యాధునిక స్కానింగ్ సెంటర్ ఏర్పరచుకొన్నారు. ఆ ఏడుగురి దగ్గరా ఆధునిక వైద్య విధానాలకు సంబంధించిన అల్ట్రా మోడరన్ ఎక్విప్‌మెంట్ ఉంది. ఎంతో ఖర్చుపెట్టి ఆ ఎక్విప్‌మెంట్ పెట్టుకున్న తర్వాత వాటి నిర్వహణ ఖర్చులు కూడా రాని గడ్డు పరిస్థితి ఏర్పడింది. ఆ ఏడుగురూ తమ స్థితిగతులు పరిశీలించుకొని ఒక పథకాన్ని రూపొందించారు. దాని ప్రకారం ఒక డాక్టరు దగ్గరకు ఏదైనా రోగంతో ఒక రోగి వెళితే అది ఎంత చిన్న వ్యాధి అయినా ఆ రోగికి రకరకాల వైద్యపరీక్షలు రాయడం. గోరంతలు కొండంతలుగా చేసి ఆ పరీక్షలు ఎంతో అవసరం అని రోగికి లేనిపోని అనుమానాలు కలిగించడం. దాంతో ఆ సదరురోగి పరీక్షలన్నీ చేయించుకొని ఏదైనా ఉంటే కంగారుపడటం. ఏమీ లేకపోతే బిల్లు చూసి బెంగపడటం సర్వసాధారణమయింది. పట్నంలో అలా పరీక్షలు చేయించుకోవడానికి ఎంతోమంది అలవాటుపడిపోయారు.

ముఖ్యంగా మధ్యతరగతివారూ, ఉన్నత కుటుంబాలవారూ ఏ వ్యాధి వచ్చినా వందల్లో, వేలల్లో పరీక్షలనిమిత్తం ఖర్చు పెడుతూ పోతున్నారు. ఇదిలా ఎన్నో ఏళ్ళుగా సజావుగా సాగుతున్నా ఆ వైద్యవ్యాపారానికి ఓ చిక్కు ఏర్పడింది. వరసగా మూడునెలల కాలంలో నలుగురు మరణించారు. ఎక్కడ లోపం జరిగిందో ఆ మిత్రబృందం అర్థం చేసుకునే లోపల 'డాక్టర్ల మోసం' అంటూ పత్రికకు ఎక్కి ఓ మధ్యతరగతి కుటుంబీకుడు నానా గొడవా చేస్తున్నాడు. ఆయన కొడుకు ఓ జర్నలిస్టు. దాంతో పరిశోధనాత్మక వ్యాసాలంటూ పత్రికలో వైద్యవ్యాపారాన్ని పెద్ద స్థాయిలో విమర్శిస్తున్నాడు. ఆపైన తన కూతురు చావుకి ఫలానా డాక్టర్ నవీన్ కారణమంటూ తప్పుడు చికిత్సకు చెందిన డాక్యుమెంట్స్‌తోసహా పోలీస్ స్టేషన్లో కేసు పెట్టాడు. తాను వేరే చోటనుంచి మంచి వైద్యపరీక్షల నివేదిక తెచ్చినా దాన్నికాదని ఆ డాక్టరు ఈ ఆసుపత్రులన్నీ తిప్పించి ఎంతో వ్యయప్రయాసలు కలిగించి వైద్యం పేర సాగించే వ్యాపారానికి తన కన్నకూతుర్ని బలిచేశాడనీ ఆ మధ్యతరగతి కుటుంబీకుడు వాదిస్తున్నాడు.

పోలీసులు ఈ కేసు చేపట్టక తప్పలేదు. ఆ వ్యక్తికున్న పలుకుబడి అలాంటిది. పోలీసులు రంగప్రవేశం చేసి డాక్టర్లు, అందునా బాగా సంపాదించిన వైద్యుల కూటమి విషయం కూపీలాగడం ప్రారంభించేసరికి మరో మూడు కేసులు బయటపడ్డాయి. దాంతో డాక్టర్లకు ఇబ్బందులు ప్రారంభమయ్యాయి.

ఏ వృత్తిలోవారైనా ఆ పనిలో నిపుణులు. సాధారణంగా సమాజంలో డాక్టర్లకు ప్రత్యేక స్థానం ఉంటుంది. వారిపట్ల అభిప్రాయాలు ఎప్పుడూ వారికి అనుకూలంగానే ఉంటాయి. వైద్యులను అపరవిష్ణు అవతారాలుగా భావించడం కూడా జరుగుతుంటుంది. అందుకే 'వైద్యో నారాయణో హరీ' అన్నారు. ప్రాణదాతలైన వైద్యులు ఆరాధ్య దైవాలుగా కొలువబడటం గ్రామీణ ప్రాంతాల్లో నేటికీ ఉన్న వాస్తవం. హస్తవాసి మంచిదయితే ఆ వైద్యుడు తరతరాలుగా కుటుంబ డాక్టరుగా కొనసాగుతాడు. ఎందరో డాక్టర్లు తమ సేవలను దశాబ్దాలుగా ప్రజలకు అందించి... వారు భౌతికంగా లేకపోయినా ప్రజాహృదయాల్లో చిరంజీవుల్లా నిలిచిపోయారు.

గత దశాబ్దకాలంగా అత్యాధునిక వైద్యస




దుపాయాలు మనదేశంలోని అన్ని ప్రాంతాల్లో విస్తరిస్తున్నాయి. ఎన్నో కొత్త వ్యాధులూ... చికిత్సా విధానాలూ కనుకొనబడి ఆచరణలోకి వచ్చాయి. గత ఐదేళ్లకాలంలో ఫైవ్‌స్టార్ ఆసుపత్రులు కూడా విస్తృతంగా వెలిశాయి. నగర, పట్టణ ప్రాంతాలకు ఈ సదుపాయం పెద్ద ఎత్తున చేరిపోయింది. అత్యాధునిక వైద్యసదుపాయాలు లేని పట్టణం కానరావడంలేదు. అన్ని వృత్తుల్లోనూ నైతికవిలువలు పడిపోయినట్లే వైద్యరంగంలో కూడా అవి క్షీణించాయని సుప్రసిద్ధ వైద్యులే స్పష్టంగా ప్రకటిస్తున్న రోజులివి.

దాదాపు మూడు దశాబ్దాల కిందట గ్రామీణ ప్రాంతాల్లో అప్పటికే ఎల్.ఐ.ఎమ్.లాంటి మెడికల్ కోర్సులు చదివి డాక్టర్లయి, అనుభవం సంపాదించిన అనేకమంది ఆపరేషన్లు సైతం సునాయాసంగా చేసేసేవారు. సర్వసాధారణంగా రైతులూ... రైతుకూలీలు... ఇతర వ్యవసాయపనులమీద ఆధారపడేవారూ వరిబీజం, గిలక మొదలైన ఆపరేషన్లను వారి ఖాళీసమయాల్లో చేయించుకొనేవారు.

అయిదు వందల కేండిల్ బల్బు వెలుగులోనూ పెట్రొమాక్స్‌లైటు కాంతిలోనూ గ్రామాల్లో ఎందరో అనుభవజ్ఞులైన ఆనాటి డాక్టర్లు ఆపరేషన్లు కూడా చేసి ప్రజల అవ్యాజ అనురాగాలను చూరగొన్నారు. ఆనాటి డాక్టర్లు ఎక్కువగా ఏ వైద్య పరీక్షల మీదా ఆధారపడలేదనేది నిజం. రోగి తమ ముందుకు వస్తూండగానే చూసి ఆరోగి వ్యాధిని నిర్ణయించగల సమర్థత ఆ వైద్యులకు ఉండేది. రోగులకు వారి స్వభావాన్నిబట్టి వైద్య నిర్ణయం చేసేవారు. కన్నతండ్రిలా, గురువులా ఆనాటి డాక్టర్లు ప్రజలను హెచ్చరించేవారు.

కానీ ఈ రోజుల్లో ఎన్ని వైద్యసదుపాయాలు పెరిగినా ఆసుపత్రులపట్ల అపనమ్మకం పెరుగుతోందే తప్ప డాక్టర్ల పట్ల విశ్వాసం పెరగడంలేదు. కారణం వైద్యరంగంలో వ్యాపార ధోరణులు అనంతంగా అల్లుకుపోవడం అనేది ప్రజాభిప్రాయం.

ఈ నేపథ్యంలో డాక్టర్ నవీన్ లాంటివాళ్లు అవకాశాన్ని సద్వినియోగం చేసుకొంటున్నారు. డాక్టర్లను విమర్శించేముందు ప్రజల పద్ధతులు కూడా ఆలోచించాలనేది డాక్టర్ నవీన్‌వాదన.

"రోగాలు వస్తే ఏదో చిన్న రోగం అని చెప్పి రెండు మాత్రలు ఉచితంగా ఇచ్చి పంపితే ఆ డాక్టర్‌కి ఏం రాదు ఏవో రెండు బిళ్లలు పారేశాడు అంటారు. పైగా వాటితో జబ్బు ఎక్కువయిందని ప్రచారం చేస్తారు. అలాకాక రోగికి అవసరం ఉన్నా... లేకపోయినా పూర్తిగా రకరకాల పరీక్షలు చేయించి ఏవో కొన్ని మందులు ఆఖరికి బలం టానిక్కులైనా ఖరీదైనవి రాయకపోతే వాళ్లు తృప్తిపడరు. అపుడే డాక్టర్లను గుర్తిస్తారు. డబ్బు ఖర్చయితేనే రోగం తగ్గిందనే భావన రోగుల్లో ఉంటే మేమేం చేస్తాం. ఎంత ఎక్కువగా కన్సల్టేషన్ ఫీజు వసూలు చేస్తే అంత గొప్ప డాక్టరు. దీనికి ఎవరేం చేస్తారు?" అంటారు.

ఈ అభిప్రాయానికి కూడా విలువ ఇవ్వక తప్పదు. అలా అని ఆధునిక వైద్య పరిజ్ఞానాన్ని వ్యాపారపరంగానే చూస్తూ ప్రజల ప్రాణాలు హరించే హక్కు ఎవరికీ లేదు. డాక్టర్ నవీన్ కేసులో రోగులు చనిపోయారు. ఆపైనే ఈ వ్యవహారమంతా వెలుగులోకి వచ్చింది.

వనజ ఆలోచనలు సాగుతూండగా రూపాదేవి దగ్గర్నుంచి మళ్లీ ఫోను వచ్చింది.

"వనజగారూ మీరే ఏదో రకంగా ఈ ఇబ్బంది నుంచి మా అన్నయ్యను బయటపెట్టాలి. చూడండి... మీ అమ్మాయి కూడా మెడిసన్ చదువుతోంది. ఒక్క సంవత్సరం హౌస్‌సర్జన్ చేస్తే డాక్టరుగా బయటకు వస్తుంది కదా ఎలాగూ మీరిక్కడే సెటిల్ అయ్యారు. ఇల్లు కట్టుకొన్నారు. అమ్మాయి డాక్టరయితే నర్సింగ్‌హోం పెట్టిస్తారు. ఏమంటారు'' రూపాదేవి ఆగింది.

"ఆ... చెప్పండి'' వనజ గొంతులో ఏదో

హుషారు.

"వీళ్లంతా పెద్ద పేరున్న డాక్టర్లు వనజగారూ. మీ అమ్మాయి చదివే మెడికల్ కాలేజీలో వీళ్ల స్నేహితులే ప్రొఫెసర్లుగా ఉన్నారు. మీకు ఏదోరకంగా వీళ్లు ఉపయోగపడేవాళ్లే. ఈ గొడవ ఎలాగోలా సర్దుకొంటే మీరుణం ఎలాగైనా తీర్చుకొంటామని వాళ్లు నా వెంటపడ్డారు. కొంచెం ఆలోచించండి వనజగారూ. ఇది చాలా చిన్న విషయం. ఎవరో జర్నలిస్ట్ వాళ్ల వాడు ఉన్నాడు కాబట్టి నానా హంగామా చేస్తున్నారు. మీవారిని ఎలాగైనా ఒప్పించి ఈ సమస్యని తప్పించండి. ప్లీజ్' రూపాదేవిని దీనంగా అడిగింది.

"రూపాదేవిగారూ నేను శాయశక్తులా ప్రయత్నిస్తాను. ఆయన్ని ఒప్పించడానికి ప్రయత్నిస్తాను. మీరుమాత్రం మా అమ్మాయి సంగతి మర్చిపోకూడదు. ఆ డాక్టర్లు చాలా పెద్దవాళ్లు. వాళ్ల సంగతి తేలిపోగానే మమ్మల్ని మర్చిపోయినా పోతారు. మీరే మరి అమ్మాయి సంగతి చూడాలి'' వనజ అవకాశాన్ని జారవిడువలేదు.

"నన్ను నమ్మండి. ఎట్టి పరిస్థితుల్లోనూ మీ అమ్మాయి కేం ఢోకా ఉండదు. నా సంగతి మీకు తెలుసుగా. అందులోనూ నవీన్ నా అన్నయ్య. మీరసలు సందేహించవద్దు. ప్లీజ్' రూపాదేవి హామీ ఇచ్చింది.

★ ★ ★

ఉన్నత కుటుంబాల్లో సంబంధాలు విచిత్రంగా ఉంటాయి. ఈ ఉన్నత కుటుంబాలు సాధారణంగా మూడు రకాలు.

మొదట్నుంచీ డబ్బూ, పలుకుబడి ఉన్నవారు.

మధ్యతరగతి కుటుంబాల్లో పుట్టి ఉన్నతస్థాయికి ఎదిగినవారు. వీరు క్రమక్రమంగా ఎదగడంవల్ల పరిస్థితులపట్ల అవగాహన ఎక్కువ.

ఇక దిగువస్థాయినుండి అకస్మాత్తుగా ఎదిగినవారూ ఉంటారు. వీరిలో ఎవరైనా తమని కించపరచే విధంగా భావిస్తున్నారేమోననే భయం ఎక్కువగా ఉంటుంది. ఆడంబరాలకూ ఆర్భాటాలకూ వీరిచ్చే ప్రాముఖ్యతకు హద్దు ఉండదు. నడమంత్రపుసిరి గాళ్లు అనిపించుకొనే వీరిలో ఎక్కువభాగం ఎవరన్నా ఏం లెక్కలేని విధంగా ప్రవర్తిస్తుంటారు. ఎంతటివారినైనా తూలనాడేందుకు వెనుకాడరు. చిన్న పొరపాటు జరిగినా తమ దగ్గర పనిచేసేవారి మీద దారుణంగా విరుచుకు పడుతుంటారు. తాము తిడుతూంటే అందరూ విని తమని గుర్తిస్తారని వీరి నిశ్చితాభిప్రాయం. డబ్బు పారేస్తే చాలు ఎలాంటివాడినైనా చేతికిందకి తెచ్చుకోవచ్చుననే ఆలోచన వీరికి అధికంగా ఉంటుంది. కానీ మనసులో ఎక్కడో తమ పూర్వస్థితి మెదులుతూనే ఉంటుంది. అది మర్చిపోవడానికీ, తమ ప్రస్తుత ఉన్నత స్థితిని చాటుకోవడానికి నానా అవస్థాపడుతూంటారు.

మొదట్నుంచీ ఆస్తిపాస్తులుండి సమాజంలో గౌరవ ప్రదంగా భావించబడే కుటుంబాల సభ్యులు చాలా నెమ్మదిగా ఉంటారు. డబ్బు విచ్చలవిడిగా ఖర్చు చెయ్యరు. అవసరం మేరకే ఆచీతూచీ వ్యవహరిస్తూంటారు. ఎవరిపట్లా ఏహ్యాభావంగానీ, చులకనగానీ వీరికి సాధారణంగా ఉండదు. తమ పనులు సాఫీగా జరిగేలా చూసుకునే నేర్పు వీరికి సహజలక్షణంగా ఉంటుంది. వీరిపట్ల అందరూ అభిమానంతో వ్యవహరిస్తూ పనులు చెయ్యాలని అనుకొంటూ ఉంటారు. అంత ఆస్తి ఉన్నా, పరపతి పెరుగుతున్నా వాళ్లు చాలా మర్యాదస్తులు అనే విధంగా ప్రవర్తిస్తూంటారు. అందరిచేత మంచివాళ్లు అనిపించుకోవాలనే తాపత్రయం వీరికి ఎక్కువగా ఉంటుంది. అందరిచేత మంచి అనిపించుకోవడం చాలా కష్టమైన పని. అలా అనుకోవడంలోనే పరమస్వార్థం ఉందనే వాదనను వీరు పెద్దగా పట్టించుకోరు. తమకు సంబంధించిన విషయాల్లోనే కల్పించుకొంటూ ఎంత అత్యవసరమైనా ఇతర వ్యవ





హారాల జోలికి వెళ్లకపోవడం ఈ వర్గంలోని అత్యధిక శాతంమంది ఆచరించే ప్రాథమిక సూత్రం.

ఇక మధ్యతరగతినుండి ఉన్నత వర్గాలకు ఎదిగినవారు చాలా లౌక్యంగా ఉంటారు. వీరిదగ్గర మర్యాదలు ఎక్కువగా ఉంటాయి. అభిమానాలూ మెండుగానే కనిపిస్తాయి. నావాళ్లు, మనం, మేము అనే ఆప్యాయతలు ఉన్నా అవి సమానస్థాయి వారికే పరిమితం అవుతూంటాయి. డబ్బు విషయంలో చాలా జాగ్రత్తగా ఉంటారు. దీనంగా మాట్లాడరుకానీ అవసరమయితే ఎంత డబ్బు ఖర్చుపెట్టడానికైనా వెనుకాడరు. ఆ అవసరాలు తప్పనిసరి అయితేనే ఖర్చు చేస్తారు. వీరిలో చాలామంది ఉన్నతాధికార కుటుంబాలవారూ, ప్రయివేటు రంగానికి చెందిన ఉన్నతస్థాయీ పర్యవేక్షకులు, వ్యాపారంలో క్రమక్రమంగా పైకి వచ్చిన వారూ ఉంటారు.

ఈనాడు సర్వత్రా అలముకొన్న పరిస్థితుల ను పరిశీలిస్తే నాయకులకంటే కూడా ఎక్కువ సౌకర్యాలు, సౌలభ్యాలు అధికార వర్గానికే ఉన్నాయి. పదవి, పరపతి ఆధారాలుగా లేకపోతే నాయకుల విలువ ఏపాటిదో అధికారవర్గానికి బాగా తెలుసు. అనేక సందర్భాల్లో నాయకులకు అడ్డం తిరిగి తమ అధికారాన్ని నిలుపుకొన్నవారు పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొన్నారు. కానీ వారికి వ్యక్తిగత జీవితం వేదనాభరితంగానే ఉంటుందనేది రుజువైన వాస్తవం.

ఉన్నతాధికారులు రాజకీయ నాయకుల కంటే ఎక్కువ వ్యవహారాలను తరచుగా చూస్తూంటారు. పదవీ విరమణ వయసు వరకూ వారికి పదవులుంటాయి. అందుకే పదవీ పరిరక్షణే ధ్యేయంగా నడుచుకొంటారు. ఉన్నతాధికార వర్గం తలుచుకుంటే ఏదయినా సాధించగలదనే పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

అధికారంలోకి వచ్చిన ఉన్నతాధికారులు అనేక రకాలుగా ప్రవర్తిస్తుంటారు. ఒకరు తమ స్వంతవారి ప్రయోజనాలకు ముడిపెడుతూ పనులు చేస్తారు. అటునాయకులనూ నొప్పించకుండా, తాముా నష్టపడకుండా నడచుకొనే వారే అధికంగా ఉన్నారు. పోలీసుశాఖలోని అధికారులకు అన్ని సంగతులూ వివరంగా తెలుస్తాయి. అందుకే కొంచెం ముందుకెళ్లి ప్రవర్తించేవారూ ఉన్నారు. సిన్సియారిటీ, క్రమశిక్షణ, నీతినియమాలు సమాజంతోపాటే ఆ శాఖలోనూ తగ్గాయి. ఉన్నతాధికారుల పార్టీల్లో మధుపానాసక్తులై ఆ మత్తు తలకెక్కగా మిగతావారందరినీ తూలనాడే గొప్ప అధికారుల సంగతి పోలీసుకంటే ప్రజలకు తక్కువ తెలుసు. సకల గుణాభిరాములై, స్త్రీలోలులై, అభినవరసిక సామ్రాజ్య చక్రవర్తుల్లా కింది అధికారులను ఆ పనులకే వినియోగించే అసాధారణులూ ఉన్నారు. పనులు ముఖ్యం కాబట్టి ఆ ఉన్నతాధికారుల మనోవాంఛలను తీర్చే అగ్రగణ్యులూ కోకొల్లలు. వారి సంప్రదాయాల ను అలవరచుకొనే శిష్యగణం కూడా వారికి ఉంటుంది.

వారెలాంటివారైనా కుటుంబ సభ్యులు మాత్రం పరువు మర్యాదలకు ఏమాత్రం లోటురానివ్వకూడదు. వారి స్నేహితులూ, పరిచయాలు, అలవాట్లు, హాబీలు అన్నీ తమకు సమాన స్థాయిలోనే ఉండాలి.

కానీ కాలం వేగంగా మారుతోంది. యువతీ యువకులు చాలా తెలివిగా తమ చిత్తానుసారమే ఉంటూ, పెద్దల అభిప్రాయాలకు ఎంతో విలువ ఇస్తున్నట్లుగా నటిస్తున్నారు. బహుశా ఆ వారసత్వం ఆ పెద్దలనుంచే ప్రాప్తించిందేమో.

★ ★ ★

"ఏం కౌస్తుభా... పొద్దున్నే ఇలా వచ్చావ్...?" ఎస్.పి రంజిత్ నవ్వుతూ అన్నాడు.

"జయా... ఎవరొచ్చారో చూడు'' గట్టిగా

అన్నాడు.

జయ లోపల్నించి వచ్చి కౌస్తుభని చూసి నవ్వుతూ "కాలేజీలేదా'' అనడిగింది.

"మూడురోజులు సెలవలు ఇచ్చారు ఆంటీ" కౌస్తుభ మామూలుగా మాట్లాడింది.

"కాఫీ తాగుతావామ్మా'' రంజిత్ అభిమానంగా అడిగాడు.

"ఒకే... అంకుల్" కౌస్తుభ కొంచెం సీరియస్‌గా అంది.

జయ కాఫీ చెయ్యడం కోసం లోపలికి వెళ్లింది. కౌస్తుభ సీరియస్‌గా ఉండటం రంజిత్‌కి ఆశ్చర్యంగా అనిపించింది.

"ఏమ్మా... ఏదైనా ప్రాబ్లమ్...?" అడిగాడు.

"ఏం లేదంకుల్. మీరు కరుణాకర్ కేసుని మళ్లీ ఇన్వెస్టిగేట్ చేస్తున్నారట" ఆ మాటలకు రంజిత్ ఆమె ముఖంలోని అభిప్రాయాలు చదవడానికి చూశాడు.

"కరుణాకర్ కేసుకీ... నీకూ సంబంధం ఏమిటమ్మా. ఆ గొడవ నీకెందుకూ?" ఎందుకో ఆ అమ్మాయి ఆ విషయం మాట్లాడటమే నచ్చినట్లు లేదతనికి.

"ఏం లేదు అంకుల్. కరుణాకర్ ఫ్రెండ్ ఒకతను నా క్లాస్‌మేట్ ప్రియంవద బ్రదర్. అతన్ని అన్యాయంగా చంపేశారట. కరుణాకర్ మీధ కక్ష ఉంటే ప్రియంవద బ్రధర్‌ని ఎందుకు చంపాలో అర్థం కాలేదు. ఆ అమ్మాయి చాలా బాధపడుతోంది. వాళ్ల ఫేమిలీకి అతను తప్ప మరో ఆధారం లేదు. నిజంగా అది దారుణం అంకుల్" కౌస్తుభ బాధగా అంది.

"ప్రియంవద బ్రదర్ అంటే?" రంజిత్ అడిగాడు.

"అతని పేరు కల్యాణ్" కౌస్తుభ ఎస్.పి రంజిత్‌కేసి చూస్తూ చెప్పింది.

"అతను ఏం చేస్తూ ఉండేవాడు?"

"జూట్‌మిల్లులో సూపర్‌వైజర్‌గా పనిచేసేవాడట. కరుణాకర్, కల్యాణ్ క్లాస్‌మేట్స్ అని ప్రియంవద చెప్పింది''

"కల్యాణ్‌ని కూడా ఆ రోజే చంపేశారు కదూ! ఛ ఇడియట్స్ నలుగురు యువకుల్ని చంపేశారు'' రంజిత్ అసహనంగా అన్నాడు.

"అది ప్లాన్డ్ మర్డర్ అంటున్నారు అంకుల్. కల్యాణ్‌కీ లోకల్ లీడర్స్‌కీ పడేదికాదట. ఏదో జూట్‌మిల్ వర్కర్స్ సమస్యలో అతను ఎదురు తిరిగాడట. కల్యాణ్‌కి కరుణాకర్ ద్వారా నచ్చచెప్పించడానికీ ఆ లీడర్స్ ప్రయత్నించారట. కల్యాణ్, కరుణాకర్ కూడా వాళ్లమాట వినలేదట" కౌస్తుభ చెబుతోంది.

"ఈ విషయాలన్నీ నీకెలా తెలిసాయమ్మా?" సౌమ్యంగా అడిగాడు రంజిత్.

"ప్రియంవద ఇంకా చాలా చెప్పింది. నిజానికి డాడీ దగ్గరకు తీసుకురావాలని అనుకొన్నాను. డాడీ అనవసర విషయాల్లో కల్పించుకోవద్దు అని మందలించారు. ఇంక అపుడు ఊరుకొన్నాను. అంకుల్ మీరు కరుణాకర్ కేసు మళ్లీ ఎంక్వయిరీ చేస్తున్నారటగా అందుకే..." ఆగిపోయింది కౌస్తుభ.

"అదిసరే... ఆ లీడర్స్ ఎవరో ఆ అమ్మాయి చెప్పిందా...?"

రంజిత్ ప్రశ్నకు కౌస్తుభ అతన్ని ఆశ్చర్యంగా చూసింది.

"అదేంటి అంకుల్ అందరికీ ఆ విషయాలు తెలుసటగా''

"మీ డాడీకి కూడానా...?" ఉలిక్కిపడే ప్రశ్న వేశాడు రంజిత్.

"ఏమో... తెలుసేమోమరి. ఆయన బిజీకదా ఈ కేసులు చాలా చిన్నగా తీసిపారేస్తారనుకొంటాను'' కౌస్తుభ తన అంచనా అందించింది.

"ప్రియంవద ఎన్నేళ్లుగా నీకు తెలుసు'' రంజిత్ అడిగాడు.

"జస్ట్ నాలుగున్నర సంవత్సరాలుగా''

"ప్రియంవదగానీ ఆమె తరపువాళ్లుగానీ ఎక్కడయినా కేసు పెట్టారా?" రంజిత్ సాలోచ




నగా అన్నాడు.

"లేదనుకొంటా అంకుల్. కానీ ప్రియంవద నాన్నగారు చాలామందిని కలిశారట. అయితే ఏం జరగలేదన్నారు''

రంజిత్ ఆ మాటలకు ఆసక్తిగా చూశాడు.

"ఆయన ఎక్కడుంటారు...?"

"ఈ ఊర్లోనే... పేరు రవీంద్ర. కలక్టరేట్‌లో పనిచేస్తున్నారు''

కౌస్తుభ వెంటనే వివరం అందించింది.

"ప్రియంవదని ఒకసారి తీసుకురానా అంకుల్'' అడిగింది.

"వద్దులేమ్మా.. ఆ అమ్మాయినెందుకు అవస్థపెట్టడం. రవీంద్రగారితో నేను మాట్లాడతాను లే అదిచాలు'' రంజిత్ ప్రశాంతంగా అన్నాడు.

"అంకుల్ మర్డర్ చేసినవాళ్లను నిజంగా పట్టుకొంటారా? వాళ్లు అపుడు తప్పించుకొన్నారుకదా... మళ్లీ... ఎలా?" కౌస్తుభ ముఖం సీరియస్‌గా ఉంది.

"చూడమ్మా... ఇది చాలా కాంప్లికేటెడ్ కేసు. అలా అని మర్డరర్స్ తప్పించుకుపోలేరు. బట్ సరైన ఆధారాలుండాలి. గేప్ చాలా ఉందికదా. అది వాళ్లకు ఎడ్వాన్టేజ్ అవుతుంది. అయినా అందరూ సహకరించాలి'' రంజిత్ వివరించాడు.

"అంకుల్ వాళ్లను అలా వదిలేస్తే... ఇక ఎవరికి మాత్రం ఏం సెక్యూరిటీ ఉంటుంది. ఇలా ప్రాణాలకు ప్రాణాలే ఈజీగా తీసేస్తుంటే... అంతా భయంతో బతకాలి. అలాంటివాళ్లను ఎలాగైనా పట్టుకోవాలి అంకుల్. వాళ్లకి గట్టి పనిష్‌మెంట్ దొరికితేనే మిగతావాళ్లకి బుద్ధి వస్తుంది. అసలు ప్రాణానికి విలువలేకుండా పోతోంది. ఇష్టం వచ్చినట్లు మర్డర్స్ చేసేస్తున్నారు'' కౌస్తుభ కోపంగా చెబుతోంది.

"వాట్ కౌస్తుభా... డోంట్ గెట్ ఎక్సైటెడ్. మనదేశంలో నిత్యం ఏదో ఒక చోట ఇలాంటివి మామూలే. కానీ ఒక విషయం తెలుసా. ఇలాంటి నేరాలు కొంతమందే చేస్తారు. అందరూ చెయ్యలేరుగా.. వాళ్లని మేము పట్టుకొని పనిష్‌మెంట్లు ఇప్పించామనుకో... మరి మర్డర్స్ చేసేవాళ్లు ఎక్కడ దొరుకుతారూ... అందుకే వాళ్లతో అవసరం ఉన్నవాళ్లు ఈ మర్డరర్స్‌ని కాపాడుతూంటారు. అర్థం అయిందా'' అని నవ్వుతూ ఆ చర్చలో మౌనంగా ఇద్దర్నీ గమనిస్తున్న జయకేసి చూశాడు రంజిత్.

"మీ పోలీసులకి అన్నీ ఈజీగానే అనిపిస్తాయి. పాపం కౌస్తుభ ఎంతో సీరియస్‌గా కాఫీకూడా పూర్తిగా తాగకుండా చెబితే మీరు అంత లైట్‌గా తీసుకోవడం బాగోలేదు'' జయ వ్యాఖ్యానించింది.

"విషయం సీరియస్ కానీ మనమెందుకు సీరియస్‌గా ఉండాలి? అనవసర టెన్షన్ ఆలోచనల్ని సరిగా రానివ్వదు'' అర్థమయిందా అదీ సంగతి అనే రకంగా కళ్లతో చూశాడు రంజిత్.

కౌస్తుభ అతని మాటలకు ఎలాంటి స్పందనా లేకుండా ఉండిపోయింది.

"ఈ విషయాన్ని పెద్ద సీరియస్‌గా తీసుకొని ఆలోచిస్తూ నీ మైండ్ పాడుచేసుకోకు కౌస్తుభా. ఇలాంటివి తెలిసినపుడు డిటైల్స్ ఎక్కువగా సేకరించడం మొదలుపెడితే మన మొత్తం ఇంట్రస్ట్ అంతా అటువైపుకే పోతుంది. మాకయితే తప్పదనుకో. నువ్వు చక్కగా చదువుకోవాలి. చదువు పూర్తి చేసుకొని నర్సింగ్‌హోం పెట్టావనుకో మాకందరికీ వైద్యం చెయ్యవచ్చు'' ఏమంటావ్ అన్నట్లుగా నవ్వుతూ చూశాడు రంజిత్.

"ఆ... పోలీసాఫీసరు కూతురుకదా ఆ మాత్రం ఇంట్రస్టు చూపించవచ్చు. రేపు మీ అమ్మాయి ఏం చేస్తుందో... చూద్దాంకదా'' జయ కళ్లు ఎగరేస్తూ అంది.

"అప్పటి సంగతికదా.. చూద్దాం. ఇప్పట్నుంచీ టెన్షన్ పడకు'' నవ్వుతూ అని అక్క.

డనుంచి లేచి వెళ్లిపోయాడు ఎస్.పి రంజిత్.

★ ★ ★

"ఏమయినా ఇది మన అమ్మాయి భవిష్యత్తుకి సంబంధించిన సమస్య. మీరు ఎలాగైనా వాళ్లని ఆ గొడవనుంచి తప్పించాలి'' భార్య వనజ స్థిరంగా చెప్పడం చూసి ఆశ్చర్యపడ్డారు డి.ఐ.జి స్వామి.

"నేను కాదనను. కానీ అవతలి వాళ్లు ఎవరో తెలుసా? పేరున్న జర్నలిస్ట్. అతనికి స్వంత చెల్లెలు. ఈ విషయంలో తల దూరిస్తే నాకేదో సంబంధం ఉందని నా గురించి చెడుగా రాస్తారు. అయినా నీకంత పట్టింపు ఎందుకూ?" స్వామి అడిగారు.

"చెప్పానుగా... డాక్టర్ నవీన్ రూపాదేవి అన్నగారు. అయినా నాకు తెలీక అడుగుతాను. ఆయన్ని అరెస్టు చేసి కోర్టులో కేసుపెడితే మటుకు వాళ్లు నెగ్గుతారా?"

భార్య ప్రశ్నకు స్వామి మెదడు పని చెయ్యనారంభించింది.

"ఎలాగూ ఓడిపోతారు. దానికి ముందే మీరేదయినా చొరవతీసుకొని ఈ గొడవని ఇంతటితో ఆపుచేయిస్తే మనకి మంచి పేరువస్తుంది. రేపు కౌస్తుభకి వాళ్లు తప్పకుండా సహాయం చేస్తారు. రూపాదేవి మాట ఇస్తే వెనక్కిపోదు. ఆవిడ తత్వం నాకు తెలుసు. చాలామంది లేడీస్ ఆవిడ తరఫున నా దగ్గరకు వచ్చారు. డాక్టర్ నవీన్ భార్య కూడా వచ్చింది. వాళ్లంతా పెద్దపెద్ద డాక్టర్లు. కేసులన్నాకా కొన్ని ఫేలవుతాయి. వాళ్లరాత బాగుండకపోతే డాక్టర్ల మీద విరుచుకుపడడం ఏం న్యాయం. దేశంలోని ఎన్ని ఆసుపత్రుల్లో ఎంతమంది చనిపోవడంలేదూ. చనిపోయిన వారినంతా డాక్టర్లే చంపేశారని కేసులుపెడుతూ పోతే ఇక డాక్టర్లు మిగలరు. డాక్టర్లు పేషెంట్లను ఎందుకు చంపుతారండీ! వాళ్లకి చెడ్డ పేరురాదూ. ఒకసారి చెడ్డపేరు వస్తే మళ్లీ అది పోతుందా'' వనజ ఆ విషయంలో అంత వివరంగా మాట్లాడుతూ ఉంటే మౌనంగా వింటూ ఉండిపోయాడు స్వామి.

"ఏమిటీ... ఏం మాట్లాడరు. నేను తప్పు మాట్లాడానా?" వనజ ప్రశ్న.

"లేదు అదే ఆలోచిస్తున్నాను'' ఆయన ఆగాడు.

"ఆలోచిస్తూ కూర్చొంటే ఎలాగండీ... ఏదో ఒకటి చెయ్యండి. మీరు ఎన్ని కేసుల్లో ఎంత మందికి హెల్ప్ చెయ్యలేదూ'' వనజ భర్త సమర్థతను పురికొల్పింది.

"సరే... ఆ డాక్టర్ని నన్ను కలవమని చెప్పు''

డి.ఐ.జి ఆ మాట అనగానే వనజ హాయిగా ఊపిరి పీల్చుకొంది.

ఆ సాయంత్రం డాక్టర్ నవీన్, అతని మిత్రకూటమి డి.ఐ.జి స్వామితో చర్చలు జరిపారు. కేసు పూర్వాపరాలన్నీ ఆయన ముందుంచారు. తమ పరువు ప్రతిష్టలకే ఈ సమస్య పెద్ద అవరోధమని నొచ్చుకొన్నారు. తాము ఆ పత్రిక ఎడిటర్ని కల్సినా ప్రయోజనం లేకపోయిందని విచారపడ్డారు. అవన్నీ స్వామి ఊహించిన అంశాలే కాబట్టి పెద్దగా పట్టించుకోలేదు. సమస్యా పరిష్కారమార్గాన్ని ఆయన ఆలోచిస్తున్నారు.

మాటల సందర్భంలో ఓ డాక్టర్ తాము ఉదయం ఎస్.పి.రంజిత్ని ఒక ఆసుపత్రిలో కల్సినట్లు చెప్పాడు. అదే ఆసుపత్రిలో డి.ఎస్.పి ప్రసాదరావు కోలుకొంటున్నాడు. అక్కడ ఎస్.పి రంజిత్ ప్రసాదరావు దగ్గర స్టేట్మెంట్ కోసం వచ్చాడని ఆ డాక్టర్ చెప్పాడు. కానీ డి.ఎస్.పి పరిసరాలను గుర్తించడం తప్ప మాట్లాడలేదనీ, రాయడానికి ఆయన చేతులు పనిచెయ్యడం లేదనీ డాక్టర్ వివరించాడు.

ఎస్.పి రంజిత్ ప్రసాదరావు దగ్గర స్టేట్మెంట్కి వెళ్లడం డి.ఐ.జికి అసాధారణంగా అనిపించలేదుగానీ, ఎందుకా ప్రయత్నం అనే ప్రశ్నకు ఆయనకి సరైన సమాధానం దొరకడంలేదు.

 

"ఎస్.పి రంజిత్ చురుకైనవాడు. డి.ఎస్.పి ప్రసాదరావు కొత్తగా ఏవైనా వివరాలు అందిస్తాడేమోనని ప్రయత్నిస్తున్నాడా? తనను చాలా సార్లు కలిసినా ఆ ప్రసక్తే రంజిత్ తేలేదు. బహుశా అనవసరం అనుకొన్నాడేమో''

స్వామి ఆలోచనలను భంగపరుస్తూ డాక్టర్ ఎస్.పి తనతో మాట్లాడిన విషయాల్ని ఏకరువుపెట్టాడు. 'ఎస్.పి రంజిత్ చాలా తెలివైనవాడు' అనుకున్నాడు డి.ఐ.జి.

"ఆయన చాలా తమాషాగా మాట్లాడారండీ. కేసు నడుస్తోందిగా... నడవనివ్వండి మీరు డాక్టర్లు, మెడిసన్‌లో మీకు తెలిసిన సూక్ష్మాలు అవతలివాళ్లకు తెలియవుగా, వాళ్లకి ఇదో లూజింగ్‌కేసు... ఎక్కడ తప్పు జరిగిందనేది తేల్చాలంటే ప్రస్తుతం కుదిరే పనికాదుగా... పోస్టుమార్టం రిపోర్టు ఇచ్చిందీ డాక్టరే కదా. ఆ కాంప్లికేషన్లూ ఆ రియాక్షన్లూ ఎలా వస్తాయనేది వైద్య నిపుణులు తేల్చి చెప్పాలి. మీరంతా నిపుణులే. మీకేసులో ఎంక్వయిరీ కోసం ఎవర్నో పెద్ద డాక్టర్ని వేస్తారేమో. అంతకన్నా ఎవరు మాత్రం ఈ విషయంలో చెప్పే కొత్త విషయం ఉండదు' అలా ఆయన చాలా సేపు జరగబోయే వ్యవహారాన్ని మాట్లాడారు'' అంటూ డాక్టర్ విపులీకరించాడు.

"మరి మీరేమన్నారు?" డి.ఐ.జి స్వామి అడిగాడు

'ఆయన చెప్పింది వినడం తప్ప. మేము ఏం మాట్లాడలేదండి. అందుకే మీ దగ్గరకు'' ఆగి డి.ఐ.జి కేసి చూశాడా డాక్టర్.

"మీరు ఓ పని చెయ్యండి. రేపు మార్నింగ్ ఓసారి నన్ను కలవండి. ఈలోగా ఏదో ఒకటి చెయ్యడానికి ప్రయత్నిస్తాను. డోంట్‌వర్రీ. ఐ.విల్ లుక్ ఇన్‌టు ద మేటర్'

డి.ఐ.జి హామీ వాళ్ల మనసుల్ని తేలిక పరచింది.

వాళ్లు వెళ్లిపోయాక డి.ఐ.జి సమస్యను లోతుగా ఆలోచించారు.

అపుడు గుర్తుకొచ్చాడు రషీద్.

క్రైంరిపోర్టర్ రషీద్‌ని రంగంలోకి దింపాలనుకున్నాడు. డి.ఐ.జి స్వామి సమర్థతకు పదును పెట్టేవి అలాంటి చిక్కు సమస్యలే.

రషీద్ అపుడు రంగప్రవేశం చేశాడు.

తాను ఎక్కడా కనిపించకుండా రషీద్‌తో వ్యవహారాన్ని నడపడానికి స్వామి వ్యూహరచన చేశారు.

రషీద్ తనతోటి జర్నలిస్ట్‌ని కలిశాడు. అసలు విషయాన్ని కదపడానికి అనువైన స్థలంలో సహచర పాత్రికేయుణ్ణి కూర్చోపెట్టాడు. ఏదో మాటలు సాగాయి. అలవాటైన నిషా మాటలకి అడ్డం రాలేదు. ఆ జర్నలిస్ట్ శ్యాంప్రసాద్‌కి రషీద్ గురించి తెలియనిదేం లేదు. రషీద్ మంచివాడు. అందరికీ పనికివచ్చే రషీద్‌కి పోలీసు సంబంధాలు ఎక్కువగా ఉన్నాయి. మంచి క్రైం రిపోర్టర్ అనిపించుకొంటున్నాడు. అపుడపుడు అతనితో అలా కూర్చోవడం సాధారణ విషయం.

"చూడు శ్యాం. ఏ విషయాన్నయినా తెగే వరకూ లాగకూడదు. నీకు వివరంగా చెప్పేటంత వాడ్నికాదు. పోయిన మనిషా తిరిగిరాదు. డాక్టర్లను ఎంతవరకూ లాగాలో అంతదాకా లాగేశావు. నీకు తెలియందేం కాదు. కావాలని ఎవరూ చంపరుగా..." రషీద్ అన్నాడు.

రషీద్‌కేసి శ్యాంప్రసాద్ చురుగ్గా చూశాడు. ఎందుకా టాపిక్ ఎత్తాడనే విషయాన్ని ఆలోచించడానికి పూనుకున్నాడు. రషీద్ అనుభవం ఉన్నవాడు కాబట్టి ఆ ఆలోచనలను వెంటనే కనిపెట్టాడు.

"ఈ విషయం నేనెందుకు ఎత్తానని అనుకొంటున్నావా...? దానికి కారణం ఉంది. నేను నీ విషయాన్ని పూర్తిగా తెలుసుకొన్నాను. ఎందుకంటే అందులో క్రైం ఎలిమెంట్ ఉంది కదా'' రషీద్ తన వివరణ ఇచ్చాడు.

"నీకెందుకు తెలీదు రషీద్. కానీ ఆ డాక్టర్లు చేసింది చాలా అన్యాయం, దుర్మార్గం" గట్టిగా




అన్నాడు శ్యాం.

"నిజమే శ్యాంప్రసాద్ 'దటీజ్ శాడ్' నాకూ చాలా బాధ కలిగింది. దట్ డాక్టర్ ఈజ్ ఎ ఫూల్' రషీద్ శృతికలిపాడు.

"నా చెల్లెలు పోయిందనే బాధతో ఆ రిపోర్టులు రాయలేదు రషీద్. మరో సోదరికి అలాంటి అన్యాయం జరక్కూడదనే ఉద్దేశ్యంతోనే డాక్టర్ల అవినీతిని ఎండగడుతున్నాను'' శ్యాం చెప్పాడు.

"నాకు తెలీదా శ్యాం. ఈ రిపోర్టులు రాసినంతమాత్రాన నీ చెల్లెలు బతికివస్తుందని ఎందుకనుకొంటావ్. నీ ఉద్దేశం కరక్ట్. ఆ డాక్టర్ల వ్యవహారాన్ని మొత్తం బయట పెట్టావు. వాళ్ళల్లో కూడా సంచలనం రేగింది. ఎక్కడ తప్పు జరిగిందాని వాళ్ళల్లో వాళ్ళే కలవరపడుతున్నారు. నేననేది ఏమంటే వాళ్ళు కావాలని చంపుతారా శ్యాం" రషీద్ అడిగాడు.

"కావాలని ఎందుకు చంపుతారు. అలా అని నేను అనలేదే'' ఆ రకంగా కొంచెం పట్టు సడలించిన శ్యాంప్రసాద్‌ని రషీద్ మంచి మాటలతో తనవైపు తిప్పుకొన్నాడు. తన అనుభవాన్నంతా రంగరించి శ్యాంప్రసాద్‌ని ఆకట్టుకొన్నాడు.

"డాక్టర్లకు తగిన గుణపాఠం అయింది. మిగతా వాళ్ళకీ ఇదొక ఛాన్సు ఇచ్చింది. వాళ్లూ ఈ డాక్టర్లమీద మండిపడ్డారు. ప్రస్తుతం డాక్టర్ నవీన్ క్షమాపణ చెప్పుకోవడం కోసం ఎదురుచూస్తున్నాడు. నేనూ అతనితో మాట్లాడాను. చాలా బాధపడ్డాడు. వాళ్ళ కుటుంబానికి ఎంతో రుణపడిఉంటానన్నాడు. చనిపోయిన నీ చెల్లెల్ని తిరిగి తేలేకపోయినా... వాళ్లు మీ కుటుంబసభ్యులందరికీ ఫ్రీ మెడికల్ కార్డులు ఇస్తామన్నారు. అందరికీ ఈ సౌకర్యం లభిస్తుంది. నష్టపరిహారంగా లక్షరూపాయలదాకా ముట్టచెబుతామన్నారు. దాంట్లో భాగంగా బిల్లులు కింద కట్టిన డబ్బు వాపసు చేస్తారట. కోర్టుల కెక్కి కేసులు నడిపి అనవసరంగా మీ కుటుంబాన్ని ఇబ్బందుల పాలు చెయ్యకుండా చూడు. నేను మిగతా సంగతులన్నీ చూసుకొంటాను. నువ్వు 'సరే' అను చాలు'' అంటూ రషీద్ అనేకరకాలుగా ఆ విషయాన్ని శ్యాంప్రసాద్ ముందుంచాడు.

తాను చెప్పిన మార్గం మంచిదని శ్యాంప్రసాద్ ఒప్పుకునే వరకూ రషీద్ తన తెలివితేటల్ని వాడటం ఆపలేదు.

ఆ తర్వాత ఇద్దరు పాత్రికేయ మిత్రులూ మత్తుగా వీడ్కోలు చెప్పుకొన్నారు.



అతిసాధారణమైనవి అసాధారణంగా అసాధారణ విషయాలు సర్వసాధారణంగా మారిపోవడం బహుశా ప్రకృతి విచిత్రం కావచ్చు.

కొన్ని సందర్భాల్లో చిన్న విషయాలు కూడా భయానక ఫలితాలను ఇస్తూంటాయి.

ఎంతో పెద్ద ప్రమాదం సంభవించి అందులోంచి అందరూ ప్రాణాలతో బయటపడిన సందర్భాలూ ఉన్నాయి. క్షణంలో స్టీరింగ్ అదుపుతప్పి అలవాటుపడిన రోడ్డుమీద ప్రమాదాలు సంభవించి బస్సులోంచి ప్రయాణీకులంతా దుర్మరణం పాలయిన ఉదంతాలూ ఉన్నాయి.

ఇటీవలికాలంలో వెంకటగిరి పొలాల్లోకి దూసుకువెళ్ళిన విమానంనుంచి అందరూ క్షేమంగా బయటకు వచ్చారు. అదో అద్భుత సంఘటన. అనేకమంది సినీప్రముఖులు అలా క్షేమంగా ప్రమాదంనుంచి తప్పించుకోవడం

అపూర్వమనిపిస్తుంది.

అలాంటి అద్భుత... అపూర్వ సంఘటనే డి.ఎస్.పి. ప్రసాదరావు కోలుకోవడం.

అది ఓ వర్గానికి గొడ్డలిపెట్టులా ఉంది. కానీ ఆ పరిస్థితి చక్కదిద్దుకోవడం వారికి తెలియదని ఎందుకు అనుకోవాలి?

ఆ డి.ఎస్.పి. ఆరోగ్యాన్ని కంటికి రెప్పలా కాపాడిన ఎస్.పి. రంజిత్ మనసు మాత్రం ఆనందంగా వుంది.

డి.ఐ.జి. స్వామి కూడా ప్రసాదరావుని పలకరించి తన శుభాకాంక్షలు అందించి ఆనందపడ్డాడు.

పోలీసు వర్గాల్లో సంతోషం తాండవమాడింది. ముఖ్యంగా సి.ఐ. రాజారాం ఎక్కువ ఆనందపడ్డాడు.

రాజారాం సంతోషించడానికి ముఖ్యకారణం ప్రసాదరావు ద్వారా ఎస్.పి. రంజిత్‌కి అన్ని వివరాలు తెలిసిపోతాయి. తనపై ఎస్.పి.కి ఉన్న అనుమానం తొలగిపోతుంది. ఆ అనుమాన అధికార పరదాలు ఇకనుంచి తనను వేధించవు. కరుణాకర్ మర్డర్ విషయంలో ఆనాడు తనకి సలహాలు ఇచ్చిన వ్యక్తి ప్రసాదరావే.

రాజారాం అనేకసార్లు తన దైవానికి నమస్కరించుకొన్నాడు. తేలికయిన హృదయంతో హాయిగా తిరుగుతున్నాడు.

ఎస్.పి. రంజిత్ కుటుంబంతో సహా వచ్చి చాలాసేపు ప్రసాదరావుతో ముచ్చటించాడు. డి.ఎస్.పి. ప్రసాదరావు పోలీసులకు తన స్టేట్‌మెంట్ ఇచ్చాడు. దాంట్లో తనపై దాడిచేసినవారిని ఎవరినీ గుర్తుపట్టలేనని స్పష్టం చేశాడు. దొంగతనంగా వచ్చి తనపై దెబ్బతీసిన మూక ముందుగా పొగబాంబులు విసరడంతో ఎవరికీ ఏదీ కనిపించని స్థితి ఏర్పడిందనీ, ఆ పైన తలపై తగిలిన బలమైన దెబ్బకీ తనకు ఏం జరిగిందో తెలియకుండా పోయిందని వివరాలు ఇచ్చాడు. అధికారపరమైన ఆ మాటల రాతలు అయింతర్వాత ఎస్.పి. రంజిత్ డి.ఎస్.పి. ప్రసాదరావుని కలిశాడు.

"మీకు ఎవరిమీదయినా అనుమానం ఉంటే చెప్పండి. కొందరు పాత స్మగ్లర్లు రాజా గ్రూపువాళ్లు అని అంటున్నారు. ఇంకొందరు కరుణాకర్ వ్యక్తులంటున్నారు. వాళ్ళు కాకపోతే ఇంకా ఎవరైనా ఉన్నారంటారా..." ఎస్.పి. రంజిత్ ప్రేమగా అడుగుతున్నాడు.

"అదేంలేదు... నువ్వు అనవసరంగా కంగారుపడకు రంజిత్. పాపం. రాజారాం ఎలా ఉన్నాడూ...?" ప్రసాదరావు వాకబు చేశాడు.

"సి.ఐ. రాజారాం బయటే ఉన్నాడు. పిలవనా? అతనూ... ఆ సుబ్బరాజు మనుషులికీ, మంత్రి కొడుకు గ్యాంగ్‌కీ దగ్గరంటున్నారు'' రంజిత్ తన అనుమానాన్ని వ్యక్తంచేశాడు.

"అందరూ... అందరికీ దగ్గరే. పోలీసులకు పర్మనెంట్ శత్రువులూ, మిత్రులూ ఉంటారా... కరుణాకర్ మర్డర్ జరిగిననాడు అతను కంగారు పడుతోంటే నేనే ధైర్యంగా అతన్ని ప్రోత్సహించాను. అసలే కొంచెం కంగారు. ఆపైన భయస్థుడు. లోపలికి పిలు'' ప్రసాదరావు రంజిత్‌కి చెప్పాడు.

"అలాగే బాబాయ్'' అంటూ సి.ఐ. రాజారాంకి కబురుపెట్టాడు రంజిత్.

అప్పుడు తెలిసింది రాజారాంకి ప్రసాదరావు, రంజిత్ బాబాయ్ అని. దాంతో మనసు విప్పి మాట్లాడాడు. వాళ్ల చర్చ కరుణాకర్ మర్డర్‌నుంచి ప్రారంభమయింది.

"ఆరోజు సార్ చెప్పినట్లే ఆ స్థలానికి వెళ్ళాను సార్. అక్కడ ఏ సమాచారం ఎలా దొరుకుతుందో? అలాగే ఎఫ్.ఐ.ఆర్. రాసెయ్యమన్నారు. నేను అలాగే చేశాను. ఆ మర్నాడే సార్‌మీద దాడి జరిగింది. నాకు మతిపోయినట్లయింది. ఆయన ఎందుకలా చెప్పారో తెలీదు. పైగా అక్కడ బాడీలు లేవు. కొందరు నలుగుర్ని చంపారంటారు. ఇంకొంతమంది ముగ్గుర్నే అంటారు. ఎంతమందిని చంపారనేది కూడా పెద్ద సమస్య అయింది సార్'




సి.ఐ. రాజారాం మాటలు మనసులోంచి వస్తున్నాయి.

"ఇదిగో చూడండి రాజారాంగారూ. మిమ్మల్ని ఆ వివరాలు అంత లోతుగా ఎందుకడిగానో తెలుసా? ఆ హంతకులకీ మా బాబాయ్ మీద అటాక్ చేసిన వాళ్ళకీ సంబంధం ఉందేమోనని నా మొదటి అనుమానం" రంజిత్ తన ఆలోచనను బయటపెట్టాడు.

"లేదబ్బాయ్. వాళ్ళకి కరుణాకర్ అడ్డంగానీ, నేను కాదుగా" ప్రసాదరావు ఆగాడు.

"మీరు అడ్డం అని కాదు. ఆ కేసులో వాళ్ళని మీరు పట్టుకోవచ్చుకదా. అందుకే ముందుగానే" రంజిత్, ప్రసాదరావుని చూస్తూ అన్నాడు.

"ఒక మర్డర్ ఎఫైర్‌లో ఉన్నవాళ్లు, వెంటనే పోలీసులను సర్దుకోవాలని చూస్తారుగానీ... నన్నెందుకు ఎటాక్ చేస్తారూ. ఏవంటావ్ రాజారాం" రాజారాంకేసి చూశాడు ప్రసాదరావు.

"నిజమేనండీ... ఇది కరుణాకర్ మనుషుల పనైనా అయివుండాలి. లేకపోతే అప్పట్లో మీరు ఏరిపారేసిన ఆ రాజా గ్రూపువాళ్ళయినా చేసి ఉండాలి సార్" రాజారాం నమ్మకంగా చెబుతున్నాడు.

"ఆ కరుణాకర్‌కి అసలు మనుషులు ఎవరున్నారు? ఈయనపై ఎటాక్ చెయ్యడానికి. ఉన్నా వాళ్ళకి ఆ అవసరం ఏముంటుందీ? పొగబాంబులు అంటున్నారు. ఇదేదో ముందుగా పథకంవేసి బాబాయ్ ఆ ప్రాంతానికి వస్తున్నారని తెలిసి చేసివుండాలి" రంజిత్ తన అభిప్రాయాన్ని బయటపెట్టాడు.

"కరక్టే రంజిత్. నాకూ అలాగే అనిపించింది. ఏవయినా అన్నీ మనమే అనుకోవాల్సి వుంది. ఎవర్నీ అనుమానించే స్థితిలో లేము. ఎవర్ని అనుమానించినా పోలీసు జులుం చూపిస్తున్నారంటారు. ఇలాంటి వాటిల్లో ఆధారాలు దొరికేవిధంగా వాళ్లు చేస్తే ఆ తర్వాత వాళ్ళ గతి ఏమిటో వాళ్ళకి తెలియంది కాదు. ఎవర్నీ నమ్మనూలేము. ఎవర్నీ అనుమానించనూ లేము. ఆ దేవుడి దయవల్ల బతికి బయటపడ్డాను. నీ పిన్ని నుదిటికుంకుమ బలం అలాంటిదని అనుకోవాలి. అంతే. పిన్నీ పిల్లలూ ఎంత టెన్షన్‌పడ్డారో నేనూహించగలను" ప్రసాదరావు కంఠం కొంచెం తడబడింది.

"వాళ్లూ చాలా బెంగపడ్డారు బాబాయ్. ప్రస్తుతం నువ్వు త్వరగా తేరుకొంటే వాళ్ళకి చాలా ఆనందం కలుగుతుంది" రంజిత్ అనునయించాడు.

"నువ్వు చాలా హెల్పుచేశావని వాళ్లు చెప్పారు. సరిగ్గా నిన్ను సమయానికి ఆ దేవుడే ఈ జిల్లా ఎస్.పి.గా తీసుకొచ్చాడు" ప్రసాదరావు కళ్ళు మూసుకుని భగవంతుణ్ణి తలచుకొంటున్నారు.

"నేను మళ్ళీ కలుస్తాను సార్" అంటూ సి.ఐ. రాజారాం వెళ్ళిపోయాడు. అప్పుడు ప్రారంభమయింది అసలు విషయం.

"మీరు ఆరోజు అక్కడికి ఎందుకు వెళ్ళారు బాబాయ్. నేను ఏదో రాబట్టాలని అడగడంలేదు. అసలేం జరిగిందో తెలుసుకోవాలనే అడుగుతున్నాను" రంజిత్ సూటిగా అడిగాడు.

"కరుణాకర్‌కి నేనూ చెప్పాన్రా. వాడు వినలేదు. వాడు సంఘసేవ అని చెప్పుకొనేవాడు. వాడికీ రకరకాల యూనియన్ల లీడర్లకీ సంబంధాలున్నాయి. అదే ఆధారంగా వాడు ఈ కార్మికవాడల్లో మొదట స్కూళ్ళు నడిపాడు. క్రమంగా వాటిని పంచాయతీలుగా మారుస్తూపోయాడు. అందరికీ సలహాలు, సహాయం అనేవాడు. కానీ వాడిదీ రాజకీయ ఎత్తుగడే అనేది నా అనుమానం. ఓసారి ఎం.ఎల్.ఏ. కొడుకుతో గొడవపడ్డాడు. నేను ఆ గొడవ సర్దేసి పంపేశాను. మరోసారి డి.ఐ.జి. స్వామి గారిని కూడా కలిశాడీ కరుణాకర్. ఏమయిందో తెలీదు కానీ. "వాడి ఖర్మకు వాడిని వదిలేద్దాం ప్రసాదరావుగారూ" అని ఆయన

కూడా విసుక్కొన్నారు. వాడి మర్డర్ విషయం తెలిసి ముందుగా రాజారాంని పంపించాను. అక్కడ డెడ్‌బాడీలు లేవని తిరిగివచ్చాడు'' ప్రసాదరావు మంచినీళ్లు తాగడానికి ఆగారు.

"ఇదే నాకు అంతుచిక్కడం లేదు. మర్డర్ చేసినవాళ్లు డెడ్‌బాడీస్‌ని కూడా ఎందుకు తీసుకెళ్ళడం. వాళ్లు కాల్చేశారా...?" రంజిత్ వెంటనే అన్నాడు.

"కరెక్ట్... అందుకోసమే. డెడ్‌బాడీస్ లేకపోతే మనం ఎలా ప్రొసీడ్ అవుతాం. అదీకాక వాళ్లు బాడీస్ వదిలేస్తే వాటిని ఊరేగిస్తే ఆ వర్గాలు బలపడతాయని కూడా రాజకీయంగా ఆలోచించి ఉంటారు'' ప్రసాదరావు తన అనుభవాన్ని జోడించాడు.

"అంటే రాజకీయనాయకులకీ.. ఆ మర్డర్స్‌కీ'' రంజిత్ అర్థోక్తిగా ఆగాడు.

"అంతేమరి... అసలు రాజకీయాల గొడవలే ఇవన్నీ. వాడు చిన్నగా పేరు తెచ్చుకొంటున్నాడు. రేపు వాడు బాగా ఎదిగితే- అప్పుడు చాలా కష్టం. మొక్కగా ఉన్నప్పుడే ఏరిపారేయడం మామూలు'' ప్రసాదరావు చెప్పాడు.

"వాళ్ళు మర్డర్స్ చేసి బాడీస్‌తో సహా ఎక్కడికో పారిపోయి ఆ తర్వాత వాటిని తగలేశారన్నమాట" రంజిత్ తన అభిప్రాయాన్ని చెప్పాడు.

"అదే జరిగి ఉండవచ్చు. ఎందుకంటే ఆ మర్నాడు నాకు వచ్చిన ఇన్‌ఫర్‌మేషన్ ప్రకారం ఇక్కడికి పాతిక కిలోమీటర్ల దూరంలో శవాలను తగలేస్తున్నారని తెలిసింది. ఏ ఒక్కడు దొరికినా మిగతా వాళ్ళను పట్టుకోవచ్చునను కొన్నా. ఏ ఒక్కడైనా దొరక్కపోతాడా... అనిపించింది. వెంటనే బయలుదేరి వెళ్ళాను. కానీ దారిలోనే ఇలా జరిగింది'' ప్రసాదరావు వివరించాడు.

"ఆ విషయం మీకు తెలిసిపోయిందనీ, వాళ్లను పట్టుకోవడానికే మీరు వస్తున్నారనీ వాళ్ళకు ముందుగా తెలిసిపోయిందేమో. అందుకే వాళ్ళు మిమ్మల్ని ఎటాక్‌చేసి ఉండొచ్చుగా'' ఆలోచనగా అన్నాడు రంజిత్.

"ఆ స్థలం ఇంకా పది కిలోమీటర్లు ఉందనగానే నామీద ఎటాక్ జరిగింది. బహుశా వాళ్లు కాకపోవచ్చు. అలాంటిపనులు పగలు చెయ్యరు. ఏ రాత్రో చేసినవాళ్లు ఉదయంవరకూ అక్కడ ఉంటారా? బహుశా వాళ్లు కాకపోవచ్చు'' ప్రసాదరావు తన నమ్మకాన్ని వ్యక్తపరిచాడు.

"వాళ్ళూ అంటే, సుబ్బరాజు మనుషులా? వాళ్ళకు మినిస్టర్ సపోర్టు ఉందికదూ'' రంజిత్ తెలివిగా ప్రశ్నించాననుకొన్నాడు.

"ఏమో... ఏదీ ఖచ్చితంగా ఎలా చెప్పగలం. మనం అనుకొన్నంతమాత్రాన అలాగే ఉంటుందా... వెధవరాజకీయాలు. దౌర్భాగ్యపు జిల్లాకింద తయారయింది. ఎవరని చెబుతాం? వాళ్లెవరో ఆ దేవుడికే తెలియాలి'' డి.ఎస్.పి. ప్రసాదరావు కళ్లు మూసుకొన్నాడు.

"బాబాయ్ రెస్ట్ తీసుకో. నేను మళ్ళీ వస్తా'' అనడం తప్ప ఇంక ఆ సంభాషణను కొనసాగించే వీలులేక అక్కడనుంచి బయటకు వచ్చేశాడు ఎస్.పి. రంజిత్.

ఆసుపత్రి పరిసరాలు దాటినా అతని ఆలోచనలలో ప్రసాదరావే మెదులుతున్నాడు.

ప్రసాదరావు నిజంగా ఆ దుండగులను గుర్తించలేదా? ఒకవేళ వాళ్ళు కాకపోతే ఇతన్ని ఎటాక్‌చేసే అవసరం ఎవరికి ఉంటుంది? ప్రసాదరావుకి అన్నీ తెలిసే కావాలనే తనని తప్పుదారి పట్టిస్తున్నాడా? ప్రసాదరావుకీ సుబ్బరాజుకీ ఉన్న సంబంధాలు ఎలాంటివి? ఎస్.పి. ఆలోచనా చట్రంలో చిక్కుకుపోయాడు.

★ ★ ★

ఎస్.పి. రంజిత్ వ్యవహారం చాలా అనుమానాలకు దారితీసి పోలీసువర్గాల్లో కొద్దిగా గందరగోళ పరిస్థితులు ఏర్పడినాయి.

రంజిత్ చర్యలను సమర్థించే అధికారులు అతని విధానాలు పోలీసు వ్యవస్థకే బలాన్ని చేకూరుస్తున్నాయంటున్నారు. ప్రస్తుతం సమ





స్యలు పెద్దగా పట్టించుకోకుండా రంజిత్ కరుణాకర్ హత్యాసంఘటన పట్ల అనవసర ఆసక్తి చూపించడాన్ని చాటుగా కొందరు చర్చించుకుంటున్నారు. కరుణాకర్ హత్య జరిగిన సమయంలో ఎస్.పి.గా రంజిత్ ఆ జిల్లాలో లేడు. ఆ హత్య వివరాలు సేకరించాల్సిన డి.ఎస్.పి. ప్రసాదరావు దాడికి గురయి ఆసుపత్రి పాలయ్యాడు. సి.ఐ. ఆ పరిగణాలనుంచి తప్పించుకొనే ప్రయత్నంలో ఉన్నాడు. వేరే ఎవరికీ ఆ హత్యను శోధించాల్సిన పనే లేకుండాపోయింది. శవాలు దొరకలేదు. సాక్షులు లేరు. ఫిర్యాదు ఇచ్చినవారు రాతపూర్వకంగా ఇవ్వలేదు. ఆ హత్య విషయాన్ని గట్టిగా పట్టుకొని నిలదీయడానికి ఏ రాజకీయ పక్షమూ ముందుకు రాలేదు. హత్య జరిగిన నాటి ఆవేశకావేశాలు అప్పుడే సమసిపోయాయి. కాలగమనంలో ఆ సంఘటననే మర్చిపోయే స్థితి వచ్చింది. కానీ రంజిత్ ఆ హత్యను ఎందుకు శోధిస్తున్నాడు? ఎవర్ని పట్టుకోవాలని అతని ఉద్దేశం.

హత్య చేసినవారు ఎవరు? దీనికి సమాధానం పోలీసులు చెబుతారా?

ఏ పోలీసులు ముందుకు వస్తారు. పోలీసు ఉన్నతాధికారులా... ప్రజారక్షణే ధ్యేయంగా నడుస్తున్నామని గొప్పలు చెప్పే అధికారులా... ఆ అధికారుల ఇనుపచట్రాల్లో పదవీ విరమణవరకూ పనిచెయ్యాల్సిన మామూలు పోలీసు జవాన్లా?

అది వారికి అంతుబట్టని సమస్య కాదు. నేరస్థులనీ వాళికి తెలుసు. నేరం చేసిన వాళ్ళందరినీ ఎవరు పట్టుకోగలరు. ఆ నేరం విలువ ముందు తేలాలి. ఆ పైన నేరస్థుల స్థాయి ఎరిగి ప్రవర్తించాలి. ఈ రెండింటిలో దేన్ని తక్కువ అంచనా వేసినా తత్సంబంధిత అధికారులకే దారుణ పరిణామాలు ఎదురయ్యే నేటి సమాజంలో ఎవరు మాత్రం తమని తాము పణంగా పెట్టుకొంటారు.

కరుణాకర్ హత్య నిజం. దానికి కారణాలు పోలీసుల్లోని అన్నివర్గాలకూ తెలుసు.

ఎవరు ఆ హత్య చేయించగలరు? ఎవరు దానికి బాధ్యులు? అనే విషయాలు పోలీసులకు తెలియనంత పెద్దవిషయాలు కావు. కానీ ఆ విషయాలు బయటకు రావడానికి కరుణాకర్ విలువ పెద్దదేం కాదు.

అధికారంలో ఉన్నవారి దగ్గరివారో... బంధుమిత్రులో హత్యకు గురయితే ఆ సమయాల్లో నేరస్థులను ఏదోరకంగా పట్టుకొనే బాధ్యతను పోలీసులు తమంతట తామే స్వీకరించి పరిశోధన గావిస్తారు. అధికారబలంతో ఆ నేరస్థులను బయటకు లాగేస్తారు.

కానీ అటు అధికారానికిగానీ... ఇటు ఆర్థిక బలానికిగానీ ఏ సంబంధం లేని ఓ నిరుద్యోగ యువకుని వ్యవహారంలో అనవరసరంగా ఇరుక్కొని ఆ ఇరకాటాన్ని ఎందుకు ఎదుర్కోవాలి?

అందుకే వారు మౌనం పాటించారు. ఎస్.పి. రంజిత్ కూడా ఆవిధంగానే ఉండాలని వారి మనోగతం.

ఎస్.పి. రంజిత్ ఆలోచనలు వేరేరకంగా ఉన్నాయి. జిల్లా పోలీసు యంత్రాంగంమీద పట్టు సాధించాలంటే డి.ఐ.జి. వ్యవహారం తనకి పూర్తిగా తెలియాలి. జిల్లాలో ఎన్నో హత్యలు జరిగినా వాటిని ప్రజలు పెద్దగా పట్టించుకోలేదు. కరుణాకర్ హత్యమాత్రం సంచలనాన్ని సృష్టించింది. బదిలీ అయిన ఎస్.పి.కి ఆ హత్య వివరాలు తెలుసు. తనని రాజకీయ నాయకుల సంతతి అవమానించినప్పుడు కరుణాకర్ హత్యోదంతాన్ని బయటకు లాగి ఆ నాయకుల బండారాన్ని బయటపారెయ్యచ్చు.

కానీ దానికి రుజువు కావాలి. ఎస్.పిగా ఆ రుజువులను అతను ఏర్పరచుకోవచ్చు. అలా చెయ్యలేదు. బదిలీ కాగానే నిశ్శబ్దంగా అక్కడ నుంచి తప్పుకొన్నాడు.

అతని అవమానం వ్యక్తిగతమైనది కాదు వ్యవస్థాపరమైనది.

ఒక ఎస్.పిని నెట్టేసి గెంటేసినవారికి మరో. ఎస్.పి వచ్చినా లెక్కఉంటుందా?

వారిని అణచాలి.

ఎస్.పిగా తన గౌరవాన్ని నిలుపుకోవాలి.

అలాంటి అవాంఛనీయ సంఘటన తనకు జరగకుండా వారిని భయభ్రాంతులకు లోనుచెయ్యాలి.

సాటి అధికారి అవమానం పాలయినప్పుడు బలమైన యంత్రాంగం చేతిలో ఉండి కూడా డి.ఐ.జి. స్వామి పెదవి విప్పలేదు. ఆ దురహంకారులను దండించలేదు. అంటే



డి.ఐ.జి. స్వామికి కరుణాకర్‌ని హత్యచేసిన వారి వివరాలు తెలియవని అనుకోవాలా...? లేక ఎస్.పి పట్ల నిరసనభావమా... అలక్ష్యధోరణా...

రాజకీయ నాయకుల అండ కోరుకోవడం... వారు చెప్పిన పనులు చెయ్యడం ఎవరైనా చెయ్యవచ్చు. కానీ తమ వ్యవస్థనే వారు సవాలుచేస్తున్నప్పుడు వాస్తవాలు తెలిసినా ఎందుకు మిన్నకుండిపోయాడు. ఇది సహించరాని అలసత్వం.



సుబ్బరాజు నేరుగా ఈ నేరం చేయించాడనేది పోలీసు డిపార్టుమెంటులోని ప్రతివారికీ తెలుసు. డి.ఐ.జి. స్వామికి ఆ విషయం తెలియదనుకొనే ప్రశక్తి లేదు.

అధికారాలున్న ఓ ఉన్నత పోలీసు అధికారి అలా రాజకీయాల్లో ఎందుకు నలిగిపోతున్నాడు? ఆ నేరస్థులను బయటపెడితే అతనికి ఆ వర్గం లొంగదా...! ఆ నేరాన్ని రుజువుచేసి ఆ వర్గాన్నే సమూలంగా అణగదొక్కే వీలుండదా? డి.ఐ.జి స్వామి ఎందుకు మౌనం పాటించాడు? పైగా ఎస్.పిని బదిలీ చేయించాడు. ఇది ఆ లీడర్‌కీ అవమానం. ఆ ఎస్.పి అక్కడుంటే పార్టీ వచ్చే ఎన్నికల్లో మట్టికొట్టుకుపోతుందనే జిల్లామంత్రి మంకుపట్టును ఆమోదించారు. కానీ ఆ యువనాయకుల దుష్టచర్యను ఎవరూ ఖండించలేదు.

డి.ఐ.జి. స్వామి కూడా దానికి వంతపాడటానికి బలీయమైన కారణం ఉండివుండాలి. అదే అతన్ని మౌనంగా ఉంచింది. ఏమిటా కారణం...?

కరుణాకర్‌ది ప్లాన్డ్ మర్డర్. అది చేయించింది సుబ్బరాజు. వందరూపాయలకోసం మర్డర్లు చేసే ప్రబుద్ధులున్న మన సమాజంలో వేలు గుమ్మరిస్తే ఎవడి ప్రాణాలనైనా తీసే కర్కోటకులున్నారు. అలాంటి వృత్తినే చేపట్టిన హంతకులూ ఉన్నారు. వారి వివరాలు సుబ్బరాజులాంటివాళ్లకు బాగా తెలుసు.

ఆస్థికోసం తండ్రిని చంపిన కొడుకులున్నారు. పరువుకోసం కూతుళ్లను బలిపెట్టిన తండ్రులున్నారు. అవన్నీ వ్యక్తిగత సమస్యలు. ఇది సమాజపరంగా పెద్ద సవాలు. రాజకీయంగా ఎదిగిపోతాడనే అంచనాతో ఆదిలోనే అంతంచేసి భవిష్యత్తులో అడ్డంకులు ఎదురవరాదనే దూర దురాలోచనాపథకం. భారీ రక్షణవలయాలుగానీ, కనీస రక్షణగానీ ఎదురుతిరిగి దెబ్బకు దెబ్బ తీసే గూండాల అండగానీ లేని కరుణాకర్‌ని చంపించడం పెద్ద పనికాదు.

కరుణాకర్‌ని చంపించడం... అది సమస్యగా మారడం... ఆ నేరస్థులని పట్టుకోవాలనుకోవడం... ఎస్.పి. రంజిత్ ఆలోచనలలో లేవు. ఆ నేరాన్ని వదిలేసి, తెలిసినా తెలియనివిధంగా వ్యవహరిస్తున్న డి.ఐ.జి. స్వామిపట్ల అతనికి అనేక అనుమానాలు ఏర్పడినాయి. డి.ఐ.జి. స్వామి ఆవిధంగానే ఉంటే తనకి రేపు ఏవిషయంలోనైనా ఊహించని కఠిన సమస్యలు ఏర్పడవచ్చు. అందుకే డి.ఐ.జి. స్వామి తన జోలికి రాకుండా తన అధికార పరిధికి అడ్డురాకుండా ఉండాలంటే కరుణాకర్ హత్యోదంతాన్ని ఆరనివ్వకూడదు. జిల్లా ప్రముఖ రాజకీయ నాయకులకు ప్రత్యక్ష పరోక్ష సంబంధం ఉన్న ఈ హత్య వివరాల సేకరణ ఆగకూడదు.

ఆ నాయకులు ఎస్.పి. విలువ గుర్తించాలి. డి.ఐ.జి.కన్నా ఎస్.పి. సమర్థుడని తనతో రాజీకి రావాలి. ఆ రాజకీయ నాయకులే స్వామిని జీరో చెయ్యాలి. తన అధికారమే వారు కోరుకోవాలి...

అవే రంజిత్ ఆలోచనావిధానంగా సాగుతున్నాయి.

★ ★ ★

'నో... అతనలాంటివాడు కాదు సార్' డి.ఐ.జి స్వామి గట్టిగా అన్నాడు.

ప్రభుత్వ అధికారిక గృహంలో లాన్స్‌లో ఈజీఛైర్‌మీద కూర్చొన్న మంత్రి కోటేశ్వరరావు డి.ఐ.జిని ప్రశాంతంగా చూశాడు.

"లేదండీ... మనవాళ్లు స్వయంగా చూశారట. డి.ఎస్.పి. ప్రసాదరావుతో అతనికి అంతపనేముంది. ఇతను కొత్తగా వచ్చిన ఎస్.పి. ఇతను రాకముందే ప్రసాదరావు ఆసుపత్రిలో ఉన్నాడుగా. డి.ఎస్.పి ప్రసాదరావుని ఈ ఎస్.పి తరచుగా కలుస్తున్నాడు. గంటలు గంటలు ఏవో మాట్లాడుతున్నాడు. అతని ద్వారా ఏదో సమాచారాన్ని రాబట్టాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడట. అసలు ఇతనికి అనవసర విషయాలెందుకండీ... ఏదో లాగాలనీ... ఏదో చెయ్యాలనీ మహా తాపత్రయపడుతున్నా




డు'' కోటేశ్వర్రావు తన అంచనా వివరించాడు.

"నో... సార్. ప్రసాదరావు అతనికి బంధువట. యోగక్షేమాలు కనుక్కోవడానికి వెళుతున్నాడనుకొంటా. అయినా ప్రసాదరావు చిన్న పిల్లాడా ఇతనికి ఏవేవో చెప్పటానికీ. వాళ్లిద్దరిదీ ఒకే జిల్లా. పైగా బంధువులు. మీరు రంజిత్‌ని అనుమానించద్దు'' డి.ఐ.జి. స్వామి మంత్రికి నచ్చచెప్పే ప్రయత్నం చేశాడు.

"ఇతను మరీ దూకుడుగా ఉన్నాడు. మన కుర్రాళ్లు ఏం చేసినా అడ్డం పడుతున్నాడు. సెక్యూరిటీ ప్రాబ్లం అనీ, రూల్సు ఒప్పుకోవనీ మనవాళ్లని ఏ పనీ చెయ్యనివ్వడంలేదు. ఏదో ఊరేగింపు అంటే పర్మిషన్ ఇవ్వలేదట. వాడెవడినో అకారణంగా లాకప్‌లో పెడితే మనవాళ్లు వదలమని బతిమాలినా వదల్లేదట. ఎం.ఎల్.ఎ.లు ఫోన్లు చేసినా లేడని చెప్పించేస్తున్నాడట. ఇదంతా బాగాలేదు'' కోటేశ్వరరావు రంజిత్‌మీద తనకందిన ఫిర్యాదులు చెబుతున్నాడు.

"ఇవన్నీ చిన్న విషయాలు సార్. మీరు పట్టించుకోకండి. నేను ఓసారి ఎస్.పితో మాట్లాడతాను. అతను సిన్సియర్. కానీ ప్రతిపక్షంవాళ్లతో చేతులు కలిపాడనటం సరైన ఇన్‌ఫర్‌మేషన్ కాదు సార్. ఎస్.పి. రేంకులో ఉన్న అధికారికి ఆమాత్రం తెలివితేటలు ఉండవా సార్. ఎవళ్లైనా తనని కలవడానికి వస్తే మాట్లాడివుంటాడు. అంతే... దాన్ని మీవాళ్లు పెద్దగా చెబుతున్నారేమో!" డి.ఐ.జి. స్వామి తన సందేహాన్ని వెలిబుచ్చాడు.

"ఆ... మావాళ్లు అంతటివాళ్లే. చిన్నగా ఉన్నది పెద్దగా చేసేస్తారు. నాకు ఎస్.పితో పెద్ద పరిచయం ఏముంది చెప్పండి. అతనితో నాకేం గొడవ ఉంది. పర్సనల్‌గా పెద్ద ఏముంటుంది? మనవాళ్లు ఏదో చెబుతున్నారు. అతను ఆ కరుణాకర్ కేసును తిరగతోడుతున్నాడనీ, అనవసరంగా ఎవరెవర్నో అనుమానిస్తున్నాడనీ అంటున్నారు. మీరు ఎస్.పి.తో మాట్లాడండి'' కోటేశ్వర్రావు రిక్వెస్టులా ఆదేశించాడు.

"అదేం పెద్ద పని కాదు సార్. కరుణాకర్ మర్డర్ కేసు నడుస్తోందికదా... ఏమైనా వివరాలు ఎవర్నయినా అడిగాడనుకొంటా..." డి.ఐ.జి మంత్రి కోటేశ్వర్రావును సూటిగా చూస్తూ అన్నారు.

"ఏం కరుణాకరయ్యా... వాడి మర్డర్ ఏదో ఇంటర్నేషనల్ క్రైంగా అనేసుకుంటున్నారు. అసలు వాడు బతికున్నప్పటికంటే చచ్చిపోయింతర్వాతే చాలా పబ్లిసిటీ తెచ్చుకొంటున్నాడు. చూడండి డి.ఐ.జీగారూ మన జిల్లాలో వారానికి నాలుగు మర్డర్లు జరుగుతున్నాయి. అవన్నీ ఇంతలా పబ్లిసిటీ తెచ్చుకోవడంలేదు. వాడి మర్డర్‌కి ఎస్.పి. అంత ఇంపార్టెన్సు ఎందుకు ఇస్తున్నాడో అర్థంకావడంలేదు''

మంత్రి కోటేశ్వర్రావు డి.ఐ.జి. స్వామిని నిలదీసినట్లుగా అడుగుతున్నాడు.

"అదొక తలపోటు కదా సార్. బాడీస్ మాయం అయ్యాయి. ఇప్పటివరకూ ట్రేస్ అవలేదు... అందుకే..." డి.ఐ.జి. మంత్రి దగ్గరకు ఎవరో రావడం చూసి ఆ మాటలు ఆపేశారు.

"ఆ కరుణాకర్‌గాడి విషయం అంత పెద్దది కావడానికి ఈ రాజకీయాలే కారణంకదండీ. వాడిలాంటివాళ్లు చాలామంది తయారయ్యారు. ఏంటీ వాళ్లు ప్రజలకు చెయ్యగలిగే సేవ...? ఈ జనం ఒక పనిని సక్రమంగా చెయ్యనిస్తారా...? ఒకడికి సహాయపడితే మరొకడికి కోపం. అందరికీ ఉద్యోగాలు కావాలి. అన్ని పనులూ ఎలాగోలా అయిపోవాలి. రాజకీయ నాయకుల బాధలు ఎవరికి అర్థం అవుతాయి. పోలీసులు పట్టుకొన్నా మేమే చెప్పి విడిపించాలి. గొడవలు జరిగితే పోలీసులకు చెప్పి మేమే అరెస్టులు చేయించాలి. నేరంచేసినవాడూ మాదగ్గరకే వచ్చి మేము సహాయపడకపోతే దుమ్మెత్తిపోస్తాడు. ఆ నేరానికి గురయినవాడేమో వీడ్ని అరెస్టు చేయించాలని మావెంట పడతాడు. ఒకడికి తన ట్రా

న్స్ఫర్ కావాలి. మరొకడికి వేరేవాడి ట్రా న్స్ఫర్ కావాలి. డబ్బు ఖర్చయినా మేము పనులు జరిపించాలి. రాజకీయ నాయకులకు అవినీతి అంటగడతారు. అసలా అవినీతికి పాల్పడమని ప్రోత్సహించేది ఎవరండీ... ఈ జనం కాదా... రాజకీయజీవితం కూడా దారుణంగా మారిపోయింది. ఒక్కనిముషం ప్రశాంతంగా ఉండలేకపోతున్నాం" జిల్లా ఇన్ఛార్జి మంత్రి కోటేశ్వర్రావు వాపోయాడు.

"ఏవయినా రాజకీయాల్లోకి రావాలని చాలా మంది అనుకొంటున్నారులెండి'' డి.ఐ.జి. స్వామి అన్నాడు.

"వేరే పనేంలేకపోతే ఏంచేస్తారు? అన్నిటిలాగానే రాజకీయాలకూ రద్దీ పెరిగిపోయింది. రాజకీయాల్లోకి అడుగుపెట్టగానే ప్రతీవాడూ ఎం.ఎల్.ఏ. అవ్వాలనుకొంటాడు. ఎం.ఎల్.ఏ. అయితే వెంటనే మంత్రిపదవి దక్కాలి. మంత్రయితే అమాంతం ముఖ్యమంత్రిగా ఎదిగిపోవాలి''

"ఎదగాలనుకోవడం తప్పుకాదు సార్' స్వామి తన అభిప్రాయం చెప్పాడు.

"తప్పుకాదండీ... ప్రతీవాడూ నలుగుర్ని వెంటబెట్టుకొని ఓ నాయకుడ్ననుకొంటాడు. ఆ కరుణాకర్ విషయం అంతేకదాండి. వాడెక్కడినుంచి వచ్చాడో తెలీదు. పదిమందిని పోగేశాడు. అన్ని విషయాలూ వాడికే పట్టినట్లు ప్రవర్తించాడు. వాళ్లల్లో వాళ్లకి పోటీ. వీడు కొంచెం తెలివైనవాడు కాబట్టి మిగతావాళ్లు ముందుకు రాలేదు. ఏదో సంఘసేవ చేస్తున్నానంటూ బయలుదేరాడు. ఏవిటండీ వాడు చెయ్యగలిగిందీ. అన్ని విషయాలూ అందరికీ తెలుసు. ఈరోజుల్లో ఎవడి విషయం వాడు పట్టించుకోవడానికే సమయం దొరకడంలేదు. మిగతావాళ్ల విషయాలు ఎవడికి కావాలి? వాడొకడు పైకి 'సేవ' అంటూ ముసుగు. లోపల రాజకీయంగా ఎదగాలనే కోరిక. దాంతోనే కదండీ విషయం ఇంతదాకా వచ్చింది'' కోటేశ్వర్రావు తన మనసు విప్పాడు.

"అన్నిచోట్లా ఇలాంటి గొడవలు పెరిగిపోతున్నాయి సార్. అనవసరంగా కొట్టుకొని చస్తున్నారు. వాళ్లకి ఎవరు చెప్పగలరు?" డి.ఐ.జి. మంత్రి మాటలకి మద్దతుగా అన్నాడు.

ఆ మాటలు తర్వాత ప్రస్తుత రాజకీయాల మీద సాగాయి. మంత్రి తన కష్టాలు చెప్పుకుపోతున్నాడు. డి.ఐ.జి. అభిప్రాయాలు అందుకు అనుగుణంగా వెలువడుతున్నాయి.

డి.ఐ.జి. ఇంటికి వచ్చేశాడు. మళ్లీ ఏకాంతం. కరుణాకర్ మనసులో మెదిలాడు. ఎందుకు వాడికా కోరిక. ప్రమాదం ఉందని తెలిసినా ఎందుకలా ప్రవర్తిస్తుంటారు వీళ్లు?

కరుణాకర్ చనిపోవడాన్ని కూడా స్వార్థ రాజకీయాలకు ఉపయోగించుకొన్న నాయకులమీద అసహ్యం కలిగింది. కానీ వారే అందరికీ ఆధారం. రాజకీయ నాయకులను దారుణంగా విమర్శించేవారుసైతం తమ స్వంత పనులకు వారినే ఆశ్రయిస్తుంటారు. పనులు చేసినా, చెయ్యకపోయినా విమర్శలకు గురయ్యేది రాజకీయ నాయకులే. ఈ నాయకులు ప్రజల అవసరాలను అడ్డంపెట్టుకొని తమ రాజకీయ భవిష్యత్తుకి పునాదులు వేసుకొంటున్నారు.

'ఆ కరుణాకర్ జ్ఞాపకాలను తుడిచివెయ్యాలి' అనుకొన్నాడు స్వామి.

కానీ అది అసాధ్యమని ఆయనకు తెలుసు.

★ ★ ★

ఎస్.పి. రంజిత్ ముందు కూర్చొని ఉన్నాడు రవీంద్ర.

కరుణాకర్, కల్యాణ్ స్నేహితులు. కల్యాణ్, ప్రియంవదల తండ్రి రవీంద్ర.

రవీంద్ర మొఖంలో నిస్పృహ స్పష్టంగా కనిపిస్తోంది. రంజిత్ ఏం మాట్లాడలేదు. తనని కలవాలని ఎందుకనుకొన్నాడు? ఆయన మనసు రకరకాలుగా ఆలోచిస్తోంది. ఈ రాజకీ

 

యాలూ, హత్యలూ... తన కుటుంబాన్ని ఇంకా పీడిస్తాయా...? అనే బాధ అతనిలో ఉంది. తన కొడుకు ఆరకంగా చనిపోవడం అతనిక తీరని వ్యధ. ఎవరు దానికి బాధ్యులు... ప్రతీరోజూ అనేక దారుణాలు జరగుతున్నా ఈ ప్రపంచం ఆగదు. తన బాధను అర్థంచేసుకోవడానికి ఎవరు ప్రయత్నిస్తారు? వేదనాభరితంగా అల్లాడే తన మనసుకి ఉపశమనం కలుగుతుందా...? చెట్టంత కొడుకే దారుణంగా హత్యకి గురయితే ఇంక ఉపశమనం ఏమిటి...?

రవీంద్ర మనోఫలకంమీద చెలరేగిన ఆ భావ పరంపరకు అవరోధం కలిగిస్తూ ఎస్.పి. రంజిత్ మాట్లాడటం మొదలుపెట్టాడు.

"నేను మీ అబ్బాయినయితే తెచ్చి ఇవ్వలేను. కానీ, చాలా తెలివైన కల్యాణ్ ఆరకంగా ఎందుకు ఇరుక్కొన్నాడనేది నేను తెలుసుకుంటే... వేరేవాళ్లనయినా కాపాడవచ్చునను కొంటున్నాను! సారీ... మీకు విషయం ఎంతో బాధ కలిగిస్తుందని నాకు తెలుసు. ఒక పోలీసాఫీసరుగా నేను కొన్ని విషయాలు తెలుసుకొంటే ఈ సొసైటీకి కొద్దిగానైనా మంచి జరుగుతుంది. ఏ శక్తులు ఈ దారుణాలను చేస్తున్నాయో మీకు తెలిస్తే... ఆ శక్తులను పట్టి బంధించలేకపోయినా... వాటిని మరికొన్ని దుర్మార్గాలు చెయ్యకుండా ఆపగలననేది నా విశ్వాసం. మీరూ బాధ్యతాయుతమైన ఉద్యోగం చేస్తున్నారు. ఏ ఉద్యోగంలో ఉండే సాధకబాధకాలు ఆ ఉద్యోగంలో ఉంటాయి. అది మీకు తెలియంది కాదు. అందరూ నన్ను కరుణాకర్ మర్డర్ కేసునితిరగతోడుతున్నారని ఏవేవో అనుకొంటున్నారు. కానీ అది నిజంకాదు. మీదగ్గర అబద్ధం చెప్పవలసిన పనిలేదు'' ఎస్.పి. రంజిత్ రవీంద్రతో ఆప్యాయంగా మాట్లాడాడు.

"మీరు ఏవంటున్నారో నాకు స్పష్టంగా తెలియడంలేదు. కల్యాణ్ సంగతి పూర్తిగా తెలుసుకోవాలనే ఆసక్తి మీ మాటల్లోనే ఉంది. కరుణాకర్, అతని మిత్రులు... అందులోవాడే నా కొడుకు కల్యాణ్. ఆ మర్డర్ కేసు తిరగతోడటంలేదనీ అంటున్నారు. మరి అలాంటప్పుడు ఆ ఎంక్వయిరీ ఎందుకు...? నన్ను పిలిచి విషయాలు తెలుసుకోవడం మీ టైం వేస్టుకదా'' రవీంద్రలో ఆవేశవీచికలు కదిలాయి.

"నో... మీరు నన్ను అపార్థం చేసుకొంటున్నారు. మీ మనసుని నొప్పిస్తే సారీ. ఏకేసయినా ఆధారాలను అనుసరించే ఉంటుంది. మీకు నేను కొత్తగా చెప్పేది ఏముంటుందండీ అవతలివాళ్లు తెలివిగా ఏ ఆధారం లేకుండా... ఆఖరికి బాడీలు కూడా దొరక్కుండా వాటిని ఎక్కడో తగలబెట్టేశారు. వాళ్లు ఎవరూ అనే విషయం మనం మాట్లాడవద్దు. ఎందుకంటే ఆ విషయంలో ఎవరిమీద అనుమానం ఉందో మనందరికీ తెలిసిన విషయమే. కానీ పేర్లు బయటపెట్టడానికి ఎవరూ ముందుకు రారు. ప్రత్యక్షంగా చూశామని చెప్పేవారూ లేరు. మీరు నన్ను అర్థంచేసుకోండి. ఈ పరిస్థితుల్లో నేను ఇక్కడకు వచ్చాను. బట్ అలా దారుణంగా మర్డర్లు చేసేవాళ్లని చెయ్యనిస్తూ పోవాలా...? లేక వాళ్లపై అదుపు ఉంచి... వాళ్లు ఇంకే ప్రయత్నం చేయకుండా చూడాలా...? ఒక ఎస్.పి.గా నాకు గతంలోని వివరాలు యథాతథంగా తెలిస్తే నేను వాటిని దృష్టిలో ఉంచుకొని ఆ అరాచక శక్తుల విజృంభణను ఆపగలను. మళ్లీ వాళ్ళు ఏ ప్రయత్నం సాగించినా ముందుగానే వాళ్లని పట్టుకొనే వీలు ఉంటుంది. నేను మాట్లాడింది సమంజసం కాదా... మీరే చెప్పండి. నా ఆలోచనలో నిజం లేదా? సమాజానికి ఇది మంచిది కాదా..."

ఎస్.పి. ఆవిధంగా మాట్లాడతాడని ఊహించలేదు రవీంద్ర. ఎస్.పి. చెప్పింది వాస్తవంగా అనిపించింది రవీంద్రకి.

"నిజమే... తన కొడుకు హత్యకు గురయ్యాడు. అది తనకు తెలుసు. కానీ ఎవరు ఆ నిజాన్ని బయటపెడతారు? ఎవరు ఆ దారుణాన్ని చేశారో అందరికీ తెలుసు. బట్ ఎవరు

ముందుకొచ్చి ఆ పచ్చినిజాన్ని వెల్లడిస్తారు? ఎస్.పి. రంజిత్ మాటలు వాస్తవానికి దగ్గరగా ఉన్నాయి. ఆయన విధానం ఒకరకంగా మంచిదేమో అనిపిస్తోంది. తాను ఎందర్ని కలవలేదు. తన బాధను అర్థంచేసుకోవడం అటుంచితే సరిగా మాట్లాడినవారే లేరు. పోలీసులు పట్టించుకోలేదు. ఉన్నతాధికారులు ఆ విషయం తనకు కూడా అనవసరం అనే ధోరణిలో మాట్లాడి పంపేశారు. నాయకులు... శాసనసభ్యులు... ఇతర రాజకీయ ప్రముఖులు తమవంతు పనిగా బాధపడినట్లుగా మాట్లాడి ఏం చేస్తాం సమాజం అలాగయిపోయిందంటూ పంపించేశారు. వారికి అలవాటయిన నాలుగు పరామర్శ రాజకీయపు మాటలు వల్లెవేసి జారుకొన్నారు.

ఎస్.పి. రంజిత్ ఇంత సూటిగా నిజాలను నిర్ద్వంద్వంగా చెబుతున్నాడు. ఇలాంటి అధికారాలు ఈ సమాజానికి కావాలి. వారి నికార్సయిన నిజవర్తన మానవాళి మనుగడకే మంచి మార్గాలను ఎంచి సమకూరుస్తుంది. ఈవిధంగా అధికారులంతా ఆలోచిస్తే అసలు అలాంటి దుర్మార్గపు సంఘటనలే సమాజాన్ని బాధించవు. రంజిత్ ఏనాటికైనా ఆ దుష్టశక్తులను పట్టుకొంటాడు. వాళ్లని కఠినంగా శిక్షించే ఏర్పాట్లు చేస్తాడు''

ఏదో బలీయమైన నమ్మకం రవీంద్రకు కలిగింది. పుత్రశోకంతో అల్లాడే ఆ హృదయానికి ఉపశమనంలా కనిపించాడు రంజిత్.

ఆ నమ్మకంతోనే రవీంద్ర ఎస్.పి. రంజిత్‌కి తనకి తెలిసున్న వివరాలన్నీ అందించాడు. ఆ వివరాలన్నింటినీ రంజిత్ ఓపిగ్గా శ్రద్ధగా విన్నాడు. పదునైన పోలీసు బుద్ధికి పనిచెబుతూ, ఆ వివరాల్లోని సూక్ష్మాలన్నిటినీ జాగ్రత్తగా గమనిస్తూ అవసరమయినచోట రవీంద్రను చిన్నగా ప్రశ్నలు వేస్తూ సంఘటన పూర్వాపరాలన్నీ తెలుసుకొన్నాడు.

రవీంద్ర చెప్పిన వివరాల్లో ఒకే ఒక అంశం ఎస్.పి. రంజిత్ దృష్టిని ఆకర్షించింది. ఆ అంశంమీదే రంజిత్ పూర్తిగా దృష్టిని కేంద్రీకరించాడు.

ఆ అంశం డి.ఐ.జిని కరుణాకర్ కలవడం. అది కూడా ఒక రిటైర్డ్ హెడ్ కానిస్టేబుల్ ద్వారా డి.ఐ.జి స్వామి కరుణాకర్‌కి కబురు పంపడం.

అదే రంజిత్‌కి ఆసక్తికరంగా మారింది. డి.ఐ.జి. కరుణాకర్‌ని ఎందుకు పిలిపించాడు? పిలిపించడం తనకూ తెలుసునని రవీంద్ర ధ్రువపరిచాడు. ఆ కలయిక నిజమే అనడానికి ఆధారం డి.ఎస్.పి. ప్రసాదరావు.

హత్యకు గురవడానికి పదిరోజులముందు ఆ కలయిక జరిగింది. ఎందుకు? రాజకీయాలకీ, ఇతర వ్యాపార వ్యాపకాలకీ సంబంధాలు లేని మామూలు వ్యక్తికి డి.ఐ.జి. ఎందుకు కబురు పంపించాలి? సోషల్ వర్కర్‌గా చెలామణి అవుతున్న అతి సాధారణ వ్యక్తితో స్వామికి పని ఏమిటి? ఏ బాంధవ్యం, బాదరాయణ సంబంధం, లావాదేవీల వ్యవహారం లేకుండా కరుణాకర్‌ని పిలిపించుకొనేంత అమాయకత్వం డి.ఐ.జి స్వామికి ఉండదు. ఆ కలయిక అంతరార్థం....? స్వామి కరుణాకర్‌ని హెచ్చరించడానికా? లేక స్వామికి సంబంధించిన ఏదయినా గోప్యమైన విషయం కరుణాకర్ పసిగట్టాడా? ఎస్.పి. రంజిత్‌కి అది ఒక విచిత్ర గడ్డు సమస్య అయింది. మెదడుకి పనిపెట్టాడు.



"ఈ ఎస్.పి.గాడు చాలా రెచ్చిపోతున్నా

డు. ఆ రవీంద్రగాణ్ణి పిలిపించుకొన్నాడు. వాడితో ఏదేదో మాట్లాడాడట. ఏంచేద్దామని?" సుబ్బరాజు కోపంగా అంటున్నాడు.

"ఆ రవీంద్రగాడి సంగతి చూడమంటావా... ఆడు పెద్ద పోటుగాడా...? ఎస్.పి.ని కలిస్తే చచ్చిన కొడుకు నడిచివస్తాడా? ఓ దెబ్బ కొడితే ఈడూ ఆడిదగ్గరకే పోతాడు'' తాగిన మైకంలో కర్కశత్వం ఖంగుమంది.

"ఛ... నువ్వు ఊరుకోరా... ఆడ్ని బెదిరిస్తే చాలు. ఆడిని కొట్టి మళ్లీ ఆడ్ని పెద్దమనిషిని చేస్తావా? ఈ ఎదవ అయిడియా మానుకో. ఇపుడాడి జోలికి వెళ్లావనుకో ఎస్.పి. గాడికి మనంతట మనమే దొరికినట్లు అవుద్ది. నీ మాట వింటే కుక్కతోకుచ్చుకొని గోదారి ఈదినట్లే'' సుబ్బరాజు అరిచాడు.

"అది కరెక్టే. ఇప్పుడు ఏంచేద్దామంటావ్? నాకెందుకు ఈ రాజకీయాలు? నువ్వు అవన్నీ ఆలోచించి ఇలా చెయ్యి అని చెప్పు... జనాన్ని పెట్టి ఆరకంగానే చేయించేస్తా..."

ఆ కంఠం హామీ సుబ్బరాజుకి సంతోషం కలిగించింది.

అలాంటి కంఠాలు వేరుగా ఉన్నా అలాంటి ఘనుషుల చేతలు ఒకేలా ఉంటాయి.

వారు చీకటి రాజ్యానికి సేనాధిపతులు. డబ్బుకోసం, స్వసుఖాలకోసం ఏపని అయినా చేసేస్తారు.

అరాచకాల సృష్టే వారి వృత్తి. వారి అవసరం మామూలు మనుషులకు ఉండదు. రాజకీయాల నీడల్లోనే వారు సంచరిస్తూ ఉంటారు. వారికి నేరస్థులతో బలమైన సంబంధాలు ఉంటాయి.

నేరస్థులను రాజకీయ నాయకులు తమ వెంట రానివ్వరు. కానీ వారితో పనులు జరగడానికి ఇలాంటి బ్రోకర్లను వాడుతుంటారు. డబ్బూ, పలుకుబడి ఉంటే నేరాలు చేయించినా అవి బయటకు రావడానికి సాహసించవు.

ఈరోజుల్లో నాయకులకు హత్యలు చేయించడమనేది రాజకీయంలో ఒక భాగంగా సాగుతున్నది. ముఠాకక్షలు... దోపిడీలు... బందిపోట్ల స్వైరవిహారాలు... వాటితోపాటు హత్యానేరాలు చేసే వృత్తిపరులు కూడా పెరుగుతున్నారు. ముఠాకక్ష సాధింపులకూ వారే కావాలి. రాజకీయ సోపానాలకు ఆటంకాలను వారే తొలగించాలి.

ఆ వృత్తి చేసేవారు సాధారణంగా పాత నేరస్థులేననేది పోలీసుశాఖ విశ్వశిస్తున్నది. అందుకే అరాచకాలు జరిగినప్పుడు పాత నేరస్థులను అరెస్టుచేసి జైళ్లలో ఉంచుతున్నారు. వారికి బలమైన అండ ఉంటే తక్షణం బయటకు వస్తారు. అండలేని పక్షంలో జైళ్లలోనే కొన్ని మాసాలు గడిపి బయటకు వచ్చి తమ వృత్తిని కొనసాగిస్తారు. ఆ వృత్తి చేపట్టినవాళ్లు సాధారణంగా మారరనేది పోలీసులకు రుజువైన వాస్తవం. వారు సాధారణంగా బయట తిరగరు. పోలీసుల కంటపడకుండా ఎక్కడో దాగి మత్తుగా తాగి పడుకుంటారు. అకృత్యాలు చేసే సమయంలోనే గుట్టుగా వచ్చి పని కానిచ్చుకుంటారు. ఆ సమయాలు... అకృత్యాలు ఏర్పాటుచేసేది బ్రోకర్లే. ఈ బ్రోకర్లు సమాజంలో పెద్దలుగానే చెలామణి అవుతుంటారు. ప్రత్యక్షంగా వారు ఎక్కడా కనిపించరు. వీరిని నాయకులు పెంచి పోషిస్తుంటారు.

ఈ బ్రోకర్లకు ఎక్కువ ప్రతిఫలాలు ముడుతుంటాయి. వారి సమర్థత ఆధారంగా వారికి రేట్లు ఉంటాయి.

పాత నేరస్థులు పోలీసులకు లొంగి ఉండరు. కానీ ఈ బ్రోకర్లమాటే వారికి వేదం. ఆ నేరస్థులకు సౌకర్యాలు ఏర్పాటుచేస్తూ, గోప్యంగా వారిని ఉంచుతూ వారిచేత ఏ సమయంలో ఎలాంటి పనులు చేయించాలో పకడ్బందీగా ఆలోచించి అమలుచేయించే బ్రోకర్ల చేతుల్లో వారు కీలుబొమ్మలు.

నిజానికి నేరస్థులకు దక్కేది బ్రోకర్ల దయాధర్మం. నేరస్థుల అవసరాలు తీరుస్తూ వారిని

చెప్పుచేతల్లో ఉంచుకోవడం ఈ బ్రోకర్లకు వెన్నతో పెట్టినవిద్య.

ప్రస్తుతం చదువుకొన్నవారు కూడా ఈ బ్రోకర్లస్థాయికి ఎదిగారు. పనీపాట లేని కొంద రు యువకులను పాడుచేసి, వారిని చెడు అలవాట్లకు బానిసలుగా మార్చి, వాళ్లచేత ఆ కార్యాలు చేయించడం ఒక వృత్తి అయిపో యింది. పద్ధెనిమిదినుంచి ముప్ఫైలోపు వయ సున్న యువకులనే ఈ బ్రోకర్లు ఎక్కువగా పరిగణలోకి తీసుకొంటారు. ఆవేశంలో వారి చేత పనులు చేయిస్తుంటారు. ఆ బ్రోకర్లకు ఒక పేరంటూ ఉండదు. ఒకచోట దాదా అంటే మరోచోట పెద్దన్న ఇంకోచోట చిన్నన్న, బాబా, బాబాయ్, నాన్న, మామ, గుంటి, బాజ్జీలాంటి పెట్టుడుపేర్లతో ఉంటుంటారు. వారికి అసలు పేరున్నా అది బయటపడదు. రాజకీయ పె ద్దల దగ్గర్నుంచి అందరూ వాళ్లని ఉరఫ్ పేర్లతోనే పిలుస్తుంటారు.

వీళ్లు చాలా విలాసవంతమైన జీవితాన్ని అనుభవిస్తుంటారు. వీళ్ల బసలు పెద్దపెద్ద హొటళ్లలో ఉంటుంటాయి. మంచి మేడలూ, కార్లూ, సకల సౌకర్యాలు కలిగివుంటారు. వాళ్ల ఇళ్లల్లోమటుకు నేరస్థులకు ప్రవేశం అనేది ఉండదు. సాధారణంగా ఈ బ్రోకర్లు తమకు తాము సమస్యలు సృష్టించుకోరు. ఎలాంటి నేరంలోనూ ఇరుక్కోరు. ప్రత్యక్ష సంబంధాల నేవి వీరి సంస్కృతే కాదు. చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తుంటారు. పోలీసులకంటె, గూఢచా రులకంటె, ఇతర డిటెక్టివ్స్, ఇన్వెస్టిగేటర్స్ కంటె వీళ్లకి పదునైన ఆలోచనాసరళి ఉంటుంది. అటు రాజకీయ నాయకులకు, ఇటు నేరస్థులకూ వారధులు వీళ్లు. చిన్నచిన్న హెూ దాల్లో ఉండే సుబ్బరాజులాంటివాళ్లకి వీళ్లతో మంచి పరిచయాలుంటాయి.

"ఇంతకీ ఇపుడేం చెయ్యమంటావు సు బ్బరాజూ... ఆడ్ని బెదిరించాలి. ఎలా?"

"ఆడి కూతురు మెడిసిన్ చదువుతోంది. దాన్ని పట్టుకురండి. ఈడి తిక్క కుదురు తుంది. మళ్లీ ఈ సంగతి ఎత్తడు. ఆడు ఎవరెవరిదగ్గరకో వెళ్లి ఏడుస్తోంటే... పోన్లే ఆడి బాధ ఆడిదని ఒదిలేశాం. ఇపుడాడు ఎస్.పితో చేరి నాటకాలాడుతున్నాడు. ఆడికి అదే చెయ్యాలి. నోరు మూసుకు పడుంటాడు''

సుబ్బరాజు ఆలోచన అందించాడు.

★ ★ ★

'ప్రియ, కౌస్తుభ కనిపించడంలేదు...' ఆ వార్త తెలిసి డి.ఐ.జి. స్వామి హతాశుడయ్యా డు. వనజ బాధకు అంతులేకుండా పోయింది. స్వామి ముందుగా తేరుకొని ఆ విషయాన్ని జిల్లా మంత్రికి చెప్పాడు. మంత్రి కోటేశ్వ రరావు కూడా కలవరపడిపోయాడు. డి.ఐ.జి. కూతుర్ని కిడ్నాప్ అంటే మాటలుకాదు. ఎవ రు... ఎందుకు చేశారా దారుణం. కోటేశ్వ ర్రావు తన మనుషులమీద విరుచుకుపడ్డాడు. అది మంత్రికి కూడా బాధ కలిగిస్తోంది.

ఆ విషయం ఎక్కడా పొక్కిపోకుండా పోలీసుశాఖని అప్రమత్తంగా ఉంచారు. అది డి.ఐ.జి పరువు మర్యాదలకూ. పోలీసుశాఖ ప్రతిష్టకూ సంబంధించిన విషయంగా పరిగ మించింది. అందరూ అన్ని రకాల జాగ్రత్తలూ తీసుకొంటున్నారు. ఎక్కడా కిక్కురుమన కుండా మౌనం రాజ్యమేలుతోంది.

ఏ స్థాయిలో ఉన్న వారికైనా పిల్లలపట్ల ప్రేమ ఒకేలా ఉంటుందనే వాస్తవం అక్కడ ప్రతిబింబిస్తోంది. ప్రియంవద, కౌస్తుభలను ఎవరు మాయం చేశారు? ఇంచుమించు ఆ వ్యవహారాలకు దగ్గర సంబంధం ఉన్న అంద రూ కంగారుపడ్డారు. పోలీసుల విషయంలో ఎంతో అప్రమత్తంగా ఉండే ఆ వర్గాలు ఈ తప్పు ఎలా జరిగిందా అనే ఆందోళనతో ఉన్నారు.

ఆ సంఘటన వెనుక ఖచ్చితంగా ఏదో ఒక వర్గం ఉండి తీరాలనేది ఎస్.పి రంజిత్ నమ్మకం. రవీంద్రను తాను పిలిచి మాట్లా డటం ఈ సంఘటనకు కారణం అని రంజిత్ గట్టిగా విశ్వసిస్తున్నాడు. రవీంద్రకు కూడా




అలాగే అనిపిస్తోంది.

ఇద్దరు యువతులను అందునా ఒక పోలీసు ఉన్నతాధికారి కూతుర్ని మాయం చేసిన వారికి ఎన్ని గుండెలుండాలి? ఇది చాలా తీవ్ర సమస్య. ఎవరికైనా ఉన్నత పోలీసు అధికారితో అలాంటి వైరం ఎందుకుంటుంది?

ఈ సంఘటనను పోలీసు వర్గాలు తేలిగ్గా తీసుకోవనే అభిప్రాయం అందరిలోనూ ఉంది.

రవీంద్ర భార్య లక్ష్మి హృదయ విదారకంగా రోదిస్తోంది.

హోదా పరిధి అడ్డం వచ్చిందిగానీ అంతటి వేదనా వనజను కలచివేస్తోంది.

ఆ రెండు కుటుంబాలూ దారుణమైన మనఃక్షోభకు గురవుతున్నాయి. డి.ఐ.జి స్వామి గంభీరంగా కనిపిస్తున్నా ఆయన హృదయంలో అగ్నిగోళాలు బద్దలవుతున్నాయి.

పరిస్థితులను అర్థం చేసుకొన్న ఎస్.పి రంజిత్ అన్ని చర్యలూ తీసుకొన్నాడు. ఎస్.పి కుటుంబం డి.ఐ.జి కుటుంబానికి అండగా నిలచింది. ఆ వేదనను అంతా కలిసి భరిస్తున్నారు. కొందరు నమ్మకమైన అధికార్లు ఈ విషయాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ బయటపడకుండా ఉండేందుకు కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసి అనుక్షణం పర్యవేక్షిస్తున్నారు.

క్షణాలు యుగాలవుతున్నాయి. ఏ చిన్న కదలిక ఏర్పడినా ఏదైనా సమాచారం దొరుకుతుందేమోననే ఆతృత పోలీసు వర్గాల్లో చోటు చేసుకొంది. పోలీసుల హృదయాలు బాధతో సుళ్లు తిరుగుతున్నాయి. తమ కుటుంబసభ్యులకే రక్షణ కలిగించని స్థితిలోకి తామే రావడం వారికి విపరీతమైన ఆగ్రహాన్ని కలిగిస్తోంది. దీనికి బాధ్యులు ఎవరైనా సరే వారిని కుళ్లబొడిచెయ్యాలన్న పట్టుదల... ప్రతీకారాగ్ని రేగుతోంది. ఎస్.పి రంజిత్ తనదైన వ్యూహాన్ని అమలు పరుస్తున్నాడు.

ఈ నేరం చేసింది ఏ వర్గమైనా ఆ వర్గాన్ని పోలీసులు సమూలంగా నాశనం చేసేస్తారనే ప్రచారం రహస్యంగా అన్ని అకృత్య వర్గాలకూ చేరవేయడం జరిగింది. దారుణాలకు పాల్పడే బృందాలకూ నాయకులకూ వారికి దగ్గర సంబంధం ఉన్న పోలీసులే ఆ ప్రచారాన్ని నిర్వహిస్తున్నారు. ఆ వర్గాలన్నీ భుజాలు తడుముకొన్నాయి.పోలీసులవైపు చూడటానికి కూడా ఏ వర్గమూ సిద్ధంగాలేదు.

జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి కోటేశ్వర్రావు కనిపించిన అనుయాయులందర్నీ నానా రకాలుగా దుయ్యబడుతున్నాడు. అది రాజకీయపరమైన కోపంకాదు. కోటేశ్వరరావుకి నిజంగా కోపం వచ్చింది. దానికి కారణం ఈరోజు డి.ఐ.జి కూతురయితే, రేపు తన కూతుర్ని కూడా ఇలా మాయం చేస్తారు.

మంత్రి కోపం పాకిపోయింది. పోలీసుల ఆగ్రహజ్వాలల వేడి ప్రసరిస్తోంది. ఆ అమ్మాయిల తల్లితండ్రుల హృదయవేదన సర్వత్రా వ్యాపిస్తోంది. ఎవరి ఇంటి కాపలాకయినా ఏ సమయంలోనైనా సిద్ధపడే పోలీసులు... ఏ హత్య జరిగినా...ఏ మారణహోమం జరిగినా ముందుగా పరిగెత్తే జవాన్లు... మత కల్లోలాలు... వర్గవైషమ్యాలు... కులపోరాటాలు... దోపిడీలు... పెద్దల రక్షణలు, రోడ్ల మీద పహరాలు, బీట్లు, రద్దీల నియంత్రణలు అన్నిటికీ పోలీసులు కావాలి. ఏం జరిగినా పోలీసు... దేనికైనా పోలీసు. కానీ ఎవడెక్కడ తప్పు చేసినా పోలీసు వ్యవస్థనే దూషిస్తుంటారు. ఎవడు ఏ నేరం చేసినా... ఎవడెక్కడ కల్తీ చేసినా... మర్డర్ చేసినా... దోపిడీ చేసినా... మానభంగాలకు పాల్పడినా పోలీసుల్నే దుయ్యబడతారు. అదెందుకు? రక్షణకూ... దూషణ భూషణలకూ వారే ఎందుకు? స్వార్థ రాజకీయ చదరంగపు చట్రంలా వాళ్లు ఉన్నందుకా? స్వార్థపరుల చేతుల్లో ఆ వ్యవస్థ బానిస అయినందుకా? అధికారానికి దాసోహమంటూ పాలకుల కను సంజ్ఞలే ఆదేశాలుగా అమలు పరుస్తున్నందుకా? ఆ పరిస్థితులు సృష్టించిందెవరు?

★ ★ ★

తెల్లవారు జామున నాలుగు గంటల

ప్రాంతంలో ఎందరికళ్లో చింతనిప్పుల్లా కాలాన్ని గణిస్తున్నాయి. ఆ రాత్రంతా ఎస్.పి రంజిత్ పోలీసు బలగాలతో కీలకమైన ప్రదేశాలన్నీ గాలిస్తున్నాడు. మధ్యలో బంగ్లాకు వచ్చినా రెండేసి గంటలకొకసారి రౌండ్సు చేస్తున్నాడు. ఎస్.పి ఆ రకంగా తిరగడం చాలా అరుదుగా జరుగుతుంది. అత్యవసర పరిస్థితులూ... తనిఖీలూ ఉంటే తప్ప ఎస్.పిలు రాత్రి సమయాల్లో బంగ్లాలు కదలరు. వారి విశ్రాంతిని ఎంతో అత్యవసరం ఉంటేగానీ ఎవరూ భంగం చెయ్యరు.

తెల్లవారుజామున నాలుగున్నర ప్రాంతంలో ఇద్దరమ్మాయిలను ఒక వేన్‌లో తీసుకు వచ్చి జిల్లా ముఖ్యపట్టణం చివర్న ఒక కూడలిలో దించేశారనీ, ఆ అమ్మాయిలు చదువుకొన్న యువతుల్లా ఉన్నారనీ సమాచారం రాగానే రంజిత్ ఆ స్థలానికి హుటాహుటీన చేరుకున్నాడు.

ఆ అమ్మాయిలు ప్రియంవద, కౌస్తుభ అని గుర్తించడానికి కొద్ది సమయం పట్టింది.

వారి శరీరం మీది వస్త్రాలు చిరిగి చింకినట్ల నిపించాయి. మొహాల్లో కళాకాంతులు లోపించాయి. అక్కడక్కడ పైకి కనిపించేలా దెబ్బలు... ఎర్రగా కందిన శరీరం... మొహం మీద దెబ్బలు తిన్నట్లుగా బుగ్గలు కందిపోయాయి. సుకుమారంగా పెరిగిన ఆ అమ్మాయిలు ఏడ్చి... ఏడ్చిన కన్నీటిధారల నల్లని మచ్చలు కూడా మొహంలో కనిపిస్తున్నాయి.

ఎస్.పి రంజిత్ వెంటనే వాళ్లకి ఫస్ట్ ఎయిడ్ అందేటట్టు చూశాడు. వాళ్లని వెంటనే సురక్షిత ప్రదేశానికి తరలించాడు. ఆరున్నర, ఏడవుతుండగా వారిని డి.ఐ.జి ఇంటికి చేర్చేశాడు. వాళ్లని చూసి ఎవరికీ నోట మాట రావడంలేదు. తల్లిదండ్రులను చూసి ప్రియంవద వారి దగ్గరే ఏడుస్తూ కూలబడిపోయింది.

వాళ్లకి విశ్రాంతి ఇవ్వాలని నిర్ణయించారు.

కౌస్తుభ కంటనీరు ఇంకగా ఏడిచే ఓపికకూడా లేక తన గదిలోకి వెళ్లి మంచంలో కూరుకుపోయింది.

విపరీతమైన శారీరక బాధ, భరించలేని మనోవేదన పీడిస్తూండగా ఆ అలసటలో మగతగా ఉన్న కౌస్తుభకు ఆ సంఘటనే భయానకంగా గుర్తుకు వస్తూ భీతిని కలిగిస్తోంది. డి.ఐ.జి కూతురుకి కూడా ఇలాంటి చేదు అనుభవాలు ఎదురవుతాయా? ఎంతటి దుర్మార్గం. ప్రియంవద, తానూ ఏం చేశారని వాళ్లకి తమపై పగ... ఆ పీడకలలాంటి వాస్తవం ఆమె మనోఫలకం మీద కదలాడుతూనే ఉంది.

లైబ్రరీనుంచి వస్తున్న తమని ఎవరో వెనుకనుంచి పిలిచారు. ప్రియంవద తండ్రికి ఆకస్మికంగా గుండెపోటు వచ్చిందనీ, ఆసుపత్రిలో చేర్చారనీ చెప్పారు. ప్రియంవద కంగారుపడింది. కౌస్తుభకీ తోచలేదు. అదే అదనుగా వాళ్లు ప్రియంవదను కారు ఎక్కమన్నారు. ఎక్కడో కౌస్తుభకి అనుమానం తోచింది. వాళ్లు కారులో స్థలం లేదనట్లుగా మర్యాదగా చెబుతూ తనను తీసుకు వెళ్లడానికి విముఖంగా ఉండటంతో ఆ అనుమానం బలపడింది. ప్రియంవదను కారు ఎక్కవద్దని తామిద్దరం కలిసి వెళదామని కౌస్తుభ ఆమెను ఆపేసింది. వాళ్లు అయిదు నిముషాలు ఏమీ మాట్లాడలేదు. ఆ తర్వాత ఇద్దర్నీ ఎక్కమన్నారు. తాము ఆ కారులో రామనీ, వేరేగా వస్తామనీ మర్యాదగా చెప్పింది. ఆ తర్వాత ఎవరో ఇద్దరు వారి దగ్గరగా వచ్చారు. ఊహించని విధంగా ఏదో బట్టను ముక్కు దగ్గర అదిమిపట్టారు. అదేదో ఘాటైన వాసన... పీల్చక తప్పలేదు. ఆ తర్వాత తనకేం తెలీదు.

కళ్లు తెరిచే సరికి ప్రతిఘటించడానికే వీలు లేకుండా చేతులూ... కాళ్లూ మంచానికి కట్టి ఉన్నాయి. కొంచెం మత్తు వదిలేసరికి ప్రియంవద అరుపులు వినిపిస్తున్నాయి. భయంకరంగా... బాధాకరంగా అరుస్తూనే ఉంది. ఆ అరుపులూ... వారి అమానుషాన్నీ అరికట్టాలంటే దేవుడే దిగిరావాలి. నోరారా పిలుద్దామన్నా గొంతు రావడంలేదు. నోటికి




ఏదో అడ్డం ఉంది. అయినా లేని ఓపిక తెచ్చుకొని ప్రతిఘటించడానికి విఫల ప్రయత్నం చేసింది. ఆ చీకటి భయంకరం. ఎక్కడ ఉన్నారో తెలీదు. ఎవరు... ఎందుకు... అలా చేస్తున్నారో ఆలోచించే శక్తీలేదు. పాము పడగ లాంటి ఆ చీకటిలో సంస్కారానికి విలువలేదు. భాషా సంస్కృతుల ప్రసక్తిలేదు. గుప్పుమంటున్న ఆ మత్తువాసనని భరిస్తూఉండటం తప్ప ఆ మొర ఆలకించే నాథుడు లేనేలేడు.

శోకంతో సుడులు తిరిగే ఆ మనోవేదన... భరించలేని దారుణ స్థితి. ఈ సమాజంలో రక్షణ ఎవరికుంది?

ఆ గాడాంధకారంలో కలకలం రేగింది. రెండు గంటల ప్రాంతంలో రెండు మూడు కార్లు ఆ దుర్మార్గం సాగిన ప్రదేశానికి వచ్చాయి. ఆ తర్వాత అరగంటకు ప్రియంవద, కౌస్తుభ కలుసుకొన్నారు. వాళ్లని ఆ ప్రదేశంలోనే రెండుగదుల్లో ఉంచారు. తమని అక్రమంగా తీసుకు వచ్చిన నలుగురూ మత్తుగా చిత్తుగా తాగుతూ ఆ చీకటి సామ్రాజ్యంలో విర్రవీగారు. చదువు, సంస్కారం, సమాజంలోని విలువా, పలుకుబడి ఏవీ ఆ చీకటిశక్తులను ఆ సమయంలో అడ్డుకోలేదు.

మూడు గంటలవుతుండగా ఆ ప్రదేశంలో గొడవ జరిగింది. పెద్దగా బూతులు తిట్టుకొన్నారు. రెండు గంటల ప్రాంతంలో ఆ వచ్చిన వారూ... కిడ్నాప్ చేసినవాళ్లు తగవులాడుకొన్నారు. తిట్టుకొంటూ విడిపోయారు.

ఆ బూతుల్లో డి.ఐ.జి మాట వచ్చింది. ఆయన కూతుర్ని ఇలా చేస్తే పోలీసోళ్లు మిమ్మల్ని బతకనివ్వరంటూ తిట్టారు. అదెవరో తమకేం తెలుసని వాళ్లు గట్టిగానే అదిలిస్తున్నారు.

మూడున్నర గంటల ప్రాంతంలో ఎవరో తమని వదిలేస్తామని వేన్ ఎక్కమన్నారు. అంతకన్నా చేసేదేమీలేదు... ఇక దేనిగురించీ భయపడాల్సిందీలేదు. ఆ శోకం.. బాధ... వేదనలో ఆ వేన్ ఎక్కేశారు ఇద్దరూ. ఒకర్ని పట్టుకొని మరొకరు ఏడుస్తూనే ఉన్నారు. ఆ డ్రయివర్ ఏమనుకొన్నాడో వెంటనే వేన్ని పరిగెత్తించాడు.

ఆ పట్నం శివార్లలోని ఓ చిన్న కూడలిలో దించేసి వాళ్లు హడావిడిగా వెళ్లిపోయారు. ఆ వేన్కి నంబరుబోర్డూలేదు... నంబరూలేదు.

పోలీసు బృందాల గాలింపులో ఆఖరి రౌండులో వీళ్లు ఆ రోడ్డుమీదే చలికివణుకుతూ... బాధకు సుళ్లు తిరుగుతూ కనిపించారు.

ఏ మేఘాలు ఎక్కడ గర్జించినా... ప్రకృతి ఎంత బీభత్సాన్ని సృష్టించినా... చీకటి సామ్రాజ్యంలో దుర్మదాంధులు... కిరాయి దుష్టులు ఎంత భయానక వాతావరణాన్ని ఏర్పరచినా... ఆ గాఢాంధకారంలో ఎన్ని దుస్సంఘటనలూ... దౌర్జన్యాలు జరిగినా ఆగని కాలం పరిగెడుతూనే ఉంది. కాలమే అన్నిటికీ మహత్తరమందు. గాయాలను మానుపుతుంది. ఆవేదనలను ఉపశమింపచేస్తుంది. హృదయాందోళనలను తగ్గిస్తుంది. ఆవేశాలను చల్లారుస్తుంది. బుసలుకొట్టే ఆవేశం కాలంతోపాటు తగ్గినట్లు కనిపించినా పరిస్థితులు అనుకూలిస్తే ప్రతీకార చర్యకు వెనుకాడదు.

★ ★ ★

ఎస్.పి రంజిత్కి చాలా విషయాలు అర్థం అయ్యాయి. ఎంతటి ప్రాముఖ్యం ఉన్న వ్యక్తికయినా దుర్భర పరిస్థితులు ఏర్పడే విధంగా సమాజం తయారైంది. ఆ పరిస్థితులను ఏర్పడకుండా తనేం చెయ్యలేడు. ఎవరూ తమ విషయాలను స్వంత స్నేహితులకు కూడా చెప్పుకోరు. అందరి విషయాలు తమ వరకూ రావాలనీ, తమ పెద్దరికంతో ఎదుటివారి సమస్యలు పరిష్కరించాలనీ అనుకొంటారు. కానీ పరిస్థితులు విషమించినపుడు వారే అందరినీ ఆశ్రయిస్తూంటారు. అన్యాయం జరిగిందంటూ రోదిస్తుంటారు.

డి.ఐ.జి స్వామిలాంటివాళ్లు అలాంటి సాధారణ ప్రవర్తనలకు దిగజారరు. అధికార పరమైన అహాన్ని కాపాడుకోవడమే ఉన్నతాధికారుల లక్ష్యం. ఆ లక్ష్య సాధనముందు సమాజశ్రేయస్సూ మరే ప్రయోజనాలూ వారు

పట్టించుకోరు.

"మీరెన్ని చెప్పండి సార్! వాళ్లని షూట్ చేయించాలి" రంజిత్ ఆవేశంగా అరిచాడు.

"నో... అదంత ఈజీకాదు. అయినా దాని వల్ల మనకి వచ్చేదీలేదు. మన పేరు ఇంకా డామేజ్ అవుతుంది. చూడు మిష్టర్ రంజిత్! కౌస్తుభ తనకు ఏమీ జరగలేదంటోంది. ఇది నా కూతురని తెలియక వాళ్లు తీసుకువెళ్లారు. ఆ విషయం తెలియగానే భయపడి వదిలేశారు... అంతే"

డి.ఐ.జి స్వామి ఆ మాటలు మామూలుగా అంటున్నా ఆయన ముఖంలో భావాలను రంజిత్ చదువుతూనే ఉన్నాడు.

"నేను నమ్మనుసార్... వాళ్లిద్దరినీ ఏ పరిస్థితిలో చూశానో నాకు తెలుసు. వాళ్లని రోడ్డు మీద పారేసి వాళ్లు పారిపోయారు. మీ పరువు కోసం కౌస్తుభ అబద్ధం చెబుతోందనుకొంటా... నేను కౌస్తుభతో మాట్లాడతాను. నో... ఇది దారుణం... నా కూతురయినా... మీ కూతురయినా ఒక్కటే... వాళ్లని ప్రాణాలతో వదలడం జరగనిపని" రంజిత్ మాటల్లో ఆవేశం కట్టలు తెంచుకొంటోంది.

"ఓకే... మీరే కౌస్తుభతో మాట్లాడండి. నేను చెప్పేది నిజం. అమ్మాయికి ఏంకాలేదు. ఆ ప్రియంవదనీ వాళ్లు ఏమీ చెయ్యలేదు. నా కూతురు అని తెలిశాక కౌస్తుభను తీసుకువచ్చినందుకు వాళ్లల్లో వాళ్లే గొడవపడ్డారు. తన్నుకొన్నారు. చావుదెబ్బలు కొట్టుకొన్నారు" డి.ఐ.జి స్వామి ప్రశాంతంగా మాట్లాడడానికి విఫలప్రయత్నం చేశాడు.

"ఏమయినా కానివ్వండి. వాళ్లను అలా వదిలితేకాదు. లైఫ్‌లాంగ్ వాళ్లకి గుర్తుండేలా ఏదో ఒకటి చేసి తీరాలి. ఐ డోంట్ లీవ్‌దెమ్" రంజిత్ పట్టుదలగా అన్నాడు.

"మీరు ఆవేశపడకండి. ఇపుడు మనం ఎలాంటి చర్య తీసుకొన్నా... అది మనకే ఎదురు తిరుగుతుంది. ప్రస్తుతం రవీంద్రని మనం గమనించుకోవాలి. ప్లీజ్ ముందా విషయం చూడండి" డి.ఐ.జి ఆదేశం ఇచ్చాడు.

"యస్ సార్.. బట్ దట్ బ్లడీ గ్యాంగ్. నా అనుమానం వాళ్లే కరుణాకర్‌ని హత్య చేసి ఉంటారు. వాళ్లే డి.ఎస్.పి ప్రసాదరావుపై దాడి చేసి ఉంటారు. వాళ్లే అంతటికీ కారణం. వాళ్లని ఏమాత్రం సేవ్ చెయ్యకూడదుసార్. మీరు ఈ విషయాన్ని నాకు వదిలెయ్యండి. ఐ విల్‌సీ దైర్ ఎండ్" ఎస్.పి. రంజిత్ ఉగ్రుడవుతున్నాడు.

"ఆ అవసరం లేదు రంజిత్. ఆ గ్యాంగ్ ఇపుడులేదు. వాళ్లు చెదరిపోయారు. ఒకళ్లని ఒకళ్లు కొట్టుకొని ప్రాణాలరచేతిలో పెట్టుకొని మళ్లీ ఈ ఛాయలకు రాకుండా పారిపోయారు" డి.ఐ.జి స్వామి నమ్మకంగా అంటున్నాడు.

"మీకెవరు చెప్పారు సార్... మీకు ఆ విషయం ఎలా తెలిసింది? అలాగని వాళ్లు ప్రచారం చేసి తప్పించుకొంటున్నారేమో ఆలోచించండి సార్. ఇలాంటివాళ్లను ఏ రకంగానూ తప్పించుకోనివ్వకూడదు సార్" ఇంకా రంజిత్‌లో ఆవేశం చల్లారలేదు.

"నో... ఐయామ్ షూర్ ఎబౌట్ ఇట్. బిలీవ్‌మీ. ప్లీజ్ మిగతా విషయాలు చూడండి" డి.ఐ.జి ఆ ప్లీజ్ అన్న మాటని గట్టిగా వాడాడు.

"సారీ సార్. ఐ బిలీవ్ యూ సార్" సెల్యూట్ చేసినట్లుగా అభివాదం చేసి ఎస్.పి రంజిత్ అక్కడనుంచి నిష్క్రమించాడు.

డి.ఐ.జి మనసు రగిలిపోతోంది. ఆనాడు వాడన్నమాటలే గుర్తుకొస్తున్నాయి. "నువ్వు ఏ పొజిషన్‌లో ఉన్నా నీకూ ఓ బలమైన అండకావాలి. నన్ను ఆ స్థాయికి ఎదగనియ్యి. అంతవరకూ నాకు నువ్వు సహాయపడు. నేను ఎదిగితే అది నీకు బలం. ఇపుడు నీ అధికారం నా ఎదుగుదలకు మూలం. నేను చెప్పేది ఆలోచించు. వీళ్లంతా నీతో పనులు ఉన్నంతవరకే ఉంటారు. ఆపైన ఎవరు? నీకు కష్టం కలిగినా




డు ఒక్కడూ ఉండడు. వీళ్ళు పైకి సానుభూతి చూపించినా లోపల ఏమీ ఉండదు. వీళ్లని అనవసరంగా నమ్ముతున్నావ్. వాళ్లకిచ్చిన సహకారంలో కొంత నాకు అందించు. నేనెలా పైకివస్తానో చూడు. నీ అధికారాన్నీ... హెూదానీ నేను వాడుకోను. పరోక్షంగానే సహాయపడు''

అవి మాటలు కావు. ఆనాడే వాడు చెప్పిన వేదాలు. వాడు నిజంగానే అన్నాడు. ఆ మాటలున్నాయిగానీ... వాడులేడు. ఎవరువాడు? ఎక్కడివాడు? వాడ్నే ఎందుకు కాదనుకొని కూడా తలచుకొంటున్నాడు డి.ఐ.జి స్వామి.

వాడే కరుణాకర్. కరుణాకర్ ఒక నిజం. స్వామి, కరుణాకర్‌ల మధ్య జరిగిన సంభాషణ వాస్తవం. అది స్వామి గుండెల్లో నిరంతరం మారుమ్రోగుతూనే ఉంది.

ఆనాడు...

"ఒరే... కరుణా... అసలీ ఊరు ఎందుకొచ్చావురా? నేనున్నాననే కదా! నా పరువు తియ్యడానికి కంకణం కట్టుకొన్నావా?" స్వామి ప్రశ్న.

"ఛ.. అలాంటి ఆలోచన కూడాలేదు. ఎక్కడో అక్కడ ఎదగాలి. ఇక్కడయితే పరిస్థితులు బాగున్నాయి. నీనుంచి పెద్దపెద్ద సహాయాలు నేను ఆశించను. అదీకాక నువ్వు ఫలానా అని చెప్పుకు తిరిగే అవసరం నాకులేదు'' కరుణాకర్ ఎదురు తిరిగి అన్నాడు.

"అంత పెద్ద అయిపోయాను అనుకోకు. ఈ రాజకీయాలు, గొడవలూ నీకెందుకూ. ఎక్కడో అక్కడ ఉద్యోగం చేసుకొని హాయిగా ఉండలేవా?"

"అలా అని నిన్ను నేను అడగలేదు. ఎందుకంటే నువ్వు ఒకోమెట్టూ ఎక్కి ఈ స్థాయికి చేరావు. అమాంతంగా డి.ఐ.జి అయ్యావా? అప్పట్లో నీకన్నా వయసులో పెద్దయిన వాళ్లూ నిన్ను అడగలేదు. ఎందుకో తెలుసా నువ్వు వినవని వాళ్లకి తెలుసు. అలాగే నన్నూ అనుకో'

కరుణాకర్ వాదనకు, స్వామి చిరాకుపడ్డాడు.

"యు ఆర్ టాకింగ్ లైక్ ఎ ఫూల్. నువ్వు అనుకొన్నట్టుగా రాజకీయాల్లో పెరగాలంటే చాలా డబ్బు ఉండాలి. వెనకాల గట్టిదన్ను ఉండాలి. ఏదో గాలివాటంగా వచ్చి రాజకీయాల్లో ఎదిగి పోతాననుకోవడం నీ భ్రమ"

"నేను భ్రమల్లోలేను. వాస్తవ పరిస్థితుల్లో బతుకుతున్నాను. నీ స్థాయిలో కూర్చొని ఆలోచిస్తే అలాగే అనిపిస్తుంది. నా స్థాయికి దిగి నువ్వు ఒక్కక్షణం కూడా ఆలోచించలేవు. రాజకీయాల్లో బాగా పైకి వచ్చిన వాళ్లంతా నువ్వు అనుకొన్నట్టుగా రాలేదు. ఇపుడు రాజకీయమంటే ఒక్క డబ్బూ పలుకుబడే కాదు. జనాన్ని నమ్మించగల శక్తి అన్నిటికన్నా ఎక్కువగా పనిచేస్తుంది''

డి.ఐ.జి కరుణాకర్‌కేసి చూస్తూ ఉండిపోయాడు.

"నువ్వు ఎందరికో సహాయం చేస్తున్నావు. వాళ్లల్లో ఒకడిలా నన్ను భావించు. నీ పేరు వాడుకోను. నీ పరపతితో నాకు అనవసరం. పరోక్షంగా చిన్నగా సహాయం అందించు. నీవాణ్ణి ఒకడ్ని పెరిగేందుకు అవకాశం కల్పించు. నీకు నేను రేపటిరోజున ఉపయోగపడతాను. నువ్వు నన్ను ఎందుకు పిలిపించావో నాకు తెలుసు. 'వాళ్లు నన్ను ఏదో చేసేస్తారు ఇక్కడనుంచి వెళ్లిపో' అని చెప్పడానికి... అంతేనా - వాళ్లు ఎవరో నీకూ, నాకూ కూడా తెలుసు. నువ్వు నాకు కొంచెం సహకరిస్తే వాళ్లను అధిగమిస్తాను. ఎంతయినా నాకున్న బాధ్యతవాళ్లకి ఉండదు. నిజంగా నీకు సమస్యవస్తే వాళ్లు తప్పుకొంటారు. ఒక్కడూ ముందుకురాడు''

కరుణాకర్ అలా చాలా మాట్లాడాడు. అప్పట్లో స్వామి ఆ మాటలకి విలువ ఇవ్వలేదు. తననుంచి ఏం ఆశించవద్దని కరుణాకర్‌కి స్పష్టంగా తేల్చి చెప్పాడు. మార్గాన్ని మార్చు

కో అని సలహా మాత్రం ఇచ్చాడు.

తన విధానం మారదనీ, ఏ పరిస్థితి ఎదురైనా మారననీ కరుణాకర్ తేల్చి చెప్పాడు. నీ ఖర్మనీదన్నట్లుగా కరుణాకర్‌ని ఆ రోజు స్వామి నిర్లక్ష్యం చేసినందుకు ఈ రోజు ఆయన బాధపడుతున్నాడు.

'వాడ్ని ఎలాగోలా కాపాడుకోవలసింది. వాడ్ని నాలుగు తన్ని పారిపోయేటట్టు చేస్తారనుకొన్నానుగానీ, మొత్తానికి అలా మర్డర్ చేసి శవాన్ని కూడా మాయం చేస్తారని ఆనాడు అంచనా వెయ్యలేకపోయాను. సమర్థుడైన అధికారిగా రాజకీయశక్తుల దృష్టిలో ఉండాలంటే కొన్ని చూసీచూడనట్లు వదిలెయ్యాలి. పాలకులకు అవరోధాలు ఏర్పడి, వాటిని వాళ్లే తొలగించుకొంటున్నప్పుడు మిన్నకుంటే చాలు తన సమర్థతకు విలువ పెరుగుతుంది' అనుకున్నారు స్వామి.

నాయకులకు వారనుకొన్నట్లుగా పనులు జరగాలి. వ్యాపారస్థులకు వారి వీలుప్రకారం పనులు సాగాలి. ఆశ్రితులకు ఉపయోగపడాలి. పై అధికారుల ఆశలకు అనుగుణంగా నడవాలి. సమాజంలో గౌరవాన్ని సాధించాలి. అవన్నీ ఎలా వస్తాయి? సమర్థత కావాలి. ఆ సమర్థతవల్లే అన్నీ సానుకూలపడతాయి. నేటి సమాజానికి కావలసిన సమర్థత అదే. ఓపక్క మనకి పనికిచ్చే సమర్థతను కోరుకొంటూ, మరోవైపు నైతిక విలువంటూ విమర్శనాస్త్రాలు కురిపించడం అసమంజసం. అదొక దారుణ విధానం. పెదాల కదలికల్లో విలువలు మాట్లాడే ఎందరు ఆ సమర్థతను సంపాదించడానికి ఉవ్విళ్లూరడంలేదు? ఆ సమర్థతను సాధించడానికి అన్ని అడ్డదారులు తొక్కడంలేదూ... ఆ ఆలోచనలు స్వామికి ఊరట కలిగించాయి.

★ ★ ★

"మీరలా బుద్ధావతారంలా కూర్చొంటే ఏమవుతుందీ? రెండు జిల్లాలకు పోలీసు అధికారి. మీరు తలచుకుంటే అమ్మాయిని అలా చేసినవాళ్లని పట్టుకోలేరా? పరువు పోతుందని అదీ, మీరూ కలిసి నా నోరు నొక్కేశారు. ఇదెంత బాధో తెలుసా...? మీరు ఎలా భరిస్తున్నారో తెలీదుగానీ, నావల్ల కాదు. పరువు... మర్యాద ఎందుకోసం...? మంచిగా బ్రతకడానికి. మన అమ్మాయికే అలాంటి అవమానం జరిగినప్పుడు మీరు ఇలా ఏమీ చెయ్యకుండా నోరు మెదపకుండా ఉంటే మాకు ఎంత బాధగా ఉంటుందో ఆలోచించండి. ఎవరి కోసం ఈ అధికారం? ఎందుకోసం ఈ సంపాదన? మన పిల్లల్నే కాపాడలేని దౌర్భాగ్యం..." అంటూ ఏడుస్తోంది వనజ.

అంతటి పోలీసాఫీసరు భార్య రోదిస్తోంది. ఆ కుటుంబమే మౌనంగా రోదిస్తోంది. పరువు కోసం గంభీరంగా మాట్లాడుతున్నా దైనందిన కార్యక్రమాల్లో పాల్గొంటున్నా మనసులు మూగవేదనతో అల్లాడుతున్నాయి. వనజ కోపంగా ప్రశ్నిస్తోంది. బాధగా ఏడుస్తోంది. మగని చేతకాని తనాన్ని ఎత్తిచూపుతోంది. ఎందుకోసం ఈ బతుకు అనే వాదనకు దిగుతోంది.

స్వామికి ఆ దుర్మార్గుల సంగతి తెలీదా...? తెలుసనే వనజ నమ్మకం.

వారిని బంధించి శిక్షించలేడా? శిక్షించగలడనే ఆమె విశ్వాసం.

అలా చేస్తే ఎవరితో డి.ఐ.జి. ఢీకొనాలి? అది ఆమె ఆలోచించలేని ప్రశ్న.

ఆ మాతృహృదయం ఆవేశంతో ఎగిసి ఎగిసి పడుతోంది. ఆ ఆవేశానికి రూపు ఉంటే అది ఆ కిరాతకులను భస్మంచేస్తుంది. కూతురికి జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకొంటుంది. ఆ ఆవేశాగ్ని డి.ఐ.జి. స్వామిని క్రమక్రమంగా ఆక్రమిస్తోంది. తన సమర్థత చూపించే తరుణం స్వామికి ఆసన్నమయింది.

"మనం తొందరపడి ఏ నిర్ణయానికీ రాకూడదు వనజా. తొందరపడితే మనకే నష్టం" స్వామి అనునయించడానికి ఆరంభం పలికాడు.

ఆమె ఉగ్రురాలైంది. కోపంగా స్వామిని




చూసింది. ఆ చూపులో బాధా, అసహ్యం మేళవించి వున్నాయి.

"ఏం నష్టం జరగాలి? జరగరానిదే జరిగింది. అమ్మాయి మర్యాద నాశనమయింది. ఇంకా ఏం మిగిలింది నష్టపోవడానికి? మీ అధికారగౌరవమే ముఖ్యమా? దాన్ని కాపాడుకోవడానికి రేపు నన్ను చంపినా ఇలాగే ఉంటారా? మీకు మీ పరువు ముఖ్యం. మమ్మల్ని ఈ పరువు పంజరంలో ఇరికించారు. మా నోళ్లు మూయించారు. ఎందుకు నోరు మూసుకొన్నామో తెలుసా? మీరు ఆ రాక్షసులను పట్టుకొని వాళ్ల అంతు చూస్తారనుకొన్నాం. కానీ మీరూ... మీ రాజకీయాలు తప్ప మరేం పట్టకుండా ఉన్నారు'' వనజ కోపంగా లేచింది.

"అలా మాట్లాడకు వనజా! అదను చూడాలి. ఒక్కసారిగా మనం ఏదయినా చేస్తే కూతురికి ఏదో అయింది కాబట్టే డి.ఐ.జి. చర్య తీసుకొన్నాడంటారు''

స్వామి మాట పూర్తి చెయ్యకుండానే "ఎవరంటారండీ... ఆ చేయించినవాళ్ళా'' వనజ కోపంగా అడిగింది.

"నన్ను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు. ఆవేశపడితే పనులు కావు'' స్వామి గట్టిగానే అన్నాడు.

"నేను మీలా పెద్ద పోలీసాఫీసర్ని కాదు ఆవేశపడకుండా ఆలోచించడానికి. కన్నకూతురు బలిపశువుగా మారితే మీరు గొప్ప అధికారి కాబట్టి ఆవేశపడరు. నేను మామూలు మనిషిని. దాని కన్నతల్లిని''

ఆ ఏడుపు స్వామి హృదయాన్ని పిండేస్తోంది. కన్నకూతురికి జరిగిన అవమానం డి.ఐ.జికి తెలియంది కాదు. ఆ బాధ ఆ తండ్రికి లేకా కాదు. ఆ హృదయం ఆక్రోసిస్తూనేవుంది. అది తెలిసిన మంత్రి కూడా చాలా విచారంగా డి.ఐ.జిని ఓదార్చాడు. ఆపని చేసినవాళ్ల కాళ్లు విరగ్గొట్టించాడు. ఆ కిరాయి దుండగులు చావుదెబ్బలు తిని స్పృహ లేకుండా పడివున్నారు. పోలీసులు కూడా వెయ్యలేని కఠిన శిక్షలు వాళ్లు అమలుచేశారు. ఒకడికి ప్రాణమే పోయింది. మరో ఇద్దరు చావుబ్రతుకులమధ్య అల్లాడుతున్నారు. మరొకడు చావుదెబ్బలు తిని పారిపోయాడు. వాడి కోసం ఆ దుర్మార్గులే వెతుకుతున్నారు.

అవి నిజాలు. డి.ఐ.జి. స్వామిని ఉపశమింపచేయడానికి ఒక వర్గం చేసిన పనులవి. కానీ ఆ కిరాయి దుండగులే ఆ సమస్యకు మూలమా? అది స్వామికి తెలియదా? ఆడపిల్లల్ని కిడ్నాప్ చెయ్యడంవరకే వారు ఆగిపోతారా? ఒంటరిగా ఉన్న అమ్మాయిని అందులోనూ వయసులో ఉన్న యువతులు దొరికితే వాళ్లు పవిత్రంగా ఆలోచిస్తారా?

అదంతా ఆ పని చేయించినవర్గానికి తెలియదా? అసలా కిడ్నాప్ చేయించినవాళ్లను వదిలేసి, ఎవరినో చంపామనీ... చంపుతామనీ ఎందుకు ఈ నాటకం ఆడుతున్నారు. వాళ్లు చచ్చినంతమాత్రాన కన్నకూతురికి జరిగిన అన్యాయం సమసిపోతుందా?

ఈ విషయంలో భార్యకు సమర్థుడిలా అనిపించాలి. ఆమె దృష్టిలో అసమర్థుడిలా నిలిచిపోకూడదు. కూతురి విషయంలో కూడా మిన్నకుండిపోవడంకంటె ఈ పదవిని వదులుకోవడమే మంచిది. ఏదో ఒకటి చెయ్యాలి. నేరుగా చెయ్యకూడదు. పరోక్షంగా సాధించాలి అనుకున్నాడు స్వామి.

★ ★ ★

"అయామ్ వెరీ సారీ సర్' ఎస్.పి. రంజిత్ కొద్దిగా తలదించి అన్నాడు.

అదెందుకో అర్థంకాక డి.ఐ.జి. స్వామి రంజిత్‌వైపు ఆశ్చర్యంగా చూశాడు. ఆ చూపులో 'ఫర్ వాట్' అనే ప్రశ్న ఉంది.

"నాకు ఈరోజే తెలిసింది సార్. ప్రసాదరావు మాటల్లో చెప్పారు, కరుణాకర్ మీ తమ్ముడని. ఐయామ్ రియల్లీ సారీ సర్'

రంజిత్ నెమ్మదిగా అన్నా ఆ మాటలు

డి.ఐ.జి మనసులో మారుమోగాయి. పెద్ద సంచలనం చెలరేగింది. అయినా అది బయటకు రాలేదు. స్వామి మౌనం పాటించాడు. కానీ నవనాడుల్లో రేగిన పెనుతుఫాను ఆయన శరీరాన్ని కుదిపేస్తోంది. అసహనంగా మారిపోయాడు.

ఎస్.పి. రంజిత్ సానుభూతిని అందిస్తూనే సుబ్బరాజు విషయాన్ని మాట్లాడాడు. కౌస్తుభ, ప్రియంవదల సంఘటన పూర్వాపరాలు విశ్లేషించాడు.

చిన్నగా ఆ మాటలు వింటున్నా డి.ఐ.జి. స్వామి ఉద్వేగానికి గురవుతున్నాడు. అనేక రకాలుగా ఆ సంభాషణ సాగింది. డి.ఐ.జి. అంగీకరిస్తే సుబ్బరాజును అరెస్ట్ చేస్తానని ఎస్.పి హామీ ఇచ్చాడు. అదే సరైన విధానమని వాదించాడు. తన అంచనాలు... ఆలోచనలూ సరైనవని అంటూ అందుకు ఒప్పుకోమని రకరకాలుగాఒత్తిడిచేశాడు.

ఆఖరికి స్వామి ఆ ఒత్తిడికి లొంగక తప్పలేదు. పర్యవసానంగా సుబ్బరాజు అరెస్ట్ అయ్యాడు. ఆ వార్త జిల్లా అంతటా పాక్కింది.

మంత్రి కోటేశ్వరరావు మండిపడ్డాడు. డి.ఐ.జి. స్వామిమీద నోరు పారేసుకున్నాడు. ఇరవైనాలుగు గంటల్లో సుబ్బరాజును వదిలిపెట్టి, కేసు మూసెయ్యకపోతే తన తడాఖా చూపిస్తానని సవాలుచేసి నేరుగా రాజధానికి ప్రయాణమయ్యాడు.

ఎస్.పి. రంజిత్ మంత్రి పక్కనే ఉండి తనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాడు. ఆ వ్యవహారంలో తన పాత్ర పై అధికారి చెప్పింది చెయ్యడమే అన్నట్లుగా ప్రవర్తిస్తున్నాడు.

మంత్రి ఎస్.పి.తో సమాలోచనలు చేస్తున్నాడు. డి.ఐ.జి. స్వామి తనకు ఎదురు నిలిచి తనవారిమీద ప్రత్యక్ష చర్యకు పూనుకొన్నాడని తెలియగానే మంత్రి ఎస్.పి. రంజిత్‌తో వ్యూహరచన చేస్తున్నాడు.





జిల్లాలో గాలిదుమారం లేచింది. రాజకీయ చదరంగం ప్రారంభమయింది. కల్లోలం ఆరంభమయి, పోలీసుల దురాగతాన్ని పాలకపక్షంవారేపత్రికల కెక్కించి ఖండించడం మొదలు పెట్టారు. పోలీసుల దురాగతాలు నశించాలనీ, డి.ఐ.జి. దౌర్జన్యకర పద్ధతులు నశించాలనీ జిల్లాలోని అనేక ప్రాంతాల్లో అల్లర్లు చెలరేగాయి.

'డి.ఐ.జి. స్వామి డౌన్‌డౌన్' అనే నినాదాలు మారుమోగుతుండగా జిల్లా కేంద్రంలో పెద్ద ఊరేగింపు జరిగింది. నిరసన ధ్వనులు పురవీధుల్లో వ్యాపించాయి. అనేక పుకార్లు పుట్టాయి. సుబ్బరాజు విడుదలకోసం ఆమరణ నిరాహార దీక్షలు ఆరంభమయ్యాయి. బస్సుల అద్దాలు పగలగొట్టారు. దుకాణాలు లూటీచేశారు. అమాయకులను దోచుకొన్నారు. ఏ గొడవతో సంబంధంలేని సామాన్యులను వేధించారు. జిల్లానే సమస్యలవలయంగా మార్చేశారు.

అల్లకల్లోలంగా మారిన స్వామి హృదయం ఆక్రోశిస్తోంది. ఇన్ని దశాబ్దాలుగా నాయకుల భుజశక్తిగా వారికి అన్ని పనులూ చేసిన తాను పనికిరానివాడిగా క్షణాల్లో మారిపోయాడు. పోలీసు సమర్థతమీద అధినాయకులు చేసే దాడి అని తెలిసినా ఎవరూ తనకు మద్దతు ఇవ్వడంలేదు. ఇన్నేళ్లుగా పెంచుకొన్న ప్రతిష్ఠ ఒక్క దెబ్బకు ఎగిరిపోయింది. నాయకులు తననో అసమర్థుడిగా చిత్రీకరిస్తూ ప్రకటనల పరంపరను కురిపిస్తున్నారు.

స్వామికి తన తండ్రి గుర్తుకు వచ్చాడు. ఆయన ఆశయాలు ఆయనవి. ఆ ఆశయాల సాధనలోనే ఆ తండ్రి తన సమర్థతను పట్టించుకోలేదు. ఏ విలువా ఇవ్వలేదు. తాను నమ్ముకున్న సమాజం కావాలనుకొంటున్న తన సమర్థత ఆయన్ని దూరంచేసింది.

తమ్ముడు కరుణాకర్ వాడి విధానం వాడిది. ఓరకంగా వాడి విధానం కూడా సమాజం కోరుకొన్నదే. కానీ ఆనాడు తాను తన సమర్థతకే విలువ ఎక్కువగా ఇచ్చాడు. తమ్ముణ్ణి పట్టించుకోలేదు. వాడికీ పనికిరా

కుండా పోయాడు. వాణ్ణి వాళ్లు తెగనరికిననాడే ఆ విషయాన్ని పట్టించుకొంటే పరిస్థితి ఇంతలా విషమించేది కాదు. అప్పట్లో ఆ విషయం పట్టించుకున్నా ఫలితం ఉండదని తనకు తెలియదా?

కౌస్తుభ... తన కన్నకూతురు విషయంలో ఎవరాపని చేయించారు? పొరపాటయినా, గ్రహపాటయినా అది నేరంకాదా? వారెవరో స్వామిలాంటి అనుభవశాలికి తెలియదా? తెలిసినా ఏంచెయ్యాలి? కూతురు భవిష్యత్తును వెలపెట్టి పోరాడాలా? నేరస్థుడి మొఖం చూసి వాడి చరిత్ర చెప్పగల తనలాంటి ప్రతిభాశాలి కూతుర్ని ఆ స్థితిలో చూసినప్పుడు ఏం జరిగిందో అంచనా వెయ్యలేడా...? తండ్రి పరువునే ప్రధానంగా భావించిన కౌస్తుభ తనకు ఏమీ జరగలేదని చెబుతున్నా, అది తాను నమ్మినట్లు నటించినా ఆ మాతృహృదయాగ్నిని చల్లార్చగలడా...? నిజాలు తెలిసిన హృదయాన్ని మభ్యపెట్టగలడా? 'కరుణాకర్, కల్యాణ్ మర్డర్ల విషయంలో కల్పించుకొంటే చంపేస్తాం అని బెదిరిస్తూ వాళ్లు సాగించిన అకృత్యం' సమసిపోతుందా? ఇద్దరమ్మాయిలు వయసులో ఉన్నవారు. అన్ని గంటలు ఉచ్చం, నీచం తెలియని కిరాతకులమధ్య గడిపారు. అయినా ఏమీ జరగలేదనే లోకాన్ని నమ్మించాలి.

ఒక సీనియర్ పోలీసాఫీసరయిన తనకి వాస్తవాలను ఖచ్చితంగా అంచనావేయగల శక్తి ఉంది. కానీ అది 'సమర్థత' ముసుగులో మత్తుగా పడివుంది. ఆ మత్తును ఒదిలించుకొంటే ఈ సమాజం తనను అసమర్థుడంటుంది. సంఘంలోని మనుషులు కోరుకొనేవిధంగా సమర్థతను చూపిస్తూ ముందుకు సాగాలంటే అగ్నిపర్వతాలనుసైతం హృదయంలోనే అణగార్చాలి.

అయినా అధికారపు అహంకోసం పోటీ తప్పదు. ఎస్.పి. రంజిత్ తన అధికారపు అహంకోసమే కరుణాకర్ మర్డర్ విషయాన్ని శోధిస్తున్నాడనేది స్వామికి తెలియని విషయం కాదు. కరుణాకర్ స్వామికి తమ్ముడనే విషయాన్ని బయటకు లాగి తన అధికార బలాన్ని పెంచుకొన్నాడు. సమాచారాలను వెలికితీసి పై అధికారిని ఇరకాటంలో పెట్టి రాజకీయంగా తనను ఇరికించాడు. దేనికోసం? ఎదగడంకోసం. అవి తనకి తెలియని విద్యలు కావు. ఆఖరికి ఎస్.పి రంజిత్ రాజకీయ బలానికి దగ్గరయ్యాడు. అనుకొన్నది సాధించాడు. 'సమర్థత'ను నిలబెట్టుకొనే ప్రయత్నంలో ఒక మెట్టు ఎక్కాడు.

ఒకరు మెట్టు ఎక్కాలంటే ఒకర్ని దించాలి. అదే నేటి సమాజపు మూలసూత్రం.

డి.ఐ.జీ.పై నిరసనధ్వజం రాజధానిలో సైతం ఎగిరింది. స్వామి అక్కడే ఉంటే వచ్చే ఎన్నికల్లో పాలకపక్షం ఓటమి పాలవుతుందని రాజకీయ నాయకులు వాదించి గెలిచారు. స్వామిని అక్కడినుంచి మరో శాఖకు తరలిస్తూ ఆదేశాలు జారీఅయ్యేవరకూ వారు ఆ అలజడులనూ, ఆందోళనలనూ ఆపలేదు. నాయకుల ఒత్తిడులకు సదా లొంగే పాలకపక్షం వారి అభీష్టాన్ని కాదనక తప్పలేదు. దశాబ్దాలుగా నాయకులకు 'సమర్థత' ఆధారంగా సేవలందించిన డి.ఐ.జి. స్వామి నిర్జీవయాత్రకు సిద్ధమయ్యాడు. ఆ జిల్లాలో ఆ వ్యవహారం సమసిపోయింది. మరొకరు ఆ స్థానంలోకి వస్తారు. తమ 'సమర్థత'ను సమర్థవంతంగా కాపాడుకోవడానికి అహర్నిశలూ తాపత్రయపడతారు.

ఎన్నిటినో కోల్పోయిన ఒకనాటి 'సమర్థుడు' స్వామి - నేడు ఆ సమర్థతా ప్రమాణికంగా సాగే వీలులేదు. అదొక జీవనయాత్ర నిర్జీవయాత్ర. అదలా సాగక తప్పదు.



ఈ నవలకు ప్రేరణ నిచ్చిన మిత్రులు, ఆప్తులు, శ్రేయోభిలాషులు శ్రీ ఇమాన్యుయేల్ గారికి కృతజ్ఞతలు.
-రచయిత

# పడగనీడ పై సమీక్షలు

ఫిబ్రవరి చతురలో ప్రచురితమైన జె.వి. బాబు నవల 'పడగనీడ'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## వ్యాపార నాగరికత

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

**ఈ** నవల ప్రారంభంలోనే రచయిత లక్ష్యమూ, ఉద్దేశమూ, ఏం చెప్పబోతున్నారూ అనేది తెలిసిపోతూనేవుంది. కానీ చివరి కంటా చదివింపజేసే గుణం, సామాజిక పరిస్థితులపై రచయితకుగల అవగాహన, ప్రశాంతజీవనం కోసం మానవాళి జరుపుతున్న మౌనపోరాటం ఇవన్నీ కథకి నిండుదనం సమకూర్చాయి. పట్నంలో ఏదో బావుకుందామని పల్లెల్ని వదిలి, దాహం తీర్చుకోవటం కోసం శరన్మేఘంవంక ఆశగా చూసినట్లు పట్నాల మోజులో పడ్డ అమాయక కుటుంబం ఏవిధంగా నాశనం అయిందో, మానవ అమానుషత్వానికి ఎలా బలి అయిందో హృద్యంగా వర్ణించారు రచయిత. శ్రీనివాసరావు, సరోజ, రవి, ముఖ్యంగా ఆలీ బేగ్, నూర్జహాన్ పాత్రల చిత్రణ చాలా బావుంది.

కానీ పల్లెలన్నీ ప్రశాంతంగా వుంటాయనీ, పట్నాలన్నీ అల్లకల్లోలంగా వుంటాయనీ అనుకోవటం ఒక పరిమిత కోణంలోంచి ఆలోచించడమే! ఈనాడు పల్లెల్లో కూడా కులద్వేషాలు, తగాదాలు, మారణకాండలు ప్రజ్వరిల్లిపోతున్నాయి. ఒకరు బాగుపడితే ఓర్వలేనితత్వం, అసూయ, పొలంతగాదాలు, కుప్పలు తగలబెట్టడాలు, స్థానిక అధికారుల ఆగడాలు లాంటి వాటితో పల్లెలు తమ సహజ ప్రశాంతతను కోల్పోయి చాలాకాలం అయింది. పచ్చటి పంటపొలాల స్థానాన్ని చేపల చెరువులు ఆక్రమిస్తున్నాయి. నేటి పల్లెలు చాలా శాతం పట్నం అనుకరణలో వాతలు పెట్టుకుని దుర్వాసన కొడుతున్నాయి. రచయిత అభిప్రాయాలు కొన్ని అవాస్తవికంగా వున్నా, చాలావరకు నిజాయితీతో గూడిన వేదనతో, మానవత్వంపట్ల, శాంతితో కూడిన జీవనంపట్ల ఆశాజనకంగా వున్నాయి.

-వి. దీప్తి,
హైదరాబాద్

## యధార్థ చిత్రణ

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

'పడగనీడ ఇతివృత్తం ఆకర్షణీయంగానూ, నవలపేరు ఇతివృత్తానికి తగినట్లుగానూ వుంది. కొసమెరుపు రచయిత రచనాశిల్పాన్ని తెలియజేస్తుంది. రాష్ట్రంలో జరిగిన ఒక వర్గపోరాటాన్ని, ఒక మతకలహాన్ని చిత్రించడంలోనూ రచయిత సఫలీకృతుడైనాడు. ఆఖ్యానంలో ఉపాఖ్యానాల్లాగా అయోధ్య బాబ్రి మసీదు విషయం, బొంబాయి బాంబుల విషయం ప్రస్తావించడం ప్రశంసనీయం.

ఆటంబాంబులు పడి ఫ్రాన్స్ నాశనమైతే ఫ్యాషన్స్ పోతాయి. జపాన్ నాశనమైతే టెక్నాలజీ పోతుంది. అమెరికా పోతే ఆయుధాలు అంతరిస్తాయి. కాని భారతదేశం పోతే ప్రపంచశాంతికి ఆలవాలమైన సంస్కృతి





పోతుంది. శాంతి నశించి ప్రపంచమే పోతుంది అన్నాడొక కవి. అంటే ప్రపంచానికి నాటికి నేటికి శాంతిని ప్రసాదించేది భారతదేశమే. ఆ శాంతి భారతదేశపు పల్లెల్లో ఇంకా కొంత జీవించివుంది. నగరాల్లో ఆ శాంతి అశాంతిగా మారింది. ఈ సత్యాన్ని రచయిత చక్కగా ప్రతిపాదించాడు.

ప్రకృతి రమ్యమైన పల్లెల్లో అర్ధాకలితోనైనా హాయిగా నవ్వుతూ నలుగురితో కలిసి బతుకవచ్చు. కాని నిండుగా భోంచేసినాపట్నాలలో భయంలేకుండా బతకడం సాధ్యంకాదన్న నిజం ఈ కథలో చక్కగా చెప్పారు.

రామచంద్రారావు పాత్ర ద్వారా నగరాలలో జనాభాను ఎలా తగ్గించవచ్చో సూచించడం ఒక సమస్యకు సమాధానం చెప్పినట్లయింది. నవలలో కేవలం సమస్యల్ని చిత్రించడమేకాక సమాధానాలు కూడా చెప్పడంవల్ల ఈ నవల అత్యంత ఆదరణీయమైందని నా భావన.

-డా॥ జి.డి. నాయుడు
తిరుపతి

## చతురమైనదే

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

'పడగనీడ' అన్న టైటిలే ఈ నెల చతుర నవలకు ఓ ఆకర్షణ అయింది. రచయిత ఎంచుకున్న కథ సామాన్యమయినదే అయినా మలిచినతీరు, సాగిన విధానం, శైలీ చదువరిని ఏకబిగిని చదివించింది.

పల్లెల్లో రైతుల బ్రతుకులు ప్రకృతివైపరీత్యాలకు బలయిపోవడం కళ్ళకు కట్టినట్లు వర్ణించారు. మరి అలాంటివారికి దారేది? భూములు అమ్ముకుని వలసవెళ్ళిన వారందరి బ్రతుకులూ అలాగే అవుతాయా? కాకపోవచ్చు! అలాంటి ఆలోచనలు చేసేవారికి వెన్నుతట్టి గుణపాఠం చెప్పినట్టుంది రచయిత కథావిధానం. కాని నగరజీవనంపట్ల మోజుతో కాదుకదా శ్రీనివాసరావు పల్లె వదలిరావడం! ఒకవిధంగా బ్రతుకుతెరువు వెదుక్కోడానికే పల్లెనుండి వచ్చిన కుటుంబాలనే విజయవాడ అల్లర్లు దోచుకోలేదు. అక్కడే వుంటున్న నగరవాసులు కూడా దోచుకోబడ్డారు. వారి మాటేమిటి? అలాగే హైదరాబాదులో మతకలహాలకు బలి అవ్వడం కూడా! నగరవాసుల్లోనే అనేకమంది అమాయకులు మతమౌఢ్యాలకు బలవడం జరుగుతోంది. అలాంటప్పుడు శ్రీనివాసరావు కుటుంబం పల్లెనుండి వలస వచ్చినందువల్లనే అలా వారి జీవితాలు నాశనమయ్యాయని చెప్పడంలో రచయిత ఉద్దేశమేమిటో? ఏది ఏమయినా ప్రముఖ నగరాల్లో నాడు జరిగిన, నేడు జరుగుతున్న కొన్ని సంఘటనలను నవలలో రచయిత సమయానుకూలంగా అన్వయించి కథను, మలచిన విధానం ప్రశంసనీయం.

-శ్రీమతి డి. చంద్ర
చిత్తూరు.

## మానవతకు అద్దం

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

పల్లె ప్రాంతాలు అభిమానానికి, అనుబంధానికి, ఆత్మీయతకు నిదర్శనాలు. అవి ప్రకృతి అందాలకు, ప్రశాంత జీవనానికి, పసిడి పంటలకు పట్టుకొమ్మలు. అలాంటి పల్లెల్లో వ్యవసాయమే జీవనోపాధి అయిన కుటుంబాలు ఎంత ప్రశాంతంగా జీవనాన్ని గడుపుతున్నాయో, అలాగే ఒక్కోసారి ప్రకృతి అలజడులు రైతును ఎంతగా దిగజారుస్తున్నాయో, నిరాశతో వారు పల్లెలను వదిలి, ధనదాహంతో ఎలా నగరవాసానికి పరిగెడుతున్నదీ, నగరవాసుల జీవితం ఎంత యాంత్రికంగా, దుర్భరంగా ఉండేది, ఎన్ని అలజడులను ఒడుదుడుకులను సృష్టించేది ఈ నెల చతుర నవల 'పడగనీడ' ద్వారా జె.వి. బాబుగారు తెలియజేశారు.

ఈ రోజుల్లో పట్నవాసం అంటే 'దినదిన గండం నూరేళ్ళు ఆయుష్షే'. రాజకీయ నాయ

కులు తమ పదవీ వ్యామోహంతో సృష్టించే అల్లర్లకు, అలజడులకు, అమాయకులైన ప్రజలు బలయిపోతున్నారు!

రవి, అలీలు అలీబేగ్, రామచంద్రరావులు భిన్న మతస్థులైనా, వారి మధ్య ఉన్న స్నేహాన్ని, సన్నిహితత్వాన్ని జాతీయసమైక్యతకు చిహ్నంగా చెప్పుకోవచ్చు. ముస్లిమ్ మతస్థుడైన అలీబేగ్, హిందూ నిరుద్యోగ యువకుడైన రవిని చేరదీసి, అతనికి జీవనోపాధి కల్పించడం మానవత్వ విలువలు ఇంకా సజీవంగానే ఉన్నాయనడానికి నిదర్శనం. మతంకన్నా మానవత్వం గొప్పదనే అతని ఆదర్శం, మానవత్వాన్ని కాపాడటానికి ప్రాణాలను సైతం లెక్కచేయని అతని తెగింపు హర్షణీయం.

ఉన్నత విద్యలను అభ్యసించి కూడా జీవనోపాధి కోసం నిరుద్యోగ యువకులు ఎంత తక్కువ ప్రతిఫలానికి అయినా పనిచేస్తున్నారనే రచయిత ఆవేదన 'అజయ్' పాత్ర ద్వారా స్పష్టమైంది. పల్లెలోకంటే పట్నాలలో సుఖపడగలమనే నమ్మకంతో ఉన్న ఆస్తిని అమ్ముకొని, నగరానికి చేరిన శ్రీనివాసరావు, సరోజలు నగర రాజకీయానికి ఏవిధంగా బలయిపోయినదీ చక్కగా తెలియచేశారు.

ఏదిఏమైనా పల్లెలలో ఉన్న సుఖశాంతులు, ప్రశాంతత, పట్టణాలలో కుటిల స్వార్థపు రాజకీయాలున్నంతకాలం అసాధ్యమనేది ఈ నవల సారాంశం. ఇలాంటి ఉన్నత విలువలు కల రచనను అందచేసినందులకు 'చతుర'కు కృతజ్ఞతలు.

-వి. స్నిగ్ధ
అనకాపల్లి.

## సంస్కారం!

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

''పడగనీడ'' సామాజిక నేపథ్యంలో కొంగ్రొత్త ఇతివృత్తంతో అద్భుతంగా నడిచింది. అకాలవర్షానికి గురైన రైతుల కడగండ్ల దగ్గర్నించి మొదలైన ఈ నవల, నేటి వర్గపోరాటాలకు పరిష్కారాన్ని సూచిస్తూ చక్కని సందేశంతో ముగుస్తుంది. అవకాశం దొరికితే చాలు పక్కవాడిని దోచుకుతినే నగర సంస్కృతిని, ఆ నగరాలను తమ గుప్పెట్లో పెట్టుకుని స్వైరవిహారం చేసే ముఠానాయకులను, వాళ్లు నడిపే రౌడీ రాజకీయాలను రచయిత తన రచనలో ఎత్తిచూపారు.

''పల్లెలే దేశానికి పట్టుగొమ్మలు, గ్రామీణాభివృద్ధే దేశాభివృద్ధి'' అన్న మహాత్ముని మాటలను ఈ నవల బలపరుస్తుంది. పల్లెలను పట్టణాలతోపాటు అభివృద్ధిపరిస్తే, పల్లెల నుండి పట్టణాలకు వలసవచ్చే జనంతాకిడి తగ్గుతుందన్న రచయిత సూచన గమనించదగ్గది. పల్లెలు కక్షలు, కార్పణ్యాలకు దూరంగా ఉన్నాయనీ, అక్కడ మనుష్యులలో ఇంకా మానవత్వం బతికేఉందని రచయిత భావించారు. కానీ ఇప్పుడు పల్లెటూళ్లలో కూడా ముఠారాజకీయాలు, వర్గపోరాటాలు బయలుదేరాయి. అందుకు నిదర్శనాలు కారంచేడు, నీరుకొండ సంఘటనలు. రావాల్సింది మనుష్యుల్లో చైతన్యం, వెల్లివిరియాల్సింది మానవత్వం. మన ఆలోచనాపరిధి విస్తరించి, ఏది మంచో ఏది చెడో తెలుసుకున్ననాడు, ఏ ముఠాలు, ఏ రాజకీయనాయకులు మనమీద సవారీ చేయలేరు.

వాస్తవ సంఘటనల నేపథ్యంతో, దేశం ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలకు పరిష్కారాన్ని సూచిస్తూ, చక్కని సందేశంతో నవల ముగుస్తుంది. ఇంతటి మంచి నవలను అందించిన రచయితకు అభినందనలు.

-మండపాక శివప్రసాద్
విజయవాడ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

